# త్రిలింగలక్షణశేషము

అను

# ప్రౌఢవ్యాకరణము

## దిగ్దర్శినీవ్యాఖ్యాయుతము

వ్యా క ర్త

బహుజనపల్లి సీతారామాచార్యులు

వ్యా ఖ్యా త

డాక్టర్ అంబడిపూడి నాగభూషణం

# ప్రౌఢవ్యాకరణదిగ్దర్శిని

ప్రణయనం 2001

డాక్టర్ అంబడిపూడి నాగభూషణం
డాక్టర్ కొలచల వేంకటకృష్ణమూర్తి సంస్కృతకళాశాల
3-3 అరండల్ పేట, గుంటూరు-2

# నివేదనము

జననీజనకులు ఆదిలక్ష్మీప్రసాదులకు –
లక్షణాక్షరభిక్షఁ బెనిచి యాదరముతో నన్నివిషయములఁ బ్రోత్సహించు
మాపూజ్యగురువర్యులు డాక్టర్ బేతవోలు రామబ్రహ్మం గారికి –
పాదాభివందనములు.

ఈగ్రంథము కూర్పునకుఁ దోడ్పడినగ్రంథములకును,
తత్తద్గ్రంథకర్తలకును కృతజ్ఞతలు.

వివాదములు, చర్చలు మొద లైనవానికి ప్రసక్తి లేకుండ
విద్యార్థుల ఉపయోగము మాత్రమే ఉద్దేశించి
విద్యాలయపరీక్షలను దృష్టియం దుంచుకొని
అందుకు కావలసినఅంశములతో
దిక్ప్రదర్శనముగ ఈగ్రంథము కూర్పబడినది.

వ్యాకరణశాస్త్రముపై నభిమానము గలిగినవారికి,
అవసరము గలిగినవారికి,
ఇది ఏకొంచె మైన ఉపయోగించిన
ఈప్రయత్నము సార్థకమైన దని తృప్తిచెందువాడ.

**అంబడిపూడి నాగభూషణం**

సత్యము శ్రేయము జనులకు,
సత్యము ద క్కొండు లేదు సద్ధర్మ, మదే
యత్యలఘుతపఃఫల మిడు,
నిత్యతఁ బాటిల్లు దాన నిఖిలార్థంబుల్.

-బహుజనపల్లి సీతారామాచార్యులు

# విషయానుక్రమణిక

# అకారాదిసూత్రానుక్రమణిక

సమాస. 33. ఒకానొకచో ద్వంద్వంబు మిశ్రంబుగను, అందలిపూర్వపదంబు క్లీబసమంబుగను గానంబడియెడి.

సంజ్ఞా. 15. ఒకానొకచో ననుకరణవిరహితంబుగ సంస్కృతవాక్యంబు గానంబడియెడి.

తద్ధిత. 19. ఒకానొకచో మతుబర్థంబున నవర్ణకంబు చూపట్టెడి.

క్రియ. 26. ఒకానొకచో సహార్థంబున యుష్మదస్మదర్థంబు లభిహితంబు లగునపుడు క్రియలు తత్కర్తృకంబులు విభాష నగు.

సమాస. 20. ఒక్కచో ద్విగువు మిశ్రం బేకవచనాంతంబు నగు.

కారక. 24. ఒక్కచో ద్వితీయాంతవిధేయవిశేషణంబునకుం బ్రథమయు నగు.

కారక. 17. ఒక్కచో నుదంతం బగునజడంబుతృతీయకును నవర్ణకంబు గానంబడియెడి.

కారక. 21. ఒక్కచో సమాసాంతర్గతవిశేష్యంబుల కగువిశేషణంబులషష్ఠికిని బ్రథమ చూపట్టెడి.

కారక. 20. ఒక్కొకచో జడంబుసప్తమికిం బ్రథమయు నగు.

క్రియ. 15. ఒక్కొకచో భూతార్థకాసమాపకక్రియ హేత్వర్థకంబు నగు.

శబ్ద. 9. ఒక్కొకచో విశేష్యవిశేషణంబులు వ్యత్యస్తంబులు నగు.

క్రియ. 21. కంటెవర్ణకంబు పరం బగునపుడు విశేషణనవర్ణకంబుమీఁదియమహ త్తచ్ఛబ్దార్థమునకు లోపంబు విభాష నగు.

సంజ్ఞా. 13. కపిలశబ్దభవము కవిలశబ్దం బొండు గానంబడెడి.

క్రియ. 34. కరఁగు తలఁగు మెఱయ్వాదు లంతర్భావితప్రేరణంబులు.

సమాస. 6. కర్మధారయం బియ్యది మిశ్రంబు సిద్ధసమాసం బట్ల యగు.

సమాస. 27. కఱకంఠుఁడు బహువ్రీహి.

కారక. 1. కారకంబు లనం గర్మాదులు.

సంజ్ఞా. 10. కారము క్షారశబ్దభవము.

సంధి. 10. కొన్నిచోట్ల షష్ఠీసమాసంబునం దుకారంబున కచ్చు పరం బగునపుడు నుగాగమంబునకు లోపంబు నగు.

సంధి. 5. కొన్నియెడలఁ దెనుఁగులమీఁదిసాంస్కృతికకతపలకు గదవలు గానంబడియెడి.

క్రియ. 7. కొన్నియెడలఁ ద్వరితార్థసూచకం బయి భావిని భూతంబు చూపట్టెడి.

సంధి. 6. కొన్నియెడల ద్వంద్వంబునం బదంబుమీఁదిచతపలకు సదవలు గానంబడవు.

కారక. 18. కొన్నియెడల నజడంబుతృతీయాసప్తములకును బహుత్వంబున ద్వితీయ చూపట్టెడి.

కారక. 19. కొన్నియెడల నజడంబుద్వితీయకును బ్రథమ కానంబడియెడి.

శబ్ద. 103. కొన్నియెడల నవ కగు కానంబడియెడి.

వాక్య. 17. కొన్నియెడల నవయవకర్తృకక్రియ తదవయవికర్తృకం బగు.

సంధి. 15. కొన్నియెడల నవర్ణంబు పరం బగునపుడు పూర్వపదాంత్యడకారంబు నకారం బగు.

సమాస. 28. కొన్నియెడల మహద్ద్వంద్వంబునం బూర్వపదంబు క్లీబసమం బగు. అగుచో నాముపర్ణకంబునకు లోపం బగు.

వాక్య. 21. కొన్నియెడల వాక్యంబు వాక్యాంతరగర్భంబు నగు.

కారక. 26. కొన్నియెడల విభక్తిపరిణామంబు గ్రాహ్యంబు.

కారక. 22. కొన్నియెడల విశేషణంబుద్వితీయాదులకుఁ బ్రథమ చూపట్టెడి.

సమాస. 37. కొన్నియెడల సప్తమీతత్పురుషమునందు నవర్ణకంబు నగు.

కారక. 12. కొన్నియెడల హేతువునం దన్నంతక్రియలమీఁదను బట్టివర్ణకంబు విభాష నగు.

క్రియ. 14. కొఱకు కంటె పొంటెలు పరంబు లగునపుడు భావార్థకటవర్ణకంబునకు లోపంబు విభాష నగు.

సంజ్ఞా. 11. కోటపేఁటలు వైకృతములు.

వాక్య. 9. క్రియాన్వయవాక్యంబులు కొన్ని వ్యంగ్యార్థద్యోతకంబు లగు.

సమాస. 7. క్రొత్తాదులు లుప్తశేషంబులు దేశ్యంబులతోడంబలెఁ దత్సమంబులతోడం గొన్నియెడలఁ గర్మధారయం బగు.

సమాస. 13. గుణవాచకంబులు కొన్నింటినిగాగమంబునకుఁ బరుషంబులు పరంబు లగునపుడు బిందు వగు.

సంజ్ఞా. 14 గ్రామ్యంబు తత్తజ్జాతివర్ణనంబునం బ్రయోగార్హం బగు.

కారక. 9. చతుర్థికిం బొంటెవర్ణకంబు నగు.

సంధి. 4. చిట్టడవిఁ జిట్టి.

తద్ధిత. 5. చెడుగు దుడుకు నిడుపులకుఁ బుంస్త్వంబున మతుబర్థం బకారం బగు.

శబ్ద. 18. జడపదంబుమీఁదితోడకు మెయిమైలు విభాష నగు.

శబ్ద. 82. టివర్ణం బమహదర్థంబున నొక్కఁడాదులడువర్ణకంబునకు విభాష నగు.

తద్ధిత. 15. టివర్ణకం బొందునంత్యవర్ణంబునకు భావంబునం దగు.

క్రియ. 1. తద్ధర్మార్థకవిశేషణం బసహాయతం ద్రికాలవాచి యగు.

తద్ధిత. 1. తద్ధితప్రత్యయములు పరంబు లగునపుడు పదంబులడువర్ణకాదులకు లోపం బగు.

తద్ధిత. 2. తనవర్ణకంబు పరం బగునపుడు తచ్ఛబ్దార్థకములకు లోపంబు విభాష నగు.

సమాస. 16. తమ్ముఁగుఱ్ఱలు చిలుకమొకరి యిత్యాదులు
విశేష్యపూర్వపదకర్మధారయంబులు.

సంధి. 8. తామర కాకు పరం బగునపుడు పుగాగమం బగు.

క్రియ. 20. తిగుచుధాతువునన్నంతరూపములు తివ్వఁ దివ ననియు.

తద్ధిత. 17. దఘ్నార్థంబునం దత్సమపదంబులమీఁదను బంటి గానంబడియెడి.

సంజ్ఞా. 4. దీర్ఘంబు దీర్ఘంబ.

ముక్త. 1. దీర్ఘపూర్వక మగులఘురేఫము హ్రస్వపూర్వక మగుచో నలఘురేఫం బగు.

శబ్ద. 28. దేశ్యంబునం దక్కడాదులు నిత్యైకవచనాంతములు.

సమాస. 30. ద్వంద్వం బప్రాణివాచకకృదంతశబ్దఘటితం బేకవచనాంతంబు నగు.

సమాస. 32. ద్వంద్వంబునం బూర్వపదాంత్యావయవంబునకు లోపం బొండె నగు.

శబ్ద. 23. ద్విత్వయుక్తలాంతంబుమీఁదిలులలకు రుర లాదేశంబు లగు.

ముక్త. 3. ద్విత్వరహితం బగుద్వితీయావిభక్తియుకారమున
కచ్చు పరం బగుచో సంధి రాదు.

సంజ్ఞా. 7. నకారం బసాధారణంబు ద్రుతంబు.

సంధి. 14 నెన్నడాదులన్ నెఱి దగు. .

వాక్య. 13. న్యూనవచోవాక్యంబునఁ దద్వచనంబు లధ్యాహార్యంబు లగు.

వాక్య. 3. పదము లవి నామంబులు క్రియ లవ్యయంబు లని త్రివిధంబులు.

వాక్య. 23. పద్యంబులకుం గులకం బగు.

తద్ధిత. 16. పరిమాణార్థంబునం బ్రథమైకవచనంబునంద యెఁడువర్ణకం బగు.

సంధి. 11. పూ పూవు.

శబ్ద. 7. ప్రధానంబు పశ్చాద్వాచ్యం బగు.

సంజ్ఞా. 12. ప్రాణగొడ్డ మగ్రామ్యంబు నాఁ దగు.

శబ్ద. 100. ప్రాప్తహ్రస్వంబు లగుమూడేలమీఁదివర్ణంబులకు
ద్విత్వంబు బహుళంబుగ నగు.

క్రియ. 9. ప్రార్థనంబునం దన్వృత్యయాంతక్రియలమీఁదఁ గదకదవుపూర్వకంబు
లన్నాదు లనుప్రయుక్తంబు లగు.

క్రియ. 10. ప్రార్థనాదులం దన్వృత్యయాంతక్రియలమీఁదియిమ్మున
కీకారంబు విభాష నగు.

సమాస. 31. భావద్వంద్వంబునం దొలిపదంబుటవర్ణకంబునకు లోపం బగు.

వాక్య. 16. భూతార్థకాసమాపకక్రియ వలయుచో వాక్యాంతరజనిస్థానం బగు.
అగుచోఁ గర్త తత్కర్తలందలిదియ యెద్ది యే నొం డగు.

సంధి. 18 మధ్యమపురుషమువర్ణకంబున కచ్చు పరం బగునపుడును

గొన్నియెడల లోపంబు చూపట్టెడి.

క్రియ. 6. మహద్బహుకర్తృకక్రియకు నేకవచనంబు విభాష నగు.

శబ్ద. 49. ముత్తియశబ్దేతరంబులయందును దఱచుగ నిత్వలోపంబు గానంబడియెడి.

సమా. 6. ముయ్యేడ్వాదులందు హ్రస్వదిత్వంబులు నిత్యంబులు.

కారక. 16. యొక్కకు లోపంబు బహుళంబు.

తద్ధిత. 12. రవర్ణకంబు నాయఁకశబ్దమునకు భావంబునం దగు.

కృదంత. 2. రాయున కిడివర్ణకం బగు.

శబ్ద. 26. రాహుబాహుశబ్దంబుల కంతట వువర్ణకలోపంబు వైకల్పికంబు.

వాక్య. 1. వాక్యము నా యోగ్యతాకాంక్షాసహితం బగునర్థము గలయాసత్తియుక్త పదసముదాయంబు.

శబ్ద. 24. విధాశబ్దంబు సంస్కృతంబునం బుంలింగంబు నగు.

శబ్ద. 11. విశేషణంబులు కొన్ని వ్యవహితంబులు నగు.

శబ్ద. 3. విశేషణము జాత్యాదిభేదంబుచే షడ్విధంబు.

శబ్ద. 27. విశ్వకర్ముఁ డనియు రూపంబు.

వాక్య. 5. విషయబోధకము వాక్యము.

క్రియ. 8. వ్యతిరేకక్రియ యర్థత్రయబోధకం బగు.

శబ్ద. 1. శబ్దములు విశేష్యములు విశేషణము లని ద్వివిధంబులు.

సమాస. 1 షష్ఠీతత్పురుషంబులందు నగాగమంబు విభాష నగు.

కారక. 13. షష్ఠీస్థానికం బగుకువర్ణకం బొక్కొకచో ద్వితీయాదివిభక్తులకు మాఱుగాఁ దత్తదర్థంబులం జూపట్టెడి.

వాక్య. 7. సంపూర్ణ మసంపూర్ణ మని వాక్యంబు ద్వివిధంబు.

సంధి. 12. సమాసమందుఁ దత్సమంబు పరం బగునపుడును
నుమాగమాదులు గానంబడియెడి.

శబ్ద. 16. హలవసానంబులు పరంబు లగునపుడు ఉరువర్ణకంబులయుత్వంబునకు లోపంబు వైకల్పికంబుగ నగు.

సంధి. 16. హలవసానంబులు పరంబు లగునపు డేమిశబ్దముయొక్క మికారమునకు లోపంబు వైకల్పికంబు.

# వివరణవాక్యానుక్రమణిక

కారకము, అపాదానకారకము, అధికరణకారకము.

వాక్య. 3. అవి సకర్మకములు అకర్మకము లని ద్వివిధములు.

వాక్య. 3. అవ్యయము లనఁగా లింగవిభక్తివచనశూన్యములు.

వాక్య. 7. అసమాపకక్రియలు గలవాక్య మసంపూర్ణవాక్యము.

సంధి. 16. అసమాసంబునం బూశబ్దము పూవుశబ్దముయొక్క పర్యాయముగా గానంబడియెడి నని యర్థము.

సమా. 10. ఆంధ్రశబ్దచింతామణియందుఁ గల ఇద మద సిత్యాది సూత్ర మందలియదః ప్రభృతులు వ్యర్థము లగుచు స్వేతరంబులకును నక్కార్యం బని తెలుపుచున్నవి.

వాక్య. 1. ఆకాంక్ష యనఁగా నిలుపుదల లేక పయిపయిం బోయెడి పదార్థముల మీఁదియాదరము.

సమా. 19. ఆదిపదంబుచే తియ్యఁబోఁడి, ననఁబోఁడి, విరిఁబోఁడి, యిత్యాదులు గ్రాహ్యంబులు.

వాక్య. 9. ఆదిపదంబుచే నితరంబు లూహ్యంబులు.

వాక్య. 6. ఆదిపదద్వయంబుచే అన్నంతక్రియలును, నేలాద్యవ్యయములును గ్రాహ్యములు.

సంధి. 1. ఆదిశబ్దము అన్న, అక్క, అప్పలను దెలిపెడు.

వాక్య. 1. ఆసత్తి యనఁగాఁ బదములచేరిక.

సమా. 36. ఇందు ఆదోఁకేత్యాదులు కొన్నిటియందు వర్ణలోపాగమాదేశ వికారంబులు నిత్యము లనియు, అందాఁకేత్యాదులయందు వైకల్పికంబు లనియు నెఱుంగవలయు.

వాక్య. 1. ఇందు మొదటివి మూఁడు క్రియా(అ)భిన్నకర్తృకములు, వెనుకటిమూఁడు క్రియావిభిన్నకర్తృకములు.

క్రియ. 27. ఇందు రాఁ, బో ననుకర్తృభూతక్రియలతో వానికిఁ గర్త యగు నీ వనుదాని కన్వయం బని యెఱుంగవలయు.

సంజ్ఞ. 10. ఇందు సారూప్యము గనఁబడెడి.

కార. 26. ఇక్కడఁ దృతీయకుఁ బంచమిగా మార్పు గలిగె నని తెలియ వలయు.

కార. 16. ఇక్కడ నిది షష్ఠ్యంతమునకు విశేషణము గనుక ప్రథమ.

కార. 16. ఇట అంకుశములవ్రేటు లనఁగా లక్షణచేఁ బోటు లని యర్థము.

కార. 5. ఇటఁ జేతవిభక్త్యర్థక ల వర్ణముపై నెల్లెడల నుండవలసిన చేసి యొక్కచోటనె యున్నది.

శబ్ద. 77. ఇటఁ దాశబ్దము పాదపూరణార్థకము

సమా. 19. ఇటఁ బోఁడి పరం బగుచో నెల్లెడల ను మ్మగు.

కార. 13. ఇట నర్థభేదము విశేషము.

శబ్ద. 114. ఇట నర్థవిశేషము క్రమముగా ననుట.

కార. 13. ఇట నొకానొకచోఁ గొఱకుకయివర్ణకంబులు నయ్యెడి.

శబ్ద. 19. ఇట్టిప్రయోగంబులంబట్టి యాగమశాస్త్ర మనిత్య మగుటవలనఁ దక్కిన చోట్ల నకారాగమంబు రాకుండిన దోషంబు లే దనియు –

కార. 20. ఇట్టిప్రయోగములచేత 'అన్యస్యాః క్వచి ధ్రువే చ్చాన్యా' అను శబ్దశాసనుల సూత్రము సార్థక మగుచున్నది.

సమా. 18. ఇట్టిప్రయోగములు కవిత్రయమువారిగ్రంథములయందు దొరకినవి కావు.

శబ్ద. 103. ఇట్టియెడల అవ యనియె యుండవచ్చును. అయినను గ్రంథములయందుఁ బాఠ మి ట్లగపడుచున్నది.

కృత్. 5. ఇట్ల ఎగువ.

శబ్ద. 59. ఇ ట్లనుటచే అయ్య దీత్యాదులందు ద్విత్వంబు గలుగ దని యూహింప వలయును.

కార. 4 ఇ ట్లనుటచే 'ఇవ్విధము నాననముల్ గలవారు' అనునిట్టి ప్రయోగములు నిర్దుష్టము లగుచున్నవి.

సమా. 6. ఇ ట్లనుటచేఁ బూర్వపదంబు లుప్తవిభక్తికం బయి యవికృతాంతం బగు నని యెఱుంగవలయు.

శబ్ద. 22. ఇట్లు గోపాలిగాఁడు.

శబ్ద. 16. ఇట్లు భూసురోత్తముల్, భూపాలుర్.

తద్ధి. 19. ఇతరంబులు ప్రయోగదృష్టంబులు గ్రాహ్యంబులు.

వాక్య. 9. ఇది యేతన్మార్గసూచనాక్రమము. ఇట్లు దీని నింక ననేకప్రకారంబులఁ జెప్పవచ్చును.

సంధి. 4. ఇయ్యది తదితరంబులకు నుపలక్షణం బని యెఱుంగునది.

సం. 12. ఇయ్యది ప్రాణకుట్టకశబ్దభవము.

శబ్ద. 37. ఇవి ధాన్యవాచకము లయ్యును నిత్యైకవచనాంతములే యని గ్రహింపవలయు.

శబ్ద. 36. ఇవి వృత్తియం దేకవచనాంతముల యగు.

సంధి. 4. ఇవి సంజ్ఞావాచకంబులు గాన సంధి నిత్యము.

శబ్ద. 10. ఈకవి పాపజాతికాన అని ప్రయోగించినాఁడు అది విచార్యము.

కార. 4 ఈయర్థమునకు 'ఇతరత్ర చ ద్వితీయా' అనుస్థాననియమ శూన్యవిధియు నవకాశ మిచ్చుచున్నది.

కార. 11. ఈసూత్రము నిట్లు చెప్పుటకు నంద్వితరసప్తమ్యర్థకవర్ణకంబులమీఁదియుండికి లోపంబు వచ్చుట ప్రయోజనంబు.

వాక్య. 6. ఉద్దేశించి చెప్పఁదగినది యుద్దేశ్యము.

వాక్య. 6. ఉద్దేశ్యము వక్తృశ్రోతల కుభయులకుఁ దెలియును.

సం. 7. ఉన్నాను ఇత్యాదులయందు ద్రుతంబునందలియుకారంబునకు లోపంబు గలుగదు.

శబ్ద. 104. ఊరు మొద లగువానికిఁ దృతీయయం దత్వము సంప్రాప్తింపదు గాన 'ఔపవిభక్తికనామ్నా మత్వం స్యాత్ సప్తమీతృతీయార్థే' అనుసూత్రమున కవి విషయములు గాక 'కేషాంచి దుదంతానాం నేతి విభక్తా వునో లుక్ స్యాత్' అనుసూత్రమునకు విషయంబు లగుచున్న వని యెఱుంగ వలయును.

సం. 1 (లూ)కారగ్రహణము సంస్కృతప్రాకృతభాషావ్యాకరణజ్ఞులసమ్మతము.

సమా. 9. ఎట్టిఁడు నాహృదీశుఁ డనుట యుక్తము.

వాక్య. 16. ఏతల్లక్షణానుక్తవిశేషప్రయోగంబులుం గలవు.

.... ఇట్టివి ప్రయోగంబులవలన నెఱుంగునది.

శబ్ద. 85. ఒకచో ననుటచే ఒకఁడు ఒకతె ఒకటి.

శబ్ద. 85. ఒకశబ్ద మొక్కాదుల కుపలక్షణము.

శబ్ద. 38. ఒకానొకకవి యిందుఁ గొన్నిటి నేకవచనాంతములుగాఁ బఠించి యున్నాఁడు. అది విచార్యము.

శబ్ద. 14. ఒకానొకయాధునికగ్రంథమునందు 'అన్నరో, ఏనుంగురో' అని కవి ప్రయోగములు కానంబడుచున్నవి. వానికిఁ బ్రామాణికప్రయోగములు కానంబడవు.

శబ్ద. 13. ఒక్కచో ననఁగా సంబోధ్యవాచకంబు క్రియాజన్యవిశేషణపూర్వకం బగునపు డనియు ఇతరశబ్దం బనఁగా ఆక్రియాజన్యవిశేషణమునకు సంబంధించినపద మనియు నర్థము.

శబ్ద. 43. ఒక్కచో ననుటచే ఆచార్యుఁడు ద్రోణునకున్ శిష్యుఁడ.

శబ్ద. 104. కడపటియుదాహరణములయందలిసంఖ్యావాచకములు తత్సమ ములు గాన వాని కట్టిరూపములు మూఁ డర్బుదములవారు, పదివేల సహస్రసంఖ్యలవారు అని యేర్పడుచున్నవి.

వాక్య. 3. కర్తరిప్రయోగము సకర్మకక్రియ గలచో సకర్మకకర్తరిప్రయోగ మనియు, అకర్మకక్రియ గలచో నకర్మకకర్తరిప్రయోగ మనియుఁ జెప్పఁబడును.

వాక్య. 3. కర్తృకర్మక్రియలు గూడఁ బ్రయోగ మనంబడు.

వాక్య. 3. కర్మము గలది సకర్మకము.

వాక్య. 3. కర్మము లేనిది యకర్మకము.

శబ్ద. 19. కాన నచ్చో మాత్ర మయ్యది యత్యావశ్యక మనియుఁ దోఁచుచున్నది.
శబ్ద. 19. కుత్సార్థదోషవిస్ఫురణంబు కలుగక పువర్ణాంతశబ్దములమీఁద నకారాగమము వచ్చుట కేతత్ సూత్రారంభప్రవృత్తి యైయుండు.
వాక్య. 23. కులకం బనఁ బద్యమునకుఁ బద్యాంతరముతో నన్వయము.
సమా. 5. కృష్ణమ్మ యనుచో అమ్మ ప్రేమసూచకం బని యెఱుంగునది.
సమా. 2. కృష్ణశాస్త్రీత్యాదులందు దీర్ఘంబు గలుగదు.
శబ్ద. 28. కొందఱు ఇరులు కేలు శబ్దములు నిత్యబహువచనాంతము లందురు. అట్లు కాదు.
శబ్ద. 92. కొన్నింటి యనుటచే అయిదుగురు, ఆఱుగురు ఇత్యాదులందు లోపంబు లేదు.
శబ్ద. 10. కొన్ని యనఁగాఁ గీదుప్రభృతులును నల్లాదులును.
సంధి. 5. కొన్నియెడల ననఁగాఁ బ్రాసంబులం దని యర్థము.
శబ్ద. 104. కొన్నియెడల ననుటచే పదివేవురు, నూఱునేఁబండ్రు, లేక నూటయేఁబండ్రు అని యిట్లు మహత్త్వయుక్తరూపంబులుం గల వని యెఱుంగవలయు.
సం. 11. కోట్టశబ్దపర్యాయంబుగా సంస్కృతంబునఁ గోట శబ్దంబు నొక్కండు గానంబడియెడి.
సం. 11 కోట్టశబ్దభవము కోట. (కోట్టారఘట్టహట్టా శ్చ)
వాక్య. 1. క్త్వా తద్వ్యతిరేక శతృ తుమున్ చే దానంతర్యార్థకము లసమాపకక్రియలు.
వాక్య. 3. క్రియచేఁ గర్త చెప్పఁబడు నేని యది కర్తరిప్రయోగము,
కర్మము చెప్పఁబడు నేని కర్మణిప్రయోగము.
వాక్య. 1. క్రియ లనఁగా వర్తమానాద్యర్థకము లయినసమాపకక్రియలు.
వాక్య. 3. క్రియ లనఁగా వ్యాపారావబోధకము లయినవి.
వాక్య. 6. క్రియ లుద్దేశ్యములు గావు.
వాక్య. 6. క్రియాదికము విధేయము.
క్రియాదికము– క్రియ, విశేష్యము, విశేషణము, సర్వనామము.
కార. 1. క్రియాన్వయమును గలిగించునది అనఁగాఁ గ్రియాన్వయము కలది యని కారకశబ్దార్థము.
సం. 1 క్షకారము సంస్కృతవ్యాకరణములయందును నిఘంటువులయందును షాంతపదమధ్యమునందుఁ బఠింపఁబడుటంజేసి యది వర్ణాంతరము గాదు. సంయుక్తాక్షరం బని తెలియవలయు.
సం. 10. క్షారశబ్దము కటుశబ్దపర్యాయంబు నగు.
తద్ధి. 4. గ్రామ్యజనులపాటలయందును జెంచీత యని యికారదీర్ఘంబ వినంబడియెడి.

కార. 13. చతుర్థికి నుదాహరణంబులు పూర్వవ్యాకరణంబులం జూచునది.

సంధి. 4. చిట్టడవి - - - ఇత్యాదులందుఁ బూర్వపదము చిట్టిశబ్ద మని యర్థము.

క్రియ. 2. చేరు కొను అనఁగా అనుప్రయుక్త మగుకొను ధాతు వని యర్థము.

క్రియ. 18. చొక్కఁజేయు చొక్కించు ఇ ట్లంతట నెఱుఁగునది.

సమా. 31. టవర్గకం బిటఁ గృత్ప్రత్యయంబున కుపలక్షణంబు.

శబ్ద. 1. తక్కినవి విశేషణంబులు.

సమా. 22. తఱచుగ ననుటంజేసి పదియాఱు పదా ఱిత్యాదిరూపంబులు గ్రాహ్యంబులు.

సంధి. 9. తఱచుగ ననుటచే 'అన్నిష్టసఖి నూఁదియున్నదాని' ఇత్యాదులు గ్రాహ్యంబులు.

శబ్ద. 90. తఱచుగ ననుటచే ఇరువుర నిత్యాదులయం దిత్వంబు కలుగదు.

సం. 9. తఱచుగ ననుటచేఁ గేవలవర్ణోచ్చారణమునం దీవిధి నిత్యము గా దని తెలియునది.

శబ్ద. 86. తఱచుగ ననుటచే తాము, మేము, తమ్మున్, మమ్మున్ ఇత్యాది రూపంబు లగు నని యెఱుంగునది.

సమా. 21. తఱచుగ ననుటచే తడవకు ఇత్యాదు లెఱుంగునది.

శబ్ద. 116. తఱచుగ ననుటచే నుశబ్దము కొన్నింటి కొకప్పుడు వచ్చును. ఒకప్పుడు రా దని యర్థము గ్రహింపవలెను.

కార. 4. తఱచుగ ననుటచే నొకానొకచో నేకవచనంబున నుకారంబుమీఁది ద్వితీయయుఁ దృతీయావిభక్త్యర్థక మయ్యెడు నని తెలియవలయు.

సం. 16. తఱచుగ ననుటచే నొక్కొకచో ననుకరణసహితంబు నగు నని యెఱుంగవలయు.

క్రియ. 29. తఱచుగ ననుటచే పూఁతపసిండివంటివలపుం బచరించుకులంబు నీతికిన్ లేఁత గదమ్మ, యిత్తెఱఁగు లేమ, దయాంబురాశివి గదమ్మ ఇత్యాదు లూహ్యంబులు.

కార. 15. తఱచుగ ననుటచే బాహుకుండు రథంబు గడపునేర్పునకు ఇత్యాదు లెఱుంగునది.

శబ్ద. 37. తఱచుగ ననుటచే బియ్యము, జీలకఱ్ఱ.

శబ్ద. 47. తఱచుగ ననుటచే....వాక్యమును వ్యాసము చేసియుఁ జెప్ప నగు నని తెలియవలయును.

సమా. 15. తెనుఁగున సాధారణంబుగ విశేషణంబు లవిభక్తికంబులు.

సమా. 18. త్రికక్రియాజన్యవిశేషణఘటితంబులు త్రికక్రియాజన్యవిశేషణోభయ ఘటితంబులు, కేవలక్రియాజన్యవిశేషణఘటితంబులు నని ద్వివిధంబులు.

శబ్ద. 24. దంష్ట్రా శబ్దంబును బుంలింగముగాను గానంబడియెడి.

సం. 11. దానివలనఁ గలిగిన దందు రేని యపు డది కుండ లోనగువానివంటి దని యెఱుంగవలయును.

శబ్ద. 75. దాని భిన్నరూపము. ఆకలహంస అభిన్నరూపము.

శబ్ద. 24. దీనికిఁ దత్సమంబునం బుంలింగరూపముతోనె ప్రయోగము గాని స్త్రీలింగరూపముతో లేదు.

సమా. 19. దీనికిఁ బువ్వవలె మనోజ్ఞురాలైన దని యర్థము. ఇ ట్లంతట నెఱుఁగవలయు.

కార. 17. దీనికిఁ బ్రయోగాంతరంబు మృగ్యంబు.

శబ్ద. 116. దీని కుదాహరణములు పాదపూరణమందలివి.

సమా. 27. దీని నహోబలపండితుఁడు మిశ్రబహువ్రీహి యనెఁ గాని యది య ట్లగుట దుర్ఘటము.

శబ్ద. 62. దేనన్, వేనన్ అనువానికిఁ బ్రయోగంబులు మృగ్యంబులు.

సం. 4 ద్రుత మనఁగా నొల్లనియెడ మఱఁగిపోవునది యనుట.

శబ్ద. 40. ద్వితీయాదివిభక్తులయందు గారు శబ్దమునందలిరువర్ణము రివర్ణం బగు నని యర్థము.

వాక్య. 3. ధాత్వర్థఫలాశ్రయము కర్మము.

వాక్య. 3. ధాత్వర్థవ్యాపారాశ్రయము కర్త.

సంధి. 3. నన్నయభట్టారకుఁడు 'అన్నిష్టసఖి నూఁదియున్నదాని అని ప్రయోగించి 'లుక్సంశ్లేషౌ నాచి ద్రుతస్య' అని సంశ్లేషమును నిషేధించుట ప్రయోగవైరళ్యసూచనార్థం బని యెఱుంగునది

వాక్య. 3. నామములు నా వస్తువాచకశబ్దములు.

శబ్ద. 39. నాయఁడుగారు, దేవిగారు దీనికిఁ దఱచుశబ్దంబు శరణంబు.

సం. 3 నిర్దేశవిధానంబులం గారేఫప్రత్యయములు రానియెడల హ్రస్వమునకు దీర్ఘము వచ్చు నని యర్థము.

సం. 4 నిర్దేశవిధానవిషయము లయినవర్ణములు దీర్ఘము లయ్యె నేని యవి యట్లే యుండు నని యర్థము.

శబ్ద. 47. నీ వెవ్వ రిత్యాదివిశేషప్రయోగంబులుం గలవు.

సమా. 37. నుశబ్దంబుచేఁ గువలయంబునందలివారు మొ.

సమా. 30. నుశబ్దంబుచేఁ గూరగాయ లిత్యాదులు బహువచనాంతంబులు నగు నని యెఱుంగవలయు.

సంధి. 14. నెన్నడ – నెన్నడుము ఇత్యాదులయందు నెఱిశబ్దము పూర్వపదంబుగా నుండుట యుక్త మగు నని యర్థము.

సంధి. 14. నెఱ పూర్ణార్థకము - నెఱి రమ్యార్థకము.
కార. 12. పక్షంబునఁ గలుగుటంబట్టి.
కార. 13. పక్షంబున బ్రహ్మనుగూర్చి తపము చేసె.
సమా. 9. పక్షమున అట్టివాఁడు మొ.
తద్ధి. 2. పక్షమున ఆఁకొన్నవానితనము, ఆఁకొన్నదానితనము.....
క్రియ. 13. పక్షమున ఇచ్చుకొనుట పుచ్చుకొనుట.
క్రియ. 2. పక్షమున ఉండునే మొ.
కార. 9. పక్షమునఁ గార్యసంప్రయోగముకొఱకు మొ.
క్రియ. 21. పక్షమున కనినదానికంటె.
క్రియ. 25. పక్షమున చనుదే చననిచ్చు మొ.
క్రియ. 14. పక్షమున చూపుటకొఱకు, కలుగుటకంటె, పట్టుటపొంటె.
క్రియ. 24. పక్షమున తూఁటాడి తూఁటాడి.
క్రియ. 30. పక్షమున తూర్పుగ, దక్షిణంబుగ, పడమరగ, ననియు నుండవచ్చును
కార. 13. పక్షమున నావిషయమున సైపు.
కార. 13. పక్షమున నీకంటె నగ్గలముగ.
కార. 13. పక్షమున నీచే నారాధ్యను.
కార. 13. పక్షమున నీతో మార్కొనంగ నోపరు,
హరితో మార్కొనునయ్య, అంగపతితో నెదిరించెన్.
కార. 13. పక్షమున నీయం దనురక్త.
కార. 13. పక్షమున నీయందుఁ దక్క.
క్రియ. 22. పక్షమున పెల్లుగఁ దొరగు, కప్పముగ నడుగుము,
కృతాంతనికేతనాతిథిన్.
క్రియ. 2. పక్షమున బలవంతుఁడు పయి నెత్తినబలహీనుఁడు ... కామాకులచిత్తుఁడు
నిద్ర లేక కుందుదు రధిపా.
క్రియ. 26. పక్షమున మోహాంధుండు భీష్ముండుఁ గేశవ నీవుం గడఁగుండు.
కార. 20. పక్షాంతరమునఁ దీర్ఘమం దాడి మొ.
సం. 11. పింతా విటజనాశ్రయః అని అమరపదపారిజాతము.
సం. 11 పింతాశబ్దభవము పేఁట.
సమా. 32. పుట్టుగ్రుంకుగ ట్లనఁగా పుట్టుగట్టు, క్రుంకుగట్టు (ఇ ట్లంతట నెఱుంగునది.)
సంధి. 9. పెనుశబ్దము పెనుపుశబ్దలుప్తశేషము.
సం. 11 పేఁటశబ్దార్థము ప్రకృతి యగుపింతాశబ్దార్థముకంటె నించుక భిన్నముగా
నున్నది.

వాక్య. 3. ప్రకృతిసిద్ధములు ప్రతిపదోక్తములు.

సం. 7. ప్రత్యయాగమావ్యయాత్మక మై యుత్వవిశిష్ట మైననకారంబు ద్రుత సంజ్ఞకం బని యర్థము.

సమా. 2. బహుళంబుగా ననుటచే రామరాయఁడు, సుబ్బరావు,
ఎఱ్ఱప్రెగ్గడ యిత్యాదులందు దీర్ఘంబు వైకల్పికంబు.

కార. 16. బహుళగ్రహణముచే ధాతుజవిశేషణభావార్థకములముందఱి కర్తృ
పదంబులయొక్కకు నిత్యంబుగ లోపం బని యెఱుంగవలయు.

కార. 11. బహుళగ్రహణముచే నందు మీఁదియుండికి లోపంబు గలుగు దని
యెఱుంగునది.

కార. 25. బహువచనాంతము గాక యేకవచనాంత మైనచోఁ దెరువు లై దుండవలెను.

శబ్ద. 22. బాలిగానిన్ బాలిగానిచేతన్ అని తక్కినవిభక్తు లూహ్యంబులు.

వాక్య. 9. భావక్రియలు గలవాక్యము వ్యతిరేకక్రియలు గలవాక్యమునకును,
వ్యతిరేకక్రియలు గలవాక్యము భావక్రియలు గలవాక్యమునకును,
ఉభయము లుభయములకును వ్యంజకము లని యర్థము.

వాక్య. 10. భావ్యర్థకథనప్రారంభంబునఁ బూర్వవాక్యాంతమున 'ఇ ట్లనియె' అనియును,
ప్రారబ్ధవాక్యపరిసమాప్తియందు 'అనిన' అనియును బదంబులు క్రమంబుగఁ
బ్రయుక్తంబు లగు నని యర్థము.

సంధి. 2. భూతకాలికాసమాపకక్రియయొక్క యికారమునకుఁ బ్రామాణిక
ప్రయోగములందును గొన్నియెడల సంధి గనఁబడుచున్న దని యర్థము.

ముక్త. 2. మఱియు నాన్యేషాం ...అని ప్రథమాచార్యులును,
అనయో స్సంగతిం ... అని ద్వితీయాచార్యులును నియమించియుండుటంజేసి
యవి పూర్వరేఫంబులే యనుటకు వల్ల కాదు.

వాక్య. 6. మఱియు నీ వితరులఁ గొలువ నేటికి ఇత్యాదు లూహ్యంబులు.

కార. 22. మఱియు నేతద్విశేషంబు లనేకవిధంబులు గలవు గాని ప్రామాణిక
ప్రయోగములు దొరుకమింజేసి యవి యనాదృతము లయ్యె.

వాక్య. 6. మీఁదఁ దెలియఁదగినది విధేయము.

సం. 1 యవలలవలె రేఫంబును బ్రయత్నభేదంబుచే ద్వివిధంబు గాన
శబ్దశాసనాదులచేత నలఘురేఫము వర్ణాంతరముగాఁ బరిగణింపఁబడదయ్యె.

వాక్య. 1. యోగ్యత యనఁగాఁ బదార్థములకుఁ బరస్పరసంబంధమునందు బాధ
కలుగకుండుట.

సమా. 4. రామిసెట్టి సుబ్బిసెట్టి యిత్యాదులం దిత్వంబు నిత్యంబు.

వాక్య. 3. లక్షణసిద్ధములు లాక్షణికములు.

ముక్త. 2. 'లఘు ర్భవే ద్గురుః కుత్రచి ద్గురు శ్చ లఘు స్తథా, ఉచ్చారణస్య కల్యత్వా న్నిదానం తత్ర సద్వచః' అని యధర్వణాచార్యులు.

శబ్ద. 77. వచ్చె సుదర్శనాయుధుఁడు, విదురుఁడు ప్రబోధించె- అని యాత్మార్థవిరహితంబుగను జెప్పనగు.

శబ్ద. 25. వర్గువునందలివువర్ణకం బొండె లోపించు.

సం. 7. వలయుచో నీద్రుతంబునందలియుత్వంబునకు లోపం బగు.

వాక్య. 16. వలసినప్పుడు కొన్నియెడల భూతార్థకాసమాపకక్రియనుండి వాక్యాంతరము పొడమును.

శబ్ద. 75. వాఁడె భిన్నరూపము. ఆసుదర్శనాయుధుఁ డనుట అభిన్నరూపము.

వాక్య. 1. వాక్యమునందుఁ గొన్ని క్రియాన్వయము కలవి, కొన్ని తదితరాన్వయము కలవి.

వాక్య. 19. వాక్యములందు పూర్వార్థమునఁ గ్రియమీఁద వచ్చిన కాని యవ్యయ ముత్తరార్థముయొక్క అర్థమునకు విరుద్ధముగా నుండు ననుటను దెలుపుచున్నది.

సంధి. 12. వింజామరము (వెల్ల-చామరము) సంధియందు వర్ణవికారము.

వాక్య. 6. విధేయము వక్తకు మాత్రము తెలియును.

శబ్ద. 116. విభాష ననుటచే నుశబ్దము కొన్నియెడల యువర్ణపూర్వకముగానే వచ్చు ననియుఁ గొన్నియెడల యువర్ణపూర్వకము గాకయు వచ్చు ననియు నర్థము పరిగ్రహింపవలెను.

తద్ధి. 16. విశేష్యము భిన్నవచనవిభక్తికం బయ్యు మానార్థకములమీఁదఁ బరిమా ణార్థమునం ప్రథమైకవచనంబునందె యెఁడువర్ణకంబు వచ్చు నని యర్థము.

వాక్య. 6. విశేష్యాదిక ముద్దేశ్యము.
విశేష్యాదికము- విశేష్యము, విశేషణము, సర్వనామము.

వాక్య. 6. విశేష్యాదు లద్దేశ్యవిధేయములు రెండు నగు.

వాక్య. 6. విషయ ముద్దేశ్యవిధేయములతోఁ గూడినది.

శబ్ద. 65. వీనికి ఎవ్వరియొక్క యాఁడుది యనియు, ఒకరియొక్క యాఁడుది యనియు నర్థము.

సమా. 36. వీని కొక్కొక్కటికిఁ బ్రయోగంబులు పెక్కులు గలవు. కాని గ్రంథవిస్తరభీతిచే నవి యుదాహరింపఁబడవయ్యె.

వాక్య. 1. వెనుకటి మూఁడు క్రియావిభిన్నకర్తృకములు.

సం. 8. వ్యతిరేకార్థక భూతకాలికాసమాపకక్రియ ద్రుతప్రకృతికము కా దని యర్థము.

శబ్ద. 51. శబ్దశాసనుఁడు తచ్ఛబ్దాతః అని సూత్రించినసూత్రమునందలితచ్ఛబ్ద

మంత్రప్రభృతులకు నుపలక్షణ మని తెలియునది.

సం. 7 శబ్దశాసనుఁడు ద్రుతాఖ్యో నః అని కేవలనకారగ్రహణము చేయుట ద్రుతమునకు స్థిరత్వసిద్ధికై యని తెలియవలయు.

సం. 5 శ్లేషయందు జకార మొక్కటియె యొకయర్థమున దంత్యమును వేఱొకయర్థమునఁ దాలవ్యము నయ్యెడు నని యర్థము.

కార. 22. షష్ఠీవిశేషణానా మ్మను బహువచనస్వారస్య మిట్టిప్రయోగముల కుత్పాదకముగా నున్నది.

వాక్య. 3. సందర్భవశమున నివి కొన్ని కర్త లనియుఁ గర్మము లనియుఁ జెప్పఁబడును.

వాక్య. 7. సమాపకక్రియలు గలవాక్యము సంపూర్ణవాక్యము.

కార. 2. సముచ్చయగ్రహణము కూర్చి జ్ఞాపనార్థము.

కార. 16. సమ్మెటకోలలయొక్కయు, అంకుశములయొక్కయు, చేఱుకోలల యొక్కయు వ్రేటులచేత నని యర్థము.

శబ్ద. 32. సరులు లేనిదృక్షంజనశాబకములను అని యొక్కచోఁ బ్రయోగము కనఁబడుచున్నది.

శబ్ద. 91 సాధారణంబుగ ననుటచే ఎనమండ్రు తొమ్మండ్రు ఇత్యాదులందు రా దని యెఱుంగునది.

శబ్ద. 70. స్వార్థంబునం గప్రత్యయంబు రా – ఎవ్వతుక.

సంధి. 4. హల్లు పరం బగుచో ద్విత్వంబునకు లోపంబు వైకల్పికంబు.

# ప్రౌఢవ్యాకరణం-సూత్రవ్యాఖ్యానం

## 1. సంజ్ఞాపరిచ్ఛేదం

**1. ఒకచో హ్రస్వంబు దీర్ఘం బగు.** (3)

'నిర్దేశవిధానంబులం గారేఫప్రత్యయములు రానియెడల హ్రస్వమునకు దీర్ఘము వచ్చు నని యర్థము'. అని సూత్రం అర్థాన్ని సూత్రకర్తే వివరించాడు.

'నిర్దేశవిధానోచ్చారణంబులం దఱచుగ అవర్ణాదులు కారప్రత్యయాంతంబులును రవర్ణ మిఫప్రత్యయాంతంబు నగు' అనేసూత్రంచేత 'అ' మొద లయినవర్ణాలకు 'కార' అనేప్రత్యయమూ 'ర' అనేవర్ణానికి 'ఇఫ' అనేప్రత్యయమూ విధింపబడ్డాయి. దేనికి విధింపబడుతుందో అది నిర్దేశం. (దానికి) ఏది విధింపబడుతుందో అది విధానం.

నిర్దేశమో లేదా విధానమో అయినవర్ణాలు హ్రస్వా లయితే వాటికి కార, ఇఫ అనేప్రత్యయాలు రానపుడు దీర్ఘం వస్తుం దని సూత్రానికి అర్థం.

లకారమునకు రేఫము వచ్చును. ఈవాక్యంలో 'ల' అనేవర్ణం నిర్దేశం. దానికి విధింపబడిన 'ర' అనేవర్ణం విధానం. 'నిర్దేశవిధాన –' అనేసూత్రంచేత 'ల' వర్ణానికి కార ప్రత్యయ మై లకారము, 'ర' వర్ణానికి ఇఫ అనేప్రత్యయం వచ్చి రేఫము, అని అవుతుంది.

ప్రస్తుతసూత్రంసామర్థ్యంచేత కార, ఇఫ లు రాక, ల– ర అనేవర్ణాలకు దీర్ఘం వచ్చి 'లాకు రా వచ్చును' అని వ్యవహరించవచ్చును. 'అడంగ్వాదులడాకు –మొ. డాకు–డకారమునకు.

'ఒకచో' అనేపదానికి 'నిర్దేశవిధానంబుల' అని సూత్రకర్త అర్థం చెప్పాడు. కాబట్టి ఉచ్చారణంలో దీర్ఘం రాదు. 'అ' కారము అనేఅర్థంలో 'ఆ' అనగూడదు.

'ఒకచో' అనేదళంచేత దీర్ఘం రావడం అరు దని గూడా గ్రహించాలి. కాబట్టి 'లకారమునకు రేఫ మగును' అనేవిధంగా కార– ఇఫలు వచ్చినప్రయోగాలే అధికంగా ఉంటాయి.

'ఒకచో' అనేదళంచేత ఈసూత్రంప్రకారం ఒకపక్షంలో కార, ఇఫ ప్రత్యయాలు రా వనీ, అపుడు దీర్ఘం వస్తుం దనీ, సూత్రకర్తవివరణంవల్ల తెలుస్తున్నది. కాబట్టి

కార, ఇఫలు వచ్చినపుడు దీర్ఘం రాదు. 'ౡకారమునకు ౡకారము వచ్చును' అనేవిధంగా ఉండదు.

'హ్రస్వంబు' అనడంచేత నిర్దేశవిధానవర్ణాలు దీర్ఘా లయితే వాటికి ఈకార్యం కలగదు. ఐకి ఔ వచ్చును.

'అగు' అనడంచేత దీర్ఘం రావడం నిత్యం. కాబట్టి 'ల కు ర వచ్చును' అని కార, ఇఫ లూ, దీర్ఘమూ ఏదీ రాకుండా ఉండడానికి వీలు లేదు.

నిర్దేశవిధానవర్ణాలు అనేకం అయితే కార, ఇఫ, దీర్ఘాలు ఏవీ రాకపోవడం గమనించవచ్చు. 'కచటతపలు పరుషంబులు, పరుషములకు గసడదవలు' మొ. ఇట 'కకారచకార– ఇత్యాదిగా, లేదా 'కాచాటాతా– ఇత్యాదిగా గాని ఉండదు.

'ఒకచో' అనేదానికి 'నిర్దేశవిధానంబులన్' అనేఅర్థం సూత్రకర్త చెప్తేనే తెలుస్తుంది. ఆఅంశం సూత్రంలోనే స్పష్టంగా చెప్తే బాగుండేది.

'దీర్ఘ స్స్యా ద్వర్ణనిర్దేశే' అనేవికృతివివేకలక్షణం దీనికి మూలం.

**2. దీర్ఘంబు దీర్ఘంబ.** (4)

'నిర్దేశనిధానవిషయము లైనవర్ణములు దీర్ఘము లయ్యె నేని యవి యట్లే యుండు నని యర్థము' అని సూత్రార్థాన్ని సూత్రకర్త పేర్కొన్నాడు.

నిర్దేశవిధానోచ్చారణంబులం దఱచుగ అవర్ణాదులు కారప్రత్యయాంతములును రవర్ణ మిఫప్రత్యయాంతము నగు' అనేసూత్రం 'అ' మొద లయినవర్ణాలకు కార అనేప్రత్యయమూ, 'ర' అనేవర్ణం ఒక్కదానికి మాత్రం 'ఇఫ' అనేప్రత్యయమూ విధించింది.

'ఒకచో హ్రస్వంబు దీర్ఘం బగు' అనేసూత్రవివరణాన్ని అనుసరించి ప్రస్తుతసూత్ర అర్థం ఇలా గ్రహించాలి.

నిర్దేశం లేదా విధానం, అయినవర్ణం (అచ్చు) దీర్ఘం అయితే, దానికి కార అనేప్రత్యయం రానిపక్షంలో ఆదీర్ఘాలు దీర్ఘాలుగా అలాగే ఉంటాయి. వాటికి ఏవిధ మయినమార్పు కూడా రాదు.(దీర్ఘం అచ్చే అవుతుంది కాబట్టి ఇఫప్రత్యయం ప్రసక్తి లేదు.)

ఐకి ఔ వచ్చును. ఇందులో 'ఐ' అనేవర్ణం నిర్దేశం, 'ఔ' అనేవర్ణం విధానం. 'నిర్దేశ విధాన – అనేసూత్రంచేత కారప్రత్యయం వస్తే 'ఐకారమునకు ఔకారము వచ్చును' అని వ్యవహరింపబడుతుంది.

ప్రస్తుతసూత్రంచేత కారప్రత్యయం రానిపక్షంలో ఇంక ఏమార్పూ రాక దీర్ఘం దీర్ఘంగానే ఉండి– ఐకి ఔ వచ్చును.

'దీర్ఘంబు' అనేదళంచేత నిర్దేశవిధానవర్ణాలు హ్రస్వా లయితే యీసూత్రం దగ్గర ప్రసక్తి లేదు. 'ఒకచో హ్రస్వంబు దీర్ఘం బగు' అనేసూత్రంచేత దీర్ఘం వస్తుంది.

'దీర్ఘంబు– అ' అనేచోటిఅవధారణార్థకం (అ) చేత దీర్ఘానికి ఏమార్పూ రాదు.

'ఒకచో హ్రస్వంబు దీర్ఘం బగు' అనే సూత్రంచేతనే దీర్ఘానికి ఏమార్పూ లేకపోవడం సిద్ధిస్తున్నది. దీర్ఘానికి మార్పును చెప్పేలక్షణం వేరుగా లేదు. కాబట్టి దీర్ఘం దీర్ఘమే అని సూత్రించవలసిన అవసరం లేదు. అయితే దీర్ఘం మీద కార, ప్రత్యయం రానిస్థితిని సాధించడం ప్రయోజనం అనాలి. కాని నిర్దేశవిధానోచ్చారణంబుల అనేసూత్రంలోని తఱచు శబ్దంచేత ఉచ్చారణంలో మాత్రమే కాక నిర్దేశవిధానాల్లో గూడా కార, ఇఫలు రానిస్థితిని సాధించుకోవచ్చు. అపుడు ఈసూత్రం చెప్పడంవలన ప్రయోజనం ఏమీ లేదు అని చెప్పక తప్పదు.

### 3. ఒకానొకచో జకారం బుభయంబు నగు. (5)

ఈసూత్రం అర్థాన్ని సూత్రకర్తే వివరించాడు. 'శ్లేషయందు జకార మొక్కటియ యొకయర్థమున దంత్యమును, వే ఱొకయర్థమున దాలవ్యము నయ్యెడు నని యర్థము'.

తెలుగులో 'చజ'లు తాలవ్యమూ, దంత్యమూ అని రెండురకాలు. ఎక్కడిది తాలవ్యమో, ఎక్కడిది దంత్యమో చిన్నయసూరి పేర్కొన్నాడు. ఒకేచోట రెండూ కావడాన్ని ఈసూత్రం విశేషంగా చెప్తున్నది.

శ్లేషస్థలంలో అంటే అనేక మయినఅర్థాలు ఉన్నచోట ఉన్నజకారం ఒకటే, ఒక అర్థంలో తాలవ్యమూ, మరొక అర్థంలో దంత్యమూ రెండూ అవుతుంది అని సూత్రార్థం.

ఉదా. 'పాండురాజయశ మెన్న వైతి'.

రామాయణార్థంలో 'పాండుర అజయశము' అని విభాగం. అజశబ్దం సంస్కృత(సమ)ం. సంస్కృతంలో దంత్యచజలు లేవు. ఉన్నవి తాలవ్యాలు మాత్రమే. అందుచేత 'అజ' అనేసంస్కృత(సమ)శబ్దంలోనిజకారం తాలవ్యం.

భారతార్థంలో 'పాండురాజ (యశ మెన్న వైతి)' అనేచోట రాజశబ్దంలోనిజకారం దంత్యం. ఇది కూడా సంస్కృత(సమ)మే. అయినా 'మఱియు రాజు శబ్దం బొక్కటి దంత్యయుక్తంబు గానంబడియెడి' అని చిన్నయసూరి సంస్కృతసమ మయినా

రాజుశబ్దంలో మాత్రం జకారం దంత్యం అన్నాడు. వైకృతచంద్రిక, మొ. పూర్వవ్యాకరణాలు కూడా రాజు జకారం దంత్య మని చెప్పాయి.

కాగా 'పాండురాజయశము' అనేచోట ఉన్నజకారం భారతార్థంలో దంత్యమూ, రామాయణార్థంలో తాలవ్యమూ ఉభయం అయింది. కాబట్టి ఇది ఉభయ మని ప్రౌఢవ్యాకర్త అభిప్రాయం.

'రాజు' అనేవిధంగా ఉదంత మయినపుడే ఇక్కడిజకారం దంత్యం. రాజా, రాజవు ఇత్యాదిస్థలాల్లో జకారం తాలవ్యమె, అని సూరిఅభిప్రాయంగా విమర్శకులు గుర్తించారు. 'రాజ' అన్నపుడు జకారం దంత్య మనడం భ్రాంతి అని చెప్పాడు అప్పకవి. కాగా ఈఉదాహరణంలో జకారం రెం దర్థాలలోనూ తాలవ్యం ఒక్కటి మాత్రమే అయింది. అందుచేత ఉభయం కావడానికి ఇది సరి యైనలక్ష్యం కాదు.

ధర్మరా జితరక్షమాపాల మొ. ఇక్కడ ఉదాహరింపవచ్చు. (ధర్మరాజు ఇతర –రాజులో జకారం దంత్యం. ధర్మరాజిత రక్ష – రాజిత లో జకారం తాలవ్యం.)

'ఒకానొకచో' అంటే శ్లేషలో మాత్రమె కాబట్టి రెం దర్థాలు లేనిచోట జకారం దంత్యమో, తాలవ్యమో ఏదో ఒకటే అవుతుంది. కాని ఉభయం కాదు. 'శ్లేషయందు' అనేఅంశం సూత్రంలోనే చెప్తే స్పష్టంగా ఉండేది.

'జకారంబు' అనడంచేత 'చ' కారానికి ఇటువంటిఉభయస్థితి లే దని అర్థం. కాని 'పంచదార వెనుదీయగ' అనే విజయవిలాసప్రయోగంలో చకారం కూడా ఉభయం అయింది. పంచ–దార అయిదుగురిభార్య అనేఅర్థంలో సంస్కృత మయిన 'పంచ' శబ్దంలో చకారం తాలవ్యం. చక్కెర అనేరెండవఅర్థంలో అచ్చుతెలు గయిన 'పంచదార' శబ్దంలో (అకారంతో కూడిఉన్నది కాబట్టి) దంత్యం. కాబట్టి ఈచకారం ఉభయం.

చకారం కూడా ఇలా ఉభయం అయినస్థితి ఉంది, కాబట్టి సూత్రంలో 'జకారంబు' అని జకారం ఒక్కదానినే చెప్పడం సరి గాదు.

'ఉభయంబును' అనేచోటిసముచ్చయంచేత ఇటువంటిస్థలాలు కవిప్రయోగాలలో అరుదుగా ఉన్నట్లు గ్రహించవచ్చు.

'ఉభయము' అంటే ఒకేసారి దంత్యతా, తాలవ్యతా రెండూ కలిసిన ఉచ్చారణం ఉంటుంది అని అర్థం. కాని ఒక్కొక్కఅర్థంలో దంత్యమో, తాలవ్యమో ఏదో ఒక్కటే అవుతున్నది కాని ఒకేసారి చజలు ఉభయం కావడం లేదు.

కాగా ఈలక్షణం లక్ష్యవిరుద్ధం అనక తప్పదు.

## 4. నకారం బసాధారణంబు ద్రుతంబు. (7)

సూత్రార్థాన్ని సూత్రకర్తే వివరించాడు ఇలా. 'ప్రత్యయాగమావ్యయాత్మక మై యుత్వవిశిష్ట మయిననకారంబు ద్రుతసంజ్ఞకం బని యర్థము. ఇది 'విభక్త్యాగమ చార్థో ను ర్ద్రుతః' అనే సూత్రాంధ్రవ్యాకరణసూత్రానికి అనువాదం.

'నకారంబు ద్రుతంబు' అనేబాలవ్యాకరణలక్షణం సాధారణంగా నకారానికి ద్రుతం అనేసంజ్ఞను చెప్పినట్లుగా తోస్తుంది. పరుషాదిసంజ్ఞలవలె ఈద్రుతసంజ్ఞ నకారానికి సాధారణంగా అంటే అన్నిచోట్లా చెల్లదు.

అసాధారణం అంటే కొన్ని విశేష మయినలక్షణాలు కలిగినపుడే నకారం ద్రుతం అవుతుంది. ఆవిశేషలక్షణాలు ఇవి. 1. నకారం ఉత్వంతో కూడిఉండాలి. అంటే 'ను' అనేది ద్రుతం. 2.ఆ ను వర్ణం ప్రత్యయమో లేక ఆగమమో లేక అవ్యయమో ఈమూడింట్లో ఏదో ఒకటి కావాలి. అపుడే నకారం ద్రుతసంజ్ఞను పొందుతుంది.

**1. ప్రత్యయ నువర్ణం** – తాను, నేను. ఇక్కడ 'ను' వర్ణం ప్రథమావిభక్తి ప్రత్యయం. ధనమును – ద్వితీయావిభక్తి. నామవిభక్తి.

చదువుచున్నాను – ఇక్కడ 'ను' ఉత్తమపురుషైకవచనం. క్రియావిభక్తి.

**2. ఆగమ నువర్ణం** – నాచేతను మొ. ఈనువర్ణం 'తృతీయాదులకు నుగాగమం బగు' అని ఆగమంగా వచ్చింది. కాబట్టి ఆగమం.

**3. అవ్యయ నువర్ణం** – అన్నయును, తమ్ముడును. సముచ్చయం మొద లయిన అర్థవిశేషాలను తెలియజేసే 'ను' అనేది అవ్యయ మయిన ప్రత్యేకపదం. అదీ ద్రుతమే.

వలెను, పోలెను మొ. అవ్యయాలలోని 'ను' వర్ణం ప్రత్యేకంగా అవ్యయం కాదు. ఇది ప్రత్యయం కానీ, ఆగమం కానీ కూడా కాదు. అవ్యయ అవయవం. వలె మొద లయినఅవ్యయాలలో చివరి నువర్ణం ద్రుతం.

ద్రుత మయినఈనువర్ణం ఇకారాదులపై ఉండి 'ని' అని మారినా, లేదా ను,ని లలో అచ్చు లోపించి నకారపుపొల్లుగా (న్) ఉన్నా 'ఏకదేశవికృత మనన్యవత్' అనేన్యాయా న్ననుసరించి ద్రుతమే అవుతుంది. హరిని, పైన్. మొ.

అదియును(న్) కాక మొద లయినస్థలాల్లో 'కొన్నియెడల ద్రుతంబుమీద నకారంబు గానంబడియెడి' అనేసూత్రంచేత పొల్లనకారమే వస్తుంది. ఇది నువర్ణవికారం కాదు. అయినా ద్రుతమే. అదియునున్గాక.

'ద్రుత మనగా నొల్లనియెడ మఱిగిపోవునది' అని సూత్రకర్త ఈసంజ్ఞకు అర్థం చెప్పాడు. ఇది అవ్యాప్త్యాది దోషరహితం అనలేం. ద్రుతం లోపింపవచ్చు.

'అవసానంబునందు ద్రుతస్వరంబున కేని ద్రుతంబున కేని లోపంబు బహుళంబుగా నగు' అనేసూత్రంచేత ద్రుతంలో అచ్చు లోపింపవచ్చు. వచ్చెన్, హరిన్. ద్రుతమే లోపింప వచ్చు. వచ్చె హరి. ఆసూత్రంలోనిబహుళపదంచేత ఉన్నాను మొద లయినచోట్ల లోపం రాదు. ఉన్నాన్, ఉన్నా ఇత్యాదిగా కవిప్రయోగాలు కనబడవు.

'నకారంబు' అనడంచేత ప్రత్యయాదు లయినా నకారం కానిదానికి ద్రుతసంజ్ఞ లేదు. రామునకు – హరికి. మొ.

'అసాధారణంబు' అనడంచేత ప్రత్యయాదిలక్షణాలు లేని సాధారణ మయిన నకారానికి ద్రుతసంజ్ఞ ఉండదు. చేను, మి న్నడు మొ.

### 5. అకప్రత్యయాంతావ్యయంబు కళయు. (8)

సూత్రార్థాన్ని సూత్రకర్తే ఇలా వివరించాడు. 'వ్యతిరేకార్థకభూతకాలికాసమాపక క్రియ ద్రుతప్రకృతికము కా దని యర్థము'.

లింగ, విభక్తి, వచనాలు లేనిపదం అవ్యయం. 'కజీ వ్యతిరేకక్త్వార్థంబునం దగు' ఇత్యాదిగా వ్యతిరేకక్త్వార్థంలో విధింపబడిన 'క' అనేప్రత్యయమూ, దానికి ముందుగా ధాతువు చివర వచ్చే 'అ'త్వమూ కలిపి 'అక' ప్రత్యయంగా వ్యాకర్త పేర్కొంటున్నాడు. అక ప్రత్యయం చివర కలిగినఅవ్యయం, అక ప్రత్యయాంతావ్యయం. ద్రుతాంతము లయినపదములు ద్రుత ప్రకృతికములు, కాగా ద్రుతప్రకృతులు కానిశబ్దంబులు కళ లనంబడును.

'అక' అనేప్రత్యయం చివర కలిగిఉన్న వ్యతిరేకక్త్వార్థక మయినఅవ్యయం కళ మాత్రమే అవుతుం దని సూత్రార్థం. ఎప్పుడూ ద్రుతప్రకృతికం కా దని తాత్పర్యం.

వైకృతచంద్రిక, తెలుగువ్యాకరణం మొద లైన పూర్వవ్యాకరణగ్రంథాల్లో ఇటువంటివి వైకల్పికద్రుతప్రకృతికాలుగా పేర్కొనబడ్డాయి. కొట్టక, తిట్టక అనే (అ) కప్రత్యయాంతాలను కళలలో ఉదాహరించి చిన్నయసూరి ఇవి ద్రుతప్రకృతికాలు కా వనీ, కళ లవుతా యనీ చెప్పాడు. దాన్నే యీసూత్రం ఇంకా వివరంగా చెప్తున్నది.

కా దన కిట్టి. అనక (అను + అక) అనేది అనుధాతువుయొక్క అక ప్రత్యయాంత రూపం. ఇది ద్రుతప్రకృతిక మైతే 'ఇఁకాదులకుఁ దప్ప – అని సంధి రాదు.

కాబట్టి 'అనక నిట్టి' అని కావాలి. 'అన కిట్టి' అని సంధి జరగడాన్నిబట్టి 'అక' కళే. అత్తునకు సంధిగా 'చూడ కుండెను' అని ఉదాహరించి సూరి ఈవిషయాన్నే చెప్పాడు.

తొరంగ నీక తొలగ, లేక తగ. ఇక్కడ ఈక (ఇచ్చు+ క) లేక (కలుగు + క) అనేవి అకప్రత్యయాంతాలు. పరుషం పరంగా ఉండగా ద్రుతకార్యాలు లేకపోవడాన్నిబట్టి (ఈకఁ దొలగ, లేకఁ దగ) వీటికి చివర ద్రుతం లేదు. పరుషం పర మైనపుడు (సమాసం కానపుడు) ద్రుతానికి లోపం రాదు. కాబట్టి ఇక్కడ సహజంగానే చివర ద్రుతం లే దని గ్రహించాలి. ద్రుతాంతాలు కావు, కాబట్టి ద్రుతప్రకృతికాలు కావు. కాబట్టి యివి కళలు.

అచ్చు పరంగా ఉండగా సంధి, పరుషం పరంగా ఉన్నపుడు ద్రుతకార్యాలు రాకపోవడాన్నిబట్టి అక ప్రత్యయాంతం కళ మాత్రమే అవుతుం దని గ్రహించాలి.

'ఆధారము లేకను' అనేనన్నయప్రయోగంలో 'లేక' అనేఅకప్రత్యయాంత కళాపదంమీద అర్థవిశేషంలో 'ను' అనేమరోఅవ్యయపదం చేరి, లేకను అని ద్రుతాంత మయింది. రాముడు(ను), అన్న(యును) మొ. వాటిలాగా, లేక(ను) కళే.

'అకప్రత్యయాంత' అనడంచేత చూచుచున్, చూచినన్, మొద లైనఇతర ప్రత్యయాంతాలకు ఇక్కడ ప్రసక్తి లేదు. అవి ద్రుతప్రకృతికాలు కావచ్చు.

'అవ్యయంబులు' అనడంచేత అకప్రత్యయాంతాలే అయినా అవ్యయాలు కాని గీఱకము, మాఱకము మొ. వాని కిట ప్రసక్తి లేదు.

'కళయ' (కళ – అ) అనుచోటిఅవధారణార్థకంచేత ఇవి ఎప్పుడూ (వైకల్పికంగా కూడా) ద్రుతప్రకృతికాలు కా వని అర్థం.

బాలవ్యాకరణం ఈవిషయం చెప్పిఉండడంచేత ప్రస్తుతలక్షణం చెప్పకుంటే భాషకు అనర్థం లేదు. సిద్ధార్థానువాద మైన ఈలక్షణం స్పష్టత కనుకోవాలి.

### 6. కారము క్షారశబ్దభవము. (10)

తెలుగులో ఉన్న కారము అనేశబ్దం సంస్కృతంలోని 'క్షార' అనేశబ్దంనుంచి పుట్టిం దనీ, కాబట్టి (సంస్కృతభవం) తద్భవం అనీ సూత్రానికి అర్థం.

చిన్నయసూరి 'సంస్కృతప్రాకృతతుల్యం బగుభాష తత్సమంబు' అని సూత్రించి కటుః (సంస్కృతం) కారో (ప్రాకృతం) కారము అని ఉదాహరించాడు. అంటే తెలుగులోని కారము అనేశబ్దం ప్రాకృతంలోని కారో అనేశబ్దంనుంచి (ప్రాకృత)సమంగా వచ్చిం దనీ, కాబట్టి యిది తత్సమ మనీ చిన్నయసూరిమతం.

సూరిమతం – తత్సమం – కారో అనే ప్రాకృతశబ్దంనుంచి యిది తెలుగులోకి వచ్చింది.

ప్రౌఢ.మతం – తద్భవం – క్షార అనే సంస్కృతశబ్దం నుంచి పుట్టింది.

క్షారశబ్దంనుండి పుట్టిం దనడానికి వ్యాకర్త కారణాలు ఇలా చెప్తున్నాడు.

కార అనేతెలుగుశబ్దానికి 'క్షార' అనేసంస్కృతశబ్దంతో రూపసామ్యం ఉన్నది. కటుశబ్దంతో పోలిక లేకపోవడంవల్ల కారము కటుశబ్దభవం అనడం కుదరదు. కాబట్టి మూలరూపాన్ని ప్రాకృతంనుండి గ్రహించవలసివచ్చింది సూరికి.

క్షార – కార శబ్దాలకు అర్థంలో కూడా సామ్యం ఉంది. 'క్షారలవణవర్జనం చ' అనే ఆపస్తంబసూత్రంలో లవణం వేరుగా చెప్పడంవల్ల ఇక్కడ క్షారం అంటే కారం అని అర్థం. కాబట్టి కారము అనేదానికి మూలసంస్కృతశబ్దం 'క్షార' అని చూపాలి. సూరి (పోలిక లేని)కటుశబ్దం చూపడం సరి కాదు.

శబ్ద–అర్థాలు రెండూ సరిపోవడంచేత కారము క్షారశబ్దభవం, తద్భవం అని ప్రౌఢవ్యాకర్త నిర్ణయం.

కాని క్షారశబ్దానికి అర్థం కారం కా దనీ, కొన్ని రకా లయిన పప్పుదినుసు లనీ వ్యాఖ్యాతలు చెప్పారు. ముఖ్యంగా లోక(కావ్య)వ్యవహారంలో క్షారశబ్దం కటుశబ్దానికి పర్యాయంగా లేదు. తత్సమ, తద్భవాలు లోకవ్యవహారంలో ఉన్నశబ్దాలనుంచి ఏర్పడతాయి గానీ, నిఘంటువుల్లోనో మ రేమారుమూలగ్రంథాలలోనిశబ్దాలనుంచో ఏర్పడవు.

రూపం, అర్థం రెండింటితో సామ్యంతో 'కారో' అనేప్రాకృతశబ్దంనుంచి తత్సమంగా కారము వచ్చిం దనే సూరిమతమే యుక్తం. తత్సమం అయినా ప్రాకృతసమం కాబట్టి కారము ఆచ్ఛికమే. (ప్రౌఢ. మొ.వ్యాకర్తలు తెలుగుశబ్దాలకు సంస్కృతశబ్దాలు మాత్రమె మూలంగా చెప్తారు. ప్రాకృతాన్ని ప్రస్తావించరు.)

### 7. కోటపేఁటలు వైకృతములు. (11)

వైకృతం అంటే ఇక్కడ తద్భవం (సంస్కృతభవం) అని గ్రహించాలి. తెలుగులోని కోట, పేఁట అనేశబ్దాలు సంస్కృతంనుంచి వచ్చిన వనీ, తద్భవా లనీ సూత్రానికి అర్థం.

చిన్నయసూరి 'త్రిలింగదేశవ్యవహారసిద్ధం బగుభాష దేశ్యంబు' అని సూత్రించి ఉదాహరణల్లో కోట, పేట అని చూపాడు. కాబట్టి కోట,పేటలు దేశ్యా లని సూరి మతం. ఇవి దేశ్యాలు కా వనీ, సంస్కృతభవా లనీ, ప్రౌఢవ్యాకరణం సవరిస్తున్నది.

'కోట్టారఘట్ట హట్టా శ్చ' అనే అమరత్రిలింగశేషనిఘంటువాక్యాన్ని అనుసరించి సంస్కృతంలో కోట్ట అనేశబ్దం ఉన్నట్లు తెలుస్తున్నది. 'కోట్ట' అనే ఆసంస్కృతశబ్దంనుంచి తద్భవంగా తెలుగులో 'కోట' అనేశబ్దం పుట్టింది. ఇది స్త్రీసమం. కోట, కోటలు మొ.

కోట్ట అనేశబ్దంతోపాటే సంస్కృతంలో 'కోట' అనేశబ్దం కూడా ఉంది. దానినుంచి అయినా తెలుగు 'కోట' తద్భవంగానే ఏర్పడుతుంది. ఇది సంస్కృత'కోట'తో తుల్యంగా ఉన్న దని తత్సమం అనుకోగూడదు. సంస్కృతంలోని 'కుండ' శబ్దంనుంచి తుల్యరూపంతో తెలుగులో 'కుండ' అనేది తద్భవంగా ఏర్పడినట్లు సంస్కృతం కోట నుంచి ఏర్పడే తెలుగు కోట కూడా రూపం సమ మయినా తద్భవమే అవుతుంది. (కాబట్టి మహాకోట, స్వర్ణకోట, రాజకోట ఇత్యాదిగా ఉండదు.)

కోట్టనుంచి వచ్చినా, కోటనుంచి వచ్చినా తెలుగు కోట సంస్కృతభవం. తద్భవం.

'పింఠా విటజనాశ్రయః' అనేఅమరపదపారిజాతాన్నిబట్టి సంస్కృతంలో పింఠా శబ్దం ఉంది. దానినుంచి తెలుగులో 'పేఁట' అనేపదం తద్భవంగా ఏర్పడింది. సంస్కృతంలో పింఠా అంటే విటు లుండేచోటు. పేఁట అంటే తెలుగులో సామాన్యంగా జనావాసం. తద్భవాలలో ఇలా మూలప్రకృతి అర్థం మారడంలో విశేషం లేదు. కాబట్టి అర్థంలో కొంచెం తేడా ఉన్నా పేఁట – పింఠా శబ్దభవమే.

సూరి దేశ్యంగా చూపిన 'పేట' శబ్దంలో అరసున్న లేదు. 'హారం మొ. వాటిలో వరుస' అని దాని కర్థం. మూడుపేటలగొలుసు, ముప్పేటత్రాడు మొ. ప్రౌఢవ్యాకరణం తద్భవంగా చూపిన పేఁటలో అరసున్న ఉన్నది. కాబట్టి ఈశబ్దం వేరు.

కోట్ట(కోట), పింఠా శబ్దాలు లోకవ్యవహారంలో ప్రచురంగా ఉండిఉంటే వాటి నుంచి తెలుగులో తద్భవాలుగా కోట, పేఁటలు ఏర్పడవచ్చు. కాని అటువంటిస్థితి కనబడటం లేదు.

### 8. ప్రాణగొడ్డ మగ్రామ్యంబు నాఁ దగు. (12.)

'లక్షణవిరుద్ధం బగుభాష గ్రామ్యంబు' అగ్రామ్యం అంటే గ్రామ్యం కానిది. వ్యాకరణానికి విరుద్ధం కానిది. అంటే లక్షణబద్ధ మైనది. 'ప్రాణగొడ్డము' అనేశబ్దం లక్షణవిరుద్ధం కాదు. సాధుపదమే. కావ్యాలలో ప్రయోగింపదగినదే.

ప్రాణ అనేకేవలసంస్కృతశబ్దానికి గొడ్డము అనేవికృతిపదంతో సమాసం చేయడం వల్ల 'ప్రాణగొడ్డము' ఏర్పడింది. ఇది 'కేవలసంస్కృతశబ్దము వికృతిశబ్దముతోడ సమసింపదు' అనేలక్షణానికి విరుద్ధం. కాబట్టి గ్రామ్యం. తిక్కన ప్రయోగించడంచేత

'ఆర్యవ్యవహారంబుల దృష్టంబు గ్రాహ్యంబు' అనేలక్షణంప్రకారం గ్రామ్య మయినా గ్రహింపదగినదే అని చిన్నయసూరిమతం.

'ప్రాణగొడ్డము' అనేసమాసం గ్రామ్యం అనేసూరిమతాన్ని సవరిస్తూ ప్రౌఢ వ్యాకరణం అది గ్రామ్యం కా దని ఇలా పేర్కొంటున్నది.

ప్రాణకుట్టక అనేసంస్కృతసమాసపదంనుండి ప్రాణగొడ్డము అనేది తద్భవంగా ఏర్పడింది. హంసపదము - అంచపదము, హంసయాన - అంచయాన. అనేవిధంగా సంస్కృతసమాసం మొత్తం తెలుగులో తద్భవంగా ఏర్పడటం ఉన్నది. అలాగే ప్రాణకుట్టక అనేసంస్కృతసమాసంనుండి ప్రాణగొడ్డ పుట్టింది. యోగపాదుకా – యోగవాగె, నాగస్వరః – నాగసరము మొ. విధంగా సంస్కృతసమాసం తద్భవ మయ్యేటప్పుడు ఉత్తరపదం మాత్రమే వర్ణవికారాలు పొంది, పూర్వపదం ఏమార్పూ లేకుండా తెలుగులోకి రావడం ఉంది. హంసయాన అంచయాన అన్నచోట పూర్వపదం మార్పులు పొందింది, ఉత్తరపదంలో మార్పు రాలేదు.

ఇలా ప్రాణగొడ్డం అనేది మొత్తం తద్భవంగా ఏర్పడింది కాబట్టి ప్రాణ అనేసంస్కృత శబ్దానికీ గొడ్డం అనేవికృతిపదానికీ తెలుగులో సమాసం చేయడం అనేప్రక్రియ లేదు. అందుచేత లక్షణంతో విరోధం లేదు. కాబట్టి గ్రామ్యం కాదు. అగ్రామ్యం.

ఈప్రౌఢవ్యాకర్తమతం యుక్తంగానే తోస్తున్నది. 'గొడ్డము' అనేపదం విడిగా తెలుగులో కనబడదు. కాబట్టి తెలుగులో సమాసం చేయడం సాధ్యం కూడా కాదు.

'ప్రాణగొడ్డ మగ్రామ్యంబు' అంటే చాలు. 'ప్రాణగొడ్డము ప్రాణకుట్టకశబ్దభవము' అంటే ఇంకా యుక్తం.

### 9. కపిలశబ్దభవము కవిలశబ్దం బొండు గానంబడెడి. (13)

కపిల అనేసంస్కృతశబ్దంనుంచి పుట్టినదిగా, అంటే తద్భవం(సంస్కృతభవం)గా తెలుగులో 'కవిల' అనేశబ్దం ఒకటి కనబడుతున్న దని సూత్రాని కర్థం.

కపిల అనే కేవలసంస్కృతశబ్దానికి గడ్డము, జడలు, కన్నులు, అనేవికృతిశబ్దాలతో సమాసం చేయగా కపిలగడ్డము, కపిలజడలు, కపిలకన్నులు అనేరూపాలు ఏర్పడతాయి. కాని కేవలసంస్కృతశబ్దానికి వికృతిశబ్దంతో సమాసం వ్యాకరణం తిరస్కరించింది. కాబట్టి ఈసమాసాలు లక్షణవిరుద్ధా లై గ్రామ్యా లయినాయి. గ్రామ్యాలే అయినా, నన్నయ ప్రయోగించడంవల్ల 'ఆర్యవ్యవహారంబుల దృష్టంబు

గ్రాహ్యంబు' అనేసూత్రంప్రకారం గ్రహింపదగినవే అని సూరిమతం.

ఇక్కడ 'కపిల' అనేసంస్కృతశబ్దమే లేదు, కవిలగడ్డము ఇత్యాదిగా ఇక్కడ ఉన్నది కవిల అనేతద్భవశబ్దమే. రెండువికృతిశబ్దాలకు చేసినయీఆచ్ఛికసమాసాలు లక్షణబద్ధ మయినవే కావడంచేత నన్నయ ప్రయోగించినవి అసలు గ్రామ్యాలే కావు. అని ప్రౌఢవ్యాకరణం సూరిఅభిప్రాయాన్ని సవరిస్తున్నది.

ఇక్కడ నన్నయప్రయోగంలో 'అవసర – పద్యంలో వకారం ప్రాస. కవిలగడ్డము అనేప్రౌఢవ్యాకర్త పాఠం ప్రకారం 'వ' కారప్రాస సరిపోతుంది. సూరి చూపిన 'కపిల'గడ్డము అనేపాఠం ప్రకారం 'ప-వ' ప్రాస అవుతుంది. ప-వ ప్రాసను లాక్షణికులు అంగీకరించలేదు.

ప్రౌఢవ్యాకర్తపాఠంలో గ్రామ్యత్వదోషమే కాక, ప్రాసవిరోధరూప మయినమరోదోషం గూడా తొలగిపోతున్నది. కాబట్టి అది గ్రహింపదగినది.

కాని ప్రౌఢవ్యాకర్త చెప్పిన 'కవిల' అనేతద్భవశబ్దం ఇక్కడ తప్ప మ రెక్కడా కనబడడం లేదు. వేరే సమాసంలో గానీ, ప్రత్యేకంగా కానీ, కవిల అనేశబ్దం ప్రయోగింపబడినజాడ లేదు. కాగా ఈప్రయోగంకోసమే కవిలశబ్దాన్ని అంగీకరించి గడ్డము, జడలు, కన్నులు అనేశబ్దాలతో మాత్రమే సమాసం జరిగి ప్రయోగింప బడుతుం దని చెప్పాలి. ఈసమన్వయం యుక్తమా?

కపిలగడ్డము అనేసూరిపాఠమే వ్రాతప్రతుల్లో పెక్కింటిలో ఉన్నది. (అక్కడ మూడోపాదంలోనూ 'తపసి' అని ప్రాసగా 'ప' కారమే ఉంది.) కపిలశబ్దం ప్రసిద్ధమే. కానీ గ్రామ్యం కావడం, ప,వ ప్రాస కావడం అనేరెండు ఇబ్బందులు ఆపక్షంలో ఉన్నాయి.

'ఒండు గానంబడెడి' అనేమాట తద్భవ మయిన కవిలశబ్దం ఉనికివిషయంలో ప్రౌఢవ్యాకర్తకు కూడా నిశ్చయం లే దని సూచిస్తున్నది.

ఏ మయినా ఈప్రయోగస్వరూపం గూర్చి ఇంకా నిశితంగా పరిశీలించి నిర్ణయించాలి.

## 10. గ్రామ్యంబు తత్తజ్జాతివర్ణనంబునం బ్రయోగార్హం బగు. (14)

'లక్షణవిరుద్ధం బగుభాష గ్రామ్యంబు' వ్యాకరణానికి విరుద్ధ మయిన ఈగ్రామ్యం ప్రయోగించడానికి తగ దనీ, కావ్యాలలో ప్రయోగింపరా దనీ చిన్నయసూరి స్పష్టం చేశాడు.

లక్షణవిరుద్ధ మయినా గ్రామ్యభాష ఆయాజాతులవర్ణనంలో కావ్యంలో

ప్రయోగించడానికి తగినదే అని యీసూత్రం చెప్తున్నది. 'గ్రామ్యం త త్త ద్విధౌ సాధు' అనేఅధర్వణుడిలక్షణం దీనికి మూలం.

త త్తజ్ఞాతు లంటే గ్రామ్యభాష ఉపయోగించడానికి తగినగ్రామ్యజనులు మొ. జాతులు అని గ్రహించాలి. వర్ణనం అంటే ఆయాజాతిమనుషుల సంభాషణావర్ణనం అని అర్థం. తత్తజ్ఞాతిపాత్రలస్వరూపాదులను వర్ణించేటప్పుడు అవి కవివచనా లయితే, అక్కడ గ్రామ్యం ఉపయోగించడం కుదరదు. ఆపాత్రలు సంభాషించేటప్పుడే గ్రామ్యం పాత్రోచితం అవుతుంది.

ఉదా. మొక్కేము సామి, సూసినా మేలు బాగెము సేసినాము.

ఇవి ఎఱుకలమాటలు, కాబట్టి ఆపాత్రలకు తగినట్లుగా గ్రామ్యం ప్రయోగింప బడింది. ఇటువంటిసందర్భాలలో 'మ్రొక్కెదము, ఇతని జూచినమేలు భాగ్యము సేసినారము' అనేవిధంగా లక్షణబద్ధ మయినభాష ప్రయోగిస్తే అది ఆపాత్రకు తగినవిధంగా ఉండదు. ఎఱుకలు ఇటువంటి ప్రామాణికభాష మాట్లాడడం లోకవిరుద్ధం కదా.

ఈవిధ మయినపాత్రోచితభాష యక్షగానాదికృతులలో గమనింపవచ్చు. పూర్వకావ్యాలలో పాత్రోచితంగానే అయినా గ్రామ్యప్రయోగం వెదికి పట్టుకోవలసిందే.

ప్రౌఢవ్యాకర్త ఉద్ధరించినపైస్థలాల్లోనూ నేడు లక్షణబద్ధ మయినపదప్రయోగమే కనబడుతున్నది.

లక్షణయుక్తమె అయినా లక్ష్యాలు ఎంతవఱకు సహకరిస్తాయో పరిశోధించాలి.

'గ్రామ్యంబు' అనడంచేత లక్షణబద్ధ మైన(తత్సమ, తద్భవ, దేశ్య)శబ్దాలు ప్రయోగించడంలో బాధ లేదు. (లక్షణానికి విరుద్ధంగా ఉండే తత్సమ,తద్భవ,దేశ్యాలే గ్రామ్యాలు.)

'తత్తజ్ఞాతివర్ణనంబున' అనడంచేత ఉత్తమజాతిపాత్రలసంభాషణలలో గ్రామ్యప్రయోగం కుదరదు.

**11. ఒకానొకచో ననుకరణవిరహితంబుగ సంస్కృతవాక్యంబు గానంబడియెడి.** (15)

ఇతరులు పలికినమాటలను, ధ్వనులను, వారు పలికినవిధంగా యథాతథంగా స్వీకరించి చెప్పడం అనుకరణం.

'న పదా న్యవ్యయ సుప్ తిజ్ క్త్వా తుమునామ్' అనేసూత్రంతో ఆంధ్రశబ్దచింతామణి సంస్కృతపదాలను తెలుగుతో కలిపి ప్రయోగింపరాదు అని చెప్పింది. తర్వాత 'అనుకృతే కస్తి వాక్యం తు' అనేసూత్రంతో అనుకరణంలో మాత్రం సంస్కృతవాక్యం తెలుగులో కలిపి ప్రయోగించుకోవచ్చు నన్నది. కాగా అనుకరణం లేకుండా సంస్కృతవాక్యాన్ని (పదాన్ని) తెలుగులో ప్రయోగింపరాదు అని చింతామణి నిర్ణయించింది.

'వి నానుకరణం కేచి దాద్యశబ్దం ప్రయుంజతే' అని వికృతివివేకం అనుకరణం లేకుండా కూడా సంస్కృతవాక్యం, పదం, తెలుగులో ప్రయోగింపబడడాన్ని ప్రస్తావించింది. ప్రస్తుతలక్షణం ఆఅంశాన్నే అనువదిస్తున్నది.

అనుకరణం లేకుండా సంస్కృతవాక్యం తెలుగులో అరుదుగా ప్రయోగింప బడుతున్న దని సూత్రానికి అర్థం.

'అంటిటి నమ శ్శివాయ పాపాత్మురాలి' అంటిటి పాపాత్మురాలి అనేతెలుగువాక్యం మధ్యలో 'నమ శ్శివాయ' అనేసంస్కృతవాక్యం అనుకరణం లేకుండానే ప్రయోగింప బడింది. ఇలాగే 'యాగంబు లట 'నమో విశ్వసృజే' విన మింతకు' మొ.

ఇది లక్షణానికి తగినలక్ష్యం కాదు. ఇక్కడ అనుకరణం ఉండా లన్నా సంస్కృతవాక్యంతర్వాత అనుకరణం ఉండే అవకాశమే లేదు.

ఇక్కడ సంస్కృతవాక్యం మాత్రమే అనుకరింపబడడం లేదు. 'అంటిటి నమ శ్శివాయ పాపాత్మురాలి' అనేది మొత్తం పాత్ర పలికినమాట. కాగా అనుకరణం ఆచివర ఉండాలి. అనుకృత మయ్యేవాక్యం పూర్తి కాకుండానే అనుకరణం ఎలా అవుతుంది. 'కిం త త్తనె' అనేస్థలంలో 'కిం అనె తత్' అని ఉంటుందా. (తెలుగువాక్యం అయినా ఇంతే. 'వాడు రేపు వస్తాను అన్నాడు' అంటాం, కాని 'వాడు రేపు అన్నాడు వస్తాను' అంటామా?)

ప్రౌఢవ్యాకర్త చూపినరీతి ఉదాహరణస్థలాల్లో సంస్కృతవాక్యంవరకే అనుకరణం ఉండడం అసంభవం. కాబట్టి పైలక్షణానికి తగినలక్ష్యం మరొకటి వెదుక్కోవలసిందే.

'ఒకానొకచో' అనడంచేత అనుకరణం లేనిసంస్కృతవాక్యప్రయోగం అరుదు.

'అనుకరణవిరహితంబుగ' అనడంచేత అనుకరణసహిత మయినప్రయోగం సాధారణమూ, ధారాళమే.

'సంస్కృతవాక్యంబు' అనడంచేత తెలుగువాక్యం ప్రయోగించుకోవడంలో బాధ లేదు.

'కానంబడియెడి' అనడంచేత కవిప్రయోగాల్లో ఉన్నస్థలాలు మాత్రమే స్వీకరించాలి. కాని స్వతంత్రంగా సంస్కృతాంధ్రాలు కలిపి ప్రయోగింపరాదు.

ఈసూత్రం చెప్పకపోతే భాషకు నష్ట మే మయినా ఉన్న దేమో ఆలోచించాలి. అటువంటి లక్ష్యం మృగ్యం.

# 2. సంధిపరిచ్ఛేదం

**1. ఇప్రత్యయాంతావ్యయంబునకు సంధియుఁ జూపట్టెడి.** (2)

అవ్యయం అంటే లింగం, విభక్తి, వచనం లేనిది. అంటే వాటికి సంబంధించిన మార్పులు లేనిది. 'సమానాశ్రయంబులం బూర్వకాలంబునం దివర్ణకం బగు' అనేసూత్రంచేత విధింపబడిన 'ఇ' అనేప్రత్యయం ఇక్కడ గ్రహింపబడుతుంది. దానినే క్త్వార్థం అంటారు. 'క్త్వార్థం బైనయిత్తునకు సంధి లేదు' అని చిన్నయసూరి ఈ 'ఇ' ప్రత్యయానికి సంధిని నిషేధించాడు. 'క్త్వార్థేతో న భవేత్ సదా' అని అంతకు ముందు అధర్వణుడు కూడా సంధిని నిషేధించి ఉన్నాడు. ఇలా పూర్వవ్యాకరణాలచేత క్త్వార్థక మయిన ఇకారానికి సంధి రాకపోతుండగా ప్రౌఢవ్యాకర్త ప్రస్తుతసూత్రంచేత సంధిని పేర్కొంటున్నాడు.

క్త్వార్థక మయిన ఇకారానికి ప్రామాణికకవిప్రయోగాలలో అచ్చు పర మవు తుండగా సంధి కనబడుతున్న దని సూత్రానికి అర్థం.

అంది+ఇమ్ము. ఇక్కడ 'అందు' అనేధాతువుపై క్త్వార్థంలో ఇప్రత్యయం వచ్చి (అందు+ఇ) అంది అని అయింది. ఇది ఇ ప్రత్యయాంతావ్యయం. 'క్త్వార్థం బైనఇత్తునకు' అనేనిషేధంవల్ల సంధి రాకపోతుండగా ప్రస్తుతసూత్రంచేత సంధి వచ్చి 'అందిమ్ము' అని అయింది.

'ఇప్రత్యయాంత' అనడంచేత ఇతరప్రత్యయాంతానికి ఈకార్యం లేదు. వచ్చినన్+ అతడు. వచ్చిన నతడు.

'అవ్యయంబునకు' అనడంచేత ఇప్రత్యయాంతం అవ్యయం కాకపోతే ఈసూత్రంచేత సంధి రాదు. ఓయారి యది మొ.

'ఇప్రత్యయాంతావ్యయంబునకు' అని వివరించినా సంధి ఈఅవ్యయం చివరి ఇత్వానికే. కాబట్టి 'క్త్వార్థం బైనయిత్తునకు సంధియుఁ జూపట్టెడి' నని చెప్తే సూటిగా ఉండేది.

'సంధియును' అనేచోటిసముచ్చయంచేత సంధి రాకపోవటమే తఱుచు. సంధి జరగడం అరు దని అర్థం. క్వార్థం బయినయిత్తుకు సంధి అయినప్రయోగాలు భాషలో చాల విరళంగా ఉంటా యన్నమాట. వెఱచి యిట్లు మొ.రీతిగా సంధి రాకపోవడం ప్రచురం.

'చూపట్టెడి' అనడంచేత కవిప్రయోగాలలో చూపట్టినస్థలాల్లో మాత్రమే యీసంధిని గ్రహించాలి. కానీ స్వతంత్రించి క్వార్థకేకారానికి సంధి చేయగూడదు.

అందు+ఇచ్చు=అం దిచ్చు – అం దిమ్ము. ఇదిశబ్దపల్లవం. ఇక్కడ క్వార్థకేకారసంధి లేదు. వెఱ చిట్లు – వెఱ నిట్లు, చెప్పంపడె – చెప్పండె, అనేపాఠాంతరాలతో ఆఉదాహరణల్లో కూడా యీసంధి లేదు. 'ఎఱిం గెఱింగి' వంటివి గ్రాహ్యాలు.

**2. చిట్టడవిఁ జిట్టి.** (4)

'చిట్టడవి, చిట్టెలుక మొ. వాటిల్లో పూర్వపదం చిట్టిశబ్దం అని సూత్రానికి అర్థాన్ని సూత్రకర్తే వివరించాడు.

చిన్నయసూరి 'చిట్టెలుక' అనేదాన్ని చిఱు+ఎలుక అని విడదీసి 'కుఱు చిఱు కడు నడు నిడు శబ్దంబుల ఱడల కచ్చు పరం బగునపుడు ద్విరుక్తటకారం బగు' అని 'చిఱు'లో 'ఱు' వర్ణంస్థానంలో 'ట్ట్' ఆదేశ మై (చిట్ట్ + ఎలుక) చిట్టెలుక అని అవుతుం దని చెప్పాడు.

దీన్నిబట్టి చిట్టడవి ప్రభృతుల్లో పూర్వపదం చిఱు(త) శబ్దం అనీ, అందులో ఱువర్ణానికి 'ట్ట్' ఆదేశ మవుతుం దనీ సూరిమతం.

ప్రస్తుతసూత్రాన్నిబట్టి పూర్వపదం చిట్టిశబ్దం. కాబట్టి చిట్టి+ అడవి (చిట్టి+ఎలుక) అని విభాగించి 'ఇవి సంజ్ఞావాచకంబులు గాన సంధి నిత్యము' అనేసూత్రకర్త వివరణాన్నిబట్టి సంధి నిత్యంగా జరిగి చిట్టడవి (చిట్టెలుక) అని అవుతుంది.

దీన్నిబట్టి చిట్టడవి ప్రభృతుల్లో పూర్వపదం (చిఱు కాదు) చిట్టి అనీ, (నిత్యంగా) సంధి జరుగుతుంది. అని ప్రౌఢవ్యాకర్తమతం.

సూరి ఉదాహరించిన 'చిట్టెలుక'ను సూత్రంలో చెప్పక 'చిట్టడవిన్' అని వేరొకశబ్దాన్ని చెప్పడం సూరిమీద గౌరవాన్ని వ్యక్తం చేస్తుం దని కూడా చెప్పవచ్చు. కాని 'చిట్టడవిప్రభృతుల' నని స్పష్టంగా చెప్పదగు. ఉపలక్షణాదివ్యాఖ్యతో పని ఉండేది కాదు. 'పూర్వపదంబు' అని కూడా చెప్తే మరీ మంచిది.

ప్రౌఢవ్యాకర్తమతంలో కొన్నిదోషా లున్నాయి.

1.'చిట్టడవి' ఇత్యాదులు సంజ్ఞావాచకాలు కావు. కాబట్టి సంజ్ఞావాచకాల్లో సంధి నిత్య మని అంగీకరించినా సంజ్ఞలు కాని ఈశబ్దాలలో సంధి నిత్యంగా రాదు. కాబట్టి ఏమ్యాదిసూత్రంచేత సంధి వికల్పంగా వచ్చి 'చిట్టియడవి' అనేవిధ మయిన, సంధి రాని రూపాలు ఏర్పడవలసివస్తుంది.

2. సంజ్ఞావాచకాల్లో సంధి నిత్యం అనేలక్షణం (సూరి గానీ) ప్రౌఢవ్యాకరణం కూడా చెప్పలేదు. రామయ్య, సీతమ్మ వంటివాటిని సాధించే 'శ్రేష్ఠతావాచకంబులు–' అనేసూత్రం సంజ్ఞావాచకాలలో సంధి వస్తుం దని చెప్పేది కాదు. అలా చెప్తుం దన్నా చిట్టడవి ప్రభృతులు సంజ్ఞావాచకాలు కావు కాబట్టి సంధి రాదు.

3. వీటిల్లో సంధిని ప్రత్యేకంగా విధించుకోవాలి. చిట్టడవివంటిరూపాలను సాధించడంకోసం ప్రత్యేకంగా సంధికార్యాన్ని విధించుకోవలసివస్తే 'ద్విరుక్తటకారాన్నే విశేషంగా చెప్పుకోవడంలో ప్రక్రియాగౌరవంవంటిదోషం లేదు.

4. సూరి ఆసూత్రంలో కుఱు, కడు, నడు, నిడు,శబ్దాల్లో కూడా ఇటువంటికార్యాన్ని చెప్పాడు. చిఱు అనేఒక్కదానికి వేరే సమన్వయాన్ని ఆశ్రయించినా మిగిలిన కుఱు, ప్రభృతిశబ్దాలవిషయంలో ఆవిధానం తప్పదు. కుఱ్వాదిశబ్దాలలో 'ట్ట'కారం చేసుకుంటున్నపుడు చిఱు శబ్దం ఒక్కదానివిషయంలోనే యిటువంటిప్రక్రియ అసహజం అని తిరస్కరించడానికి వీలు లేదు.

5. ఒకవేళ అలా చెప్పుకున్నా 'చిఱుగాలి, చిఱుచాప, అనేవిధంగా హల్లు పర మయి నప్పటిలాగా, అచ్చు పర మయినపుడు చిఱుశబ్దం ఉంటే ఏం కావాలి. చిఱుటడవి, చిఱడవి మొ. రూపా లున్నాయా. చిఱు(త)శబ్దానికి అజాదిపదంతో సమాసమే కా దని నియమించుకోవాలి. ఇది కేవలం అసహజం.

సూరి చెప్పిన 'చిఱు+ఎలుక' అనేవిభాగం చారిత్రకంగా కూడా సమన్వయింపబడు తున్న దనే శాస్త్రజ్ఞులఅభిప్రాయం కూడా ఇక్కడ స్మరించుకోవడంలో దోషం లేదు.

కాగా 'చిట్టి+అడవి' అనేప్రౌఢ.మతంకంటే 'చిఱు+ అడవి' అనే సూరిమతమే గ్రాహ్యం.

**3. కొన్నియెడలఁ దెనుఁగులమీఁదిసాంస్కృతికకతపలకు గదవలు గానంబడియెడి.** (5)

'కొన్నియెడల ననఁగా ప్రాసంబులం' దని సూత్రకర్తే అర్థం చెప్పాడు. ప్రాస అంటే పద్యపాదంలో రెండవఅక్షరం. సంస్కృతానికి సంబంధించినవి సాంస్కృతికాలు.

తత్సమాల్లో (మొదటి)వని యిక్కడ అర్థం.

ప్రథమాంత మయిన, అచ్చతెనుగుశబ్దంపైన, ప్రాసస్థానంలో ఉన్నటువంటి, సంస్కృత సమశబ్దాల్లో మొదటి 'క త ప' అనేహల్లులస్థానంలో క్రమంగా 'గ ద వ' అనేవి ఆదేశంగా రావడం కవిప్రయోగాల్లో కనబడుతున్న దని సూత్రాని కర్థం. క ద ప, గ ద వ అన్నపుడు పైనున్న అకారం ఉచ్చారణసౌకర్యంకోసం చేర్చింది. కాబట్టి క్ త్ ప్, అనేపొల్లులస్థానంలో గ్, ద్, వ్ అనేపొల్లులు వస్తాయి.

'ప్రథమమీఁదిపరుషములకు గసడదవలు బహుళంబుగా నగు' అనేసూత్రంచేత ప్రథమాంతం మీదిపరుషాలకు రావలసినగసడదవాదేశాన్ని 'తెనుఁగులమీదిసాంస్కృతికపరుషములకు గసడదవలు రావు' అనేసూత్రం అచ్చతెలుగు పదంమీద ఉన్నసంస్కృతసమశబ్దం మొదటిపరుషాలకు రా దని నిషేధిస్తున్నది. అలా గసడదవలు రాకపోతుండగా ప్రౌఢవ్యాకర్త ప్రయోగానుగుణంగా కతపలకు గదవలు రావడం ఈలక్షణంలో పేర్కొన్నాడు.

వే + పణములు. ఇక్కడ 'వే'శబ్దం ప్రథమాంతం. (వేయిశబ్ద మనీ, సమాస మై యి లోపించిం దనీ, అనుకోగూడదు. 'మొగములు వే గలశేషుండు' అని ప్రయోగం.) దానికి పకారం పర మైంది. 'ప్రథమమీఁదిపరుషములకు– అనేసూత్రంచేత పకారానికి వకారం ప్రాప్తిస్తున్నది. కాని 'తెనుగులమీఁదిసాంస్కృతికపరుషములకు–' అనేనిషేధంవల్ల రాదు. ఇలా రాకపోతుండగా ప్రస్తుతసూత్రంచేత పకారానికి వకార మై, వేవణములు అవుతుంది.

'కొన్నియెడల' అంటే ప్రాసస్థలంలో అన్నాడు సూత్రకర్త. సూత్రంలోనే 'ప్రాసంబు లందు' అంటే స్పష్టంగా ఉండేది. కాగా ప్రాస కానిస్థలంలో ఈకార్యం లేదు. కాని ఈభేదదృష్టి అవసరం అనిపించదు. కొన్నియెడల అనేశబ్దం 'అరుదు' అనేఅర్థంలో గ్రహిస్తే, ఆదేశం లేకపోవడం తఱు చనేవిషయం ప్రయోజన మయ్యేది. గ్రంథకర్తే స్వయంగా వ్యాఖ్యానం వ్రాసుకుంటే ఒక్కొక్కసారి ఇలా యిబ్బందులు వచ్చేఅవకాశమూ ఉంది.

'తెనుగులమీఁది' అనడంచేత సంస్కృతసమాలమీదిసాంస్కృతికపరుషాలకు ప్రస్తుతలక్షణం వర్తించదు. పూర్వవ్యాకరణాలప్రకారం ఆదేశం సామాన్యం. రాముదు గరుణించెన్.

'సాంస్కృతిక' అనడంచేత (అచ్చతెలుగుశబ్దంమీది) అచ్చతెలుగుశబ్దం మొదటిపరుషాలవిషయంలో ఈసూత్రం వర్తించదు. పూర్వవ్యాకరణాలచేత ఆదేశం

సామాన్యంగానే వస్తుంది. వాడు గొట్టె.

'కతపలకు' అనడంచేత చ,ట లకు ఈఆదేశం అసలు లేదు. వాడు చక్రపాణి. అయ్యది టంకృతి.మొ.

'కానంబడియెడి' అనడంచేత కవిప్రయోగాలలో కానవచ్చినస్థలాల్లో మాత్రమే ఈఆదేశం గ్రహించాలి. స్వతంత్రించి చేయగూడదు.

**4. కొన్నియెడల ద్వంద్వంబునం బదంబుమీఁదిచతపలకు సదవలు గానంబడవు.** (6)

సమాసంలోని ఉభయ(పూర్వ, ఉత్తర) పదాలఅర్థం ప్రధాన మైన (క్రియలోకి అన్వయించే) సమాసం ద్వంద్వం. చతపలు అన్నపుడు అకారం ఉచ్చారణసౌకర్యం కోసం. కాబట్టి చ్ ఇత్యాదిగా పొల్లులే గ్రహింపబడతాయి.

ద్వంద్వసమాసంలో పూర్వపదానికి తరువాత ఉన్న(ఉత్తర)పదం మొదటి 'చతప' అనేపరుషాలస్థానంలో సదవ అనేవర్ణాలు ఆదేశంగా రావడం కవిప్రయోగాల్లో కొన్నిచోట్ల కనబడ్డం లేదు. అంటే ఆదేశం రావడం లేదు అని సూత్రానికి అర్థం.

'ద్వంద్వంబునం బదంబుపయి పరుషములకు గసడదవ లగు' అని బాల వ్యాకరణం ద్వంద్వసమాసంలో కచటతపలకు గసడదవలు నిత్యంగా విధించింది. కాబట్టి ద్వంద్వంలో సూరిమతంలో గసడదవాదేశం రాకుండటానికి అవకాశం లేదు. కాగా కవి ప్రయోగానుగుణంగా ఆదేశం రాకపోవడాన్ని ప్రౌఢవ్యాకరణం ఈసూత్రంతో ప్రస్తావిస్తున్నది.

'రాకయును, పోకయును' అనేఅర్థంలో ద్వంద్వసమాసం అయి (విభక్తి లోపించి) రాక + పోక. అని ఉండగా 'ద్వంద్వంబునం బదంబుపయి' అనే(బాల)సూత్రంచేత పకారానికి కావలసినవకారాదేశం ప్రస్తుతసూత్రంచేత వారింపబడగా రాదు. (ప్రథమావిభక్తిలో బహువచనంతో) 'రాకపోకలు' అని ఉంటుంది.

ఇలాగే అందచందములు, అన్నపుడు చకారానికి సకారమూ,

కండతుండెములు అన్నపుడు తకారానికి దకారమూ రాలేదు.

'కొన్నియెడల' అనడంచేత ద్వంద్వంలో సదవాదేశం రానిస్థలాలు కవిప్రయోగాలలో అరుదుగా మాత్రమే ఉంటాయి. కాబట్టి ద్వంద్వంలో ఆదేశం రావడమే తఱుచు. కాలుసేతులు మొ.

'ద్వంద్వంబున' అనడంచేత ఇతరస్థలాలకు ఇక్కడ ప్రసక్తి లేదు.

'చతపలకు సదవలు' అనడంచేత 'క,ట లకు గ,డ ల ఆదేశం రాకపోవడం ఉండదు. అంటే తప్పకుండా వస్తుం దని అర్థం. కూరగాయలు, టక్కుడెక్కులు మొ.

( ప్రౌఢవ్యాకర్త ద్వంద్వంగా చూపిన 'విన్నకన్నది' (సమా. 32) అనేదాన్లో కకారానికి గకారం లేదు. దాన్ని ఈసూత్రం సంగ్రహించదు. నిజానికి విన్నకన్నది అనేది ద్వంద్వం కాదు. 'ఎత్తిపెంచినవారు' ఇత్యాదులలాగా విశేషణసమాసం. కాబట్టి అక్కడ గసడదవాదేశం ప్రసక్తే లేదు.)

'కానంబడవు' అనటంచేత గసడదవలు రానిస్థలాలను కవిప్రయోగానుసారంగానే గ్రహించాలి. స్వతంత్రంగా ద్వంద్వంలో ఈఆదేశాన్ని మానగూడదు.

### 5. తామర కాకు పరం బగునపుడు పుగాగమం బగు. (8)

ఆగమం అంటే (వర్ణం) అధికంగా వచ్చిచేరటం. అలా వచ్చిచేరినవర్ణం కూడా ఆగమం అవుతుంది. పుక్ + ఆగమ, అన్నపుడు కకారం ఇత్తు. కాబట్టి లోపిస్తుంది. కకారం ఇత్తుగా కలిగింది, కాబట్టి 'పు'వర్ణం కిత్తు. అందుచేత 'ఆద్యన్తౌ టకితౌ' అనేసంస్కృతపరిభాషచేత విధించినదానికి చివరలో చేరుతుంది. 'పు' వర్ణంలో ఉత్వం ఉచ్చారణసౌకర్యంకోసం చేర్చబడింది. కాబట్టి అది తొలగిపోగా మిగిలిన పకారంపొల్లు మాత్రమే ఆగమం అవుతుంది.

ఆకు అనేశబ్దం పరంగా ఉండగా పూర్వంలోని 'తామర' అనేశబ్దానికి చివర పకారపు పొల్లు (ప్) ఆగమంగా వచ్చిచేరుతుం దని సూత్రానికి అర్థం.

తామర+ఆకు అని ఉండగా 'అత్తునకు సంధి బహుళముగా నగు' అనేసూత్రంచేత ప్రాప్తిస్తున్నసంధిని బాధించి ప్రస్తుతసూత్రంచేత పుగాగమం వచ్చి తామరప్ + ఆకు = తామరపాకు.

'తామరకు' అనడంచేత ఇతరశబ్దానికి ఈకార్యం లేదు. చింత + ఆకు = చింతాకు, చింతయాకు. తాటి+ఆకు = తాటాకు. తాటియాకు. మొ.

'ఆకు పరం బగునపుడు' అనడంచేత ఆకుకంటే ఇతర మయినశబ్దం పర మయితే ఈకార్యం రాదు. తామరయందము.

'అగు' అనడంచేత పుగాగమం నిత్యం. కాబట్టి ఆగమం రాని – తామరాకు, తామరయాకు అనేరీతిరూపాలకు అవకాశం లేదు. తామరాకు, తామరయాకు అనేరూపాలు కవిప్రయోగాలలో కనబడకపోవడంచేత వ్యాకర్త నిత్యంగా విధించి ఉండవచ్చు.

ఈఆగమం సమాసంలో మాత్రమే వస్తుంది. 'తెల్లదామర ఆకుపై నున్నది'. అని వ్యస్త మైతే పుగాగమం రాదు. సమాసంలో వచ్చే అనేక మయినమార్పుల్ని సమాస (36) పరిచ్ఛేదంలో ఈవ్యాకర్త కూడా నిరూపించాడు. ఒక్క (విధ మయిన) రూపాన్ని సాధించడంకోసం ఇలా ప్రత్యేకంగా లక్షణం చేయడం ఎంతవరకు అవసరం అనేది ఆలోచించవలసిఉంది.

**6. కొన్నిచోట్ల షష్ఠీసమాసంబునం దుకారంబున కచ్చు పరం బగునపుడు నుగాగమంబునకు లోపంబు నగు.** (10)

షష్ఠీ(యొక్క)విభక్తి చివర గలిగినశబ్దానికి మీదిపదంతో చేసినసమాసం షష్ఠీసమాసం. షష్ఠీతత్పురుషసమాసంలో తరువాతిపదం మొదటిఅచ్చు పరంగా ఉండగా పూర్వపదం చివరిఉకారంపైన చేరిన నుగాగమానికి లోపం కూడా వస్తుం దని సూత్రాని కర్థం.

'షష్ఠీసమాసంబులం దుకార ఋకారముల కచ్చు పరం బగునపుడు నుగాగమం బగు' అనేసూరిలక్షణంప్రకారం వచ్చిననుగాగమానికి ఈసూత్రం ఉదంతాలపై లోపం చెప్తున్నది.

శిరసుయొక్క - అనేషష్ఠ్యంతానికి అందము అనే పైపదంతో (షష్ఠీ)సమాసం చేయగా సమాసంలో విభక్తి లోపించి 'శిరసు+అంద' అని ఉండగా ఉత్వసంధిని బాధించి 'షష్ఠీసమాసంబునం దుకారఋకారములకు' అనేసూత్రంప్రకారం నుగాగమం వచ్చి శిరసున్+అంద. ప్రస్తుతసూత్రంచేత ఆనుగాగమం లోపించి, శిరసు+అంద. 'ఉత్తున కచ్చు పరం బగునపుడు సంధి యగు' అని సంధి జరిగి, శిరసందము.

'కొన్నిచోట్ల' అనడంచేత నుగాగమం వచ్చిన అన్నిచోట్లా లోపం రాదు. కవిప్రయోగాలలో లోపం కనిపించినచోట్ల మాత్రమే వస్తుంది. ప్రయోగాలలో నుగాగమం నిలిచిఉండటమే తఱుచు. 'రాజునాజ్ఞ' మొ.

'షష్ఠీసమాసంబునందు' అనడంచేత ఇతరసమాసాలలో (ఉకారానికి అచ్చు పర మైనపుడు వచ్చిన) నుగాగమానికి లోపం రాదు. చేయు+అతడు=చేయునతడు. ఇలాగే చేసెడు+అతడు=చేసెడునతడు. ఇక్కడ చేయతడు, చేసెడతడు ఇత్యాదిగా నుగాగమం లోపించినరూపాలు ఉండవు.

'ఉకారంబునకు' అనడంచేత ఋకారంపై వచ్చిననుగాగమానికి లోపం రాదు. విధాతృనానతి. మొ.

'అచ్చు పరం బగునపుడు' అనడంచేత హల్లు పర మయినపు డయిన నుగాగమానికి లోపం రాదు. సింగపుంగొదమ.మొ.

'నుగాగమంబునకు' అనడంచేత ఇతర మైనఆగమానికి లోపం రాదు. వేలుపుటావు. మొ.

'లోపంబును' అనేచోటిసముచ్చయార్థక 'ను' శబ్దంచేత లోపం వచ్చేలక్ష్యాలలో కూడా లోపం అరు దనీ, లోపం రాకపోవడమే తఱ చనీ అర్థం. శిరసునందము.మొ.

'లోపంబు' చెప్పడంవల్ల ముందుగా ఆగమం చేయాలి. ఆగమం చేసి దానికి లోపం చేయడంకంటె మొదలు ఆగమమే కొన్నియెడల రా దని చెప్తే ప్రక్రియలో లాఘవం సిద్ధించేది.

'ఆగమశాస్త్ర మనిత్యమ్' అని బాలవ్యాకరణంచేతనే అరుదుగా ఆగమం రాని రూపాలు కూడా సాధించుకునే అవకాశం ఉంది అంటారు కొందరు.

**7. పూ పూవు.** (11)

'అసమాసంబునం బూశబ్దము పూవుశబ్దముయొక్క పర్యాయముగా గానంబడియెడి నని యర్థము' అని సూత్రంఅర్థాన్ని సూత్రకర్తే వివరించాడు.

పూవు అనేశబ్దానికి పర్యాయంగా 'పూ' అనేఏకాక్షరశబ్దం కూడా సమాసం కానిస్థితిలోనూ ఉన్నది అని తాత్పర్యం.

సమాసంలో పూవు (శబ్దానికి పర్యాయంగా), పూ ఉండడాన్ని సూరి పేర్కొన్నాడు. పూవు అనేశబ్దం ప్రాఁతాదులలోది. కాబట్టి పూవురెమ్మ ఇత్యాదిగా సమాసం చేసినసందర్భంలో 'సమాసంబునం బ్రాఁతాదులతొలియచ్చుమీఁదివర్ణంబుల కెల్ల లోపంబు బహుళంబుగా నగు' అనేసూత్రంచేత తొలియచ్చుమీదివర్ణాలు లోపించగా పూ+రెమ్మ. ఇత్యాదిగా 'పూ' అనేరూపం ఏర్పడుతుంది. ఈకార్యం సమాసంలో మాత్రమే. కాబట్టి సమాసం కానిపక్షంలో (వ్యస్తతలో) 'పూవు' శబ్దానికి 'పూ' అనేరూపాంతరం బాలవ్యాకరణం ప్రకారం సిద్ధించదు.

ఉదా. కాలకంఠునిశిరసుపూ గగనగంగ

ఇక్కడ పూవుశబ్దం తీసుకుంటే అందులో తొలిఅచ్చుమీదివర్ణాలు లోపించే అవకాశం లేదు. కాబట్టి 'శిరసుపూ' అనేచోటి 'పూ'శబ్దం పూవు నుండి ఏర్పడిం దనడానికి వీలు లేదు. అందుచేత ఇక్కడి పూ శబ్దం ప్రత్యేక మైనదిగా చెప్పవలసిందే.

సమాసం కానపుడు 'పూ' శబ్దం ఉం దని చెప్పడంలో పూరెమ్మ ఇత్యాది

రూపాలకోసం పూవును ప్రాతాదుల్లో చేర్చడం అనవసర మనీ, పూ శబ్దానికి రెమ్మతో సమాసం చేస్తే పూరెమ్మ అయిపోతుం దనీ, ప్రౌఢవ్యాకర్త అభిప్రాయం కావచ్చు. అందుకే దీన్ని సంధిపరిచ్ఛేదంలో చెప్పాడు.

కానీ, 1. పూఁబొదలు, పూఁదోట, ఇత్యాదుల్లో నుగాగమం రావడం మొ. వాటినిబట్టి పూవును ప్రాఁతాదులలో చేర్చక తప్పదు.

2. పూను, పూచేత ఇత్యాదిగా పూశబ్దం వ్యస్తంగా కనబడడం లేదు. 'సింధువారమున బూ శిథిలపడగ' అని ప్రయోగం ఉంది. కాని ప్రామాణికాలు లేవు.

3. శిరసుపూ, (తలపూ వాడక, పొన్నపూ) ఇత్యాదులు కూడా సమాసాలే. ఇక్కడ పూ(వు)శబ్దం సమాసంలో చివర ఉన్నది. ప్రాతాదిసూత్రంలోని బహుళశబ్దంచేత గానీ, సామాసికవికారంగా గానీ, ఇక్కడ గూడా పూవు లో వు లోపం సాధించుకోవడం యుక్త మేమో అనిపిస్తుంది.

ప్రౌఢవ్యాకర్త ప్రస్తావించిన 'పూ' అనే ప్రత్యేకశబ్దాన్ని అంగీకరించడానికి ఇంకా దృఢ మైన ఆధారాలు వెదకాలి. పూరెమ్మ, పూఁదోట ఇత్యాదులు ప్రసిద్ధాలు. కాగా సూరిమతమే యుక్తం అని యిప్పటికి నిశ్చయింపవచ్చు.

**8. సమాసమందుఁ దత్సమంబు పరం బగునపుడును నుమాగమాదులు గానంబడియెడి.** (12)

ఇక్కడ ప్రౌఢవ్యాకర్త నిర్దేశించిన'క్రొత్తాదులు లుప్తశేషంబులు దేశ్యంబులతోడంబలె దత్సమంబులతోడం గొన్నియెడల గర్మధారయం బగు' అనేసూత్రాన్నిబట్టి ఈకార్యం క్రొత్తాదులసమాసంలో అని గ్రహించాలి. చిన్నయసూరి చెప్పిన ప్రాతాదులే ప్రౌఢవ్యాకర్త చెప్పిన క్రొత్తాదులు. 'నూతనత్వాదిబోధకాః' అనే అథర్వణవచనాన్ని అనుసరించి ప్రౌఢవ్యాకర్త క్రొత్తాదు లన్నాడు. లక్ష్యాలలో ప్రయోజనాన్ని ఉద్దేశించి సూరి ప్రాఁతాదు లని మార్పు చేశాడు.

తత్సమం అంటే సంస్కృతసమం అని అర్థం. పూర్వపద మైన క్రొత్తాదు లన్నీ ఆచ్ఛికాలే. ఉత్తరపదం సంస్కృతసమం కావడంవల్ల ఇవి మిశ్రసమాసాలు. 'నుమాగమం' అన్నపుడు నుమ్ లో మకారం ఇత్తు. 'మి దచో ऽన్త్యాత్ పరః' అని మి త్తయిన ఆగమం విధించినదానిలో చివరిఅచ్చుకు పరంగా వస్తుంది. 'నుమాగమాదులు' అన్నప్పటి ఆదిశబ్దంచేత మీదిహల్లుకు ద్విత్వం గ్రహించాలి.

'ను మ్ప్రాతః' అని చింతామణి చెప్పిననుమాగమం 'అమిశ్రే స్త్రీసమాత్' అని

అథర్వణుడు మిశ్రసమాసాలలో అంటే సంస్కృతసమం పరంగా ఉంటే, రా దని చెప్పాడు. (సూరి రా దనలేదు, కాని ప్రాతాదిసంధిసందర్భంలో మిశ్రసమాసం ఉదాహరించలేదు.) ఆఅభిప్రాయాన్ని సవరిస్తూ ప్రౌఢవ్యాకర్త ఈలక్షణం చేశాడు.

మిశ్రసమాసంలో క్రొత్త మొద లయినశబ్దాలకు సంస్కృతసమం అయిన ఉత్తరపదం పరంగా ఉండగా నుమాగమం, లేదా మీదిహల్లుకు ద్విత్వం రావడం కవి ప్రయోగాలలో కనబడుతున్న దని సూత్రాని కర్థం.

ముందు+కోపము అని ఉండగా 'సమాసంబునం బ్రాఁతాదులతొలియచ్చు మీఁదివర్ణంబుల కెల్ల లోపంబు బహుళంబుగా నగు' అనేసూత్రంచేత మొదటిఅచ్చు పైన ఉన్నవర్ణాలు అన్నీ లోపించి ము+కోప. ఇక్కడ 'కోప' అనేది సంస్కృతసమం. ప్రస్తుతసూత్రంచేత నుమాగమం వచ్చి మును+కోప. ద్రుతకార్యాదులతో – ముంగోపము.

క్రొ(త్త) + నారాచ.  అన్నపుడు మీదిహల్లుకు ద్విత్వం వచ్చి, క్రొన్నారాచము.

ఈలక్షణం స్పష్టంగా లేదు. ప్రాతాదులసమాసంలో అని స్పష్టంగా చెప్పక పోవడంవల్ల ఆబృందము, రామునిబాణము ఇత్యాదిగా సంస్కృతసమం పర మైన సమాసా లన్నింటిలోను ఈలక్షణం ప్రసక్త మవుతున్నది. ఇలాగే కఱకుటసుర, మొ.

తత్సమం అనడంకంటె సంస్కృతసమం అంటే ఇంకా ఉచితంగా ఉండేది.

'తొలియచ్చుమీదివర్ణములు లోపించి' లుప్తశేషం అయినతర్వాతనే బాలవ్యాకరణం ప్రకారం నుగాగమాదు లయ్యేది. అంటే నుగాగమాదులకు ముందు 'లోపం' కూడా చెప్పాలి. లోపం వచ్చి లుప్తశేషం అయినతరువాత నుమాగమాదులు తప్పక వస్తాయి. మొదటికార్యం లోపం. కాబట్టి ఇక్కడ కార్యం లోపాదులుగా చెప్తే సక్రమంగా ఉండేది.

'నుమ్' అని మిత్తుగా చింతామణి, వికృతివివేకాలనుబట్టి చెప్పడం జరిగింది. షష్ఠీసమాసంలోలాగా బాలవ్యాకరణానుగుణంగా 'నుక్' అని కిత్తుగా చెప్పదగు.

తొలియచ్చుమీదివర్ణాలు లోపించి, 'ము+ కోప. అని అయినతర్వాత 'ను' ఆగమం, లేదా ద్విత్వం,  రాకుండా ముకోపము, నెమనము వంటి రూపాలు ఉండవు.

కాగా ఈసూత్రం చెప్పకపోతే భాషకు నష్టం కలుగుతుం దని చెప్పలేం.

## 9. నెన్నడాదులన్ నెఱి దగు. (14)

నెన్నడ అనేది మొదలుగా కలిగినవి నెన్నడాదులు. వీటిలో పూర్వపదంగా నెఱి అనేశబ్దం ఉండటం యుక్తం. అని సూత్రార్థాన్ని సూత్రకర్తే చెప్పాడు. 'నెఱ పూర్ణార్థకము. నెఱి రమ్యార్థకము. అనేసూత్రకర్తవివరణాన్నిబట్టి నెన్నడాదులలో పూర్వపదం 'నెఱ' కా దని చెప్పడం తాత్పర్యంగా తెలుసుకోవచ్చు.

సూరి 'అన్యంబులకు సహిత మిక్కార్యంబులు కొండొకచోఁ గానంబడియెడి' అనేసూత్రంవద్ద 'నెత్తఱి, నెమ్మది, నెవ్వగ, నెన్నడుము' అని ఉదాహరించి వాటిలో పూర్వపదంగా 'నెఱ' అనేశబ్దం చూపాడు. వీటిలో నెన్నడుమును నెన్నడాదులలో చేర్చి పూర్వపదం నెఱ కా దని సూరిమతాన్ని తిరస్కరిస్తూ నెఱి ఉండటం యుక్త మని తనమతాన్ని వ్యాకర్త వివరించాడు.

నెఱ+నడ, నెఱ+నడుము అని గ్రహిస్తే నిం డైన నడక, నిం డైన నడుము ఇత్యాదిగా అర్థం చెప్పాలి.'నెఱ' ప్రశస్తగుణవాచక మనీ, నెన్నడుము ఇత్యాదుల్లో గూడా నెఱశబ్దం యుక్తమే అని కొంద రంటారు. కానీ దానికంటే నడక, నడుము మనోహరంగా ఉం దని చెప్పడమే యుక్తం. కాబట్టి పూర్వపదంగా నెఱి ఉండా లనే ప్రౌఢ.మతమే ఉచితంగా కనబడుతున్నది.

'నెన్నడాదులన్' అనడంచేత నెన్నడ మొద లయినవాటిలో చేరనిసమాసంలో పూర్వపదం 'నెఱి' కానక్కఱ లేదు. కాగా నెత్తఱి, నెమ్మది, నెవ్వగ అనే సూరిఉదాహరణలలో సూరి చెప్పినట్లు పూర్వపదం 'నెఱ'గా ఉండడం సమంజసం. అన్నిచోట్లా ఒకేశబ్దం ఉండా లనేనియమం లేదు.

కాగా సూరి ఉదాహరణలలో నెన్నడుము ఒక్కదానిలోనే మార్పు. అయితే ఆశబ్దమే సూత్రంలో చెప్పకుండా నెన్నడ అని వేరేశబ్దాన్ని తీసుకోవడంలోనూ, 'తగున్' అనడంలోనూ ప్రౌఢవ్యాకరణంలో మృదుత్వాన్ని గమనింపవచ్చు.

## 10. కొన్నియెడల నవర్ణంబు పరం బగునపుడు పూర్వపదాంత్య దకారంబు నకారం బగు. (15)

'నవర్ణంబు' అన్నచోట అకారం ఉచ్చారణార్థంగా గ్రహించాలి. కాబట్టి నవర్ణం అంటే నకారం (న్). పూర్వపదం అనేమాట సమాసంలోని మొదటిపదాన్ని బోధిస్తుంది. అందుచేత ఈకార్యం సమాసాల్లోనే. పూర్వపదం చివర దకారం అచ్చుహిత మై ఉంటుంది. అపుడు స్వరంతో వ్యవధానంవల్ల నకారం పరంగా ఉండడం సంభవించదు. అపు డీవిధానం వర్తించేఅవకాశం ఉండదు. కాబట్టి ఈవిధాన

సామర్థ్యంచేత పూర్వపదాంత్యడకారంమీది అచ్చు లోపిస్తుం దని గ్రహించాలి.

కొన్నిచోట్ల సమాసంలో తరువాతిపదం మొదటినకారం పరంగా ఉండగా ముందరిపదం చివరిడకారంమీది అచ్చు లోపించి, ఆడకారంపొల్లుస్థానంలో నకారంపొల్లు ఆదేశంగా వస్తుం దని సూత్రాని కర్థం.

రెండు+నాఁడు(ళ్లు) అని ఉండగా ప్రస్తుతసూత్రంచేత దువర్ణంలో ఉత్వం లోపించి, రెండ్+నాఁడు. ఇపుడు నకారం పరంగా ఉండగా ముందరి డకారపుపొల్లుస్థానంలో పొల్లునకార మై, రెం+నాఁడు. 'సంస్కృతసమేతరంబు లయినతెలుఁగుశబ్దముల యందుఁ బరుషసరళములకు ముందే బిందువు కానంబడుచున్నది' అనేసూత్రం ప్రకారం స్థిరానికి ముందు బిందు వుండదు. కాబట్టి లోపించి రెన్+నాఁడు. ప్రథమా విభక్తిలో బహువచనంతో 'రెన్నాళ్లు' అవుతుంది.

'కొన్నియెడల' అనడంచేత ఈకార్యం అన్నిచోట్లా రాదు. మఁడినీళ్లు, మూఁడు నెలలు మొద లయినచోట్ల డకారానికి నకారం రాదు. నకారం వచ్చేచోట్ల గూడా రెండునాళ్లు, వేఁడినీళ్లు ఇత్యాదిగా నకారం రానిరూపాలే తఱుచుగా ఉంటాయి.

'నవర్ణంబు పరం బగునపుడు' అనడంచేత ఇతరవర్ణం పర మయితే ఈకార్యం లేదు. వేఁడిపాలు, రెండుచోట్లు. మొ.

'నవర్ణంబు' అంటే అత్వసహితనకారం (న) అని అర్థ మవుతుంది. 'ద్వంద్వంబు నందు ఋకారంబునకు రవర్ణంబు విభాష నగు'. (బాల.సమా.35) నకారంబు అంటే బాగుండేది.

'పూర్వపద' అనడంచేత ఈకార్యం సమాసాలలోనే. కాబట్టి సమాసం కానపుడు ఈకార్యం లేదు. క్రోసులు రెండు నడచెను. వేఁడి నెలకొనె. మొ.

'అంత్య' అనడంచేత చివరిది కానిడకారానికి నకారం రాదు.

'డకారంబు' అనడంచేత డకారంకంటె వే రయినహల్లుకు నకారం రాదు. ఒకనాడు, ఐదునెలలు మొ. అయినా వెల్ల-నెల, వెన్నెల మొ. కొన్నిస్థలాలు విశేషం. ఇవి నిక్కలాదులలో చేరతాయి.

'నకారం బగు' అనకుండా 'నకారంబు నగు' అని సముచ్చయం చేరిస్తే రెండునాళ్లు వంటివాటికి అవకాశం స్పష్టంగా ఉండే దని తోస్తుంది.

**11. మధ్యమపురుషమువర్ణకంబున కచ్చు పరం బగునపుడును గొన్నియెడల లోపంబు చూపట్టెడి.** (18)

యుష్మదర్థం (నీవు, మీరు) కర్తగా కలిగినక్రియాపదం మధ్యమపురుషం. (ఆశీస్సు, ప్రార్థనం మొ. అర్థాలలో) 'ము'ప్రత్యయం మధ్యమపురుషలో ఏకవచనం.

ఈమధ్యమపురుష 'ము' ప్రత్యయం అచ్చు పరంగా ఉన్నపుడు కూడా లోపించడం కవిప్రయోగాలలో కనబడుతున్న దని సూత్రాని కర్థం.

'మధ్యమపురుషమువర్ణకంబునకు హలవసానంబులు పరంబు లగునపుడు లోపము విభాష నగు' అని చెప్పినసూరి 'చూడు మనియె, విను మనియె ఇచ్చట నచ్చు పర మయినది కాట్టి లోపము లేదు'. అని స్పష్టంగా మళ్ళీ చెప్పాడు. అధర్వణుడు కూడా 'న ప్రాణే తు కదాచన' అన్నాడు. ఆఅభిప్రాయాన్ని సవరిస్తున్నది ఈసూత్రం.

'చెప్పుము+ అనినన్' అని ఉండగా 'ఉత్తున కచ్చు పరం బగునపుడు సంధి యగు' అనేసూత్రంచేత ప్రాప్తిస్తున్న ఉత్త్వసంధిని బాధించి ప్రస్తుతసూత్రంచేత ముపర్ణకం లోపించి చెప్పు+అనినన్. ఇపుడు 'ఉత్తున కచ్చు-' అనేసూత్రంచేత సంధి జరిగి, 'చెప్పనినన్' అని అవుతుంది.

'మధ్యమపురుష' అనడంచేత మధ్యమపురుష కాని ముపర్ణకానికి ఈకార్యం లేదు. చదువుదము + అంటిని=చదువుద మంటిని. (అన్నము+అడిగెను =అన్న మడిగెను.)

'ముపర్ణకంబునకు' అనడంచేత ముపర్ణకంకంటె వే రయినమధ్యమపురుష ప్రత్యయానికి ఈకార్యం లేదు. చదువుదువు+ ఎల్లపుడు = చదువుదు వెల్లపుడు. వినుడు+ఇదె = విను డిదె.

'అచ్చు పరం బగునపుడును' అనేచోటిసముచ్చయార్థక నుశబ్దంచేత హలవసానాలు పర మైనపుడు పూర్వవ్యాకరణాలచేత సాధారణంగానే లోపం వస్తుంది. చూడు నన్ను, ఇటు చూడు. మొ.

'కొన్నియెడల' అనడంచేత అచ్చు పర మైనపుడు లోపం (హలవసానపరకతలోవలె) సార్వత్రికం కాదు. అరుదుగా కొన్నిచోట్లనె. కాబట్టి చూడు మనియె, విను మనియె ఇత్యాదిగా లోపం రాకపోవడమె సాధారణం.

చెప్పు నినున్.... పుణ్యుండుగా. అనేయతిస్థలప్రయోగా న్ననుసరించి ఇక్కడ హల్లు పర మైనపుడే 'ము' లోపం అయింది. ఆడిదె అనే మరో దానికి ఆడితె అనే పాఠాంతరమే అర్థవంతం.

కాగా ఈలక్షణానికి కావు కావు(ము)+అనువారు = 'కావు కా వనువారు' వంటివి ఉదాహరించడం యుక్తం.

## 12. ప్రాసంబున మకారంబు పరం బగుచో ద్రుతంబునకు మకారాదేశం బగు. (22)

'వళి రాద్య మనన్తరాక్షరం ప్రాసః'. పద్యంలో ప్రతిపాదంలోనూ రెండవఅక్షరానికి ప్రాస(ము) అని పేరు. ప్రాసస్థానంలోని మకారం పరంగా ఉండగా దానికి పూర్వంలోని ద్రుతంస్థానంలో మకారపుపొల్లు ఆదేశంగా నిత్యంగా వస్తుం దని సూత్రాని కర్థం. ప్రాసనియమం ఉన్నపద్యంలో, మిగిలినపాదాల్లో ప్రాసాక్షరం ద్విరుక్తమకారం అయినసందర్భంలో మాత్రమే ఈకార్యం జరుగుతుం దని గ్రహించాలి.

'కమ్మనిలతాంతములకు మ్మొనసి'. ఇక్కడ 'కమ్మని' అన్నపుడు ద్విరుక్తమకారం ప్రాస అయింది. కాబట్టి 'లతాంతములకును-మొనసి' అనేచోట 'ద్రుతమునకు సరళస్థిరంబులు పరంబు లగునపుడు లోపసంశ్లేషంబులు విభాష నగు' అనేసూత్రాన్ని బాధించి ప్రస్తుతవిశేషవిధిచేత ద్రుత మైన 'ను' వర్ణంస్థానంలో మకారంపొల్లు వచ్చి 'లతాంతములకు మ్మొనసి' అని అవుతుంది. ఇలాగే చేసెను+మహానది = చేసె మ్మహానది. మొ.

'ప్రాసంబున' అనడంచేత (ద్విత్వమకారం) ప్రాసకంటే వే రయినస్థలాల్లో ఈకార్యం లేదు. 'ద్రుతమునకు సరళస్థిర- అనే సూత్రంచేత లోప సంశ్లేష స్వత్వాలు యథావసరంగా కలుగుతాయి. లతాంతములకు మొనసి, చేసె న్మహానది, మొ.

'మకారంబు పరం బగుచో' అనడంచేత వేరేవర్ణం పరంగా ఉంటే ఈకార్యం రాదు. చేసె నతడు, ధాత న్నాభిని. మొ.

'ద్రుతంబునకు' అనడంచేత ద్రుతం కానిదానికి ఈకార్యం లేదు. విన్మిదియ కాదు. వినుము- విను- విన్. ఈనకారం ద్రుతం కాదు. కాబట్టి వి మ్మిది అని కాదు.

'మకారాదేశంబు' అన్నపుడు ఆదేశ మనేమాట స్పష్టతకే. అది లేకుండా 'ద్రుతంబునకు' అని మాత్రమే చెప్పినా ద్రుతంస్థానంలో మకారం ఆదేశంగానే వస్తుంది.

'అగు' అనడంచేత ఈకార్యం నిత్యం గాబట్టి 'కమ్మని లతాంతములకు మొనసి' అనేవిధంగా ద్విత్వమకారప్రాసస్థలంలో ద్రుతానికి లోపాదులు రావు.

'ప్రాసంబున' అని సాధారణంగా కాకుండా 'ద్విమకారప్రాసంబున' అని స్పష్టంగా

చెప్పాలి. 'భ్రమరములు లతాంతముల–కు మొనసి, తన్మయత లతాంతముల – కున్మొనసి' అనే యితరవిధ మైనప్రాసల్లో మకారమే పరంగా ఉన్నా ద్రుతానికి మకారాదేశం చేస్తే ప్రాసభంగ మవుతుంది. అయినా ప్రాసస్థానంలో వచ్చే ఈకార్యం ఇతరత్రా రా దని చెప్పడంలో యుక్తి కనబడదు. అసలు 'ప్రాసంబున' అనేదళమే లేకుండా చెప్పడం మేలు. కాని–

'ద్విత్వమకారప్రాసలో అని చెప్తే 'అగు' అని నిత్యంగా విధించడం యుక్తం. సాధారణంగా చెప్పదలచుకుంటే (మామూలుగానే) మకారం రావడం 'కొన్నియెడల కానంబడియెడి' అనడం అవసరం.

## 13. ఆమ్రేడితంబు పరం బగునపుడు కృతహ్రస్వంబునకు దీర్ఘం బగు. (23)

ద్విరుక్తంయొక్క పరరూపం ఆమ్రేడితం. ఒకేశబ్దం రెండుసార్లు ఉచ్చరించినపుడు అందులో రెండవసారి ఉచ్చరింపబడినది (రెండవశబ్దం) ఆమ్రేడితం. కృతహ్రస్వం అంటే (దీర్ఘానికి) చేయబడినహ్రస్వం. మధ్యమముదుజులు లోపించకపోతే ఆమ్రేడితం కృతహ్రస్వానికి పరంగా ఉండదు. కాబట్టి ముదుజ్‌జులు లోపించినపుడు మాత్రమే ఈలోపం వస్తుంది.

ఆమ్రేడితం పర మయినపుడు మధ్యమముదుజ్‌జులు లోపింపగా పూర్వంలో ఉన్న (మొదటిశబ్దందీర్ఘానికి) చేయబడినహ్రస్వానికి దీర్ఘం వస్తుం దని సూత్రాని కర్థం.

లెమ్ము+లెమ్ము. అని ఉండగా 'ఆమ్రేడితంబు పరం బగునపుడు మధ్యమ ముదుజ్‌జులకు లోపంబు విభాష నగు' అనేసూత్రంచేత మొదటి 'లెమ్ము' లో 'మ్ము' వర్ణం లోపించగా, లె+లెమ్ము. (ఇక్కడ 'లే(చు) లో దీర్ఘానికి వచ్చినహ్రస్వం కాబట్టి 'లె' అన్నపు డున్నది కృతహ్రస్వం. దానికి ఆమ్రేడితం పర మైంది కాబట్టి) ప్రస్తుతసూత్రంచేత దీర్ఘం వచ్చి, లేలెమ్ము అని అవుతుంది. ఇలాగే 'లెండు + లెండు = లేలెండు.'

'ఆమ్రేడితంబు' అనడంచేత ఆమ్రేడితం కానిది పర మయితే ఈకార్యం లేదు. లెమ్ము, పొండు. మొ.

ఆమ్రేడితంబు 'పరం బగునపుడు' అనడంచేత (ఆమ్రేడితానికి పూర్వంలోని మొదటిశబ్దంలోనే ఈదీర్ఘం.) ఆమ్రేడితంలో దీర్ఘం రాదు. లెలేమ్ము, పొపోండు అని కాదు.

'కృతహ్రస్వంబునకు' అనడంచేత సహజ మైనహ్రస్వానికి దీర్ఘం రాదు. కొట్టు కొట్టుము, లెమ్ము లెమ్ము. ఇక్కడ కొట్టూ కొట్టుడు, లెమ్మూ లెమ్ము ఇత్యాదిగా దీర్ఘం రాదు.

'అగు' అనడంచేత ఈకార్యం నిత్యం. కాబట్టి దీర్ఘం రాని లెలెమ్ము, పొపొండు అనేవిధ మయినరూపా లుండవు.

ఈకార్యం ఆమ్రేడితం పరంగా ఉన్నపుడు మాత్రమే కాక మధ్యమముడుజులు లోపించిన అన్నిసందర్భాలలోనూ అంటే హలవసానపరకతలోనూ వస్తుంది.రా, బాలకృష్ణ ! రా.

సూరి 'ముడుజులకు లోపంబు రా– అని శబ్దలక్షణసంగ్రహంలో చెప్పాడు. కాబట్టి 'ఆమ్రేడితంబు పరం బగునపుడు' అనకుండా 'మధ్యమముడుజులకు లోపంబు రా' అని చెప్పి ఉంటే లక్ష్యా లన్నీ సంగ్రహింపబడేవి.

# 3. శబ్దపరిచ్ఛేదం

**1. శబ్దములు విశేష్యములు విశేషణము లని ద్వివిధంబులు.** (1)

ఈసూత్రానికి పూర్వంలో ఉన్న 'నామప్రకరణము' అనేశీర్షిక ననుసరించి ఇక్కడ శబ్దములు అంటే నామము లైన శబ్దములు అని అర్థం. 'నామము లనఁగా వస్తువాచకశబ్దములు' అని ప్రౌఢవ్యాకర్త వాక్యప్రకరణంలో వివరించాడు. వస్తువును తెలియజేసేశబ్దాలు నామాలు. నామవిభక్తి అంటే ప్రథమ, ద్వితీయ మొదలుగా ఏడు విభక్తులు చివర గలిగినశబ్దాలను నామపదాలు అని వ్యవహరిస్తారు.

కాగా ప్రథమ మొద లైననామవిభక్తులు చివర గలిగినశబ్దాలు విశేష్యాలు, విశేషణాలు అని రెండు విధాలుగా ఉంటా యని సూత్రానికి అర్థం.

'విశేషణము నా జాత్యాదివిశేషములను దెలుపునది'. జాతి, గుణము, క్రియ, ద్రవ్యము, సంఖ్యా, సంజ్ఞ అనేఆరువిధా లైనవిశేషాలను తెలియజేసేశబ్దానికి విశేషణం అని పేరు. ఉదా. బ్రాహ్మణుడు. ఇది బ్రాహ్మణత్వం అనేజాతివిశేషాన్ని తెలియజేస్తున్నది. కాబట్టి ఇది విశేషణం. జాతి ననుసరించి ఏర్పడింది కాబట్టి దీన్ని జాతిప్రయుక్తవిశేషణం అంటారు. నల్లనివాడు. ఇది నలుపు అనేగుణవిశేషాన్ని తెలియజేస్తున్నది. కాబట్టి గుణప్రయుక్తవిశేషణం. వచ్చినవాడు. వచ్చుట అనేక్రియను

తెలియజేసే(క్రియాప్రయుక్త)విశేషణం. ధనవంతుడు. (ద్రవ్య), ఒకడు (సంఖ్య), దేవదత్తుడు (సంజ్ఞ).

'విశేష్యము నా విశేషణముచేఁ దెలుపఁబడువిశేషము గలది.' విశేషణంచేత తెలియజేయబడే జాతి మొద లైనవిశేషాలు గలిగినది విశేష్యం

అయ్య, అన్న, అమ్మ,అక్క, మొద లైనవి విశేష్యాలు అని వ్యాకర్త వివరించాడు. ధనవంతు డైన అయ్య. ధనవంతుడు అనేవిశేషణంచేత తెలియజేయబడే ధనం గలిగిఉండటం అనేవిశేషం కలిగినవాడు కాబట్టి ఇక్కడ అయ్య అనేపదం విశేష్యం. ఇలాగే వచ్చుచున్న అమ్మ, గుణవంతురా లైనఅక్క, మొ.

తక్కినవి విశేషణాలు అని ఇక్కడ వ్యాకర్త విశేషణాన్ని వివరించాడు. అంటే అయ్య అమ్మ మొద లైనవాటికంటే వేరైనశబ్దాలు విశేషణాలు. అవి జాతి, గుణం మొదలుగా ఆరు రకాలు అయినవిశేషాలు తెలియజేసేశబ్దాలు. విశేష్యంలోని జాతి మొద లైనవిశేషాలను తెలియజేసేశబ్దాలు విశేషణాలు అని తాత్పర్యం. బ్రాహ్మణుడు, నల్లనివాడు మొ.

**2. విశేషణము జాత్యాదిభేదంబుచే షడ్విధంబు.** (3)

చూ. వ్యాసప్రశ్న

**3. ప్రధానంబు పశ్చాద్వాచ్యం బగు.** (7)

అన్వయక్రమమునందు విశేషణములు ముందు చెప్పి కడపట విశేష్యమును జెప్పవలె అని సూత్రార్థాన్ని సూత్రకర్త వివరించాడు.

'విశేష్యంబు ప్రధానం బితరం బప్రధానంబు' అనేపూర్వసూత్రాన్ని అనుసరించి ప్రధానం అంటే విశేష్యం. పశ్చాద్ వాచ్యం అంటే తరువాత అర్థం చెప్పవలసింది అని అర్థం. దీన్నిబట్టి అప్రధానం ఐనవిశేషణం అర్థాన్ని ముందుగా చెప్పాలి. పదములకుఁ బరస్పరము గలసంబంధ మన్వయ మనంబడు' అనేసూత్రాన్ని అనసరించి అన్వయం అంటే పదాలఅర్థానికి పరస్పరం ఒకదానికి ఒకదానితో ఉన్నసంబంధం.

విశేషణవిశేష్యాలు వాక్యంలో ఏక్రమంలో ప్రయోగించినప్పటికి అన్వయించే సమయంలో మాత్రం విశేషణాలఅర్థాన్ని ముందుగా చెప్పి, విశేషణాలు అన్ని అయిపోయాక చివరలో విశేష్యం అర్థాన్ని గ్రహించాలి. అంటే క్రమంగా విశేషణాల అర్థాన్ని విశేష్యంతో అన్వయించి విశేష్యం అర్థాన్ని క్రియతో అన్వయించాలి. 'విశేషణంబులు కొన్ని వ్యవహితంబులు నగు' ఈసూత్రంలో విశేషణంబులు అనేపదం

విశేష్యం. కొన్ని అనేపదం విశేషణం. ఇక్కడ వాక్యంలో విశేష్యం ముందుగానూ, విశేషణం తరువాతగానూ ప్రయోగింపబడ్డాయి. కాని అన్వయించేటపుడు మాత్రం 'కొన్ని విశేషణంబులు ' అనేవిధంగా విశేషణాన్ని ముందుగా గ్రహించాలి. ఇలాగే 'రామునికి సీతాపతికి' నతులు. ఇక్కడ 'సీతాపతికి రామునికి' అనేవిధంగా విశేష్యం తరువాత ఉంచి అన్వయించాలి.

**2. ఒక్కొకచో విశేష్యవిశేషణంబులు వ్యత్యస్తంబులు నగు.** (9)

వ్యత్యాసం అంటే తారుమారు కావడం. తారుమా రయినది వ్యత్యస్తం. కొన్నిచోట్ల విశేషణాలూ, విశేష్యాలూ, తారుమారు అవుతా యని సూత్రానికి అర్థం. అంటే విశేషణాలు విశేష్యా లవుతాయి, విశేష్యాలు విశేషణాలు అవుతాయి.

నీమాఱుదల్లి త్రిభువనభామారత్నంబు గంధవతిపై. ఈప్రయోగంలో 'గంధవతి' అనేది సంజ్ఞ. కాబట్టి సంజ్ఞాప్రయుక్తవిశేషణం. తల్లి అనేది విశేష్యం. నీమాఱుదల్లి, (త్రిభువన భామారత్నమూ) అయిన గంధవతిమీద– అనేఅన్వయంతో విశేష్య మయిన మారుదల్లి విశేషణ మయింది. (సంజ్ఞాప్రయుక్త) విశేషణ మయిన 'గంధవతి' ప్రధాన మై, ఇక్కడ విశేష్యం అయింది.

'ఒకొక్కచో' అనడంచేత ఈవిధమైన వ్యత్యాసం సార్వత్రికం కాదు. అరుదుగా మాత్రమే ఉంటుం దని అర్థం.

'విశేషణ విశేష్యంబులు' అనడం స్పష్టతకే. 'ఒక్కొకచో వ్యత్యస్తంబులు నగు' అని చెప్పినా ప్రకరణాన్నిబట్టి ఈఅర్థం సిద్ధిస్తుంది.

'వ్యత్యస్తం' అంటే విశేషణం పూర్వంలోనూ, విశేష్యం దానికి తరువాతగానూ ప్రయోగింపబడడం అనేస్థితి తారుమా రవుతుం దని కొందరు అర్థం చెప్పారు. అంటే మారుదల్లి అనేది విశేష్యమే, గంధవతి–విశేషణమే ముందువెనుకలే తారుమా రయ్యాయి అంటారు. కాని 'గంధవతిపై' అనేదే ప్రాధాన్యాన్నిబట్టి ఇక్కడ విశేష్యం.

'వ్యత్యస్తంబులును' అనేచోటిసముచ్చయంచేత వ్యత్యస్త మయినచోట వ్యత్యస్తం గానిస్థితి కూడా ఉంటుం దని అర్థం. ప్రస్తుతస్థలంలో అలా ఉండటం కుదర దనిపిస్తుంది.

**3. విశేషణంబులు కొన్ని వ్యవహితంబులు నగు.** (11)

వ్యవహితం అంటే వ్యవధానం అంటే ఎడం కలిగినది. విశేషణాలను గురించి చెప్తున్నాడు కాబట్టి ఈవ్యవధానం విశేష్యంతో అని గ్రహించాలి.

(విశేషణానికీ, విశేష్యానికీ) మధ్యలో వేరే పదం ప్రయోగించడంచేత విశేషణం

విశేష్యంతో వ్యవధానం (ఎడం) కలిగినది కావడం కొన్ని విశేషణాలవిషయంలో ఉన్న దని సూత్రానికి అర్థం.

మే లెల్లెడఁ గాన వరునిన్. ఇచట 'వరుని' అనేది విశేష్యం. మేలు అనేది విశేషణం. మేలు–వరుని అనేవిశేషణవిశేష్యాలకు మధ్యలో 'ఎల్లెడఁ గాన' అనేపదాలు ప్రయోగింపబడినాయి. కాగా మేలు అనేవిశేషణం వరుని అనేవిశేష్యంతో 'ఎల్లెడఁ గాన' అనేపదాలతో వ్యవధానం కలిగిఉన్నది. కాబట్టి యిది ప్రస్తుతసూత్రానికి లక్ష్యం అవుతున్నది.

ఇక్కడ 'మే లెల్లెడ వరునిఁ గాన' అని పాఠాంతరం. అందులోనూ 'ఎల్లెడ' అనేదానితో వ్యవధానం. 'మేలిల్లెడువరుని' అనేముద్రితపాఠంలో 'మేలిల్లెడు' ధాతుజవిశేషణం. కాగా ఇక్కడ వ్యవధానం లేదు.

వీరభోజ్యము సుమ్ము రాజ్యము, మొదలుగా విశేషణవిశేష్యములకు వ్యవధానం ప్రయోగాలలో ఉన్నది. కాని మేలెల్లెడ గాన వరుని అనేరీతి వ్యవధానం మాత్రం వింతగా తోస్తున్నది.

**4. హలవసానంబులు పరంబు లగునపుడు లురువర్ణకంబుల యుత్వంబునకు లోపంబు వైకల్పికంబుగ నగు.** (16)

కకారాదులు హల్లులు. పిదప వర్ణము లేవీ లేకపోవడం అవసానం. వర్ణకం అంటే ప్రత్యయం. హల్లు గానీ అవసానం గానీ పరంగా ఉన్నప్పుడు, పూర్వంలో ఉన్న ప్రత్యయా లైన లు, రు అనేవాటిలోనిఉకారానికి వికల్పంగా లోపం వస్తుంది అని సూత్రానికి అర్థం.

ప్రతతులు+సాల్పడి. ఇక్కడ హల్లు(సకారం) పరమైంది. కాబట్టి ప్రథమా బహువచనం అయిన 'లు' వర్ణంలోని ఉకారం ప్రస్తుతసూత్రం ప్రకారం లోపించగా ప్రతతుల్ సాల్పడి.

'వైకల్పికం' అనడంచేత ఉత్వం లోపించనిపక్షంలో 'ప్రతతులు సాల్పడి' అని కూడా ఉంటుంది.

భూసురోత్తములు – భూసురోత్తముల్. ఇక్కడ అవసానంలో ఉత్వలోపం.

ఇలాగే తత్వాలురు+భయంబు=తత్వాలు ర్భయంబు. హల్పరకతలో – ప్రథమాబహువచన మైన 'రు' వర్ణకంలో ఉత్వలోపం. ఇలాగే వత్తురు+వారు – వత్తు ర్వారు.

భూపాలుర్ – (భూపాలురు) అవసానంలో రువర్ణంలో ఉత్వలోపం.

'హలవసానంబులు' అనడంచేత అచ్చు పర మైనపుడు ఉత్వానికి లోపం రాదు. ప్రతతులు + ఎగిరి = ప్రతతు లెగిరి, భూపాలురు + అందఱు = భూపాలు రందఱు అనేవిధంగా ఉత్తుకు సంధి జరుగుతుంది.

'లురు' అనడంచేత ఇతరప్రత్యయాలలోని ఉత్వానికి లోపం రాదు. రాముఁడు రాఁడు. మొ.

'వర్ణకంబుల' అనడంచేత ప్రత్యయం కాని లు–రు– అనేవర్ణాలలోనిఉత్వానికి ఈసూత్రంచేత లోపం రాదు. (విలుపూని, కారుపోతు)

'పదాంతంబు లయి యసంయుక్తంబు లయిననులురులయుత్వంబునకు లోపంబు బహుళంబుగా నగు' అనే బాలవ్యాకరణలక్షణంచేత ప్రత్యయం ఐనదీ, ప్రత్యయం కానిదీ అయిన లురులలో ఉత్వం లోపిస్తుంది. కాబట్టి యిక్కడి ఉదాహరణ లన్నీ బాలవ్యాకరణ సిద్ధాలే. సూరి రువర్ణంలో ఉత్వానికి లోపం హల్లు పరంగా ఉన్నపుడు ప్రాయికంగా కనబడుతున్న దన్నాడు. కాబట్టి అవసానం పరంగా ఉన్నపుడు లోపం అరుదుగా (ప్రత్యయేతరంలో అసలు లేదు) వస్తుంది. అది కవిప్రయోగానుగుణం.

కాగా ప్రస్తుతలక్షణం బాలవ్యాకరణలక్షణానికి వ్యాఖ్యానప్రాయం. స్పష్టత ప్రయోజనం అనవచ్చు.

**5. జడపదంబుమీఁదితోడకు మెయిమైలు వికల్పంబుగ నగు.** (18)

'జడము లనఁగా నచేతనములు' 'మెయిమైలు' అంటే మెయి, అనీ, మై అనీ రెండుశబ్దాలను లక్ష్యానుగుణంగా గ్రహించాలి. 'తోడకు' అనేచోటిషష్ఠిచేత తోడ ప్రత్యయంస్థానంలో అని అర్థం.

జడవాచకా లయినశబ్దాలమీద ఉన్న తోడ అనేతృతీయావిభక్తిస్థానంలో మెయి, లేదా, మై అనేశబ్దాలు వికల్పంగా అదేశంగా వస్తాయి అని సూత్రానికి అర్థం. ఇవి రెండూ 'తోడ' స్థానంలోనే రావాలి కాబట్టి, ఒకటి రానిపక్షంలోనే రెండవది వస్తుం దని అంటే పర్యాయంగా వస్తా యని గ్రహించాలి. తోడకు ఆదేశ మైన మెయి మైలు ద్రుతాంతా లవుతాయి.

'భక్తితోడన్' అన్నపుడు భక్తి అనేజడవాచకంపైన ఉన్న 'తోడ' స్థానంలో ప్రస్తుతసూత్రంచేత 'మెయి' అనేది ఆదేశం అయి భక్తిమెయిన్. వికల్పం కాబట్టి 'మెయి' ఆదేశం కానిపక్షంలో భక్తితోడన్ అని ఉండగా మై అనేది ఆదేశ మై భక్తిమైన్. ఇది కూడా వికల్పం కాబట్టి (మై) రానిపక్షంలో భక్తితోడన్.

'జడపదంబుమీఁది' అనడంచేత అజడశబ్దాలమీద ఈకార్యం లేదు. రామునితోడ సీతతోడ, లేడితోడ మొ. ఇక్కడ రామునిమెయిన్ అనేరీతిరూపాలు ఉండవు.

'తోడకు' అనడంచేత జడశబ్దాలమీద నైనా ఇతరవిభక్తులకు ఈకార్యం లేదు. 'విద్యచేత యశంబు గల్గు' – ఇక్కడ విద్యమెయి, లేదా విద్యమై యశంబు గల్గు – అని కాదు.

'మెయిమైలు' అన్నప్పటి బహువచనంచేతా, కవిప్రయోగాలనుబట్టి కూడా, ఇక్కడ విధింపబడినవి మెయి–మరియు మై–అనే రెండు శబ్దాలు అని తెలుసుకోవాలి.

'జడపదంబుమీఁది తోడకు' అనేచోట 'జడంబుమీఁదితోడకు' అని చెప్తే ఇంకా నిర్దుష్టంగా ఉండేది అనిపిస్తుంది.

జడశబ్దాలమీద అన్నింటా ఈకార్యం కనబడదు. కోలతోడ గూల్చె. అన్నచోట కోలమెయిఁ గూల్చె అని ఉండదు. ఈకార్యం 'కొన్నియెడల'– అనేవిధంగా చెప్పడం అవసరం అనిపిస్తుంది.

**6. ద్విత్వయుక్తలాంతంబు మీఁదిలులలకును రుర లాదేశంబు లగు.** (23)

ద్విత్వంతో కూడిన 'ల' ద్విత్వయుక్తల. ద్విత్వయుక్త మైన 'ల' అంతంలో కలిగినశబ్దం ద్విత్వయుక్తలాంతం. 'లు' అనేది ప్రథమాబహువచనం'. 'ల' అనేది ద్వితీయాది విభక్తులకు బహుత్వంలో ఆగమంగా వచ్చినది.

'ల్ల' అనేవర్ణం చివర కలిగిన ప్రాతిపదికలమీద ఉన్న లు,ల అనేబహువచనాలకు క్రమంగా రు,ర అనేవి ఆదేశంగా వస్తా యని సూత్రాని కర్థం. యథాక్రమంగా లువర్ణంస్థానంలో రువర్ణమూ, లవర్ణంస్థానంలో 'ర' వర్ణమూ ఆదేశ మవుతాయి.

'మల్ల' ప్రాతిపదిక. 'పుంలింగం బై మహద్వాచకం బయిననామంబు తుది యత్వంబున కుత్వం బగు' అని ఉత్వం వచ్చి మల్లు. దీనిపై ప్రథమాబహువచన వివక్షలో 'లువర్ణంబు బహువచనంబు' అని లువర్ణక మై, మల్లు+లు. ప్రస్తుతసూత్రంచేత 'లు' వర్ణం స్థానంలో 'రు' ఆదేశం కాగా మల్లురు.

ఇలాగే ద్వితీయాదుల్లో 'ల' కు 'ర' వర్ణం వస్తుంది. మల్లు+లను – మల్లురను.మొ.

'అదంతం బయి దీర్ఘపూర్వలోపధం బయిన' అనేబాలవ్యాకరణసూత్రమూ, లాన్తాత్తు రురౌ, అనే చింతామణిసూత్రమూ లాంతాలమీద మాత్రమే విధించిన ఈకార్యం 'ల్లా'ంతాలపై రాకపోతుండగా ప్రౌఢవ్యాకర్త ఈలక్షణం చేశాడు.

'ద్విత్వయుక్త' అనడంచేత అద్విరుక్త మైతే ఈసూత్రంప్రకారం రురలు రావు.

'అదంతం బయి' అనేబాలవ్యాకరణసూత్రంచేత రేఫ వస్తుంది. బాల–బాలురు మొ.

ద్విత్వయుక్త 'లాంతంబు' అంటే 'లల' అనేది చివరిలో ఉన్నశబ్దం అని అర్థం అవుతుంది. 'సలలాంతం' ఇత్యాదిగా చెప్తే బాగుండేది.

'లాంతంబు' అనడంచేత 'ల్ల' వర్ణాంతం కానిశబ్దంమీద ఈకార్యం లేదు.

వ్యాకర్త చింతామణిమార్గాన్ని అనుసరించి లు–ల–లకు మొత్తానికి రు–ర లాదేశించాడు. కాని ఆదేశాలుగా చెప్పిన 'రుర' లలోనిఉత్వఅత్వాలు అంతకు ముం దున్న లు–లలో ఉన్నవే. కాబట్టి సూరిమార్గంలో లకారానికి రేఫం చేస్తే చాలు.

'లులలకును' అనేచోటినుశబ్దంచేత పూర్వవ్యాకరణానుసారంగా బహువచనా లయిన లులలకే అని అర్థం. కాబట్టి ఇతరవర్ణాలకు ఈకార్యం లేదు. మల్లు లాఘవము.

'ఆదేశంబులు' అనడం స్పష్టతకే. 'లులలకు' అనేచోటిషష్ఠీవిభక్తివల్ల 'షష్ఠీస్థానే యోగా' అనేసంస్కృతపరిభాష ననుసరించి లులలస్థానంలో, రురలు ఆదేశంగా వస్తా యనేఅర్థం సిద్ధిస్తునే ఉన్నది. 'లులలకు రురలు' అంటే చాలు.

'అగు' అనడంచేత ఈకార్యం నిత్యం. కాబట్టి రురలు రాని మల్లులు, మల్లులను అనేరీతి రూపాలు లక్షణవిరుద్ధాలు కావలసివస్తున్నది. కాని తిక్కన ఆదేశం కాని మల్లులు అనేరూపాన్ని ప్రాసఘటితంగా ప్రయోగించాడు.

కాబట్టి 'అగు' అని కాక, విభాష అనో, 'చూపట్టెడి' ననో చెప్పడం యుక్తం.

**7. విధాశబ్దంబు సంస్కృతంబునం బుంలింగంబు నగు.** (24)

'విధా' అని స్త్రీలింగంగా ప్రసిద్ధమై ఉన్నశబ్దం సంస్కృతంలో పుంలింగం కూడా అయిఉన్నది అని సూత్రాని కర్థం.

'విధో విధానే' అనేవాక్యం ప్రకారం విధానం అనేఅర్థంలో 'విధః' అని యీశబ్దం పుంలింగంలో ఉన్నట్లు అజయుడు చెప్పడం దీనికి ప్రమాణం.

'తత్సమంబునం బుంలింగరూపముతోనె ప్రయోగము గాని, స్త్రీలింగరూపముతో లేదు' అని వ్యాకర్త విశేషవివరణం.

'విధ' అనేపుంలింగశబ్దం తెలుగులో ప్రాతిపదిక. ఇది పుంలింగ మైనా అమహత్తు. అదంతం కూడా అయింది కాబట్టి ప్రథమైకవచనవివక్షలో 'అమహన్నపుంసకముల

కదంతములకు ముపర్ణకం బగు' అని ముప్రత్యయం వచ్చి, విధము. ఇతరవిభక్తుల్లో విధములు, విధములందు మొ.

'విధా' అనేస్త్రీలింగశబ్దం తెలుగులోకి రాదు. కాబట్టి ప్రథమైకవచనలోపాదికంతో విధ– విధలు అనేవిధ మయినరూపాలు ఉండవు.

'సంస్కృతంబునన్' అనేదళం సూత్రంలో వ్యాఖ్యానప్రాయమె.

సూరి 'విధా' అనేస్త్రీలింగరూపమే తీసుకుని, విధ–విధలు అనేరీతిస్త్రీలింగ రూపాలను నివారించి, విధము, విధములు అనే రీతిగా ముపర్ణకాంతరూపాలను సాధించడంకోసం 'కంధరాదులు క్లీబతుల్యంబులు బహుళంబుగా నగు' నని చెప్పి బహుళశబ్దానికి ప్రయోజనంగా క్లీబతుల్యత్వం దీనికి నిత్యంగా పేర్కొన్నాడు. ప్రౌఢవ్యాకర్త దానిని పూర్తిగా తిరస్కరిస్తూ– స్త్రీలింగశబ్దం అసలు తెలుగులోకి రా దనీ, ముపర్ణకాంతరూపం పుంలింగశబ్దంనుండి సిద్ధిస్తుం దనీ, కాబట్టి సూరి క్లీబ తుల్యత విధించడం అనవసర మని ఈలక్షణం చేశాడు.

'విధాశబ్దంబు' అని స్త్రీలింగశబ్దాన్ని ఉచ్చరిస్తూ పుంలింగం కూడా అవుతుం దనడాన్నిబట్టి స్త్రీలింగశబ్దమే ప్రసిద్ధం అని స్పష్టం. 'పుంలింగంబును' అనేచోటి సముచ్చయం పుంలింగశబ్దం అప్రసిద్ధ మని కూడా చెప్తున్నది. కాగా అప్రసిద్ధ మైన (పుంలింగ) శబ్దంనుంచి తత్సమా లేర్పడ్డా యనడం ఉచితం కాదు. సూరిమార్గం ఉచితం. ఈలక్షణం సరి కాదు అని విమర్శకులు నిర్ణయించారు.

### 8. అర్ఘాదులకడయచ్చున కుత్వంబును మీఁద వువర్ణకంబును వైకల్పికంబుగా నగు. (25)

అర్ఘ మొద లైనవి అర్ఘాదులు. వర్ణకం అంటే ప్రత్యయం. 'డుమువులు ప్రథమ, డుమువున లేకవచనంబులు' అనే లక్షణాల ననుసరించి 'వు' ప్రథమైకవచనం.

అర్ఘ మొద లైనప్రాతిపదికలలో చివరిఅచ్చుస్థానంలో అన్ని విభక్తులలోనూ హ్రస్వ మయినఉకారం ఆదేశంగా వస్తుంది. దానిపైన ప్రథమావిభక్తి ఏకవచనంలో వు అనేప్రత్యయం వస్తుంది. అని సూత్రానికి అర్థం.

అర్ఘ మొద లయినఈశబ్దాలు అన్నీ అదంతాలు. ఇవి అన్నీ అమహత్తులు. కాబట్టి 'అమహన్నపుంసకముల కదంతములకు ముపర్ణకం బగు' అని ముపర్ణకం ప్రాప్తిస్తుండగా దాన్ని బాధించి ప్రస్తుతసూత్రంచేత ఉత్వవువర్ణకాలు అవుతా యని అర్థం.

'అర్ఘ' అనేప్రాతిపదికకు ప్రథమైకవచనవివక్షలో 'అమహన్నపుంసకములకు'

అనేసూత్రాన్ని బాధించి ఈసూత్రంచేత చివరిఅత్వానికి ఉత్వమూ, (అర్ఘు) మీద వుప్రత్యయమూ వచ్చి, అర్ఘువు అని అవుతుంది.

'వైకల్పికం' అనడంచేత ఉత్వవువర్ణకాలు రానిపక్షంలో బాధ లేదు కాబట్టి 'అమహ న్నపుంసకములకు' అనేసూత్రంచేత మువర్ణకం వచ్చి అర్ఘము అని అవుతుంది.

ప్రథమైకవచనేతరవిభక్తులలో ఉత్వంమాత్రం ఈసూత్రంప్రకారం రాగా, 'వువం ణ్ణకేతరవిభక్తి పరం బగునపు డుకారాంతంబులకు బహుళంబుగా...వుగాగమం బగు' అనేసూరిసూత్రంచేత బహుళంగా వుగాగమం వస్తుంది. అర్ఘువులు. అర్ఘులు. మొ.

'అర్ఘాదుల' అనడంచేత అర్ఘ మొద లయినవాటిల్లో చేరనిశబ్దానికి ఈకార్యం లేదు. వృక్షము, వనము మొ. వృక్షువు, వనువు ఇత్యాదిగా కాదు.

'కడయచ్చునకు' అనడంచేత మిగిలినవర్ణాలకు ఈకార్యం రాదు.

అర్ఘాదు లన్నీ అదంతాలే. 'అచ్చునకు' అని సామాన్యంగా కాకుండా 'అత్తునకు' అని స్పష్టంగానే చెప్పవచ్చు. పయిగా విధింపబడిన ఉత్వం ఏకాల్లు కాబట్టి 'అలో ఽంత్యస్య' అనేసంస్కృతపరిభాషచేత చివరివర్ణంస్థానంలోనే వస్తుంది. కాబట్టి సూత్రంలో 'కడయచ్చునకు' అనేదళం అనవసరం. 'అర్ఘాదులకు' అంటే చాలు.

'ఉత్వంబును వువర్ణకంబును' అనేచోటి సముచ్చయార్థకశబ్దాలచేత ఈరెండు కార్యాలు కలిసే వస్తాయి. రాకపోతే రెండూ రావు. కాబట్టి ఉత్వం మాత్రమే వచ్చి 'అర్ఘు' అని కానీ, వువర్ణకం మాత్రమే వచ్చి 'అర్ఘవు' అని కానీ కాదు.

'మీఁద' అనేదళం స్పష్టతకే. 'వు' వర్ణకం అంటే ప్రత్యయం కాబట్టి 'ప్రత్యయః – పర శ్చ' అని పరంగానే వస్తుంది.

అసలు వువర్ణకవిధానమే స్పష్టత కనాలి. 'ఉత్వం' రాగా ఉదంతా లయినఈశబ్దాల మీద 'ఉకారాంతగోశబ్దంబుల కంతట వువర్ణకం బగు' అని బాలవ్యాకరణంచేతనే వువర్ణకం సిద్ధిస్తుంది. కాబట్టి 'అర్ఘాదుల కుత్వంబు వైకల్పికంబుగా నగు' నని ఉత్వాన్ని మాత్రం సూత్రంలో విధించి వువర్ణకాన్ని వివరణలో ప్రస్తావించవచ్చు.

**9. రాహుబాహుశబ్దముల కంతట వువర్ణకలోపంబు వైకల్పికంబు.** (26)

రాహు బాహు అనేశబ్దాలకు పరంగా ఉన్న ప్రథమైకవచన వుప్రత్యయం వికల్పంగా లోపిస్తుం దని సూత్రానికి అర్థం.

'రాహు' శబ్దం మహద్వాచకం, పుంలింగం. ప్రథమైకవచనంలో డుఙ్ను (నిత్య వు వర్ణకాన్నీ) బాధించి 'ఉకారాంతం బగుమహత్తునకు వువర్ణకము బహుళముగా

నగు' అనేసూత్రంచేత వువర్ణకం వచ్చి రాహువు. ప్రస్తుతసూత్రంచేత ఆ వుప్రత్యయం లోపించగా – రాహు.

'వైకల్పికంబు' అనడంచేత లోపం రానిపక్షంలో వువర్ణకంతో రాహువు. 'బహుళం' కాబట్టి వువర్ణకం అసలు రాకపోతే 'పుంలింగ మగు మహద్వాచకమునకు డు జగు' అని డుప్రత్యయం వచ్చి రాహుఁడు.

బాహుశబ్దంమీద ప్రథమైకవచనంలో 'ఉకారాంతగోశబ్దంబుల కంతట వువర్ణకం బగు' అని వుప్రత్యయం వచ్చి బాహువు. ఆ'వు'వర్ణకం ప్రస్తుతసూత్రంచేత లోపించి బాహు. 'వైకల్పికం' కాబట్టి లోపం రానిపక్షంలో బాహువు.

'రాహుబాహుశబ్దంబులకు' అనడంచేత ఇతరశబ్దాలకు ఈకార్యం లేదు. శంభువు, తరువు – మొ.

'అంతట' అనడంవల్ల ప్రథమైకవచనేతరవిభక్తులలో కూడా ఈలోపం వస్తుం దని సూత్రకర్త భావించినట్లుంది. అందుకే రాహులు, బాహులు అని కూడా ఉదాహరించాడు. ప్రథమైకవచనేతరస్థలాలలో 'వు' ఆగమం. వర్ణకం కాదు. కాబట్టి 'వువర్ణకంబునకు' అంటే లోపం 'వుగాగమానికి' రాదు. అయినా వుగాగమానికి లోపం చెప్పక్కర్లేదు. ఉకారాంతాలకు వుగాగమం బహుళం కాబట్టి ఆగమం రాకుండానే ఈరూపాలు బాలవ్యాకరణంచేత సిద్ధిస్తున్నాయి. వుగాగమలోపాన్ని వ్యాకర్త ఉద్దేశించి ఉండకపోతే రాహులు, ఇత్యాదిగా ఉదాహరించడం అనవసరం. సూత్రంలో 'అంతట' అనేదళమూ అనవసరమే.

'బాహు' అనేప్రయోగం లేదు. 'బాహప్పళించు' శబ్దపల్లవం. కాబట్టి అందులో వర్ణవికారంగా వులోపాన్ని గుర్తించవచ్చు. కాగా బాహుశబ్దానికి ప్రథమైకవచనంలో గూడా ఈలోపం చెప్ప నవసరం లేదు.

రాహుశబ్దానికి 'ఉకారాంతం బగుమహత్తునకు వువర్ణకము బహుళముగా నగు' అనేసూత్రంలోని బహుళశబ్దంచేత అన్యకార్యంగా ప్రథమైకవచనలోపంతో 'రాహు' అనేరూపం సాధించవచ్చు. కాబట్టి ప్రస్తుతసూత్రం అవసరం అంతగా లేదు. చెప్పాడు కాబట్టి స్పష్టత కుపయోగించుకోవచ్చు.

### 10. విశ్వకర్ముఁ డనియు రూపంబు. (27)

'విశ్వకర్మన్' అనే నకారాంతశబ్దానికి 'విశ్వకర్ముఁడు' అనేవిధంగా పుంలింగరూపం కూడా ఉన్నది అని సూత్రానికి అర్థం.

'విశ్వకర్మన్' శబ్దం పుంలింగమే. కాని బాలవ్యాకరణం 'విశ్వకర్మాదులకు స్త్రీత్వం

బగు' అని నిత్యంగా స్త్రీలింగత్వాన్ని విధించి, స్త్రీలింగత్వాతిదేశంచేత ఉత్త్వ దుఙ్‌జులు రా వని స్పష్టం చేసింది. కాగా ఉత్త్వ దుఙ్‌జులతో గూడ – అంటే పుంలింగంగా రూపం కవిప్రయుక్తమై ఉన్నది. అందుచేత విశ్వకర్మశబ్దానికి స్త్రీత్వాన్ని సూరి నిత్యంగా విధించడం సరి కా దని ప్రౌఢవ్యాకర్త తాత్పర్యం.

'విశ్వకర్మన్' శబ్దం. 'హలంతంబు ప్రథమైకవచనాంతతుల్యం బిందు నామం బగు' తెలుగులో 'విశ్వకర్మా' ప్రాతిపదిక. 'నామంబులతుదిదీర్ఘంబునకు హ్రస్వం బగు' విశ్వకర్మ. 'విశ్వకర్మాదులకు స్త్రీత్వం బగు' అనేసూత్రాన్ని బాధించి ప్రస్తుతసూత్రం ప్రకారం స్త్రీత్వం రాదు. కాబట్టి పుంలింగకార్యం వస్తుంది. 'పుంలింగం బై మహద్వాచకం బయిన –' అని ఉత్వమూ, 'పుంలింగ మగుమహద్వాచకమునకు..' అని డుజూ వచ్చి విశ్వకర్ముఁడు అని అవుతుంది.

'విశ్వకర్ముఁడు అనియు' అనేచోటిసముచ్చయంచేత ఈపుంలింగకార్యం రానిపక్షంలో బాలవ్యాకరణాన్ని అనుసరించి స్త్రీత్వం కలిగి, 'స్త్రీలింగంబుల ప్రథమైక వచనంబునకు లోపం బగు' అని ప్రథమైకవచనం లోపించగా విశ్వకర్మ – అనేరూపం అవుతుంది.

సూరి విశ్వకర్మాదు లనగా ఇక్కడ 'విశ్వకర్ముఁడు' అనడంచేత 'విశ్వకర్మన్' అనేదానికంటే ఇతరశబ్దాలకు పుంలింగరూపం ఉండదు. కాబట్టి కృష్ణవర్త్ముఁడు, యువుఁడు ఇత్యాదు లుండవు.

'అనియు' అనేసముచ్చయం 'విశ్వకర్మ' అనేస్త్రీత్వరూపం తఱచుగా ఉంటుం దనీ, 'విశ్వకర్ముఁడు' అనే పుంలింగప్రయోగం అరు దని తెలుపుతున్నది.

'విశ్వకర్మునికూఁతు' అనేప్రయోగాన్నిబట్టి విశ్వకర్ముఁడు అనేరూపాన్ని సాధిస్తున్న ఈలక్షణం సార్థకమే. కాని 'విశ్వకర్మ కొక్కచో స్త్రీత్వంబు గానంబడదు' ఇత్యాదిగా 'స్త్రీత్వాభావాన్ని' పేర్కొంటే స్పష్టంగా ఉండేది.

## 11. ముత్తియశబ్దేతరంబులయందును దఱచుగ నిత్వలోపంబు గానంబడియెడి. (49)

'ముత్తియ' అనేదానికంటే వే రయినశబ్దాలలో గూడా హ్రస్వ మైనఇకారానికి లోపం రావడం కవిప్రయోగాలలో తఱచుగా కనబడుతున్న దని సూత్రానికి అర్థం.

సూరి 'ఇయశబ్దంబునం దికారలోపంబు కొందఱు వక్కాణించిరి. అయ్యది ప్రయోగంబులందు మృగ్యంబు. ముత్తియశబ్దంబునందు మాత్ర మిత్వలోపంబు గానంబడియెడి' అన్నాడు. దీన్నిబట్టి ముత్తియశబ్దం ఒక్కదానిలో మాత్రమే ఇత్వం

లోపిస్తుం దనీ, తదితరశబ్దాలలో ఇత్వలోపం మృగ్య మనీ సూరి చేసినలక్షణాన్ని సవరిస్తూ ప్రౌఢవ్యాకర్త ప్రస్తుతసూత్రం చెప్తున్నాడు. కాబట్టి 'ఇత్వలోపం' అంటే 'ఇయ'లో ఇత్వానికి లోపం అనీ, ముత్తియేతర మైనయాశబ్దా లన్నీ, ఇయాంతాలే ననీ, గ్రహించాలి.

'కన్నియ'. 'ఇయకు నామాంతంబున కెత్వంబు' వస్తే కన్నె. బహుళం గాబట్టి ఎత్వం రాక కన్నియ అని ఉండగా ప్రస్తుతసూత్రంచేత 'ఇ'కారం లోపించి 'కన్న్+య'. భిన్నహల్సంయోగంలో నడుమ సజాతీయ మైనహల్లు లోపిస్తుంది. కాబట్టి ఒకనకారం లోపించగా కన్+య, కన్య (సంస్కృతసమ మైన కన్య శబ్దంకంటె ఇది భిన్నం. తద్భవం).

'తఱచుగ' అనడంచేత ఇత్వలోపం రానిపక్షంలో కన్నియ. ఇలాగే పళ్యము పల్లియము మొద లయినవి.

'ముత్తియశబ్దేతరంబులందును' అనేచోటిసముచ్చయార్థకంచేత పూర్వ(బాల) వ్యాకరణానుసారంగా ముత్తియశబ్దంలో ఇత్వం లోపించడం సమ్మతమే. ముత్యము, ముత్తియము.

'కానంబడియెడి' అనడంచేత ఈకార్యం కావ్యాలలో కనబడినశబ్దాలలో మాత్రమే గ్రహించాలి. అంటే కవిప్రయోగాలలో ఇత్వలోపం వచ్చినశబ్దాలను ఇక్కడి ముత్తియేతరశబ్దాలలో చేర్చుకుని ఈసూత్రంచేత ఇత్వలోపం సాధించుకోవాలి. కాబట్టి సందియము, జన్నియ – మొ. చోట్ల ఇత్వం లోపించదు.

ముత్తియేతరశబ్దంబులందు, అనో ముత్తియేతరములందు అనో చెప్తే సూటిగా ఉండేది.

'తఱచు' అంటే ఇత్వలోపం వచ్చినరూపాలే అధికంగా ఉంటా యని అర్థం. కాని అది కవిప్రయోగాలకు విరుద్ధం. మృగ్య మన్న సూరివచనాలపై విరోధాన్ని ఇది ఎక్కువగా వ్యక్తం చేస్తున్నది. 'తఱచుగ' అనేపదం లేకుండటం యుక్తం.

## 12. ఆత్మార్థం బౌకానొకచో నామాస్మదర్థాభిధాయియు నగు. (78)

ఆత్మన్ అనేసంస్కృతశబ్దంయొక్క అర్థాన్ని తెలిపే తెలుగుశబ్దం ఆత్మార్థం. 'తా' అనేశబ్దం. నామం అంటే వస్తువును బోధించేశబ్దం. (అస్మద్యుష్మదర్థాలకు భిన్న మైనదాన్ని బోధించేది అని స్థూలంగా చెప్పవచ్చు) 'అస్మత్' శబ్దార్థాన్ని తెలిపే 'నా' అనేది అస్మదర్థం.

ఆత్మార్థక మయిన 'తా' అనేశబ్దం ఆయాసందర్భాలలో నామార్థాన్ని అస్మదర్థాన్ని

గూడ తెలియజేస్తుం దని సూత్రాని కర్థం.

తనకు తానె చుట్టంబు. ఇక్కడ తనకు తాను అనేఆత్మార్థకశబ్దం 'స్త్రీ' అనేనామార్థాన్ని బోధిస్తుంది. స్త్రీకి స్త్రీయే చుట్టం అని దీని అర్థం.

ఇలాగే 'తన కిష్టుడున్' అనేనన్నయపద్యంలో తనకున్ అంటే నన్నయకు అని నామార్థక మైనట్లు చెప్పడం నన్నయమార్గం. (నన్నయ తనవిషయంలో అస్మదర్థాన్ని ప్రయోగించడం అరుదు. పయిగా దీనితర్వాత పద్యంలో నన్నయభట్టు-జగద్ధితంబుగన్ అన్నాడు కూడా.)

'తన తనుచ్ఛాయ' అన్నచోట తన(యొక్క) అనేఆత్మార్థకం నా(యొక్క) అని అస్మదర్థాన్ని తెలుపుతున్నది.

'ఆత్మార్థంబు' అనడంచేత యుష్మదర్థాదులకు ఈకార్యం లేదు.

'ఒకానొకచో' అనడంచేత ఈకార్యం కవిప్రయోగాల్లో అరుదుగా ఉంటుం దని అర్థం. కాబట్టి ప్రయోగానుసారంగా గ్రహించాలి.

'నామాస్మదర్థాభిధాయి' అనడంచేత ఇతర మైన యుష్మదాదిఅర్థాలను బోధించదు.

'అభిధాయియు' అనేచోటిసముచ్చయం ఆత్మార్థకం, ఆత్మార్థాన్ని బోధించడం సాధారణమే అని సూచిస్తుంది.

## 13. కొన్ని యెడల నవ కగు కానంబడియెడి. (103)

సంఖ్యావాచకాలకు పూరణార్థంలో వచ్చే 'అవ' ఇక్కడ గ్రహింపబడుతుంది. 'సంఖ్యకుం బూరణార్థంబునం దవగాగమం బగు' అని సూరి 'అవక్' ఆగమంగా చెప్పాడు. 'సమాసే కవ స్తు సర్వదా' అని అధర్వణుడు ప్రత్యయంగా చెప్పాడు. అవకు అన్నప్పటిషష్ఠీవిభక్తిచేత 'అవ' స్థానంలో అని అర్థం.

సంఖ్యావాచకాలమీద పూరణార్థంలో వచ్చిన 'అవ' అనేశబ్దం స్థానంలో 'అగు' అనేది కొన్ని కవిప్రయోగాలలో కనబడుతున్న దని సూత్రానికి అర్థం.

ఏడు అనేసంఖ్యను పూరించేది అనేఅర్థంలో 'ఏడు' శబ్దంపై 'సంఖ్యకుం బూరణార్థంబునందు' - అని అవ ఆగమ మై అపదాదిస్వరసంధి జరిగి ఏడవ. ఈవిశేషణం అమహదర్థంలో ఏడవది. ఏడవది అయినపర్వము ఏడవపర్వము. ప్రస్తుతసూత్రంచేత' 'అవ' స్థానంలో 'అగు' వచ్చి - ఏడగుపర్వము.

'కొన్నియెడల' అనడంచేత 'అగు' రావడం అరుదు. అంటే తఱుచుగా 'అవ' ఉంటుంది. ఏడవవాడు, పదవది మొ.

'అవకు' అనడంచేత 'అవ' లేకపోతే 'అగు' రాదు. పర్వము లేదు. ఇక్కడ పూరణార్థం లేదు. కాబట్టి అవ రాదు. అందుచేత అగు కూడ ఉండదు. పర్వము లే దగు అని కాదు.

'కానంబడియెడి' అనడంచేత అరుదుగా సైతం అవకు-అగు వచ్చేస్థలాలను కవిప్రయోగాలలో కనబడేవాటినే గ్రహించాలి.

'అవకు 'అగు' అనడంచేత ముందు అవ చేసి దానికి అగు ఆదేశం చేయాలి. 'పూరణంలో అగు' (అవకు బదులుగా) విధిస్తే ప్రక్రియలో లాఘవం సిద్ధించేది.

'అగు' ధాతుజవిశేషణంగా సమన్వయిస్తే 'అగు' విధానమే అవసరం కాదు. అవకాశం పరిశీలించాలి.

## 14. ఊరు చోటు మేన్వాదు లున్లుగ్విషయంబులు. (106)

విషయా లంటే లక్ష్యాలు. ఊరు, చోటు, మేను మొద లైనవి 'ఉన్' లోపించడానికి లక్ష్యా లని సూత్రాని కర్థం.

'ఊరు లోనగువానికి, తృతీయయం దత్వము. సంప్రాప్తింపదు గాన 'ఔపవిభక్తిక నామ్నా మత్వం స్యా త్సప్తమీ తృతీయార్థే'. అనుసూత్రమున కవి విషయములు గాక, కేషాంచి దుదంతానాం నేతి విభక్తా వునో లుక్ స్యాత్. అనుసూత్రమునకు విషయంబు లగుచున్న వని యెఱుంగవలయును' అని సూత్రార్థాన్ని సూత్రకర్త స్పష్టం చేశాడు.

కాగా ఈసూత్రం చింతామణిలక్షణానికి వ్యాఖ్యానం.

'ఔపవిభక్తికనామ్నా మత్వం స్యా త్సప్తమీతృతీయార్థే' అనేచింతామణిసూత్రం ఔపవిభక్తికశబ్దాలకు పైన తృతీయా, సప్తమీ విభక్తులఅర్థంలో అత్వం చెప్పింది. ఊరు మొద లైనవి ఔపవిభక్తికాలే. కానీ ఊరన్. మొ. వాటికి సప్తమ్యర్థం మాత్రమే ఉంది తప్ప ఊరిచేత ఇత్యాదిగా తృతీయార్థం లేదు. తృతీయాసప్తములు రెంటికీ చెప్పిన అత్వం సప్తమ్యర్థం మాత్రమే ఉన్న ఊరు మొ.వాటికి రాదు. కాబట్టి యివి ఆసూత్రానికి లక్ష్యాలు కావు.

'కేషాంచి దుదన్తానాం నేతి విభక్తా వునో లుక్ స్యాత్' అనేచింతామణిసూత్రం కొన్ని ఉదంతాలకు సప్తమీ నవర్ణకం పర మవుతుండగా 'ఉన్' అనే దానికి లోపం చెప్తున్నది. నవర్ణకం సప్తమి కాబట్టి ఉన్లోపంచేత ఏర్పడేరూపం సప్తమ్యర్థకం మాత్రమే అవుతుంది.

ఊరన్ మొద లైనవి సప్తమ్యర్థకాలు మాత్రమే. కాబట్టి అవి కేషాంచి త్తనేసూత్రానికే లక్ష్యా లవుతా యని ప్రౌఢవ్యాకర్త సమన్వయం.

ఊరు శబ్దంమీద సప్తమిలో 'అందు న సప్తమి' అని నవర్ణక మై (నుగాగమంతో) ఊరు+నన్. ప్రస్తుతసూత్రంచేత 'ఉన్' లోపించి (ఊర్+అన్) ఊరన్. లోపం రానిపక్షంలో – ఊరునన్.

'ఊరు చోటు మేన్వాదులు' అనడంచేత వీటిలో చేరనిఔపవిభక్తికశబ్దాలకు అత్త్వం రావచ్చు. గోరన్–గోరిచేతన్, గోరియందున్ – మొ. కాగా ఇవి 'ఔపవిభక్తికనామ్నామ్' అనేసూత్రానికి విషయా లవుతాయి.

'ఉన్లుగ్విషయంబులు' అనడంచేత ఊరు లోనగువానికి ఉన్లోపమె వస్తుంది. కాని అత్త్వం రాదు. కాబట్టి ఊరిచేత అనే అర్థంలో ఊరన్ అనేరూపం ఉండదు.

'ఊరు చోటు మేన్వాదులు' అన్నపుడు ఆదిశబ్దం ఎలాగూ ఉన్నది. కాబట్టి చోటు, మేను శబ్దాలను సూత్రంలో చెప్ప నవసరం లేదు. వివరణంలో ప్రౌఢవ్యాకర్తే, చెప్పినట్లు ఊరు లోనగునవి (ఊర్వాదులు) ఇత్యాదిగా చెప్పటం ఉచితం. 'ఉన్లుగ్విషయంబులు' అనక ఉన్లోపం (వికల్పంగా) విధిస్తే బావుండేది.

తృతీయలో అత్వంలేదు కాబట్టి అత్వం రా దనడం కుదరదు. అత్వం రాని ఊరిచేత, చోటితోడ – ఇత్యాదిరూపాలను కవిప్రయోగాలనుంచి చూపాలి. అటువంటిదే లేకపోతే అత్వప్రసక్తే లేదు. (సూరి 'ఔపవిభక్తికంబుల తృతీయాసప్తముల కత్వం బాదేశంబు బహుళంబుగా నగు' అని బహుళంగా చెప్పాడు. ఊరిచేత, చోటితోడ లాంటివి కవిప్రయోగాల్లో దొరికితే, బహుళగ్రహణంచేత తృతీయలో అత్వం రా దని గ్రహించాలి.)

ఇంతకీ ఉన్లోపం చేస్తే సప్తమ్యర్థం మాత్రమే వస్తుం దనడం కూడా కుదరదు. 'ఉదంతజడంబుతృతీయకు నవర్ణకం బగు' అని నవర్ణకం తృతీయలో గూడా వస్తుంది. కాబట్టి ఉన్లోపపక్షంలోనూ తృతీయార్థం ప్రసక్త మవుతుంది. నవర్ణకం సప్తమే అయినా తృతీయార్థంలో కూడా వస్తున్నది కదా.

ఫ్రౌఢవ్యాకర్త సమన్వయం సరికాదు. ఈలక్షణం విచార్యం.

# కారకపరిచ్ఛేదం

**1. ఉద్దేశార్థమునందు ద్వితీయకు గుఱించియు ననుప్రయుక్తం బగు.** (2)

ఉద్దేశం (లక్ష్యం) అనేఅర్థం ఉద్దేశార్థం. అనుసరించి ప్రయోగించబడడం అనుప్రయోగం. అలా అనుప్రయోగం అయినశబ్దం అనుప్రయుక్తం. ఉద్దేశించిన దానిని తెలిపేశబ్దంయొక్క ద్వితీయావిభక్తికి పైన 'గుఱించి' అనేశబ్దం కూడా అనుప్రయుక్తం అవుతుంది అని సూత్రానికి అర్థం.

ఉద్దేశార్థంలో ద్వితీయావిభక్తి ప్రత్యేకంగా విధింపబడలేదు. 'కర్మంబున ద్వితీయ యగు' అని కర్మకు ద్వితీయ వస్తుంది. అక్కడ ఉద్దేశార్థం ఉన్నప్పుడు, కర్మార్థంలో వచ్చినద్వితీయమీద గుఱించి, (కూర్చి మొ.) ప్రయోగింపబడుతుం దని తాత్పర్యం.

'మముగుఱించి అర్చ సేయఁగా' (అర్చ చేయడం అనేధాత్వర్థానికి ఫల మైనఅర్చనలు పొందడం అనేది అస్మదర్థాన్ని ఆశ్రయించి ఉంది కాబట్టి) కర్మ అయిన 'నా' శబ్దానికి 'కర్మంబున ద్వితీయ యగు' అని ద్వితీయావిభక్తి వచ్చి బహుత్వంలో మమున్ అవుతుంది. ఈకర్మ 'మమ్ము ఉద్దేశించి' అనేవిధంగా ఉద్దేశార్థంతో ఉండడంచేత ప్రస్తుతసూత్రా ననుసరించి ద్వితీయమీద 'గుఱించి' శబ్దం చేరి (సరళపరక ద్రుతలోపంతో) 'మముగుఱించి' అవుతుంది. ఇలాగే రామునిగుఱించి మొ.

'ఉద్దేశార్థంబునందు' అనడంచేత ఉద్దేశార్థం లేకపోతే ద్వితీయకు ఈకార్యం లేదు. పుస్తకమును చదివెను. పుస్తకమును గుఱించి అని ఉండదు.

'ద్వితీయకు' అనడంచేత ఉద్దేశార్థంలో ఇతరవిభక్తికి ఈకార్యం లేదు. పురుషార్థముకొఱకు యత్నింపవలయును. చతుర్థిపై గుఱించి మొ. చేరవు.

'గుఱించియు' అనేచోటి 'ను'శబ్దం (సముచ్చయం) చేత 'కూర్చి' కూడా వస్తుం దన్నాడు వ్యాకర్త. పురుషార్థమునుగూర్చి మొ. విరించి గుఱించి, రమేశ్వరు గానీ గుఱియించి అనేవిధంగా ఇక్కడ గుఱించి, గుఱియించి అనేశబ్దాలు కూడా కవిప్రయోగాలలో కనపడుతున్నాయి.

అంతే కాక ఈ'ను'శబ్దంచేత గుఱించి మొ. అనుప్రయుక్తం కాకపోవడం కూడా గ్రహించాలి. 'మమ్ము నర్చన సేయఁగా'.

**2. ఒకానొకచోఁ దోడకుఁ బ్రత్యేకప్రయోగంబునుం జూపట్టెడి.** (6)

ప్రకరణాన్నిబట్టి ఇక్కడ ప్రస్తావించినతోడ (తృతీయా) విభక్తి అని గ్రహించాలి. తోడ అనేతృతీయావిభక్తి ప్రాతిపదికను ఆశ్రయించి కాక స్వతంత్రంగా ప్రయోగింపబడటం కూడా కవిప్రయోగాలలో కానవస్తున్న దని సూత్రానికి అర్థం.

ఇది సుబంతం గానీ తిఙంతం గానీ కాదు, కాబట్టి పదం కాదు. 'అపదం న ప్రయుంజీత' అనేసంప్రదాయాన్నిబట్టి పదం కానిదానిని స్వతంత్రంగా ప్రయోగించ డానికి వీలు లేదు. ఇది నామ(తృతీయా)విభక్తి కాబట్టి ప్రాతిపదికలపైన ఉండి మాత్రమే ప్రయోగింపబడాలి. కాగా కవిప్రయోగానుసారంగా ఈసూత్రం అపద మయినా తోడకు స్వతంత్రప్రయోగాన్ని పేర్కొంటున్నది.

'విలోకించి తోడ మాటాడక' ఇక్కడ 'తనతోడన్' అనే అర్థంలో 'తన' అనే ప్రాతిపదిక లేకుండానే తోడన్ అనే తృతీయావిభక్తి ప్రత్యేకంగా ప్రయోగింపబడింది.

'ఒకానొకచో' అనడంచేత ఈకార్యం అరుదు. కాబట్టి తోడ కూడా సాధారణంగా ప్రకృతిని ఆశ్రయించే ప్రయోగింపబడుతుంది. రామునితోడన్ – మొ.

'తోడకు' అనడంచేత ఇతరవిభక్తులకు ఈకార్యం రాదు.'డు' మొ. విభక్తులకు స్వతంత్రప్రయోగం లేదు.

'ప్రత్యేకప్రయోగంబునున్' అనేచోటిసముచ్చయార్థకనుశబ్దంచేత స్వతంత్రంగా ప్రయోగింపబడిన అరు దయినస్థలాల్లో గూడా ప్రకృతి నాశ్రయించినప్రయోగమే సాధారణం. తనతోడ మాటాడక – మొ.

'చూపట్టెడి' అనడంచేత కవిప్రయోగాలలో కానవచ్చినస్థలాలలో మాత్రమే స్వతంత్రప్రయోగం అంగీకరించాలి. స్వతంత్రించి కొత్తస్థలాలలో ప్రయోగింపరాదు.

అపదం (ప్రత్యయం) స్వతంత్రంగా ప్రయోగింపబడిం దనడం శాస్త్రసంప్రదాయా నికి అనుగుణంగా లేదు. తోడికోడలు, తోడఁబుట్టువు ఇత్యాదులలో ఔపవిభక్తిక మైనతోడుశబ్దంనుండి ఏర్పడిన 'తోడన్' అనేపదంతో ఇటువంటిస్థలాలను సమన్వయించే అవకాశం పరిశీలించాలి.

### 3. చతుర్థికిం బొంటెవర్ణకంబు నగు . (9)

చతుర్థీవిభక్తిలో పొంటె అనేప్రత్యయం కూడా అవుతుంది అని సూత్రానికి అర్థం.

'కొఱకు కయి చతుర్థి' అని బాలవ్యాకరణం చతుర్థిలో కొఱకు, కయి అనేరెండువిభక్తులనే పేర్కొన్నది. వాటితోపాటు 'పొంటె' అనేది కూడా చతుర్థిలో అవుతుం దని ఈసూత్రం చెప్తున్నది. కయి పట్టి యొక్క విభక్తులకు భిన్నం గాబట్టి ఇది ద్రుతప్రకృతికం, 'తృతీయాదులకు నుగాగమం బగు' అని దీనికి నుగాగమం

వస్తుంది.

'కార్యసంప్రయోగ' శబ్దంమీద ఉద్దేశార్థంలో 'సంప్రదానంబునకుం జతుర్థి యగు' అనేసూత్రంచేత చతుర్థి రాగా, ఆచతుర్థికి ప్రస్తుతసూత్రంచేత పొంటె ప్రత్యయం వచ్చి 'నుగాగమ మై, 'కార్యసంప్రయోగముపొంటెన్'.

'చతుర్థికి' అనడంచేత ప్రథమ మొద లైనఇతరవిభక్తులఅర్థంలో పొంటె రాదు.

'వర్ణకంబును' అనేచోటిసముచ్చయార్థకనుశబ్దంచేత కొఱకు, కయి అనేప్రత్యయాలు రావడం సాధారణం. కార్యసంప్రయోగముకొఱకు, సంప్రయోగముకయి మొ.

కాని ఈపొంటె ప్రత్యయం కొఱకు కయిలు వచ్చే అన్నిస్థలాల్లో రాదు. ముఖ్య మైన త్యాగోద్దేశానికి పొంటె లేదు. 'రామునికొఱకు (కయి) కన్య నిచ్చె' అనేవంటిస్థలాల్లో 'రామునిపొంటె కన్య నిచ్చె' అని ఉండదు. ఉద్దేశమాత్రానికి చతుర్థి అయినసందర్భాల్లో మాత్రమే అరుదుగా కనబడుతుంది. ఆవిషయం వ్యాకర్త చెప్పిఉండవలసింది.

### 4. ఉండిపదంబు పరం బగుచో వలన కందువర్ణక మట్లు నవర్ణకంబు నగు. (10)

ఉండి అనేపదం పరంగా ఉన్నప్పుడు దానికి పూర్వంలో ఉన్న 'వలన' అనేవిభక్తి స్థానంలో సప్తమీవిభక్తి అయిన 'అందు' అనేప్రత్యయం వచ్చినట్లే 'న' అనేసప్తమీ ప్రత్యయం కూడా వస్తుంది అని సూత్రానికి అర్థం.

'ఉండిశబ్దము పరం బగునపుడు వలనకు ద్వితీయాసప్తములు ప్రాయికంబుగ నగు' అని చెప్పినచిన్నయసూరి 'వలనకు' సప్తమిలో 'అందు' ప్రత్యయం వచ్చినందుకు మాత్రమే ఉదాహరణం చూపాడు. 'అందు-న-సప్తమి' అనేసూత్రం ప్రకారం నవర్ణకం కూడా సప్తమే. కాగా పైసూత్రంలోనిసప్తమీశబ్దంచేత అందు-న అనేవి రెండు వస్తాయి. కాని ఉదాహరణలలో చూపకపోవడంచేత 'న' వర్ణకం రా దేమో నని సందేహం కలగవచ్చు నన్నఉద్దేశ్యంతో సూరిసూత్రాభిప్రాయాన్ని ప్రౌఢవ్యాకర్త ఈ సూత్రంతో వివరిస్తున్నాడు.

'బ్రహ్మలోకమువలనన్' అనేచోట వలనపై ఉండి అనుపయుక్త మై, 'బ్రహ్మలోకము వలనన్ + ఉండి' అని ఉండగా, 'ఉండి పదంబు పరం బగునపుడు వలనకు ద్వితీయా సప్తములు..' అనేసూత్రంచేత వలనకు సప్తమి రాగా దానికి (ఉదంతజడ మైన 'బ్రహ్మలోకము'పై) ప్రస్తుతసూత్రంప్రకారం నవర్ణకం వచ్చి - బ్రహ్మలోకమున నుండి.

'ఉండిపదంబు పరం బగుచో' అనడంచేత ఉండి పరంగా లేనపుడు (ద్వితీయా)

సప్తమీవిభక్తే రాదు, గాబట్టి న వర్ణకం కూడా రాదు.

'వదనగహ్వరంబున వరదవాః, ఉడుపథంబున జాఱు' అనేరీతిస్థలాల్లో ఉండి పరంగా ఉండగా వలనకు నవర్ణకం వచ్చి ఆతర్వాత సప్తమి (నవర్ణకం) మీది ఉండి లోపించిం దని ప్రౌఢవ్యాకరణప్రక్రియ గ్రహించాలి.

'వలనకు అందు వర్ణకమట్లు' అనేదళాలు బాలవ్యాకరణాభిప్రాయాన్ని అనువదిస్తున్నాయి. 'అందు వర్ణకమట్లు' అనేదళం లేకున్నా ఇబ్బంది లేదు, స్పష్టత కనాలి.

'నవర్ణకంబును' అనేచోటిసముచ్చయార్థకనుశబ్దంచేత 'అందు' ప్రత్యయం కావడం ప్రసిద్ధం అని తాత్పర్యం. బ్రహ్మలోకంబునందుండి.

సూరిసూత్రార్థాన్ని వివరించే ఈసూత్రం స్పష్టతకే.

**5. వలన కాదేశంబు లగుద్వితీయాసప్తములమీఁదియుండికి లోపంబు బహుళంబుగా నగు.** (11)

అనుప్రయుక్తంగా వచ్చిన ఉండి అనేపదం పరంగా ఉండగా దానికి పూర్వంలో ఉన్న 'వలన' అనేవిభక్తికి ద్వితీయ, సప్తమీవిభక్తులు ఆదేశంగా వచ్చినసందర్భంలో వాటికి పైన ఉన్న 'ఉండి' అనేపదం బహుళంగా లోపిస్తుంది అని సూత్రానికి అర్థం.

అదితిగర్భమును వెలువడుము. అదితిగర్భశబ్దంమీద అపాయార్థంలో 'అపాయ భయజుగుప్సా.. మొ. సూత్రంచేత వలన ప్రత్యయం. గర్భమువలన. 'ఉండి పదం బొకానొకచో వలనవర్ణకంబున కనుప్రయుక్తం బగు' అని వలనపై ఉండి చేరి, గర్భమువలనన్ + ఉండి. 'ఉండిశబ్దము పరం బగునపుడు వలనకు ద్వితీయాసప్తములు ప్రాయికంబుగ నగు' అనేసూత్రంచేత వలనకు ద్వితీయా (ను) విభక్తి వచ్చి, గర్భమును + ఉండి. ఆద్వితీయ మీది ఉండికి ప్రస్తుతసూత్రంచేత లోపం వచ్చి – గర్భమును వెలువడుము. బహుళం కాబట్టి లోపం రాకపోతే – గర్భమునుండి వెలువడుము.

వదనగహ్వరమున వరదవాః. ఇక్కడ 'న' అనేసప్తమీవిభక్తిమీది'ఉండి' లోపించింది. లోపించనిపక్షంలో – వదనగహ్వరముననుండి వరదవాః.

'వలన కాదేశంబు లగు' అనడంచేత ఇతరద్వితీయాసప్తములమీద (అను ప్రయుక్తం కాని స్వతంత్రపద మైన) ఉండి లోపించదు. ద్వారవతి నుండి కంటిని. ఆపురమున నుండి బ్రదికితిమి మొ.

అనుప్రయుక్త మైన 'ఉండి' పరంగా ఉండగా, వలనకు ద్వితీయాసప్తములు రెండే ఆదేశంగా వస్తాయి. కాబట్టి ద్వితీయా, సప్తములకంటే ఇతర మైనవిభక్తిపైన 'ఉండి'కి లోపం రావడానికి అవకాశం లేదు.

కాగా వలనకు పై నున్న ఉండికి లోపం రాదు. వృక్షమువలన పడియె (గర్భము వలన వెలువడుము) ఇత్యాదుల్లో 'ఉండి' అనుప్రయుక్తం కా లే దని గ్రహించాలి.

బహుళం అనడంచేత వలన కాదేశ మైన 'అందు' అనేసప్తమిమీద ఉండి లోపించదు. అంటే అప్రవృత్తి అని వ్యాకర్త వివరించాడు. కాని 'నాయందు (ధనము) గొనిపొమ్ము' అనేవిధంగా తిక్కనాదులప్రయోగాల్లో అందుపై గూడా ఉండి లోపించింది.

**6. కొన్నియెడల హేతువునం దన్నంతక్రియలమీఁదను బట్టివర్ణకంబు విభాష నగు.** (12)

ఫలసాధనయోగ్యం బగుపదార్థము హేతువు. 'అన్' అనేది అంతమందు కలిగినక్రియ అన్నంతక్రియ. 'తుమర్థ భావలక్షణంబులందు నుజీ యగు' అనేసూత్రం చేత వచ్చిన 'ను' అనేప్రత్యయం, జ్ఞీత్వంవల్ల ముందు ధాతువుచివరిఉత్వానికి వచ్చే అత్వంతో కలుపుకొని (అను) అన్ ప్రత్యయంగా ఈవ్యాకర్త వ్యవహరిస్తున్నాడు.

అన్నంతక్రియ హేతు వయితే దానిమీద 'పట్టి' అనేపంచమీవిభక్తి వికల్పంగా వస్తుం దని సూత్రానికి అర్థం.

'పట్టివర్ణకంబు హేతువు లగుగుణక్రియల కగు' అనేబాలవ్యాకరణసూత్రంప్రకారం క్రియ హేతు వయితే పట్టి ప్రత్యయం వస్తుంది. కాని అన్నంతక్రియ అవ్యయం. అవ్యయం విభక్తివచనశూన్యం. దీనిపై విభక్తులు ఉండవు. కాబట్టి పట్టి విభక్తి కూడా లేకపోతుండగా ఈసూత్రం ప్రత్యేకంగా విధిస్తున్నది.

కలుగు ధాతువుపై అన్ (నుజీ) ప్రత్యయ మై, కలుగన్. దీనిమీద నుజ్యంత మైన అగుధాతువు రూపం (కాన్) చేరి హ్రస్వమై (కన్) కలుగంగన్. ఈఅన్నంతక్రియ (ప్రభావం సమకూర్చుట అనేఫలాన్ని సాధించడానికి సాధనమైంది కాబట్టి) హేతువు. అందుచేత ప్రస్తుతసూత్రంచేత పట్టి ప్రత్యయ మై, కలుగంగఁబట్టి అని అవుతుంది. ఇలాగే కాఁబట్టి మొ.

'విభాష' అనడంచేత పట్టి ప్రత్యయం రానిపక్షంలో హేతువులో 'కలుగంగన్' అని కూడా ఉంటుంది.

'కొన్నియెడల' అనడంచేత హేతువు కాకపోతే ఈకార్యం లేదు. చదవఁగోరెను.

'అన్నంతక్రియల మీఁద' అనడంచేత, హేతువు లయినా ఇతర (అవ్యయ) క్రియలమీద ఈకార్యం లేదు. 'కంఠము తెగి దేహము పడియె' మొ॥

'మీఁదను' అనేచోటినుశబ్దంచేత పూర్వవ్యాకరణోక్త మైన జ్ఞానముఁబట్టి, వచ్చుటంబట్టి మొ. సంగ్రహింపబడుతున్నాయి. అలాగే అన్నంతం 'అవ్యయ మైనప్పటికీ' పట్టివిభక్తి వస్తుం దనీ (నిలిచిఉంటుం దనీ) సూచిస్తుంది.

**7. యొక్కకు లోపంబు బహుళంబు.** (16)

'కు యొక్క లోపల షష్ఠి' అని యొక్క అనేది షష్ఠీవిభక్తి. 'శేషషష్ఠికి యొక్కయు నగు' అని సంబంధార్థంలో సంబంధిపదానికి యొక్క (అనే షష్ఠీ)ప్రత్యయం వస్తుంది. దానికి బహుళంగా లోపం వస్తుం దని ఈసూత్రానికి అర్థం.

'సమాసవిభక్తికి లోపం బగు' అనేసూత్రంచేత సమాసంలో మిగిలినవిభక్తులతో పాటు యొక్కవిభక్తి కూడా లోపిస్తుంది. కాగా సమాసం కాని (వ్యస్త) స్థితిలో లోపింపజేయడంకోసం ఈసూత్రం ప్రారంభింపబడింది.

ఎవ్వనియొక్క ఏని – అనేవ్యస్తస్థలంలో ప్రస్తుతసూత్రంచేత యొక్క విభక్తి లోపించి 'ఎవ్వనియేని'. పుష్పదామముల (యొక్క) యు మొ.

'యొక్కకు' అనడంచేత (సమాసం కానపుడు) ఇతరవిభక్తికి లోపం రాదు. ఎవ్వడేని మొ.

'బహుళంబు' అనడంచేత 'ధాతుజవిశేషణ భావార్థక పూర్వ వ్యవహితావ్యవహిత కర్తృపదప్రథమకుఁ దఱచుగ యొక్క షష్ఠి యగు' అని వచ్చిన యొక్కకు లోపం నిత్యంగా వస్తుం దని సూత్రకర్త వివరించాడు. బాహుకురథంబు గడపు నేర్పు. 'బాహుకుయొక్క రథంబు గడపునేర్పు' అనేవిధంగా 'యొక్క' లోపించకపోవడం ఉండదు.

కాని 'యొక్క' ప్రత్యయం లోపించకుండా నిలిచిఉన్నస్థలం కావ్యాలలో ఎక్కడా కనబడదు. ఎవ్వనియొక్క యేని అనేరీతి ప్రయోగాలు లేవు. ఏమి శబ్దముయొక్క మికారమునకు (సంధి .16) సమీపకర్తయొక్క లింగవచనంబులు (వాక్య. 15) అని రెండుచోట్ల సూత్రంలోనూ, 'పూవుశబ్దముయొక్క' అని మొదలుగా వ్యాఖ్యలోనూ ఈవ్యాకర్త యొక్కను ప్రయోగించాడు. కాని ఇం కెక్కడా యొక్క విభక్తి భాషలో గ్రంథస్థ మై లే దనే చెప్పాలి. కాగా 'బాహుకుయొక్క రథంబు గడపునేర్పు' అనేవిధ మైనప్రయోగాలు లేవు.

యొక్కకు లోపం కావ్యాలలో నిత్యంగానే వస్తున్నట్లు చెప్పక తప్పదు. 'తఱచుగ'

అని అయినా చెప్పవచ్చు. బహుళంగా చెప్పడం విచార్యం.

**8. ఒక్కచో నుదంతం బగునజడంబు తృతీయకును నవర్ణకంబు గానంబడియెడి.** (17)

హ్రస్వ మైనఉకారం (ఉత్) చివర కలిగినశబ్దం ఉదంతం. జడము లనగా నచేతనములు. కాబట్టి అజడ మంటే చేతనం. మహత్తులు స్త్రీ తిర్యగ్వాచకాలు అజడాలు అవుతాయి.

హ్రస్వ మైనఉకారం చివరగలిగిన చేతనశబ్దాలమీదితృతీయావిభక్తికి 'న' అనేసప్తమీవిభక్తి కవిప్రయోగాలలో కనబడుతున్నది అని సూత్రాని కర్థం.

'ఉదంతజడంబు తృతీయకు నవర్ణకం బగు' అని సూరి జడవాచకాలపై వస్తుం దని చెప్పినకార్యం, జడం కానిశబ్దం మీద గూడా సాధించడానికి సూత్రం ప్రారంభింపబడింది. ఇది సూరిలక్షణానికి సవరణం.

ఏనుగు శబ్దం మీద కరణార్థంలో 'చేతవర్ణకంబు హేతుకరణంబులకు..' (కార. 7) అని చేత ప్రత్యయం వస్తే, ఏనుగుచేత, 'కరణ సహార్థ తుల్యార్థ యోగంబులం దృతీయకుం దోడవర్ణకం బగు' (కార. 8) అని తోడ వస్తే, ఏనుగుతోడ (ఏనుగు వైచుచు). ప్రస్తుతసూత్రంచేత ఆతృతీయ (చేత – తోడ) స్థానంలో 'న' వర్ణకం వచ్చి, ఏనుగునన్ – ఏనుగు వైచుచు అని అవుతుంది. ఏనుగునన్ అంటే ఏనుగుచేత లేదా ఏనుగుతోడ అనేవిధంగా (తృతీయ) కరణం అర్థం.

'ఒక్కచో' అనడంచేత ఈకార్యం అరుదు. కాబట్టి ఉదంత మైన అజడశబ్దాల కన్నిటికీ ఈకార్యం రాదు. ఏనుగుచేతఁ జంపబడె, ఏనుగుతోఁ గలిసి వచ్చెను, ఇక్కడ ఏనుగునఁ జంపబడె, ఏనుగునఁ గలిసి వచ్చె' ఇత్యాదిగా అని కాదు.

ఏనుఁగున ఏనుఁగు అనేప్రయోగ మొక్కటి మాత్రమే ఈలక్షణానికి లక్ష్యంగా దొరుకుతున్నది. కాబట్టి 'ఒక్కచో = ఈప్రయోగం ఒక్కచోటనే' అనేచమత్కారం గూడా వ్యాకర్త ఉద్దేశించిఉండవచ్చు.

'ఉదంతంబు' అనడంచేత ఉదంతాలు కానివాటికి ఈకార్యం లేదు. అనుదంతానికి దేనికి గూడా సప్తమిలో సైతం నవర్ణకం రాదు.

'తృతీయకు' అనడంచేత ఇతరవిభక్తులకు ఈకార్యం రాదు. 'ఏనుగు వచ్చెను' ఇక్కడ ఏనుఁగున వచ్చెను అనేవిధంగా ఉండదు.

'తృతీయకు' అనేచోట సముచ్చయం పూర్వవ్యాకరణానుసారంగా జడవాచకంపై

నవర్ణకం రావడాన్ని సంగ్రహిస్తుంది. బాణమునఁ గూల్చె.

'కానంబడియెడి' అనడంచేత కవిప్రయోగాలలో ప్రత్యక్షంగా చూచినవాటిని మాత్రమే గ్రహించాలి. అలాంటివాటిని స్వతంత్రంగా కల్పించగూడదు.

**9. కొన్నియెడల నజడంబు తృతీయాసప్తములకు బహుత్వంబున ద్వితీయ చూపట్టెడి.** (18)

జడము లనగా నచేతనములు. అజడం అంటే చేతనం. చేతనవాచకా లైన మహత్తులూ, స్త్రీలు, తిర్యక్ శబ్దాలకు పైన ఉన్న తృతీయాసప్తమీవిభక్తులకు కూడా బహుత్వార్థంలో ద్వితీయావిభక్తి వస్తుం దని సూత్రార్థం.

'జడంబు తృతీయాసప్తములకు ద్వితీయ బహుళంబుగా నగు' అనేబాలవ్యాకరణ లక్షణంలో జడశబ్దాలకు విధించినకార్యం జడం కానిశబ్దాలపైన గూడా సాధించడానికి ఈలక్షణం ప్రారంభింపబడింది.

'కరణ సహార్థ తుల్యార్థ యోగంబులం దృతీయకుం దోడవర్ణకం బగు' అనేసూత్రంచేత సహార్థంలో చక్రవాకశబ్దంమీద తృతీయ, దానికి తోడవిభక్తి వచ్చి బహుత్వంలో 'చక్రవాకములతోడ అలరు' అని ఉండగా ప్రస్తుతసూత్రంచేత తృతీయకు ద్వితీయ వచ్చి 'చక్రవాకములన్ అలరు' అవుతుంది. ద్వితీయ రానిపక్షంలో 'చక్రవాకములతోడ అలరు' అని తృతీయ అలాగే ఉంటుంది.

'మనుజులయందు విప్రుడు' అన్నచోట సప్తమికి ద్వితీయ వచ్చినపక్షంలో 'మనుజుల విప్రుండు'.

'కొన్నియెడల' అనడంచేత ఈకార్యం అరుదు. చేతనశబ్దాలు అన్నింటిమీద ఈకార్యం సాధారణంగా రాదు. అంటే జడవాచకాలమీదలాగా అజడాలమీద ప్రసిద్ధం గా దని తాత్పర్యం.

'అజడంబు' అనడంచేత జడశబ్దాలపై ఈకార్యం ప్రస్తుతసూత్రంచేత రాదు. 'జడంబు తృతీయాసప్తములకు' అనేబాలవ్యాకరణసూత్రంప్రకారం సాధించుకోవాలి.

'తృతీయాసప్తములకు' అనడంచేత ఇతరవిభక్తులకు ఈకార్యం (ద్వితీయ) రాదు. రామునికయి తపము మొ.

'బహుత్వంబున' అనడంచేత కవిప్రయోగాలలో కానవచ్చినచోట్ల మాత్రమే యీకార్యాన్ని గ్రహించాలి. స్వతంత్రించి ఇలా ప్రయోగింపరాదు.

**10. కొన్నియెడల నజడంబు ద్వితీయకును బ్రథమ కానంబడియెడి.** (19)

జడం అంటే అచేతనం. జడం కానిది అంటే చేతనం – అజడం. చేతనవాచకం అయిన శబ్దంమీద ఉన్నద్వితీయావిభక్తికి కూడా ప్రథమావిభక్తి రావడం కవిప్రయోగాలలో కనిపిస్తున్నది అని సూత్రానికి అర్థం.

'జడంబు ద్వితీయకుం బ్రథమ బహుళంబుగా నగు' అని చిన్నయసూరి జడ వాచకాలమీద చెప్పినకార్యం అజడానికి సిద్ధించకపోతుండగా ఆఅవకాశాన్ని కల్పిస్తూ ప్రస్తుతసూత్రం సూరిలక్షణాన్ని సవరిస్తున్నది.

'హయోత్తమ మొక్కెడఁ గట్టఁ బంపుచున్' ఇక్కడ కర్మ అయిన హయోత్తమశబ్దానికి 'కర్మంబున ద్వితీయ యగు' అనేసూత్రంచేత ద్వితీయావిభక్తి రాగా 'హయోత్తమమున్'. ఇది తిర్యగ్వాచకం. జడం కాదు, కాబట్టి ప్రస్తుతసూత్రంచేత ఆద్వితీయకు ప్రథమా విభక్తి వచ్చి – హయోత్తమము (ఒక్కెడ) అని అయింది.

ప్రథమ రానిపక్షంలో ద్వితీయ అలాగే ఉంటుంది. 'హయోత్తమమున్'

'కొన్నియెడల' అనడంచేత ఈకార్యం సార్వత్రికం కాదు. అజడశబ్దా లన్నింటికి ఈకార్యం సాధారణంగా రాదు. రావణుని జంపెను మొదలైనచోట్ల ప్రథమ అసలు రాదు. (పుం, స్త్రీ) మహత్తుల కీకార్యం కనబడదు. తిర్యక్కులకు మాత్రమే అని చెప్పవచ్చు నేమో. పరిశీలించాలి.

'అజడంబు' అనడంచేత జడశబ్దాలపై ఈసూత్రంచేత ప్రథమ రాదు. బాలవ్యాకరణం ప్రకారం వస్తుంది.

'ద్వితీయకు' అనడంచేత ఇతరవిభక్తులకు ఈకార్యం లేదు. మదనాగముతో సమము మొ.

(అజడంబు) 'ద్వితీయకును' అన్నచోటిసముచ్చయార్థకం జడద్వితీయకు పూర్వవ్యాకరణాలప్రకారం ప్రథమ రావడాన్ని స్మరింపజేస్తుంది. పూవులు దెచ్చె (ప్రథమ అనడంచేత ఇతరవిభక్తులు రావు).

'కానంబడియెడి' అనడంచేత ఇటువంటివి కవిప్రయోగాలలో కానవచ్చినస్థలాలు మాత్రమే గ్రహించాలి. కాని స్వతంత్రంగా కల్పించగూడదు. కాబట్టి అజడం ద్వితీయకు ప్రథమ రావడం అరుదు. అందుచేత ప్రథమ వచ్చినచోట గూడా 'హయోత్తమమున్' అనేవిధంగా ప్రథమ రానిరూపాలే ప్రచురంగా ఉంటాయి.

సూరిసూత్రంలోని బహుళపదంచేత అన్యకార్యంగా దీనిని సాధించుకోవచ్చు. అయినా స్పష్టత కీలక్షణం ఉచితమె.

**11. ఒక్కొక్కచో జడంబు సప్తమికిం బ్రథమయు నగు.** (20).

జడంబు లనగా నచేతనములు. 'ప్రథమయు' అన్నప్పటిసముచ్చయశబ్దానికి వికల్పం అర్థం. జడశబ్దాలకు పైనున్న సప్తమీవిభక్తిస్థానంలో ప్రథమావిభక్తి, వికల్పంగా వస్తుం దని సూత్రానికి అర్థం.

'జడంబుద్వితీయకుం బ్రథమ బహుళంబుగా నగు' అనేసూరిసూత్రం ద్వితీయకు మాత్రమే ప్రథమ చెప్తున్నది. సప్తమికి కూడా ప్రథమ రావడాన్ని చెప్తూ ఈసూత్రం బాలవ్యాకరణలక్షణానికి పూరక మవుతున్నది.

తీర్థమాడి. అధికరణార్థంలో 'అధికరణంబునకు సప్తమి యగు' అనేసూత్రంప్రకారం తీర్థశబ్దానికి సప్తమీవిభక్తి రాగా, ఏకవచనంలో తీర్థమందున్ (తీర్థమునన్) ఆసప్తమికి ప్రస్తుతసూత్రంచేత ప్రథమావిభక్తి రాగా, తీర్థము (ఆడి) అని అవుతుంది. వికల్పం కాబట్టి ప్రథమ రానిపక్షంలో – తీర్థమందు, తీర్థమున – ఆడి అని సప్తమి అలాగే ఉంటుంది.

'ఒక్కొక్కచో' అనడంచేత ఈకార్యం సార్వత్రికం కాదు. ప్రయోగానుసారంగా అరుదుగా వస్తుం దని గ్రహించాలి. ఘటమందు జల మున్నది మొ.

'జడంబు' అనడంచేత జడం కానిశబ్దంమీద ఈకార్యం లేదు. రామునియందు భక్తి.

'ప్రథమయు' అన్నప్పటి ను శబ్దంచేత వికల్పం కాబట్టి ప్రథమ వచ్చినస్థలాల్లో కూడా పక్షాంతరంలో సప్తమితో రూపా లుంటాయి. తీర్థమం దాడి మొ.

**12. ఒక్కచో సమాసాంతర్గతవిశేష్యంబుల కగువిశేషణంబులషష్ఠికిని బ్రథమ చూపట్టెడి.** (21)

విశేష్యం షష్ఠ్యంత మై సమాసంలో ఉండగా కూడా విడిగా ఉన్న దానివిశేషణానికి సంబంధించిన షష్ఠీవిభక్తిస్థానంలో ప్రథమావిభక్తి రావడం కవిప్రయోగాలలో కనబడుతున్న దని సూత్రానికి అర్థం.

'విశేష్యంబునకుం బోలె విశేషణంబులకు లింగవిభక్తివచనంబు లగు' అనేసూత్రం ప్రకారం విశేష్యం ఏవిభక్తిలో ఉంటే, విశేషణానికి కూడా అదేవిభక్తి అవుతుంది. విశేష్యం షష్ఠ్యంత మైనపుడు విశేషణానికి కూడా షష్ఠీవిభక్తి వస్తుంది.

'షష్ఠీ విశేషణానాం ప్రథమా స్యాత్' అనేచింతామణి సూత్రాన్ని వ్యాఖ్యానిస్తూ అహోబలుడు షష్ఠ్యంతవిశేష్యం సమాసగత మైనా విశేషణషష్ఠికి ప్రథమ వస్తుం దని చెప్పి 'ప్రల్లదుఁ డైన యొక్కకులపాంసనుచేసినదాన' అనేనన్నయప్రయోగం చూపాడు. 'ఒకానొకచో విశేషణంబుల షష్ఠికిఁ బ్రథమ విభాష నగు' అని చెప్పి, ఉదాహరణలలో

విశేష్యం భిన్నంగా ఉన్నప్పటిస్థితిని మాత్రమే ఉదహరించాడు. అహోబలపతివ్యాఖ్య కనుగుణంగా వివరిస్తూ ప్రౌఢవ్యాకరణం ఈసూత్రం చెప్పింది.

పార్థివప్రాగ్రసరుడు ధర్మసుతుపన్పు. ఇక్కడ 'ధర్మసుతుయొక్క' అనేషష్ఠ్యంతం విశేష్యం. దీనికి పన్పు అనేమీదిపదంతో సమాస మై, (షష్ఠి లోపించి), ధర్మసుతుపన్పు. 'ధర్మసుతు' అనేదానికి విశేషణం కావడంచేత 'పార్థివప్రాగ్రసర' అనేశబ్దానికి 'విశేష్యంబునకుం బోలె' అని షష్ఠీవిభక్తి రాగా, పార్థివప్రాగ్రసురునియొక్క. ఆషష్ఠికి ప్రస్తుతసూత్రంచేత ప్రథమావిభక్తి వచ్చి, 'పార్థివప్రాగ్రసరుండు' అని అయింది. ప్రథమ రానిపక్షంలో 'యొక్కకు లోపంబు బహుళంబు' అని యొక్క లోపించి 'పార్థివప్రాగ్రసరు ధర్మసుతుపన్పు'.

ఇలాగే 'దేవుడు త్రివిక్రము (యొక్క) సొమ్ములు' మొ.

'ఒక్కచో' అనడంచేత ఇటువంటి ప్రయోగాలు అరుదుగా ఉంటాయి.

'విశేషణంబుల' అనడంచేత విశేష్యవిభక్తికి మార్పు లేదు.

'షష్ఠికి' అనడంచేత ఇతరవిభక్తులకు ప్రథమ రాదు. 'షష్ఠికిని' అనేచోటిసముచ్చయం చేత సమాసాంతర్గతం కాకుండా భిన్నంగా ఉన్నవిశేష్యానికి సంబంధించినవిశేషణషష్ఠికి 'ప్రథమ' బాలవ్యాకరణాన్నిబట్టే సిద్ధిస్తుంది.

'చూపట్టెడి' అనడంచేత ఇటువంటిస్థలాలను కవిప్రయోగాలలో ఉన్నవాటిని మాత్రమే గ్రహించాలి. స్వతంత్రంగా కూర్చకూడదు.

**13. కొన్నియెడల విశేషణంబుద్వితీయాదులకుఁ బ్రథమ చూపట్టెడి.** (22)

విశేషణానికి సంబంధించిన ద్వితీయ మొద లైనవిభక్తులకు కూడా ప్రథమావిభక్తి రావడం కొన్ని కవిప్రయోగాలలో కనబడుతున్నది అని సూత్రానికి అర్థం.

'ఒకానొకచో విశేషణంబులషష్ఠికిం బ్రథమ విభాష నగు' అని (చింతామణి ననుసరించి) సూరి విశేషణముల షష్ఠీవిభక్తికి ప్రథమావిభక్తి చెప్పాడు. భవత్యర్థ వ్యవధానం ఉన్నప్పుడు మాత్రం విశేషణం ద్వితీయాదివిభక్తులకు అన్నిటికీ ప్రథమ పేర్కొన్నాడు. అగు మొద లైన భవత్యర్థకాలతో వ్యవధానం లేకపోయినప్పటికీ షష్ఠికి మాత్రమే కాక, ద్వితీయ మొద లయినయితరవిభక్తులకు గూడా ప్రథమను విధించేఈలక్షణం బాలవ్యాకరణానికి పూరణ మనుకోవచ్చు.

ఘనుల్ . . . దైత్యపతులన్. ఇక్కడ దైత్యపతులన్ అనేవిశేష్యం ద్వితీయావిభక్తిలో ఉంది. కాబట్టి దానికి విశేషణ మయినఘనశబ్దం కూడా 'విశేష్యంబునకుం బోలె' ద్వితీయావిభక్తి వచ్చి ఘనులన్ – దైత్యపతులన్ అని ఉంటుంది. ఘనులన్ అనేవిశేషణ

శబ్దంమీదిద్వితీయావిభక్తికి ప్రస్తుతసూత్రంచేత ప్రథమావిభక్తి రాగా ఘనుల్(లు) దైత్యపతులన్ అని అవుతుంది. ప్రథమావిభక్తి రానిపక్షంలో 'ఘనులన్ (పతులన్) అని ద్వితీయావిభక్తి అలాగే ఉంటుంది. ఇలాగే తల్లి(తోడ) ద్రౌపదితోడన్ మొ.

'కొన్నియెడల' అనడంచేత షష్ఠికంటే ఇతర మైనవిభక్తులకు ప్రథమ రావడం అరుదు. కాబట్టి ద్వితీయాదులు అలాగే ఉండడం ప్రచురం. ఘనుని రామునిన్ మొ.

'విశేషణంబుల' అనడంచేత విశేష్యవిభక్తి మారదు. ఘనుల్ దైత్యపతులన్.

'ద్వితీయాదులకు' అనడంచేత ప్రథమకు ప్రథమ రాదు. (చేయవలసినఅవసరం లేదు) షష్ఠి కూడా ద్వితీయాదుల్లోనిదే అయినా దానికి ప్రథమ ప్రత్యేకంగా చెప్పి ఉండటంచేత (ప్రథమ) షష్ఠికంటే ఇతర మైనవిభక్తులకే ఈసూత్రంచేత ప్రథమను సాధించుకోవాలి. షష్ఠికి పూర్వ (బాల) వ్యాకరణానుగుణంగా ప్రథమ వస్తుంది.

'చూపట్టెడి' అనడంచేత ఇటువంటివి కవిప్రయోగాలలో కానవచ్చినస్థలాలు మాత్రమే స్వీకరించాలి. స్వతంత్రించి ప్రయోగించరాదు.

**14. ఒక్కచో ద్వితీయాంతవిధేయవిశేషణంబునకుం బ్రథమయు నగు.**(24)

విశేష్యంలోని జాతి, గుణం మొద లయినవిశేషాలను తెలియజేసేశబ్దం విశేషణం. ఇది వ్యావర్తకం, హేతుగర్భం, విధేయం అని మూడు రకాలు. విధేయం అంటే మీద తెలియదగినది, ఇది వక్తకు మాత్రమే తెలిసిఉంటుంది అని వ్యాకర్త స్థలాంతరంలో వివరించాడు. వాక్యంలో దేనినిగురించి చెప్పబడుతుందో అది ఉద్దేశ్యం. దాన్ని గురించి, ఏమి చెప్పబడుతుందో అది (విధింపదగినది) విధేయం. విధేయ మైన విశేషణం విధేయవిశేషణం. దానియొక్క ద్వితీయావిభక్తికి కొన్నిచోట్ల ప్రథమావిభక్తి వికల్పంగా వస్తుం దని సూత్రానికి అర్థం.

బ్రాహ్మణముఖ్యుఁ బురోహితుండుగా. విశేష్య మైన 'బ్రాహ్మణముఖ్యున్' అనేశబ్దం ద్వితీయాంతం. కాబట్టి దానికి విశేషణ మయిన 'పురోహిత' శబ్దానికి 'విశేష్యంబునకుం బోలె . . .' అనేసూత్రంప్రకారం ద్వితీయ వచ్చి పురోహితున్. ఆద్వితీయకు ప్రస్తుతసూత్రంచేత ప్రథమావిభక్తి వచ్చి 'పురోహితుండు' అయింది.

వికల్పం గాబట్టి ప్రథమ రానిపక్షంలో 'బ్రాహ్మణముఖ్యున్ బురోహితునిగా' అని ద్వితీయాంతంగా ఉంటుంది. 'వానిని బ్రాహ్మణకులుఁగా నెఱుఁగుము' అని ప్రయోగం.

'ఒక్కచో' అనడంచేత ఈకార్యం క్వాచిత్కం. ప్రయోగానుసారంగా గ్రహించాలి.

'ద్వితీయాంత' అనడంచేత తృతీయాదులకు ప్రథమ రాదు. కాని విధేయవిశేషణం తృతీయాద్యంత మై కానరాదు. ప్రథమకు ప్రథమ చెప్ప నవసరం లేదు. కాగా ద్వితీయకు మాత్రమే ప్రథమ.

'విధేయ' అనడంచేత వ్యావర్తక, హేతుగర్భ రూప మైనయితరవిశేషణాలకు ఈకార్యం ఈసూత్రంచేత కలుగదు. 'కొన్నియెడల విశేషణంబు ద్వితీయాదులకుఁ బ్రథమ చూపట్టెడి' అనేసూత్రంచేత ప్రయోగానుసారంగా ప్రథమ రావచ్చు.

'విశేషణంబునకు' అనడంచేత విధేయం విశేష్య మయితే ఈకార్యం రాదు. 'ఘనుల్ – దైత్యపతులన్' ఇక్కడ దైత్యపతులన్ అనేవిశేష్యం విధేయం. కాగా ప్రథమ రాదు.

విధేయవిశేషణానికి కూడా 'విశేషణంబు ద్వితీయాదులకు' అనేలక్షణంచేతనే ప్రథమ వస్తుంది. ఈసూత్రం చెప్పకపోతే నష్టం కనబడదు.

**15. కొన్నియెడల విభక్తిపరిణామంబు గ్రాహ్యంబు.** (26)

కొన్ని సందర్భాలలో వాక్యంలో ప్రయోగింపబడినవిభక్తి, అన్వయాన్ని అనుసరించి వేరొకవిభక్తిగా మార్పు చెందడం గ్రహింపదగిఉన్న దని సూత్రానికి అర్థం.

ఉదా: ఈతనితో సాటి యనంగ మే లన. 'సాటి' అనేతుల్యార్థంతో యోగంచేత 'ఈ' శబ్దానికి 'కరణ సహార్థ తుల్యార్థయోగంబులం దృతీయకుం దోడవర్ణకం బగు' అని తో(డ)ప్రత్యయం వచ్చి ఈతనితో సాటి. ఈశబ్దం 'మేలు' అనేదానితో గూడా అన్వయించవలసిఉన్నది. అన్యార్థాదులలోని దయిన 'మేలు' శబ్దంతో 'ఈతనితో' అనేతృతీయ అన్వయించదు. 'కంటెవర్ణకం బన్యార్థాది యోగజం బగుపంచమి కగు' అనేసూత్రాన్ని అనుసరించి 'కంటె' ప్రత్యయం కావాలి. కాబట్టి మేలు శబ్దంతో అన్వయించేసందర్భంలో 'ఈతనితో(సాటి) అన్నప్పటి తృతీయ 'ఈతనికంటె మేలు' అనేవిధంగా పంచమీవిభక్తిగా మారుతుంది.

'కొన్నియెడల' అనడంచేత ఈకార్యం సార్వత్రికం కాదు. ఆ 'కొన్నియెడలు' ప్రయోగానుసారంగా గుర్తించాలి.

పెక్కింటితో అన్వయం ఉన్నప్పుడే ఈకార్యం. 'ఈతనితో మేలు' అనేవిధంగా అనేకాన్వయం లేనిచోట వేరేవిభక్తి ఉండడమూ అది మరోవిభక్తిగా మారడమూ ఉండదు.

అనేకాలతో అన్వయించేటప్పుడు మొదటిపదంతో అన్వయాని కనుగుణంగా విభక్తి వస్తుంది. అదేపదం ఆతరువాతిపదాలతో అన్వయించేటప్పుడు దాని కనుగుణంగా మారుతుంది.

సన్నిహితపర మైనశబ్దంతోటిఅన్వయానికి అనుగుణంగా వచ్చినవిభక్తి, ఆతరువాతి పదాలతో అదేశబ్దం అన్వయింపవలసివచ్చినపుడు ఆఅన్వయానికి అనుగుణంగా అవసర మైతే మార్పు చెందుతుంది.

'రామునకు నధికుఁడు, తుల్యుడు లేడు' అనేరీతిస్థలాల్లో అవసరం లేదు గాబట్టి విభక్తిమార్పు ఉండదు.

అవసర మైనచోట్ల ఈపరిణామం నిత్యమే.

# 5. సమాసపరిచ్ఛేదం

**1. షష్ఠీతత్పురుషంబునందు నగాగమంబు విభాష నగు.** (1)

షష్ఠీ(యొక్క) విభక్తి చివర కలిగినపదానికి పైపదంతో ఏర్పడినసమాసం షష్ఠీ తత్పురుషం. 'నక్' ఆగమ అన్నపుడు కకారం ఇత్తు. కాబట్టి అది లోపిస్తుంది. 'న' ఆగమం అవుతుంది. ఇది కిత్తు కాబట్టి విధించినదానికి అంత్యావయవంగా అంటే చివర వచ్చి చేరుతుంది.

షష్ఠీతత్పురుషసమాసంలో ఉదంత మైనపూర్వపదానికి చివరలో 'న' అనేవర్ణం వికల్పంగా ఆగమంగా వస్తుంది.

యోగక్షేమంబుయొక్క అనేశబ్దానికి తెఱఁగు అనేపదంతో సమాసం జరిగి, విభక్తి లోపించి 'యోగక్షేమంబు+తెఱఁగు' అని ఉండగా, ప్రస్తుతసూత్రంచేత నగాగమం వచ్చి 'యోగక్షేమంబునతెఱఁగు' అని అవుతుంది.

'విభాష' అనడంచేత వికల్పం గాబట్టి నగాగమం రానిపక్షంలో 'యోగక్షేమంబు తెఱఁగు' అని ఉంటుంది.

'షష్ఠీతత్పురుషంబునందు' అనడంచేత ఇతరసమాసాలలో ఈకార్యం రాదు. చివురుసవురు.

'నగాగమం' అసామాన్యంగా చెప్పడంచేత హల్లు పర మైనా అచ్చు పర మైనా ఈఆగమం వస్తుంది. అరదంబునయురవడి.

ఈకార్యం ఉదంతాలకు మాత్రమే వస్తుంది. ఉదంతాలు కానివాటిపై నగాగమం రాదు. అమ్మమాట, రామునిబాణము మొ.

ఇది పూర్వపదానికే వస్తుం దనీ, ఆపూర్వపదం ఉదంత మయితేనే వస్తుం దనీ కవిప్రయోగాలనుబట్టి గ్రహించాలి. ఆఅంశాలను సూత్రంలో స్పష్టం చేస్తే బాగుండేది.

ఇక్కడిఉదాహరణలు సప్తమీ అలుక్సమాసాలుగా అన్వయింపబడతాయి. కాబట్టి 'న' అనేది ఆగమం కాక సప్తమీవిభక్తి అని గుర్తిస్తే ఈలక్షణం చెప్పనవసరం లేదు.

**2. కొన్నియెడల నిచ్చోఁ ననాపామాయాగమంబు లగు.** (4)

'ఇచ్చోన్' అంటే పూర్వసూత్రసందర్భాన్నిబట్టి 'బిరుదాద్యుత్తరపద మయిన కర్మధారయసమాసంలో, పూర్వపదం ద్వ్యక్షరాదంత స్త్రీపుంసంజ్ఞావాచకం అయినచోట' అని అర్థం.

కర్మధారయసమాసంలో బిరుదాద్యుత్తరపదం పరంగా ఉండగా, ద్వ్యక్షరాదంత స్త్రీ పుం సంజ్ఞావాచక మైనపూర్వపదానికి చివరలో, అన, అప, అమ, అయ అనేవి ఆగమాలుగా వస్తాయి అని సూత్రానికి అర్థం.

'తిక్క' అనే ద్వి అక్షర, అదంత పుం సంజ్ఞకు 'సోమయాజి' అనేబిరుదవాచకంతో కర్మధారయసమాస మై, 'తిక్క + సోమయాజి' అని కాగా, (దీర్ఘాన్ని, ఇత్వాన్నీ బాధించి) ప్రస్తుతసూత్రంచేత 'అన' అనేది ఆగమ మై, తిక్క + అన, 'అంద్వవ గాగమంబులం దప్ప' అని సంధి జరిగి, 'తిక్కన సోమయాజి'. ఇలాగే

| | | | |
|---|---|---|---|
| 1. అప – | నన్న + ఆర్య | నన్న + అప + ఆర్య | నన్నపార్యుడు |
| 2. అమ – | కృష్ణ + నాయ | కృష్ణ + అమ + నాయ | కృష్ణమనాయఁడు |
| 3. అయ – | నన్న + భట్టు | నన్న + అయ + భట్టు | నన్నయభట్టు |

'కొన్నియెడల' అనడంచేత ఈకార్యం సార్వత్రికం కాదు.

తిక్కయజ్వ– కృష్ణశాస్త్రి – చిన్నాదేవి (చిన్నపరెడ్డిలో అప) మొ.చోట్ల వీటిలో ఏఆగమమూ రాదు. అలాగే ఆయాశబ్దాలకు ఆయాశబ్దాలు పరంగా ఉన్నప్పుడే ఆయాఆగమాలు వస్తాయి. నన్ననభట్టు, తిక్కయసోమయాజి మొద లైనవిధంగా వేర్వేరు ఆగమాలు రావడం కానరాదు. ఈస్థితి కూడ 'కొన్నియెడల' అనేదళంచేతనే సమన్వయించుకోవాలి.

అన + అప + అమ + అమ + ఆగమ, అని అన మొ. తెలుగుశబ్దాలను సంస్కృతంలోకి అనువదించడంవల్ల సవర్ణదీర్ఘంతో 'అనాపాయాగమంబులు' అని

అయింది.

'అగు' అనడంచేత ఈకార్యం నిత్యమే. ఈఆగమాలు వచ్చినస్థలాలలో ఆగమం లేనిరూపాంతరం కనబడదు. తిక్కనసోమయాజి, నన్నపార్యుడు ఇత్యాదుల్లో తిక్కసోమయాజి, నన్నార్యుడు ఇత్యాదులు కానరావు.

ఈఆగమాలు పూర్వపదానికే వస్తాయి. పూర్వపదం అదంతం కావడంవల్ల అత్వం అంతకు ముందే ఉన్నది. కాబట్టి న-ప-మ-య అని యేకాక్షరాలను ఆగమంగా చెప్పిన ట్లయితే సంధి చేయవలసినప్రక్రియాగౌరవం తగ్గిఉండేది.

వీటిలో తిక్కన, నన్నయ ఇత్యాదులు కొన్ని ప్రత్యేకపదాలుగా (అన-అయ మొ. వాటిలో) ప్రసిద్ధాలు అయినా, నన్నప (ఆర్య) కృష్ణమ ఇత్యాదులు లేవు. నన్నన, తిక్కప ఇత్యాదులు కూడా. కాగా ఆగమాలుగా చెప్పడంవరకు అవసరమే. ఏకాక్షరాలుగా చెప్పడం మేలు అనిపిస్తుంది.

**3. కర్మధారయం బియ్యది మిశ్రంబు సిద్ధసమాసం బట్ల యగు.** (6)

ఇయ్యది - అంటే పూర్వం చెప్పింది. బిరుదాది ఉత్తరపదమూ, (ద్వ్యక్షరాదంత స్త్రీ, పుం) సంజ్ఞావాచకం పూర్వపదమూ అయినదీ అని అర్థం. సంస్కృతసమ, ఆచ్ఛికశబ్దాలకు కలిగినసమాసం మిశ్రం. సంస్కృతంలో సమాసంగా ఏర్పడినది (సమాసమే ప్రాతిపదికగా తెలుగులోకి వచ్చినది) సిద్ధసమాసం.

బిరుదాద్యుత్తరపద మయిన కర్మధారయసమాసం మిశ్ర మైతే అది సిద్ధసమాసంవలె అవుతుం దని సూత్రానికి అర్థం.

సిద్ధసమాసంవలె - అనడంలో ప్రయోజనాన్ని వ్యాకర్తే 'పూర్వపదంబు లుప్తవిభక్తికం బయి యవికృతాంతం బగు' నని వివరించాడు. అంటే ఈసమాసంలో మొదటిపదం చివరివిభక్తి లోపించి, ఆవిభక్తిని నిమిత్తం చేసుకుని ప్రాతిపదికచివర వచ్చినమార్పు లన్నీ పోయి (సంస్కృతంలోలాగా) మూలప్రాతిపదికరూపం మిగులుతుంది.

రాముఁడు అనేతత్సమసంజ్ఞకు రావు అనేబిరుదవాచకంతో కర్మధారయ మై, రాముఁడు + రావు. ఇందులో రాముడు సంస్కృతసమం. రావు ఆచ్ఛికం. కాబట్టి ఈసమాసం మిశ్రం. 'సమాసవిభక్తికి లోపం బగు' అనేసూత్రాన్ని బాధించి (ఆసూత్రం ప్రకారం విభక్తి లోపిస్తే రాముురావు అవుతుంది) ప్రస్తుతసూత్రంచేత సిద్ధసమాసంవలే అవుతుంది. దానివలన విభక్తి లోపించి 'రాము'లో అత్వానికి వచ్చిన ఉత్వరూప మైనవికారం కూడా పోయి, అంటే ఆమార్పు పొందక పూర్వం ఉన్నరూపం కలిగి

రామ – రావు అని అవుతుంది. ఆతర్వాత 'కర్మధారయంబు' ఇత్యాదిసూత్రంచేత దీర్ఘం వస్తే రామారావు.

'మిశ్రంబు' అనడంచేత సాంస్కృతిక ఆచ్ఛిక సమాసాల్లో ఈకార్యం లేదు.

దీన్నిబట్టి 'రామశాస్త్రి' 'కృష్ణశాస్త్రి' ఇత్యాదులు సంస్కృతంలోనే ఏర్పడిన సమాసాలుగా గుర్తించాలి. తెలుగులో సమాసం చేస్తే (రాముడు + శాస్త్రి) రాముశాస్త్రి అని కావలసివస్తుంది.

సుబ్బఁడు + రావు అనేరీతిఆచ్ఛికసమాసాల్లో విభక్తిలోపంచేతనే సుబ్బరావు ఇత్యాదు లవుతాయి. అంటే (ఇక్కడ) ఆచ్ఛిక సమాసాల్లో పూర్వపదం (అత్వానికి ఉత్వం రాని) మగాదుల్లోనిదే అవుతుంది.

'సిద్ధసమాసం బట్ల' అనడంచేత రాముఁరావువంటి రూపా లుండవు. సిద్ధ సమాసాలవలె ఉంటాయి. కాని యివి మిశ్రసమాసాలే. తెలుగులో చేసినసమాసాలే.

'ఇయ్యది' అనేదానిచేతనే కర్మధారయంబు అనేఅర్థం వస్తుంది. కాబట్టి సూత్రంలో 'కర్మధారయంబు' అనేదళం స్పష్టతకే. లేకున్నా అనర్థం లేదు.

'సిద్ధసమాసం బట్ల' అనడంకంటే పూర్వపదంలో ఉత్వానికి అత్వం చెప్పడం ఉచిత మేమో పరిశీలించాలి. ఇక్కడ అత్వానికి ఉత్వం తప్ప మ రొకమార్పు కనబడటం లేదు. విభక్తిలోపం పూర్వోత్తరపదాలు రెండింట్లో వస్తుంది.

**4. క్రొత్తాదులు లుప్తశేషంబులు దేశ్యంబులతోడంబలెఁ దత్సమంబుల తోడం గొన్నియెడలఁ గర్మధారయం బగు.** (7)

క్రొత్త మొద లైనశబ్దాలు క్రొత్తాదులు. లుప్తశేషం అంటే (తొలియచ్చు మీదివర్ణాలు) లోపించగా మిగిలిన (మొదటి) అక్షరం. దేశ్యం అంటే అచ్చతెనుగు అనీ, తత్సమం అంటే కేవలం సంస్కృతసమం అనీ ఇక్కడ గ్రహించాలి.

(తొలియచ్చు)మీదివర్ణాలు లోపించగా మిగిలినమొదటిఅక్షరం (లేదా మొదటి రెండక్షరాలు) కలిగిన క్రొత్త మొద లయినశబ్దాలు (క్రొ, మొ.) ఆచ్ఛికశబ్దాలతో లాగానే సంస్కృతసమశబ్దాలతో గూడా అరుదుగా కర్మధారయసమాసాన్ని పొందుతాయి అని సూత్రానికి అర్థం.

ప్రాతాదికార్యాలసందర్భంలో సూరి అన్నీ ఆచ్ఛికసమాసాలే ఉదాహరించాడు. అధర్వణాచార్యులు 'అమిశ్రే స్త్రీసమాత్' అని మిశ్రసమాసాలను పరిహరించాడు. క్రొత్తాదు లన్నీ ఆచ్ఛికాలే కాబట్టి సంస్కృతసమంతో సమాసం చెప్పడం ద్వారా

మిశ్రసమాసాలను ప్రౌఢవ్యాకరణం సాధిస్తున్నది.

సూరి ప్రాతాదు లని చెప్పి క్రొత్తశబ్దం ప్రాతాదుల్లోనిదిగా చూపాడు. 'శబ్దానా మాదిభాగేషు నూతనత్వాదిబోధకాః' అనేఅధర్వణుడివచనాన్ని అనుసరించి ప్రౌఢ వ్యాకర్త క్రొత్తాదు లన్నాడు. అందుకే సూరి ప్రాతాదులకంటే అన్యంగా చూపిన నెఱ మొద లైనవాటిని కూడా ప్రౌఢవ్యాకర్త క్రొత్తాదులలో చూపాడు.

అలాగే సమాస మయినతర్వాత తొలియచ్చుమీదివర్ణాలు లోపించడం సూరిప్రక్రియ. కాగా ముందుగా లోపం వచ్చిన తర్వాత (లుప్తశేషానికి) మీదిపదంతో సమాసం చేయడం అనేప్రౌఢవ్యాకర్త పేర్కొన్నప్రక్రియ అధర్వణమతానుసరణంవల్ల కావచ్చు.

'క్రొత్త' శబ్దంలో 'త్త' అనే అక్షరం లోపింపగా మిగిలిన 'క్రొ' అనేశబ్దం, 'పులకలు' అనేసంస్కృతసమంతో ప్రస్తుతసూత్రంప్రకారం సమాసం పొందుతుంది. క్రొ + పులకలు. సమాసవిభక్తి లోపించి 'క్రొ + పులక' 'సమాసమందుఁ దత్సమంబు పరం బగునపుడు నుమాగమాదులు గానంబడియెడి' అనే ప్రౌఢ.సూత్రంప్రకారం నుగాగమం వచ్చి, ద్రుతకార్యాలతో క్రొంబులకులు. ఇలాగే ముంగోపము, వింజామరము మొ.

క్రొత్తశబ్దం లుప్తశేష మై – క్రొ. దీనికి 'నారాచములు' అనేసంస్కృతసమంతో ప్రస్తుతసూత్రంచేత సమాసం. 'సమాసమందుఁ దత్సమంబులు' అనేసూత్రంచేత మీదిహల్లుకు ద్విత్వం వచ్చి – క్రొన్నారాచములు.

'క్రొత్తాదులు' అనడంచేత క్రొత్తాదులలో చేరనిశబ్దానికి ఈకార్యం లే దని చెప్పాలి. కాని క్రొత్తాదులలో లేనిది లుప్తశేషం కావడమూ, (సంస్కృతసమంతో సమాసం పొందక) ఆచ్ఛికంతో సమాసం పొందడమూ అనేస్థితిని గూర్చి విచారించాలి.

'లుప్తశేషంబులు' అనడంచేత లోపం రాక (క్రొత్త) మొద లైనవిధంగా ఉన్నప్పుడు సమాసం లే దని చెప్పాలి. క్రొత్తపులకలు ఇత్యాదులు సమాసాలు కా వనాలి. ఇది విచార్యం. క్రొత్తకుండలు ఇత్యాదులు సమాసాలుగా సూరి చెప్పాడు.

'దేశ్యంబులతోడంబలె' అనడం స్పష్టతకే. అది లేకపోయినా అనర్థం లేదు. 'తత్సమంబులతోడను' అనేసముచ్చయంతో ఆచ్ఛికాలతో సమాసం ప్రచురం గావడం స్పష్టం అవుతుంది.

'కొన్నియెడల' అనడంచేత 'క్రొంబులకలు' వంటి మిశ్రసమాసాలు అరుదు.

**5. అట్టి యిట్టి యెట్టి విశేషణంబులమీఁదితచ్ఛబ్దవకారంబునకు**

**లోపంబు విభాష నగు.** (9)

'తత్' అనేసంస్కృతశబ్దంయొక్క అర్థం కలిగిన తెలుగుశబ్దం తచ్ఛబ్దం. తచ్ఛబ్దానికి సంబంధించిన వకారం తచ్ఛబ్దవకారం. వాఁడు వారు మొదలైనవాటిలోనిది. వకారం అంటే పొల్లే (వ్) కాని లక్ష్యానుగుణంగా ఇక్కడ మాత్రం 'వా' అనేఅక్షరం మొత్తం గ్రహించాలి.

అట్టి – ఇట్టి – ఎట్టి అనేవిశేషణాలకు పైన ఉన్న 'వాఁడు, వారు' అనేశబ్దాలలోని 'వా' అనేఅక్షరానికి వికల్పంగా లోపం వస్తుం దని సూత్రానికి అర్థం. దీన్నిబట్టి ఈ విశేషణాలమీద విభక్తివివక్షలో తచ్ఛబ్దం చేరుతుం దని గ్రహించవలసిఉంటుంది.

అట్టి అనేవిశేషణంమీద ప్రథమైకవచనవివక్షలో 'ధాతుజవిశేషణంబులకు విభక్తి వివక్షించు నపుడు తచ్ఛబ్దం బనుప్రయుక్తం బగు' అనేసూత్రంచేత (ధాతుజవిశేషణం ఇతరవిశేషణాల కుపలక్షకం) తచ్ఛబ్దం అనుప్రయుక్తం కాగా, మహదర్థంలో అట్టివాఁడు. ప్రస్తుతసూత్రంచేత 'వా' అనేఅక్షరం లోపించగా – అట్టిఁడు.

'విభాష' అనడంచేత లోపం రానిపక్షంలో– అట్టివాఁడు.

'అట్టి యిట్టి ఎట్టి' అనడంచేత ఇతరవిశేషణాలకు పైన ఈలోపం లేదు. నల్లవాఁడు, తెల్లవారు మొ.

'తచ్ఛబ్ద' అనడంచేత తచ్ఛబ్దంకంటే భిన్న మైనశబ్దంలోని వకారానికి లోపం రాదు. అట్టివీఁడు, ఇట్టివావి, ఎట్టివరుస.

'వకారంబునకు' అనడంచేత తచ్ఛబ్దానికే సంబంధించినది అయినా ఇతరవర్ణాలకు లోపం రాదు. అట్టియతఁడు. ఎట్టియామె మొ.

'విశేషణంబుల' అనడం స్పష్టతకే. ఇవి విశేషణాలు మాత్రమే కావడం కోశాలు గుర్తించాయి. పైగా 'సేసలు వెట్టిన యట్టి రైరి' మొ. అనుప్రయుక్త మైన అట్టి మీద గూడ ఈలోపం వస్తున్నది.

'వకారం' అంటే పొల్లు (వ్) మాత్రమే అయి, అట్టి+వాఁడు, అట్టి + ఆఁడు, అట్టాఁడు, ఇత్యాదిగా అపరూపాలు ఏర్పడేప్రమాదం ఉంది. వాక్షరంబునకు లేదా తచ్ఛబ్దానికే లోపం చెప్తే బావుండేది.

ఈలోపం ప్రథమేతరవిభక్తులలో గానరాదు. అటువంటప్పుడు ప్రథమావిభక్తిలో మాత్రమే లోపిస్తుం దనేఅంశం గూడా చెప్పడం అవసరం. విభాషాపదానికి ఈఅర్థం వ్యవస్థ చేసుకోవచ్చు.

**6. ముయ్యేడ్వాదులందు హ్రస్వద్విత్వంబులు నిత్యంబులు.** (10)

ముయ్యేడు మొద లైనవి ముయ్యేడ్వాదులు. ముయ్యేడు మొద లైనసమాసాలలో మీదిహల్లుకు ద్విత్వమూ, దాని ముందరిదీర్ఘానికి హ్రస్వమూ నిత్యంగా వస్తా యని సూత్రానికి అర్థం.

'సమానాధికరణం బగునుత్తరపదంబు పరం బగునపుడు మూఁడుశబ్దము దుజ్వర్ణంబునకు లోపంబును మీఁదిహల్లునకు ద్విత్వంబును' అనేసూరిప్రణాళికలో ఈకార్యం లోపద్విత్వరూప మైనది. 'ఇద మద ఏత ద్య త్తచ్ఛబ్దాః ... బహుళం హ్రస్వం ప్రపద్య దీర్ఘాః ద్విత్వ ముపర్యక్షరస్య జనయంతి' అని చింతామణిసూత్రంలో హ్రస్వద్విత్వాలు చెప్పబడ్డాయి. ప్రౌఢవ్యాకర్త చింతామణి సూత్రార్థవివరణప్రాయంగా ఈసూత్రం చెప్పాడు. కాబట్టి సూత్రార్థాన్ని చింతామణిమార్గంలో సమన్వయించాలి. చింతామణి ఈకార్యం బహుళం అని చెప్పింది. ముయ్యేడ్వాదులలో ప్రవృత్తి అని ఈవ్యాకర్త తాత్పర్యం.

మూఁడు శబ్దాన్ని క్రొత్తాదుల్లో చేర్చుకొని మొదటిఅక్షరం మాత్రమే మిగిలేటట్లుగా మిగిలినఅక్షరా లన్నీ (డుజ్) లోపింపజేయగా 'మూ' అని ఉంటుంది. దీనికి మూఁ డైన ఏడులు అనేఅర్థంలో 'ఏడు' శబ్దంతో కర్మధారయ మై, మూ + ఏడు. ఇక్కడ సంధి లేదు కాబట్టి (యశ్రుతి) యడాగమం వచ్చి 'మూయేడు' ప్రస్తుతసూత్రంచేత మూకు హ్రస్వమూ, (ము + యేడులు) మీది హల్లుకు ద్విత్వమూ నిత్యంగా వచ్చి ముయ్యేడులు.

'ముయ్యేడ్వాదులందు' అనడంచేత ముయ్యేడు మొదల యిన వాటిలో చేరనిస్థలాల్లో ఈకార్యం నిత్యం కాదు. వ్యాకర్త చూపినఉదాహరణలనుబట్టి ముయ్యేడ్వాదు లన్నింట్లో పూర్వపదం మూఁడుశబ్దమే అయిఉంటుం దని తోస్తున్నది (అని సూత్రకర్త స్పష్టంగా చెప్పలేదు). ఆ కన్య.

'హ్రస్వద్విత్వంబులు' అనడంచేత ఈశబ్దం మొదటిఅక్షరం మిగిలింది కాక 'మూఁ డు' అని ఉన్నసందర్భంలో హ్రస్వద్విత్వాలు రాక – మూఁడుజగములు, మూఁ డేడులు, అనేవ్యస్త రూపాలు ఉంటా యని వ్యాకర్త భావించిఉండాలి.

'నిత్యంబులు' అనడంచేత ఆకన్య మొద లైనవానివలె మూయేడులు అనేవిధ మైనరూపా లుండవు.

కాగా మూఁడేడులు అనేరూపం ఉండడంలో అభ్యంతరం లే దనీ, మూయేడు అనేరీతిరూపాలు నివారించడమే ఈలక్షణానికి ప్రయోజన మనీ గ్రహించాలి.

ముక్కారు, ముత్రోవ ఇత్యాదులనుబట్టి ఇక్కడ నుగాగమం ఎప్పుడూ రాక, మీదిహల్లుకు ద్విత్వం మాత్రమే వస్తుండటంతోనే సూరి మూఁడును ప్రాతాదుల్లో చేర్చక వీటికి ప్రత్యేకలక్షణం చెప్పిఉండవచ్చు. నిర్దుష్టమూ, విస్పష్టమూ అయినసూరి మార్గాన్ని విడిచి ప్రౌఢవ్యాకర్త తిరిగి చింతామణివ్యాఖ్యకు పూనుకోవడం విచార్యం.

**7. గుణవాచకంబులు కొన్నింటినిగాగమంబునకుఁ బరుషంబులు పరంబు లగునపుడు బిందు వగు.** (13)

గుణాన్ని తెలియజేసేశబ్దాలు గుణవాచకాలు. కచటతపలు పరుషాలు. నిక్ ఆగమంలో కకారం ఇత్తు. కాబట్టి 'ని' అనేదే నిలిచిఉంటుంది. నిగాగమంబునకు – అనడంచేత 'ని' వర్ణం మొత్తంస్థానంలో బిందువు వస్తుంది. బిందువు అని సామాన్యంగా చెప్పడంవల్ల ఖండబిందువూ, పూర్ణబిందువూ రెండూ వస్తాయి.

పరుషాలు పరంగా ఉండగా, వాటికి పూర్వంలో ఉన్న కొన్ని గుణవాచకాలకు కర్మధారయ సమాసంలో ఆగమంగా వచ్చిన 'ని' అనేవర్ణంస్థానంలో, అరసున్న లేదా నిండుసున్న వస్తుంది అని సూత్రానికి అర్థం.

'కమ్మ + తేనె' అనేకర్మధారయంలో 'గుణవచనంబు లగునల్లాదులకుం గర్మధారయంబునందు నిగాగమంబు బహుళంబుగా నగు' అనే (బాలవ్యాకరణ) సూత్రంచేత నిగాగమం వచ్చి– కమ్మనితేనె. ఆ 'ని'వర్ణానికి ప్రస్తుతసూత్రంచేత అర్ధబిందువు వస్తే, కమ్మఁతేనె. పూర్ణబిందువు వస్తే, కమ్మంతేనె. లక్ష్యానుగుణంగా ఇక్కడ బిందువుతోపాటు మీదిపరుషానికి సరళం కూడా వస్తుం దని గ్రహించాలి. కమ్మఁదేనె, కమ్మందేనె.

'గుణవాచకములు' అనడంచేత ఇతర(ధ్వన్యనుకరణ)శబ్దాల నిగాగమానికి ఈకార్యం లేదు. తళతళనితరణిమెఱుఁగులు.

'కొన్నింటి' అనడంచేత గుణవాచకాలకు గూడా అన్నింటికీ ఈకార్యం లేదు. నల్లనికలువ, చక్కనితరుణి మొ.

'నిగాగమంబునకు' అనడంచేత నిగాగమం రానిపక్షంలో బిందువు రావడానికి అవకాశం లేదు. కమ్మతేనె.

'పరుషంబులు పరంబు లగునపుడు' అనడంచేత పరుషేతరం పర మైతే ఈకార్యం లేదు. కమ్మనియమృతము, కమ్మనిగాలి మొ.

'బిందు వగు' అనడంచేత ఈకార్యం నిత్యం అని చెప్పవలసిఉంది. అపుడు 'కమ్మనితేనె' అనేరీతిరూపం లక్షణవిరుద్ధం అవుతుంది. కాబట్టి నిత్యంగా చెప్పగూడదు.

బిందువుతోపాటు పైపరుషం సరళం కావడం చెప్పకపోవడం సరికాదు. ఈరెండూ చెప్పడంకంటే 'ను'గాగమ (ద్రుత) విధానం ఉచితం.

'కొన్నింటి' అని చెప్పినా 'కమ్మ'శబ్దం మాత్రమే ఉదాహరింపబడింది. మ రొకటి మృగ్యం.

ఇలాంటివి ఒకవేళ ఒకటో రెండో ఉన్నా, 'గుణవచనంబు లగు...' అనే బాలవ్యాకరణసూత్రంలోనిబహుళశబ్దంచేత అన్యకార్యంగా వాటిలో నుగాగమాన్ని సాధించుకుంటే ఈరూపా లన్నీ తేలికగా సమగ్రంగా సిద్ధిస్తాయి. అటువంటప్పుడు ఈవిధానం అవసరం కాదు.

## 8. తమ్ముఁగుఱ్ఱలు, చిలుకమొకరి యిత్యాదులు విశేష్యపూర్వపద కర్మధారయంబులు. (16)

విశేషణానికి విశేష్యంతో అయినసమాసం కర్మధారయం. పూర్వపదం అంటే సమాసంలో మొదటిపదం. విశేషణంచేత చెప్పదగిన జాత్యాదివిశేషం కలిగినది విశేష్యం.

తమ్ముఁగుఱ్ఱలు, చిలుకమొకరి మొద లయినవి విశేష్యం పూర్వపదంగా కలిగినకర్మధారయసమాసాలు అని సూత్రానికి అర్థం. దీనివల్ల విశేష్యం పూర్వపదంగా మారుతుంది.

'తత్పురుషాదులకు లక్షణంబు ప్రాయికంబుగ సంస్కృతోక్తంబ యగు' అని సూత్రించి తెలుగులోనిఆయాసమాసాలను వివరించినసూరి విశేష్యపూర్వపద కర్మధారయాలు సంస్కృతంలో లాగా తెలుగులో కూడా ఉంటా యనేవిషయాన్ని ప్రస్తావించలేదు. అందుకని ప్రౌఢవ్యాకరణం వాటిని పేర్కొన్నది.

'కుఱ్ఱ లయినతమ్ములు' అనేవిగ్రహంచొప్పున కుఱ్ఱలు అనేవిశేషణానికి తమ్ములు అనేవిశేష్యంతో కర్మధారయసమాసం ఏర్పడి కుఱ్ఱలు + తమ్ములు. విశేష్య మయిన తమ్ములు అనేశబ్దం ప్రస్తుతసూత్రంచేత పూర్వపదం అయి, తమ్ములు+కుఱ్ఱలు. 'సమాసవిభక్తికి లోపం బగు' అని విభక్తి లోపించి, తమ్మ+కుఱ్ఱ. లక్ష్యానుగుణంగా ఇక్కడ పూర్వపదానికి నుగాగమం వస్తుం దని గ్రహించాలి. తమ్మును + కుఱ్ఱ. ద్రుతకార్యాలతో (తమ్ముఁ+గుఱ్ఱ) ఈసమాసప్రాతిపదికపై ప్రథమావిభక్తిని వివక్షించగా బహుత్వార్థాన్నిబట్టి బహువచనం (లు) వచ్చి తమ్ముఁగుఱ్ఱలు.

ఇలాగే – మొకరి యగుచిలుక . . . చిలుకమొకరి.

'తమ్ముఁగుఱ్ఱలు చిలుకమొకరి' అనేనిర్దేశంవల్ల కుఱ్ఱతమ్ములు, మొకరిచిలుక అనేవిధంగా విశేషణం పూర్వపదంగా ఉంటే, విశేషణపూర్వపదకర్మధారయాలు అవుతాయి.

'ఇత్యాదు' లనడంచేత కవిప్రయోగానుసారంగా ఇతరశబ్దాలను గ్రహించవచ్చు. అల్లుఁగుఱ్ఱ, కొడుకుఁగుఱ్ఱ మొ.

'ఇత్యాదులు' అని ఎలాగూ చెప్తున్నప్పుడు సూత్రంలో అటువంటివాటిని రెండు ఉచ్చరించడంవల్ల ప్రయోజనం లేదు. 'తమ్ముఁగుఱ్ఱ లిత్యాదులు' అని మాత్రమే చెప్పినా ఇత్యాదిశబ్దంచేత 'మొకరిచిలుక' కూడా గ్రహింపబడుతుంది.

'విశేష్యం పూర్వపదం కావడం' అనే విధేయాంశాన్నే చెప్పిన ట్లయితే బాగుండేది.

**9. ఆయీత్యాదిఘటితంబులు విశేషణోభయపదకర్మధారయంబులు.** (17)

ఆ, ఈ అనేవి సర్వనామాలు (త్రికం). ఇత్యాదు లంటే 'ఏ' అనేత్రికమూ, గుణ విశేషణాలూ, ధాతుజవిశేషణాలు మొదలైనవిశేషణాలను గ్రహించాలి. సమాసంలో మొదటిపదానికి పూర్వపద మనీ, చివరిపదానికి ఉత్తరపద మనీ వ్యవహారం. ఉభయపదాలూ విశేషణా లయినకర్మధారయసమాసాలు విశేషణోభయపద కర్మధారయాలు.

తెలుగులో ఆ, ఈ మొద లైనవిశేషణశబ్దాలతో కూర్పబడినవి విశేషణోభయపద కర్మధారయసమాసాలు.

'స్నాతానులిప్తః' ఇత్యాదిగా సంస్కృతంలో ఇటువంటిసమాసా లున్నాయి. సూరి 'ఆయాకాలము' ఇత్యాదులు స్థలాంతరంలో ఉదాహరించాడు. కాని లక్షణంలో వీటిని చెప్పలేదు. 'విశేషణసమాసో కపి క్వచి దిష్టో భవే న్మమ' అని అథర్వణుడు పేర్కొన్నాడు. ప్రౌఢవ్యాకరణం దాన్ని అనుసరించింది.

రెండవవిశేషణాన్ని విశేష్యంగా వివక్షించి విశేషణవిశేష్యభావంతో రెండు విశేషణాలకు కర్మధారయం చేయడం సంస్కృతసంప్రదాయం.

ఎత్తినవారు, పెంచినవారు అనేఅర్థంలో, ఎత్తినవారు, పెంచినవారు అనేధాతుజ విశేషణాలకు ప్రస్తుతసూత్రంచేత కర్మధారయ మై, సమాసవిభక్తి లోపించగా, ఎత్తినపెంచిన. ఈసమాసప్రాతిపదికపై ప్రథమావిభక్తి వివక్షించగా 'ధాతుజ విశేషణంబులకు విభక్తి వివక్షించునపుడు తచ్ఛబ్దం బనుప్రయుక్తం బగు' అని తచ్ఛబ్దం చేరి ప్రథమలో బహుత్వార్థాన్ని అనుసరించి బహువచనం రాగా మహదర్థంలో 'ఎత్తినపెంచినవారు' అని అవుతుంది. ఇలాగే కొట్టినతిట్టినయాతఁ

డు మొ.

'ఆయీనేరములు' ఇత్యాదులలో 'ఆ,ఈ' అనేవిశేషణాలకు ముందుగా కర్మధారయం చేసి (ఆయివి) ఆరెండు విశేషణాలకూ విశేష్య మైన(నేరములు)దానితో కర్మధారయం చేయగా, ఆయీనేరములు మొ.

ధాతుజవిశేషణాలు తప్ప మిగిలినవిశేషణాలు విశేష్యంతో సమాసం పొందకుండా కేవలం విశేషణసమాసాలుగా ప్రయుక్తం కావడం కానరాదు. సూరి చూపిన ఆయాకాలము ఇటువంటిదే.

'ఈయాదేశంబు' అనేచోట ఏకవచనాన్నిబట్టి అన్వయంలో విశేషం గుర్తించ వలసిఉంది.

విశేషణోభయపదకర్మధారయా లని వర్ణించడంకంటే ఆయీత్యాదివిశేషణాలకు సమాసం విధించడంలో ఔచిత్యం ఉం దనిపిస్తుంది.

## 10. అలరుఁబోఁ డీత్యాదు లుపమానపూర్వపదకర్మధారయంబులు. (19)

విశేషణానికి విశేష్యంతో సమాసం కర్మధారయం. పమానం పూర్వపదంగా కలిగిన కర్మధారయం ఉపమానపూర్వపద కర్మధారయం. అంటే విశేషణ మైన పూర్వపదం ఉపమాన మైతే, అది ఉపమానపూర్వపదకర్మధారయం.

'అలరుఁబోఁడి' మొద లైనవి ఉపమానపూర్వపదకర్మధారయాలు. ఇక్కడ పోఁడి పరంగా ఉన్నప్పుడు అన్ని శబ్దాలకూ నుగాగమం వస్తుంది.

అలరువంటి పోఁడి (మనోజ్ఞత కలది) అనేఅర్థంలో ఉపమాన మైన అలరు అనే విశేషణానికి, పోఁడి అనేవిశేష్యంతో కర్మధారయసమాస మయి, 'ఇటఁ బోడి పరం బగుచో నెల్లెడల ను మ్మగు' అనడంచేత నుగాగమం వచ్చి ద్రుతకార్యాలతో అలరుఁ బోఁడి మొ.

'ఉపమానాని సామాన్యవచనైః' అనేపాణినీయలక్షణంచేత ఉపమానశబ్దాలు సామాన్య వచనాలతో సమాసాన్ని పొందుతాయి. అపుడు ఉపమానం పూర్వపదంగా నిలుస్తుంది. ఉపమాన, ఉపమేయాలలో సమానంగా ఉన్నధర్మం సామాన్యం. దాన్ని బోధించేశబ్దం సామాన్యవచనం.

అలరువంటి పోఁడి – స్త్రీ. అలరు అనేఉపమానంలోనూ, స్త్రీ అనే ఉపమేయంలోనూ సమానంగా ఉన్నధర్మం ఒప్పిదం. (మనోజ్ఞత) దానిని తెలిపేశబ్దం పోఁడి. కాబట్టి అలరు అనేఉపమానానికి పోఁడి అనేసామాన్యవచనంతో ప్రస్తుతసూత్రం ప్రకారం

(సమానాధికరణ) కర్మధారయసమాసం వచ్చిం దన్నమాట.

అలరువంటి మేను గలది అనేఅర్థంలో అలరు (ఉపమానం) మేను అనేశబ్దాలకు బహుబ్రీహి సమాసం కాగా, 'బహుబ్రీహిని స్త్రీ వాచ్యం బగుచో నుపమానంబుమీఁది మేనునకు బోఁడి యగు' అని మేనుశబ్దంస్థానంలో 'బోఁడి' ఆదేశం అవుతుం దని సూరిప్రక్రియ. ఈరెండు మతాలలో బేధం ఇలా గుర్తించవచ్చు.

1. ఇది బహుబ్రీహి అని సూరి. ఉపమానపూర్వపదకర్మధారయ మని ప్రౌఢ.

2. ఉత్తరపదం మేను అనీ, దానికి బోఁడి ఆదేశ మవుతుం దనీ సూరి. ఉత్తరపదం 'పోఁడి' అనీ అది పరంగా ఉంటే నుమాగమం వస్తుం దనీ ప్రౌఢ.

3. బోఁడికి పూర్వంలో అరసున్నా ఎక్కడా ఉండదు. ఉదంతాల మీద నిండుసున్న ఉండవచ్చు అని సూరి. నుగాగమంచేత బోఁడికి పూర్వంలో అరసున్న నిండుసున్నలు రెండు అన్ని విధ మైనశబ్దాలమీద ఉంటాయి అని ప్రౌఢ. ననఁబోడి, విరిఁబోడి.

4) పూవువంటిశరీరం కల స్త్రీ అని సూరిమతంలో అర్థం. పూవువలె మనోజ్ఞురా లయినస్త్రీ అని ప్రౌఢ.మతం.

శబ్దస్వరూపం ప్రౌఢవ్యాకర్తమతాని కనుగుణం కాగా, సూరిమతం అర్థానుగుణం. ప్రౌఢవ్యాకర్త చెప్పిన (మనోజ్ఞురా లైనది' అనేదానికంటే సూరి చెప్పిన 'మేనుకలది' అనేఅర్థం సముచితంగా కనిపిస్తుంది.

## 11. ఒక్కచో ద్విగువు మిశ్రం బేకవచనాంతంబు నగు. (20)

విశేషణానికి విశేష్యంతో సమాసం కర్మధారయం. 'ఇయ్యది సంఖ్యాపూర్వంబు ద్విగువు నాఁబడు'. కర్మధారయంలో విశేషణ మయినపూర్వపదం సంఖ్యను తెలియజేసేది అయితే దానికి ద్విగుసమాస మని విశేష మయినసంజ్ఞ. సంస్కృత సమమూ, ఆచ్ఛికమూ అయినశబ్దాలు కలిగినసమాసం మిశ్రం. ఏకవచనాంత మవుతుం దంటే ఏకవచనం వస్తుం దని సారాంశం.

మిశ్రం అయినద్విగుసమాసానికి కూడా అరు దైనస్థలాల్లో, వికల్పంగా ఏకవచనం వస్తుంది అని సూత్రానికి అర్థం.

'ద్విగువున కేకవచనంబు ప్రాయికంబుగ నగు' అని చెప్పిన సూరి అక్కడే 'మిశ్రంబునకుఁ గాదు' అన్నాడు. అధర్వణుడు కూడా 'ద్విగో రమిశ్రతాయాం ప్రాయ ఏకత్వ మిష్యతే' అని మిశ్రం కానిద్విగువు కేకవచం చెప్పి 'మిశ్రతాయాం

బహుత్వం స్యాత్' అని మిశ్రద్విగువునకు బహువచనమే వస్తుం దని మరోసారి స్పష్టంచేశాడు. కాగా ప్రయోగానుసారంగా మిశ్రద్విగువుకు కూడా ఏకవచనం రావడాన్ని ప్రౌఢవ్యాకర్త పేర్కొన్నాడు.

నాలు గయినదిక్కులు అనేవిగ్రహంచొప్పున నాలుగు, అనే(సంఖ్యా)విశేషణానికి, దిక్కు అనేవిశేష్యంతో కర్మధారయసమాస మై, నాలుగు + దిక్కు. విభక్తి లోపించి 'నాలుగు'కు నలు ఆదేశమై, నలుదిక్కు. ఈసమాసప్రాతిపదికపై ప్రథమావిభక్తిని వివక్షింపగా బహుత్వార్థాన్నిబట్టి 'లువర్ణంబు బహువచనంబు' అని లువర్ణకం రాగా దానికి ప్రస్తుతసూత్రంచేత ఏకవచనం వచ్చి, నలుదిక్కు+సు. 'ఇగ్లోరాయుగంతంబుల' అని ప్రథమైకవచనం లోపించి, నలుదిక్కు (నల్దిక్కు) అని అవుతుంది.

'ఏకవచనాంతంబును' అనేచోటిసముచ్చయార్థకనుశబ్దంచేత ఏకవచనం వికల్పం. కాబట్టి రానిపక్షంలో బహువచనంతో నలుదిక్కులు. (నల్దిక్కులు).

'ఒక్కచో' అనడంచేత ఈకార్యం అరుదు. కవిప్రయోగానుసారంగా కొన్ని స్థలాల్లో మాత్రమే వస్తుంది. కాబట్టి ముజ్జగములు, మువ్విధములు ఇత్యాదిగా పెక్కు లక్ష్యాలలో బహువచనం మాత్రమే ఉంటుంది.

'ద్విగువు' అనడంచేత ఇతరసమాసాని కీకార్యం రాదు. తెల్లనిగుఱ్ఱములు, అన్నదమ్ములు.

'మిశ్రంబు' అనడంచేత ఇతరద్విగువుకు ఈసూత్రంచేత ఏకవచనం రాదు. బాల వ్యాకరణంప్రకారం ఆచ్ఛికద్విగువుకు ఏకవచనం వస్తుంది. ముచ్చిచ్చు, మొ. ఇతరాలకు లేదు. సప్తర్షులు మొ.

'ఏకవచనాంతంబు' అని వర్ణించడంకంటే 'ఏకవచనంబు నగు' అనేవిధేయాంశాన్ని చెప్తే బాగుండేది.

## 12. కఱకంఠుఁడు బహువ్రీహి. (27)

కఱకంఠుడు అనేశబ్దం బహువ్రీహి సమాసం అవుతుం దని సూత్రానికి అర్థం.

'కఱకంఠుడు ఇత్యత్ర మిశ్రబహువ్రీహిః' అని అహోబలుడు దీనిని మిశ్రబహువ్రీహిగా చెప్పడం సరి గాదని ప్రౌఢవ్యాకర్త ఈలక్షణం చేశాడు.

కఱ అయిన కంఠము కలవాడు అనేవిగ్రహంతో, కఱ అనేఆచ్ఛికశబ్దానికీ, కంఠము అనేసంస్కృతసమశబ్దానికీ బహువ్రీహి సమాసం చేస్తే అది మిశ్రబహువ్రీహి అవుతుంది. కాని 'స్త్రీసమఘటితంబ యొకానొకండు బహువ్రీహి చూపట్టెడు' అనేసూత్రంచేత స్త్రీసమా లయిన ఆచ్ఛికాలకు మాత్రమే బహువ్రీహి లక్షణానుసారంగా

కుదురుతుంది. కాబట్టి బహుబ్రీహి మిశ్రం కుదరదు. అందుకనే మిశ్రం కావడం దుర్ఘటం అన్నాడు ప్రౌఢవ్యాకర్త.

ఇంక ఇది బహుబ్రీహి అవుతుంది. 'తద్భవములందును నలఘురేఫము గలదు' అనేసూత్రం దగ్గర 'కఱకంఠుడు అనేది గరకంఠ శబ్దభవ మని చెప్పాడు. వత్సనాభి – వసనాభి అనే తీరుగా సిద్ధ (సంస్కృత) సమాసంనుంచి తద్భవాలు ఏర్పడడాన్ని వైకృతదీపికలో ఈవ్యాకర్త పేర్కొన్నాడు. అలాగే 'ప్రాణకుట్టక' అనేసమాసంనుంచి 'ప్రాణగొడ్డము' తద్భవం కావడం ఈవ్యాకరణంలో పేర్కొన్నాడు.

'గరకంఠ' అనే (సిద్ధ) సమాసం సంస్కృతలక్షణానుసారంగా బహుబ్రీహి. కాబట్టి దానినుండి తద్భవంగా ఏర్పడిన 'కఱకంఠ' అనేది కూడా బహుబ్రీహే అవుతుంది. ఇక్కడ తెలుగులో సమాసం చేయడం అనేపద్ధతి లేదు. కాబట్టి ప్రౌఢవ్యాకర్త చెప్పినమార్గంలో 'కరకంఠ' అనేసమాసం మిశ్రం కాదు.

కఱకంఠ అనే తద్భవ (బహుబ్రీహి) శబ్దం ప్రథమైకవచనంలో ఉత్వడుజులతో కఱకంఠుడు అని అవుతుంది. ఇలాగే మిగిలిన విభక్తుల్లో కఱకంఠుని మొ.

'కఱకంఠ' అనేతద్భవశబ్దంలో ఱకారం ఉంది. ఇది అచ్చతెనుగువర్ణమాలలో లేదు. కాబట్టి అచ్చతెలుగులో ఉండకూడనిఱకారం ఉండటంచేత 'కఱకంఠ' అనే తద్భవశబ్దం లక్షణవిరుద్ధ మై, గ్రామ్య మైంది. అయినా 'కఱకంఠా ! క్షమియింపుము!' అనేనన్నయప్రయోగంచేత 'ఆర్యవ్యవహారంబుల దృష్టంబు గ్రాహ్యంబు' గాబట్టి గ్రహింపబడుతున్నది. శబ్దరత్నాకరంలో దీన్ని వైకృతం, గ్రామ్యం అని చెప్పాడు ఈవ్యాకర్త. అందుకే ప్రౌఢవాకర్త 'ప్రాణగొడ్డ మగ్రామ్యంబు' అన్నట్లుగా 'కఱకంఠుడు' అగ్రామ్యం బనలేదు.

సమాసం లక్షణవిరుద్ధం గాబట్టి గ్రామ్యం అని సూరిమతం.

అసలు తెలుగులో ఇక్కడ సమాసం చేయడమే లేదు గాబట్టి సామాసికదోషం లేదు. కానీ అచ్చతెలుగులో లేనిఱకారం ఉండడంచేత గ్రామ్యం అని ప్రౌఢ.మతం.

నన్నయప్రయుక్తం కావడంవల్ల గ్రాహ్యం అనడం సర్వసమ్మతం. కాని ప్రౌఢ. మార్గంలో నన్నయప్రయోగంలో మరోగ్రామ్యత వస్తుంది. 'కఱకంఠుడు' తద్భవ మయితే దీనికి సంబోధనంలో 'కృతోత్కం బగుసంస్కృతనామంబు సంబుద్ధిడుజునకు లోపంబు విభాష నగు' అనేసూత్రంచేత డుజ్లోపం రాదు. సంస్కృతనామం కాదు కదా. చందురుఁడా, అనవలసిందే. చందురా అనవచ్చునా. అలాగే తద్భవ మైన కఱకంఠుడు – కఱకంఠుడా అవుతుందే కాని 'కఱకంఠా' కాదు. ఇక్కడ డుజ్లోపం

చేయడం మరోదోషం.

గ్రామ్యత ఎలాగూ తప్పనప్పుడు సామాసికదోషంగా (అహోబలాదుల) సూరిమతాన్ని స్వీకరిస్తే 'కఱకంఠుఁడు'లో 'కంఠ'శబ్దం సంస్కృతనామం కాబట్టి దుష్టోపాదులతో నన్నయప్రయోగం సిద్ధిస్తుంది.

కాగా బహువ్రీహి అనేప్రౌఢవ్యాకర్తమతంకంటే మిశ్రబహువ్రీహి అన్న అహోబలాదులమతమే యుక్తం.

**13. కొన్నియెడల మహద్ద్వంద్వంబునం బూర్వపదాంత్యస్వరంబునకు దీర్ఘంబునుం జూపట్టెడు.** (28)

ఇక్కడ మహత్ (మహత్ చ మహతీ చ) అనేశబ్దం ఏకశేషసమాసం. మహత్తు అంటే పురుషవాచకం, మహతి అంటే స్త్రీవాచకం. సూత్రంలోని మహత్ శబ్దం ఈరెండింటినీ బోధిస్తుంది. ఉభయ (పూర్వ + ఉత్తర) పదార్థప్రధాన మైనసమాసం ద్వంద్వం. పూర్వపదం అంటే సమాసంలో ఆద్యవయవం (మొదటిపదం). 'దీర్ఘంబున్' అనేచోటిసముచ్చయార్థక నుశబ్దంచేత ఈకార్యం వికల్పం.

మహత్తులు, మహతీవాచకాలు అయినశబ్దాలకు కలిగిన కొన్ని ద్వంద్వ సమాసాలలో మొదటిపదంలోనిచివరిఅచ్చుకు దీర్ఘం, వికల్పంగా రావడం కవి ప్రయోగాలలో కనబడుతున్నది అని సూత్రానికి అర్థం.

అన్నయును తమ్ముఁడును అనేఅర్థంలో అన్న, తమ్ముఁడు అనేశబ్దాలకు 'ఆచ్ఛిక శబ్దంబుతోడ స్త్రీసమంబు ప్రాయికంబుగా ద్వంద్వం బగు' అని ద్వంద్వసమాసం ఏర్పడి, సమాసవిభక్తి లోపించి అన్న + తమ్ము. (రెండు మహత్తులకు చేసిన యీద్వంద్వ సమాసంలో) ప్రస్తుతసూత్రంచేత మొదటిపదం చివరిఅచ్చుకు దీర్ఘం వచ్చి, అన్నా తమ్ము. గసడదవాదేశం వచ్చి, ప్రథమావిభక్తిలో – అన్నాదమ్ములు.

వికల్పం కాబట్టి దీర్ఘం రానిపక్షంలో (అన్న + తమ్ము) అన్నదమ్ములు.

అప్పాచెల్లెండ్లు (రెండూ మహతీవాచకాలు)

తల్లీదండ్రులు (తల్లి మహతి, తండ్రి మహత్తు)

'కొన్నియెడల' అనడంచేత ఈకార్యం క్వాచిత్కం. కాబట్టి ద్వంద్వసమాసా లన్నింటిలో ఈకార్యం రాదు.

'చూపట్టెడు' అనేదాన్నిబట్టి కవిప్రయోగానుసారంగా దీర్ఘం వచ్చినస్థలాలను గ్రహించాలి. ఆలుమగలు ఇత్యాదుల్లో దీర్ఘం అసలు లేదు. లోకవ్యవహారంలో

ఆలూమగలూ, వదినే(నా)మరదులు ఇత్యాదిగా దీర్ఘం వినిపిస్తుంది. దానికి కావ్యప్రయోగప్రామాణ్యం లేదు.

మహత్' అనడంచేత తిర్యగ్జడాలకు చేసినద్వంద్వంలో ఈకార్యం లేదు. కుక్కనక్కలు, కూరగాయలు మొ.

'ద్వంద్వంబున' అనడంచేత ఇతరసమాసాల్లో ఈకార్యం లేదు. పెద్దతమ్ముఁడు, రామునిబాణము మొ.

'పూర్వపద అంత్యస్వరంబునకు' అనడంచేత అన్నదమ్ములూ, లేదా అన్నదమ్ములు ఇత్యాదిగా ఉత్తరపదాలలో గాని, పూర్వపదంలో ఇతరస్వరాలకు గాని దీర్ఘం రాదు.

**14. ఒకానొకచో ద్వంద్వబునం బూర్వపదంబు క్లీబసమం బగు అగుచో నాముువర్ణకంబునకు లోపం బగు.** (29)

క్లీబం అంటే నపుంసకం. దానితో సమాన మైనది క్లీబసమం. నపుంసలింగశబ్దంతో సమాన మైనకార్యం (మువర్ణకాదికం) పొందే (అచ్ఛిక)శబ్దం క్లీబసమం అని తెలియవచ్చు. ఉభయ (పూర్వఉత్తర) పదార్థ ప్రధాన మైనసమాసం ద్వంద్వం.

ద్వంద్వసమాసంలో పూర్వపదం అరుదుగా క్లీబసమం అవుతున్నది. అపుడు అందులో మువిభక్తికి లోపం వస్తుంది.

'అచ్ఛికశబ్దంబుతోడ స్త్రీసమంబు ప్రాయికంబుగా ద్వంద్వం బగు' అని బాలవ్యాకరణం ద్వంద్వంలో పూర్వపదం తఱుచుగా స్త్రీసమ మవుతుం దని చెప్తున్నది. కాగా క్లీబసమానికి సైతం అచ్ఛికశబ్దంతో ద్వంద్వసమాసం అరుదుగా కావడం, ఈసూత్రం విశేషంగా చెప్తున్నది. ఉత్తరపదం అచ్ఛికం కావడం అనేఅంశం బాలవ్యాకరణాన్నిబట్టి గ్రహించాలి.

అందమును, చందమును అనేఅర్థంలో అందము అనేక్లీబసమానికి చందము అనేఅచ్ఛిక (క్లీబసమ)శబ్దంతో ప్రస్తుతసూత్రంచేత ద్వంద్వసమాసం ఏర్పడి అందము+ చందము. పూర్వపదంలో ముప్రత్యయం లోపించి అందచందము, 'సమాసవిభక్తికి లోపం బగు' అని ఉత్తరపదంలో ముప్రత్యయం లోపించి అందచంద. ఈసమాస ప్రాతిపదికపై ప్రథమావిభక్తివివక్షలో బహుత్వార్థాన్నిబట్టి బహువచనం వచ్చి, అందచందములు. ఇలాగే వెచ్చము + సచ్చము = వెచ్చసచ్చములు మొ.

'ఒకానొకచో' అనడంచేత ద్వంద్వంలో పూర్వపదం క్లీబసమం కావడం క్వాచిత్కం. కవిప్రయోగానుసారంగా ఆయా స్థలాలను గ్రహించాలి. బాలవ్యాకరణా న్ననుసరించి తఱచుగా స్త్రీసమమే అవుతుంది. కండతుండెములు మొ.

'ద్వంద్వంబున' అనడంచేత ఇతరసమాసాలలో యథావకాశంగా ఉండవచ్చు.

'పూర్వపదంబు' అనడంచేత ఉత్తరపదం పూర్వ(బాల)లక్షణానుగుణంగా ఆచ్ఛికం (స్త్రీసమ, క్లీబసమ, పుంలింగగతుల్యాలు) ఏ దైనా కావచ్చు. తల్లిదండ్రులు, అన్నదమ్ములు మొ.

'అగుచో నామువర్ణకంబుకు లోపం బగు' అనడం అవసరం కాదు. 'సమాసవిభక్తికి లోపం బగు' అనేదానిచేత (ఉత్తరపదం విభక్తితోపాటు) పూర్వపదవిభక్తి లోపిస్తుంది. పుంప్వాదేశంస్థలంలో విశేషవిధానసామర్థ్యంవల్ల లోపించదు. మచ్చెకంటి మొ.

'పూర్వపదంబు క్లీబసమం బగు' అనేమాట సమాస మైనతర్వాతిస్థితిని వర్ణిస్తున్నది. కాని 'క్లీబసమానికి ఆచ్ఛికంతో ద్వంద్వం' విధించడం యుక్తం.

'ఆచ్ఛికశబ్దంబుతోడ స్త్రీసమంబు ప్రాయికంబుగా ద్వంద్వం బగు' అనేబాల వ్యాకరణసూత్రంలో ప్రాయికశబ్దంచేత అరుదుగా క్లీబసమం కావడం సాధించు కోవచ్చు. అపు డీప్రౌఢ.సూత్రం బాల.సూత్రంలోని ప్రాయికశబ్దానికి వివరణప్రాయం అవుతుంది.

### 15. ద్వంద్వం బప్రాణివాచక కృదంతశబ్దఘటితం బేకవచనాంతంబు నగు. (30)

ప్రాణం కలిగినది ప్రాణి. ప్రాణి కానిది అప్రాణి. అప్రాణిని బోధించేశబ్దం అప్రాణివాచకం. ధాతువుకంటే విధింపబడిన క్రియావిభక్తులకంటే వే రైనప్రత్యయం కృత్తు. కృత్తు అంతమందు కలిగినది కృదంతం. 'ను' శబ్దంచేత ఈకార్యం క్వాచిత్కం.

అప్రాణివాచకాలకు, కృదంతశబ్దాలకు (ఉభయాలకు) ఏర్పడిన ద్వంద్వసమాసం ఏకవచనాంతం కూడా అవుతుంది. అంటే అరుదుగా ఏకవచనం అవుతుం దని తాత్పర్యం. 'అన్య త్రాపి క్వచి ద్భవేత్' అనేఅధర్వణవచనం ఈఅర్థాన్నే చెప్తున్నట్లు అహోబలుడు వివరించాడు.

కూడును గుడ్డయును అనేఅర్థంలో కూడు, గుడ్డ అనేశబ్దాలకు 'ఆచ్ఛికశబ్దంబుతోడ స్త్రీసమంబు' అనేసూత్రంచేత ద్వంద్వసమాస మై కూడుగుడ్డ అనేద్వంద్వసమాస ప్రాతిపదిక ఏర్పడుతుంది. బహుత్వార్థాన్ని అనుసరించి దీనిపై బహువచనం వస్తుండగా ఈఅప్రాణిద్వంద్వానికి ప్రస్తుతసూత్రంచేత ఏకవచనం వస్తుంది. ఇది స్త్రీసమం కాబట్టి ప్రథమావిభక్తిలో ఏకవచనం లోపించి 'కూడుగుడ్డ' అని అవుతుంది. బహుత్వార్థంలో వచ్చింది కాబట్టి ఈఏకవచనం బహుత్వార్థాన్నే బోధిస్తుంది.

కూడుగుడ్డ అంటే కూడుగుడ్డలు అనే అర్థం.

వికల్పం కాబట్టి ఏకవచనం రానిపక్షంలో బహువచనంతో కూడుగుడ్డలు,

రేవగలు – అప్రాణివాచకాలద్వంద్వం. తాఁకుదగులు. ఇక్కడ కృదంతాల ద్వంద్వానికి ఏకవచనం.

కూరగాయ, దరిదాఁపు – అన్నపుడు మొదటిశబ్దం అప్రాణి, రెండవది కృదంతం.

'ద్వంద్వంబు' అనడంచేత ఇతరసమాసాల కీకార్యం లేదు. మడిసెడుదడములు.

'అప్రాణివాచక' అనడంచేత ప్రాణివాచకాలద్వంద్వానికి ఈకార్యం లేదు. తల్లిదండ్రులు. కాని 'ఆలుబిడ్డ లేనియట్టిత్రిమ్మరి', 'అత్తమామ నాగ', అని ఒకటి రెండు ప్రయోగాలలో ప్రాణిద్వంద్వానికి కూడా ఏకవచనం కనబడుతున్నది.

'కృదంత' శబ్దాలను వేరుగా చెప్పడం అవసరంగా కనబడదు. ప్రాణివాచకా లైన కృదంతాలద్వంద్వానికి ఏకవచనం కావడం వ్యాకర్త చూపలేదు.

ఆధిక్యాన్నిబట్టి కేవలం 'అప్రాణిద్వంద్వంబునకు' అని మాత్రమే చెప్పవచ్చు. 'ఆలుబిడ్డ' లాంటివాటిని గుర్తిస్తే సామాన్యంగా 'ఒకానొకచో ద్వంద్వం బేకవచనాంతం' కావడం చెప్తే చాలు.

'ఏకవచనాంతంబును' అని వర్ణించడంకంటే (ఘటితంబునకు) 'ఏకవచనంబు నగు' అని ఏకవచనాన్ని చెప్పడం ఉచితం.

'ను'శబ్దంచేత ఈకార్యం క్వాచిత్కం. కాబట్టి అప్రాణివాచకాలకు గూడా అన్నింటికీ ఈకార్యం రాదు. ఊరువల్లెలు, కాలుసేతులు మొ.

## 16. భావద్వంద్వంబునం దొలిపదంబు టవర్ణకంబునకు లోపం బగు. (31)

భావార్థకాలకు ఏర్పడిన ద్వంద్వసమాసం భావద్వంద్వం. 'టవర్ణకం' అనేది భావార్థకా లైన ఇకి మొద లైన కృత్ప్రత్యయాలను కూడా తెలుపుతుంది. టవర్ణకం కృత్తు కావడంవల్ల తన మొద లైనభావార్థకతద్ధితప్రత్యయాలకు ఇక్కడ ప్రసక్తి లేదు. కాగా ఇక్కడ భావార్థం అంటే ధాత్వర్థం.

భావార్థకా లయిన కృదంతశబ్దాలకు ఏర్పడిన ద్వంద్వసమాసంలో మొదటిపదం లోని 'ట' మొ. భావార్థక కృత్ ప్రత్యయానికి నిత్యంగా లోపం వస్తుం దని సూత్రార్థం.

ఔట(అగుట)యును, కామియును అనేఅర్థంలో ఔట, కామి అనేశబ్దాలకు 'ఆచ్ఛికశబ్దంబుతోడ స్త్రీసమంబు' అనే సూత్రంచేత ద్వంద్వసమాసం ఏర్పడి సమాసవిభక్తి

లోపించి, ఔట + కామి అని కాగా ఔట అనేమొదటిపదంలోని ట ప్రత్యయం లోపించి (ఔగామి) ప్రథమావిభక్తిలో బహువచనంతో ఔగాములు.

వినికి + వినమి అనేచోట వినికిలో భావార్థక కృత్ప్రత్యయం 'ఇకి' అయినా అందులో 'కి' వర్ణం ఒక్కటే లోపించడం (విని + వినమి) విశేషం. వినివినములు.

'భావ (ద్వంద్వంబున)' అనడంచేత ద్వంద్వసమాసంలో ఎక్క డైనా ఉత్తరపదం కృదంతం కాకుండా పూర్వపదాంతంలో భావార్థకేతర మైన కృత్ప్రత్యయం ఉంటే దానికి లోపం రాదు.

'తొలిపదంబు' అనడంచేత ఉత్తరపదంలోని (వ్యతిరేక) భావార్థకప్రత్యయం లోపించదు, ఔగాములు.

'టవర్ణకంబు' ఇతరభావార్థకకృత్తుల కుపలక్షకం. కాబట్టి ప్రయోగానుసారంగా అవి లోపిస్తాయి. వినివినములు.

'అగు' అనడంచేత ఈకార్యం నిత్యం. కాబట్టి లోపం రాని 'ఔటగాములు' అనే విధ మైనరూపాలు ఉండవు.

వినివినములు, వచ్చిరాములు మొద లైనచోట్ల మొదటిశబ్దం క్త్వాంతం అని 'ద్వంద్వః కేషాంచి దిష్ట స్స్యాత్ క్త్వార్థశబ్దేన కుత్రచిత్' అనేఅధర్వణలక్షణంద్వారా వ్యాఖ్యాతలు చెప్పారు. వచ్చురాములు, వినువినములు అనేతీరుగా వీటిని భావార్థకాలుగా చూపించినా, చేసిచేయములు ఇత్యాదుల్లో మొదటిది క్త్వార్థకం అనక తప్పదు. ఇక్కడ ఇప్రత్యయం క్త్వార్థాన్ని కాక భావార్థాన్నే బోధించడం గమనించాలి.

ఈద్వంద్వంలో మొదటిశబ్దం (స్వార్థ) భావార్థకం కాగా రెండవశబ్దం వ్యతిరేక భావార్థకం కావడం నియతంగా కనబడుతున్నది. రెండూ వ్యతిరేకభావార్థకాలు కావడం (వినమికనములు) రెండూ భావార్థకాలు కావడం (వినుట, కనుటలు) లేదా వ్యత్యస్తంగా వినమివినుటలు (వినమికనుటలు) ఇత్యాదిగా కానరావు.

ఇంకా జాగ్రత్తగా పరిశీలించి లక్షణం సమగ్రంగా నిర్దుష్టంగా గుర్తించాలి.

## 17. ద్వంద్వంబునం బూర్వపదాంత్యావయవంబునకు లోపం బొండె నగు. (32)

ఉభయ (పూర్వ – ఉత్తర) పదార్థ ప్రధానం అయినసమాసం ద్వంద్వం. పూర్వపదం అంటే సమాసంలో ఆద్యవయవం (మొదటిపదం). 'అంత్యావయవం' అనడంవల్ల ఈద్వంద్వంలో పదంలో రెండు అవయవాలు (భాగాలు) ఉంటా యని తెలుస్తున్నది.

ఒండె – అంటే వికల్పం.

రెండవయవాలు కలిగినపదాలతో ఏర్పడినద్వంద్వసమాసంలో మొదటిపదం యొక్క చివరి (రెండవ) అవయవం వికల్పంగా లోపిస్తుం దని సూత్రానికి అర్థం.

పుట్టున దైనగట్టు, పుట్టుగట్టు. క్రుంకునది ఐన గట్టు క్రుంకుగట్టు, పుట్టుగట్టును, క్రుంకుగట్టును అనేఅర్థంలో 'ఆచ్ఛికశబ్దంబుతోడ స్త్రీసమంబు' అనేసూత్రంచేత ద్వంద్వసమాస మై, విభక్తి లోపించి, పుట్టుగట్టు, క్రుంకుగట్టు. మొదటిపద మైన పుట్టగట్టు అనేదానిలోని చివరిఅవయవం 'గట్టు' అనేదానికి ప్రస్తుతసూత్రంచేత లోపం రాగా పుట్టు + క్రుంకుగట్టు. గసడదవాదేశం వచ్చి ప్రథమావిభక్తిలో బహువచనంతో – పుట్టుగ్రుంకుగట్లు.

ఇలాగే తొవవిందు, తమ్మివిందు – తొవదమ్మివిందు. ఇక్కడ ఏకవచనం విశేషం.

విన్నది + విన్నది – విన్నకన్నది. ఇక్కడ గసడదవాదేశాభావం విశేషం.

'ద్వంద్వంబున' అనడంచేత ఇతరసమాసాల్లో ఈకార్యం లేదు. తొవవిందుసొగసు మొ.

'పూర్వపద' అనడంచేత ఉత్తరపదాంత్యావయవానికి లోపం లేదు. 'పుట్టుగట్టు గ్రుంకులు' అని ఉండదు.

'అంత్యావయవంబునకు' అనడంచేత ఆద్యవయవానికి గానీ మొత్తానికి గానీ లోపం రాదు. 'గట్టుగ్రుంకుగట్లు' అని గానీ క్రుంకుగట్లు అని కానీ కాదు.

'ఒండె' అనడంచేత లోపం వికల్పం. కానీ లోపం రాని 'పుట్టుగట్టు గ్రుంకుగట్లు' అనేవిధ మైనరూపాలు మృగ్యం. ఒండెపదం లేకుంటే బాగుండే దేమో.

పూర్వపదంతోపాటు ఉత్తరపదం గూడా రెండవయవాలు ఉండి, రెండుపదాల్లోనూ రెండవఅవయవం సమానంగా ఉన్నప్పుడే ఈకార్యం జరుగుతుం దనీ లక్ష్యాలనుబట్టి తెలియాలి. లక్షణంలోనే చెప్తే బాగుండేది.

పుట్టునదియును క్రుంకునదియును పుట్టుక్రుంకునవి. పుట్టుక్రుంకునవి యగుగట్లు 'పుట్టుగ్రుంకుగట్లు' అనేవిధంగా సమన్వయించే అవకాశం ఉంది. గసడదవాదేశం (తెలిదామర, నల్లగలువ మొ.) విశేషం. పరిశీలించి నిర్ణయించాలి.

**18. ఒకానొకచో ద్వంద్వంబు మిశ్రంబును, అందలిపూర్వపదంబు క్లీబసమంబునుగఁ గానంబడియెడి.** (33)

సంస్కృతసమశబ్దమూ, ఆచ్ఛికశబ్దమూ కూడినసమాసం మిశ్రం. క్లీబం అంటే

నపుసంకలింగం. దానితో సమ మైనది క్లీబసమం. నపుంసకలింగశబ్దంతో సమ మైనకార్యం (మువర్ణకం మొ.) పొందే (ఆచ్ఛిక) శబ్దం క్లీబసమం.

అరుదుగా ద్వంద్వసమాసం మిశ్రం అయి కనబడుతుంది. అందులో పూర్వపదం క్లీబసమం అయిఉన్నది అని సూత్రానికి అర్థం.

'ఆచ్ఛికశబ్దంబుతోడ స్త్రీసమంబు ప్రాయికంబుగ ద్వంద్వం బగు' అన్నాడు సూరి. బాలవ్యాకరణాన్ని అనుసరించి స్త్రీసమక్లీబసమాలు ఆచ్ఛికాలే. కాబట్టి ద్వంద్వంలో పూర్వోత్తరపదాలు రెండూ ఆచ్ఛికాలే కావాలి. సూరి అలాగే (ఆచ్ఛికద్వంద్వాలనే) ఉదాహరించాడు.

దాన్ని సవరిస్తూ (మిశ్రం) సంస్కృతసమానికి (ఆచ్ఛికంతో) ద్వంద్వం కావడం కూడా ఉం దని ప్రౌఢవ్యాకర్త ఇక్కడ పేర్కొన్నాడు.

అలాగే పైబాలవ్యాకరణసూత్రం ద్వంద్వసమాసంలో పూర్వపదం తఱచుగా స్త్రీసమం కావా లంటే క్లీబసమం గూడా అవుతుం దని మరొకసవరణ.

అవసరమును, అక్కఱయును అనేఅర్థంలో అవసరము అనేసంస్కృత మయినక్లీబసమానికీ అక్కఱ అనేఆచ్ఛికశబ్దంతో ప్రస్తుతసూత్రంప్రకారం మిశ్రద్వంద్వసమాసం ఏర్పడింది. అవసరము + అక్కఱ. 'సమాసవిభక్తికి లోపం బగు' అని ఉత్తరపదవిభక్తి (మాత్రమే?) లోపించి, సంధి జరిగి, అవసరమక్కఱ. ఈసమాసప్రాతిపదికపై ప్రథమావిభక్తిని వివక్షింపగా బహుత్వార్థాన్నిబట్టి బహువచనం వచ్చి, అవసరమక్కఱలు.

'ఒకానొకచో' అనడంచేత మిశ్రద్వంద్వం అరుదు.

'కానంబడియెడి' అనడంచేత కవిప్రయోగాలలో చూచినవాటిని మాత్రమే గ్రహించాలి. 'అవసరమక్కఱలు' ఒక్కటే వ్యాకర్త చూపాడు. మరొకటి మృగ్యం.

'ద్వంద్వంబు' అనడంచేత ఇతరసమాసాలు యథాలక్షణంగా మిశ్రాలు ఉండవచ్చు. ఆబృందము,గుణములప్రోక మొ.

'మిశ్రంబును' అనేచోటిసముచ్చయంచేత పూర్వలక్షణానుగుణంగా ఆచ్ఛిక ద్వంద్వాలు ప్రసిద్ధమే. అన్నదమ్ములు మొ. సంస్కృతానుసారంగా సిద్ధద్వంద్వా లుంటాయి. రామలక్ష్మణులు మొ. ఇంక సాధ్యసాంస్కృతిక (సంస్కృతసమాలతో) ద్వంద్వం ఉండదు.

'అందలిపూర్వపరంబు క్లీబసమంబునుగ' అనడంచేత మిశ్రద్వంద్వంలో పూర్వపదం

క్లీబసమేతరం కాదు. అలాగే ఉత్తరపదం కూడా ఆచ్ఛికమే కావా లనవచ్చు. చూడగా 'అవసరమక్కఱలు' అనేఒక్కదానిని దృష్టిలో ఉంచుకొని ఈసూత్రం చెప్పబడిం దని స్పష్టం.

'అవసరము' అనేపదం సంస్కృతసమం. సంస్కృతసమాన్ని క్లీబసమంగా వ్యవహరించడం సూరిమతవిరుద్ధం. లక్ష్యానుగుణం కూడా కాదు. మువర్ణకాంత మనవచ్చు.

'మిశ్రంబును అందలి' అని స్పష్టతకైనా సూత్రంలోనే విసంధిగా ప్రయోగించడం విలక్షణం.

'సమాసవిభక్తికి లోపం బగు' అనేసూత్రంచేత ఉత్తరపదంలోలాగా పూర్వపదం లోనూ మువిభక్తి లోపించవలసిఉండగా లోపింపకపోవడాన్ని చెప్పవలసిఉంది.

అవసరమును అక్కఱయును అనేఅర్థంలో సముచ్చయార్థకనుశబ్దం ప్రయోగింప బడలే దని గ్రహిస్తే ఇది సమాసమే కాదు.

'అవసరమక్కఱలు' అనేఒక్కదానికోసం ప్రత్యేకసూత్రం చెప్పడంకంటే కఱకంఠాదులవలె గ్రాహ్యంగా చెప్పవచ్చు.

ఇంతకీ ఈప్రయోగం 'గ్రామ్యంబు తత్తజ్జాతివర్ణనంబునం బ్రయోగార్హం బగు' అనేసూత్రానికి ఈవ్యాకర్త లక్ష్యంగా చూపిన 'మొక్కేము సామి' అనేసందర్భంలో తజ్జాతివచనంలోనిది. అచ్చటి అవసరమక్కఱలు సాధింపబూనితే 'మొక్కేము సామి' అనేదాన్ని గూడా సాధించాలి.

ఈసూత్రం అనవసరం. తెలుగులో మిశ్రద్వంద్వాలు ప్రామాణికాలు లేవు.

**19. కొన్నియెడల సప్తమీతత్పురుషంబునందు నవర్ణకంబు నగు.**

సప్తమీవిభక్తి అంతమందు గలిగినశబ్దానికి మీదిపదంతో సమాసం సప్తమీ తత్పురుషం. సప్తమీతత్పురుషంలో 'న' అనేప్రత్యయం కూడా అవుతుం దని సూత్రార్థం. అంటే పూర్వపదంలోని 'న' అనేసప్తమీవిభక్తి కూడా (అందు తోపాటు) ఈసమాసంలో లోపింప దని తాత్పర్యం.

'అంద్వాదుల కలిగాగమంబు సమాసంబునం దగు' అని బాలవ్యాకరణం 'అందు' అనేసప్తమీవిభక్తి లోపించనిసమాసాన్ని ప్రస్తావించింది. 'న' అనేసప్తమీవిభక్తి లోపింపనిసమాసాలు కూడా ఉన్నా యని తెలపడానికి ప్రౌఢవ్యాకర్త యీలక్షణం చెప్తున్నాడు.

చిత్తమునను అనేసప్తమ్యంతశబ్దానికి దుఃఖములు అనేపదంతో తత్పురుషసమాసం కలిగి చిత్తమునను + దుఃఖములు 'సమాసవిభక్తికి లోపం బగు, లట్టునకుఁ గాదు' అనేసూత్రంచేత రావలసినవిభక్తిలోపం ప్రస్తుతసూత్రంచేత పూర్వపదంలో ఉన్న 'న' విభక్తికి రాదు. ఉత్తరపదంలో విభక్తిమాత్రం లోపిస్తుంది. చిత్తమునను + దుఃఖ, 'సమాసంబునయందు ద్రుతంబునకు లోపం బగు' అనేసూత్రంచేత ద్రుతం లోపించి 'చిత్తమునదుఃఖ' ఈసమాసప్రాతిపదికపై ప్రథమావిభక్తిని వివక్షించగా బహుత్వార్థాన్నిబట్టి బహువచనం వచ్చి 'చిత్తమున దుఃఖంబుల్'.

'కొన్నియెడల' అనడంచేత నవర్ణకం లోపింపనిసమాసాలు అరుదు. వీటిని ప్రయోగానుసారంగా గ్రహించాలి. కువలయంబునవారు. నవర్ణకం లోపిస్తే కువలయంబువారు.

'నవర్ణకంబును' అనేచోటిసముచ్చయంచేత అందు లోపింపనిసమాసాలు గ్రహింపబడతాయి. కువలయంబునందలివారు మొ.

సప్తమియం దైన యీ'నవర్ణకం' అంతకుముందు అక్కడ ఉన్నదే. 'నవర్ణకంబు నగు' అంటూ 'అగు' అని విధించడం సరికాదు. సమాసంలో లోపించవలసిన ఈవిభక్తి లోపించడం లేదు. కాబట్టి లోపాభావాన్ని చెప్పడం ఉచితం.

# 6. తద్ధితపరిచ్ఛేదం

**1. తద్ధితప్రత్యయములు పరంబు లగునపుడు పదంబుల డువర్ణ కాదులకు లోపం బగు.** (1)

ప్రథమ మొద లైనవిభక్తులు చివర కలిగిననామపదాలమీద మతుప్ మొదలైన అర్థాలలో వచ్చేప్రత్యయాలు తద్ధితప్రత్యయాలు. (తద్ధితం అంటే ప్రయోగానికి హిత మైనది అని అర్థం.) తద్ధితప్రత్యయం పరంగా ఉంటే దానికి పూర్వంలో ఉన్నపదంచివరి డుజ్ మొద లైనప్రథమాదివిభక్తిప్రత్యయాలకు లోపం వస్తుంది అని సూత్రానికి అర్థం.

బాలవ్యాకరణంలో తద్ధితప్రత్యయాలు పరంగా ఉండగా 'సమాసవిభక్తికి లోపం బగు, లట్టునకుఁ గాదు' అనేసూత్రంచేతనే విభక్తులకు లోపం చేసుకోవలసిఉంది. ప్రౌఢవ్యాకర్త స్పష్టంగా చెప్పేఉద్దేశంతో ప్రత్యేకంగా ఇలా సూత్రించాడు.

ఆఁకొన్నవానియొక్క భావం అనేఅర్థంలో భావార్థంలో 'తన' అనేతద్ధితప్రత్యయం వచ్చి, ఆఁకొన్నవానియొక్క+తన అని ఉండగా 'తన' అనేతద్ధితప్రత్యయం పరంగా ఉండగా దానికి పూర్వంలో ఆఁకొన్నవానియొక్క అనేపదంలో చివర ఉన్న యొక్క అనేవిభక్తిప్రత్యయం ప్రస్తుతసూత్రంచేత లోపించి, ఆఁకొన్నవానితనము అని అవుతుంది.

'తద్ధితప్రత్యయములు' అనటంచేత ఇతరప్రత్యయం పర మైతే లోపం రాదు. తద్ధితములు అన్నా చాలు. ప్రత్యయములు అనటం స్పష్టతకే.

'పదంబులడువర్ణకాదులకు' అంటే ప్రథమాదివిభక్తులు అన్నీ యథావకాశంగా లోపిస్తాయి. 'పదంబుల' అనేదళం స్పష్టతకే. డువర్ణకాదులు కలిగినవి పదాలు కానివి ఉండవు గదా.'డువర్ణకాదులు' అన్నప్పటి ఆదిశబ్దంచేత నామవిభక్తులను మాత్రమే గ్రహించాలి. ప్రత్యయేతరం లోపిస్తుం దనే అర్థం వచ్చే అవకాశం ఉన్నా, విభక్తులకంటె వేరైనవి లోపించటం వ్యాకర్త ఉద్దేశించిన ఆధారం లేదు.

'అగు' అనటంచేత విభక్తిలోపం నిత్యం గాబట్టి తద్ధితప్రత్యయం పరంగా ఉండగా విభక్తి లోపించనిరూపం ఉండదు. అంటే ఆకొన్నవానియొక్క తనము ఇత్యాదిగా విభక్తి నిలిచిఉన్నరూపం ఉండదు.

'తద్ధితంబులు పరంబు లగునపుడు విభక్తికి లోపం బగు' అని చెప్తే సరిపోయే దనిపిస్తుంది.

ఈలోపం బాలవ్యాకరణంప్రకారం సిద్ధిస్తునే ఉన్నది కాబట్టి చెప్పకున్నా నష్టం లేదు.

**2. తనవర్ణకంబు పరం బగునపుడు తచ్ఛబ్దార్థమునకు లోపంబు విభాష నగు.** (2)

'తనవర్ణకంబు త్వార్థంబునం దగు' అనేసూత్రంచేత త్వార్థంలో అంటే భావార్థంలో తన అనేప్రత్యయం వస్తుంది. తత్ అనేశబ్దంయొక్క అర్థం కలిగినతెలుగుశబ్దం తచ్ఛబ్దార్థం. ఇక్కడ అది 'వానియొక్క' లేదా 'దానియొక్క' అనేవిధంగా ఉంటుంది.

తన అనేతద్ధితప్రత్యయం పరంగా ఉండగా దానికి పూర్వంలో ఉన్న తచ్ఛబ్దార్థకాలైన వాని(యొక్క), దాని(యొక్క) అనేశబ్దాలు లోపిస్తా యని సూత్రానికి అర్థం.

ఆఁకొను అనేధాతువునుండి క్తవదర్థంలో ఏర్పడినవిశేషణరూపం ఆఁకొనిన– ఆఁకొన్న – అనేది. ఈధాతుజవిశేషణం మీద విభక్తివివక్షలో తచ్ఛబ్దం చేరి మహదర్థంలో షష్ఠీవిభక్తి ఏకవచనంలో 'ఆకొన్నవానియొక్క' అని అవుతుంది.

ఈషష్మ్యంతశబ్దంమీద త్వార్థంలో తనప్రత్యయం వచ్చి, 'ఆకొన్నవానియొక్క+తన' అని ఉండగా, 'తద్ధితప్రత్యయములు పరంబు లగునపుడు పదంబులడువర్ణకాదులకు లోపంబు బహుళంబుగా నగు' అనేసూత్రంచేత 'యొక్క'విభక్తి లోపించి, 'ఆకొన్నవాని+తన' అని ఉండగా ప్రస్తుతసూత్రంచేత తదర్థక మైన 'వాని' అనేశబ్దం లోపించి 'ఆకొన్నతన' అని అవుతుంది. తద్ధితాంత మైన ఈప్రాతిపదికం క్లీబసమం కాబట్టి, ప్రథమైకవచనంలో మువర్ణకం వచ్చి, 'ఆకొన్నతనము' అనేరూపం సిద్ధిస్తుంది.

'విభాష' అనటంచేత తదర్థకమైన 'వాని' అనేశబ్దం లోపించటం వికల్పం కాబట్టి, లోపం రానిపక్షంలో 'ఆకొన్నవానితనము' అనేవిధంగా 'వాని' అనేతచ్ఛబ్దం నిలిచి ఉంటుంది.

ఇలాగే 'ఓర్వలేనిదాని(యొక్క)+తన' అని ఉండగా ప్రస్తుతసూత్రంచేత 'దాని' అనే అమహత్తచ్ఛబ్దార్థం లోపించగా – 'ఓర్వలేనితనము'. లోపం రానిపక్షంలో 'ఓర్వలేనిదానితనము'.

'తనవర్ణకంబు పరం బగునపుడు' అనటంచేత ఇతరప్రత్యయం పర మైనపుడు తదర్థకం లోపించదు. ఆకొన్నవాఁడు. ఇక్కడ ప్రథమైకవచనం అయిన డుజ్ప్రత్యయం పరంగా ఉండగా తచ్ఛబ్దం లోపించలేదు. ఇలాగే 'ఆకొన్నవానిని' ఇత్యాది.

'తచ్ఛబ్దార్థమునకు' అనటంచేత తచ్ఛబ్దంకంటె వేరైనశబ్దం ఉంటే అది లోపించదు. ఉదా. ఆకొన్నరామునితనము, ఓర్వలేనిఆడుఁదనము మొ. ఈఅర్థంలో ఆకొన్నతనము, ఓర్వలేనితనము ఇత్యాదిగా తచ్ఛబ్దం లోపించినరూపం ఉండదు.

'మడిసెడుదడములు' ఇత్యాదిరూపాలనుబట్టి ఇటువంటిస్థలాలలో తచ్ఛబ్దమే లే దని చెప్పవచ్చు. కాగా తచ్ఛబ్దలోపవిధానం ప్రయోజనం మృగ్యం.

**3. మతుబర్థంబునం జెంచునకుఁ దవర్ణకంబు పరం బగుచో నిత్వంబు నగు.** (4)

మతుప్ అనేప్రత్యయం అర్థం మతుబర్థం. కలది, కలవాడు అని స్థూలంగా దీని అర్థం. 'ఇత్వంబును' అనేచోటిసముచ్చయంచేత ఇత్వం రాకపోవటం కూడా ఉన్నది అనేఅర్థం సిద్ధిస్తుంది. అంటే ఇత్వం అరుదుగా వస్తుం దని లేదా వికల్పం అని అర్థం. ఇత్వం ఏకాల్లు కాబట్టి 'అలో న్త్యస్య' అనేసంస్కృతపరిభాష ననుసరించి, అంత్యవర్ణంస్థానంలో అంటే ఇక్కడ చెంచుశబ్దంలోనిచివరిఉత్వంస్థానంలో వస్తుంది.

మతుబర్థంలో వచ్చిన 'త' అనేప్రత్యయం పరంగా ఉండగా దానికి పూర్వంలో ఉన్న 'చెంచు' అనేశబ్దంలోనిచివరిఉత్వంస్థానంలో వికల్పంగా ఇత్వం వస్తుం దని

సూత్రార్థం.

చెంచు అనేశబ్దంమీద 'తవర్ణకంబు కులవాచకంబునకు స్త్రీ వాచ్యం బగునపుడు మతుబర్థంబునం దగు' అనేసూత్రంచేత 'త'ప్రత్యయం వచ్చి, 'చెంచు+త' అని ఉండగా 'తద్ధితప్రత్యయములు పరంబు లగునపుడు –' అనేసూత్రంచేత చెంచుశబ్దంమీది ప్రథమైకవచనం లోపించి, చెంచు+త. ప్రస్తుతసూత్రంచేత 'చెంచు' లోని ఉత్వంస్థానంలో ఇత్వం వచ్చి, చెంచి+త. తద్ధితాంత మైనఈప్రాతిపదిక స్త్రీసమం కాబట్టి 'స్త్రీలింగంబుల..' అనేసూత్రంచేత ప్రథమైకవచనం లోపించి, చెంచిత' అనే ప్రథమైకవచనాంతపదం ఏర్పడుతుంది. ఇతరవిభక్తులలో చెంచితలు, చెంచితను.మొ.

'మతుబర్థంబున' అనటం స్పష్టతకే. ఈకార్యం వచ్చేది తవర్ణకం పరంగా ఉన్నపుడు. ఆ 'త' ప్రత్యయం వచ్చేది మతుబర్థంలో మాత్రమే. కాబట్టి సూత్రంలో మతుబర్థంబున అనేదళం లేకపోయినా వచ్చేనష్టం ఏమీ లేదు.

'చెంచునకు' అనటంచేత ఇతరశబ్దంలో ఈకార్యం లేదు. మాలెత, కొఱవత.మొ.

'తవర్ణకంబు పరం బగుచో' అనటంచేత తవర్ణకం పరంగా లేకపోతే ఈకార్యం రాదు. చెంచువాఁడు.

'ఇత్వంబును' అనేసముచ్చయంచేత ఇత్వం రాకపోవచ్చు. ఇత్వం రానిపక్షంలో 'తవర్ణకంబు పరం బగుచో నొకానొకచో నెత్వంబు చూపట్టెడు' అనేసూత్రంచేత ఎత్వం వచ్చి, 'చెంచెత' అని అవుతుంది.

ఇత్వం వస్తుం దనటానికి బల మైనప్రమాణం పరిశీలించాలి.

**4. చెడుగు దుడుకు నిడుపులకుఁ బుంస్త్వంబున మతుబర్థం బకారం బగు.** (5)

పుంస్త్వంబున అంటే పురుషుడిని బోధించేటపుడు అని అర్థం. మతుప్ అనేప్రత్యయం యొక్క అర్థం మతుబర్థం. కలది, కలవాడు అని స్థూలంగా దీనికి అర్థం. 'అ' కారము అంటే 'అ' అనేతద్ధితప్రత్యయం అని అర్థం.

పురుషుడిని బోధించేసందర్భంలో మతుబర్థంలో చెడుగు, దుడుకు, నిడుపు అనేశబ్దాలకు 'అ' అనేప్రత్యయం వస్తుం దని సూత్రానికి అర్థం.

'చెడుగు' అనే ప్రథమైకవచనాంతశబ్దంమీద (చెడుగు) కలవాడు అనేఅర్థంలో ప్రస్తుతసూత్రంచేత 'అ' ప్రత్యయం వచ్చి, చెడుగు+అ. 'తద్ధితప్రత్యయములు పరంబు లగునపుడు' అనేసూత్రంచేత దీనిమీదప్రథమావిభక్తి ఏకవచనం లోపించి,

'అంద్వవగాగమంబులం దప్ప' అనేసూత్రంచేత సంధి జరిగి, 'చెడుగ'. తద్ధితాంత మైన ఈశబ్దం ప్రాతిపదికం. 'ఆచ్ఛికశబ్దంబు లెల్ల' అనేసూత్రంలోని తఱుచుశబ్దంచేత అప్రత్యయాంతా లయిన ఈశబ్దాలు పుంలింగతుల్యాలు. కాబట్టి ప్రథమైకవచనంలో 'పుంలింగ మగుమహద్వాచకమునకు డు జగు' అనేసూత్రంచేత డుజ్ప్రత్యయం వచ్చి 'చెడుగఁడు' అనేరూపం సిద్ధిస్తుంది. పుంలింగతుల్యతచేత వీటికి డుజు వస్తుంది. కాబట్టి వీటిని మగాదులలో చేర్చుకోవలసినఅవసరం లేదు. 'అ' అనేనిర్దేశంవల్ల అత్వానికి ఉత్వం రాదు. కాబట్టి ఉత్వనివారణకు కూడా వీటిని మగాదులలో చేర్చుకోవలసినఅవసరం లేదు.

ఇలాగే దుడుకఁడు, నిడుపఁడు, చెడుగని ఇత్యాది.

'చెడుగు దుడుకు నిడుపులకు' అనటంచేత ఈమూడింటికంటె వేరైనశబ్దానికి ఈకార్యం లేదు. మంచివాఁడు, కుఱుచవాఁడు. మొ.

'పుంస్త్వంబున' అనటంచేత స్త్రీతిర్యగ్జడాలను బోధించేటపుడు ఈకార్యం రాదు. నోరు దుడుకు. ఆకట్టు నిడుపు. మొ. ఓసి చెడుగ. చెడు గీపాఁపపుర్వు. దుడుకుఁ గోఁతి. మొ.

**5. కరవర్ణకంబు నాయఁకశబ్దమునకు భావంబునం దగు.** (12)

భావము అంటే 'ప్రకృతిజన్యబోధంబునందు ప్రకారంబు'. ఈఅర్థంలో సంస్కృతంలో త్వ(తల్) అనేప్రత్యయం వస్తుంది. అందుచేత దీన్ని తెలుగులో త్వార్థం అని కూడా వ్యవహరిస్తారు. 'త్వ' ప్రత్యయంలాగానే సంస్కృతానుసారంగా తెలుగులోని త్వార్థకాలు గూడా షష్ఠ్యంతంమీదనే వస్తాయి.

'నాయఁక' అనేశబ్దానికి త్వార్థంలో 'కర' అనేప్రత్యయం వస్తుం దని సూత్రార్థం. ఈ'నాయఁక'శబ్దంలోని అరసున్ననుబట్టి ఇది సంస్కృత మైన 'నాయక'శబ్దం కా దనీ, అచ్చతెలుగుశబ్ద మనీ గ్రహించవచ్చు.

'నాయఁకునియొక్క భావం' అనేఅర్థంలో 'నాయఁకునియొక్క' అనేషష్ఠ్యంతంమీద ప్రస్తుతసూత్రంప్రకారం 'కర' అనేప్రత్యయం వచ్చి, 'నాయఁకునియొక్క+కర'. 'తద్ధితప్రత్యయములు పరము లగునపుడు' అనేసూత్రంచేత యొక్క విభక్తి లోపించి, నాయఁకుని+కర. ఇక్కడ 'కుని' అనేభాగం లోపించవలసిఉంది. ఆలోపాన్ని వ్యాకర్త చెప్పలేదు. కాబట్టి 'ఆచ్ఛికసమాసంబులం దఱచుగ వర్ణలోపాగమాదేశవికారంబులు నిత్యవైకల్పికములుగాఁ బెక్కులు గానంబడియెడి' అనేసూత్రంచేత లోపం చేసుకోవాలి. ఇలా 'కుని' లోపించగా, నాయఁ+కర=నాయఁకర. ఈతద్ధితాంతప్రాతిపదికం

క్లీబసమం. కాబట్టి 'అమహన్నపుంసకముల కదంతములకు ము వర్ణకం బగు' అనేసూత్రంచేత ము వర్ణకం వచ్చి, 'నాయఁకరము' అని అవుతుంది. నాయకత్వం అని దీనికి అర్థం.

'నాయఁకశబ్దమునకు' అనటంచేత ఇతరశబ్దానికి ఈకార్యం లేదు.

'భావంబునందు' అనటంచేత ఇతరార్థంలో ఈప్రత్యయం లేదు.

'అగు' అనటంచేత ఈకార్యం నిత్యం. కాబట్టి ఈప్రత్యయం రానిరూపం ఉండదు.

ఇక్కడ ప్రత్యయం 'ర' అని కొందరు, 'అర' అని కొందరు, 'కరజ్' అని కొందరు విమర్శకులు అనేకవిధాలుగా ఊహించారు. 'కుని' అనేభాగం లోపించేఅవకాశం లేకపోవటమే దీనికి కారణం. మగఁటిమ్యాదులలోనిదిగా గ్రహించి, ఇక్కడ ప్రయోగానుసారంగా 'కర' ప్రత్యయం వచ్చి, దానికి ముందరి 'కుని' లోపించినట్లుగా గ్రహించవచ్చు.

ఈలక్షణం సమగ్రంగా రూపసాధకం కావటం లే దని అంగీకరించకతప్పదు.

**6. టివర్ణకం బొందునంత్యవర్ణంబునకు భావంబునం దగు.** (15)

భావము అంటే 'ప్రకృతిజన్యబోధంబునందు ప్రకారంబు'. ఈఅర్థంలో సంస్కృతంలో త్వ(తల్) అనేప్రత్యయం వస్తుంది. అందుచేత దీన్ని తెలుగులో త్వార్థం అని కూడా వ్యవహరిస్తారు. 'త్వ' ప్రత్యయంలాగానే సంస్కృతానుసారంగా తెలుగులోని త్వార్థకాలు గూడా షష్ఠ్యంతంమీదనే వస్తాయి. కాని సూత్రంలో 'ఒండు నంత్య వర్ణంబునకు' అన్నసామర్థ్యంచేత ఈ'టి'వర్ణకం మాత్రం షష్ఠ్యంతం మీద కాక 'ఒండు' అనేప్రథమాంతంమీదనే వస్తుం దని చెప్పుకోవాలి. 'అంత్యవర్ణంబునకు' అనేచోట షష్ఠిచేత చివరివర్ణంస్థానంలో అని అర్థం సిద్ధిస్తుంది. వర్ణకం అంటే ప్రత్యయం కాబట్టి పరంగా రావలసిఉంది. దానిని వారించటానికి 'అంత్యవర్ణంబునకు' అని ప్రత్యేకంగా చెప్పబడింది. డువర్ణంస్థానంలో విధించినసామర్థ్యంచేత ఇక్కడ తద్ధితప్రత్యయపరకతలో ముందరిపదం డువర్ణకానికి లోపం రా దనేఇంకోవిషయం కూడా గ్రహించాలి.

భావార్థంలో 'ఒండు' అనేశబ్దంయొక్క చివరివర్ణంస్థానంలో 'టి' అనేప్రత్యయం ఆదేశంగా వస్తుం దని సూత్రానికి అర్థం.

ఒంటియొక్క భావం అనేఅర్థంలో 'ఒండు' అనేశబ్దంలో చివరి 'డు'వర్ణంస్థానంలో ప్రస్తుతసూత్రంచేత 'టి' అనేది ఆదేశంగా వచ్చి, 'ఒంటి'. తద్ధితాంత మైన

ఈప్రాతిపదికం స్త్రీసమం. కాబట్టి 'స్త్రీలింగంబులప్రథమైకవచనంబునకు లోపం బగు' అనేసూత్రంచేత దీనిపైని ప్రథమైకవచనం లోపించి, ఒంటి అనేపదం ఏర్పడుతుంది.

'ఒండు' అనటంచేత ఈకార్యం ఒండుకంటె ఇతరశబ్దానికి రాదు.

'అంత్యవర్ణంబునకు' అనటంచేత ప్రత్యయ మైనా చివరిఅక్షరానికి ఆదేశంగా వచ్చి దానికి ముందున్న అక్షరాలు అన్నీ (ఒం) మిగులుతాయి.

నిజానికి 'అంత్యవర్ణంబునకు' అంటే డువర్ణంలో చివర ఉన్న ఉత్వంస్థానంలో మాత్రమే టివర్ణం వచ్చి, డువర్ణంలోని డకారం కూడా నిలిచిఉండాలి. అపుడు 'ఒండ్టి' అనేవిధంగా అపరూపం కావలసిఉంది. కాగా లక్ష్యానుసారంగా అంత్యవర్ణంబునకు అన్నా, అంత్యాక్షరం (డు) మొత్తానికి వస్తుం దని గ్రహించాలి.

ఈలక్షణంలో చెప్పినదానికంటె ఊహించుకోవలసినఅంశాలే అధికంగా కనబడుతున్నాయి. లక్షణం లక్ష్యసాధకం కాదు. ఒంటిశబ్దం అర్థం వగైరా విషయాలను జాగ్రత్తగా పరిశీలించి లక్షణం తగినవిధంగా నిర్దుష్టంగా చెప్పటం అవసరం.

**7.పరిమాణార్థంబునం బ్రథమైకవచనంబునంద యెఁడువర్ణకం బగు.**(16)

పరిమాణము అనగా కొలత. ఆఅర్థాన్ని తెలియజేసేసందర్భంలో పరిమాణవాచక శబ్దాలమీద ప్రథమావిభక్తి యేకవచనంలో మాత్రమే 'ఎఁడు' ప్రత్యయం వస్తుం దని సూత్రానికి అర్థం.

ఈసూత్రం ఎఁడు ప్రత్యయాన్ని విధించటంలేదు. ఎఁడుప్రత్యయయం ఎప్పుడు వస్తుందో చెప్తున్నది. 'మానార్థంబున కేకత్వంబునం దెఁడువర్ణకం బగు' అని చిన్నయ సూరి ఏకత్వంలో వస్తుం దన్నాడు. ఏకత్వంలో అంటే అన్ని విభక్తులలోనూ ఏకత్వంలో వస్తుం దని అర్థం అవుతుండగా అలా కా దని ప్రథమావిభక్తిలో మాత్రమే (ఏకత్వంలో) వస్తుం దని ఈసూత్రం నియమిస్తున్నది.

'విశేష్యంబు భిన్నవిభక్తివచనకం బయ్యు మానార్థకములమీఁదఁ బరిమాణార్థంబు నం బ్రథమైకవచనంబునందే యెఁడువర్ణకంబు వచ్చు నని యర్థము' అని సూత్రార్థాన్ని సూత్రకర్తే వివరించాడు.

విశేష్యం ప్రథమైకవచనంకంటె వేరైనవిభక్తివచనాలలో ఉన్నా, మానార్థక మైన విశేషణం మీద ప్రథమావిభక్తి ఏకవచనంలో మాత్రమే ఎఁడుప్రత్యయం వస్తుంది.

మూరెఁడు తోఁక. ఇక్కడ 'తోక' విశేష్యం. ప్రథమైకవచనాంతం. దాన్నిబట్టి మానవాచకం ఐన 'మూర' అనేవిశేషణం కూడా ప్రథమైకవచనాంత మవుతుంది. ప్రస్తుతసూత్రాన్ని బట్టి పరిమాణార్థంలో ఎఁడు ప్రత్యయం రాగా, మూర+ఎఁడు. 'తద్ధితప్రత్యయములు పర మగునపుడు పదంబులడువర్ణకాదులకు లోపం బగు' అని మూరశబ్దంమీది ప్రథమైకవచనం లోపించి, మూర+ఎఁడు. 'అంద్వవ గాగమంబులం దప్ప' అనేసూత్రంచేత సంధి జరిగి, మూరెఁడు. తద్ధితాంత మైన ఈప్రాతిపదికం స్త్రీసమం కాబట్టి 'స్త్రీలింగంబుల' అనేసూత్రంచేత ప్రథమైకవచనం లోపించి, మూరెఁడు.

ఇలాగే తూమెఁడు బియ్యము. ఇక్కడ బియ్యము బహుత్వార్థంలో ఉన్నది. కాని శబ్దం (ప్రథమావిభక్తిలో) ఏకవచనాంతం. కాబట్టి ఎఁడు ప్రత్యయం వచ్చి, తూమెఁడు అని అయింది.

పుట్టెఁడు తవిదలు. ఇక్కడ తవిదలు అనేవిశేష్యం (ప్రథమా) బహువచనాంతం అయినా, దానికి విశేషణ మైనపుట్టిశబ్దం ఏకవచనాంతం అయింది. కాబట్టి ఎఁడు ప్రత్యయం వచ్చింది.

పుట్టెఁడు తవిదలకు. ఇక్కడ తవిదలకు అనేవిశేష్యం షష్ఠీవిభక్తిలో, బహువచనంలో ఉన్నది. పుట్టి అనేవిశేషణం షష్ఠికి ప్రథమ, బహువచనానికి ఏకవచనం వచ్చి, ప్రథమైకవచనంలో ఉండటంచేత 'ఎఁడు' ప్రత్యయం వచ్చింది.

'ప్రథమైకవచనంబునంద' అనటం(చివరిఅవధారణార్థకమైనఅకారం)చేత ఇతరవిభక్తివచనాలమీద ఎఁడుప్రత్యయం రాదు. గింజలు రెండుపుట్లు, ఇక్కడ బహువచనం కావటంచేత (పుట్లు+ఎఁడు) రాలేదు. పుట్టికి తవిదలకు. 'పుట్టికి' అనేది ప్రథమావిభక్తి కాకపోవటంచేత 'ఎఁడు' రాలేదు.

## 8. దఘ్నార్థంబునం దత్సమపదంబుమీఁదను బంటివర్ణకంబు గానంబడియెడి. (17)

దఘ్నచ్ ప్రత్యయంవర్ణకంయొక్క అర్థం దఘ్నార్థం. ఇది నీరు మొద లైనవాటిలోతు పరిమాణాన్ని తెలియజేస్తుంది.

దఘ్నార్థంబున బంటికొలఁదు లగు' అని బాలవ్యాకరణం దఘ్నార్థంలో బంటి, కొలఁది అనేప్రత్యయాలను విధించింది. 'తన' కంటె వే రయినతద్ధితప్రత్యయాలను చిన్నయసూరి అచ్ఛికశబ్దాలమీద మాత్రమే ఉదాహరించాడు. అలాగే బంటి, కొలఁదులను గూడ అచ్చతెలుగుశబ్దాలమీద మాత్రమే చూపగా, వీటిలో బంటి మాత్రం

సంస్కృతసమశబ్దాలమీద కూడా కవిప్రయోగాలలో కనబడుతున్న దని ఈసూత్రం చెప్తున్నది.

ఈదఘ్నార్థకప్రత్యయాలు తెలుగులో షష్ఠ్యంతం మీద వస్తాయి. కాగా కటియొక్క లోతు పరిమాణము గలది అనేఅర్థంలో కటి అనేసంస్కృతసమశబ్దంమీద ప్రస్తుత సూత్రంచేత బంటి ప్రత్యయం వచ్చి, కటియొక్క+బంటి. 'తద్ధితప్రత్యయములు పర మగునపుడు' అనేసూత్రంప్రకారం యొక్క విభక్తి లోపించి, కటిబంటి. తద్ధితాంత మైన ఈప్రాతిపదికం స్త్రీసమం కాబట్టి ప్రథమైకవచనం లోపించి, కటిబంటి.

'దఘ్నార్థంబున' అనటంచేత ఇతరార్థాలలో ఈప్రత్యయం రాదు.

'తత్సమపదంబులమీఁదను' అనేచోటిసముచ్చయార్థకనుశబ్దంచేత పూర్వలక్షణాను గుణంగా ఆచ్ఛికశబ్దాలమీద ఎలాగూ వస్తుంది. మొకాలిబంటి మొ.

'బంటి' అనటంచేత ఇతరప్రత్యయాలు సంస్కృతసమాలమీద రావు. కటికొలఁది అనేవిధంగా కొలఁదిప్రత్యయం కూడ తత్సమాలమీద రాదు.

'కానంబడియెడి' అనటంచేత కవిప్రయోగాలలో చూసినచోట్ల మాత్రమే సంస్కృతసమాలమీద బంటి ప్రత్యయాన్ని గ్రహించాలి. స్వేచ్ఛగా తత్సమాలమీద బంటికూడా చేయగూడదు.

## 9. ఒకానొకచో మతుబర్థంబున నవర్ణకంబు చూపట్టెడి. (19)

మతుప్ అనేప్రత్యయం యొక్క అర్థం మతుబర్థం. కలది, కలవాడు అని స్థూలంగా దీనికి అర్థం. అరుదుగా కొన్నిస్థలాలలో మతుప్ అనేప్రత్యయం అర్థంలో 'న' అనేప్రత్యయం వస్తుంది అని సూత్రానికి అర్థం. మతుబర్థకం ప్రథమాంతశబ్దం మీద వస్తుంది.

దివ్యతేజంబు అనేప్రథమాంతం మీద మతుబర్థంలో ప్రస్తుతసూత్రంచేత 'న' అనేప్రత్యయం వచ్చి, 'దివ్యతేజంబున'. 'తద్ధితప్రత్యయములు పర మగునపుడు' అనేసూత్రంచేత ప్రథమైకవచనం లోపించవలసిఉంది. కాని దివ్యతేజంబునవాఁడు అనేప్రయోగసామర్థ్యంచేత లోపించ దని గ్రహించాలి. 'దివ్యతేజంబున' అనే తద్ధితప్రత్యయాంతం అయినప్రాతిపదికం మీద విభక్తివివక్షలో తచ్ఛబ్దం అనుప్రయుక్త మవుతుం దని గ్రహించాలి. ప్రథమావిభక్తి ఏకవచనంలో దీనిమీద తచ్ఛబ్దం చేరి, 'దివ్యతేజంబునవాఁడు' అని అవుతుంది. దీనికి దివ్యతేజము గలవా డని అర్థం.

'ఒకానొకచో' అనుటచే మతుబర్థంలో నవర్ణకం రావటం అరుదు.

'చూపట్టెడి' అనటంచేత కవిప్రయోగాలలో ఉన్నదానిని మాత్రమే గ్రహించాలి. దీనికి మరొక ఉదాహరణం వ్యాకర్త చూపలేదు. ఆచ్ఛికశబ్దాలమీద వస్తుం దనటానికి ప్రమాణం మృగ్యం.

'న' అనేఈతద్ధితప్రత్యయం పరంగా ఉండగా ముందరిప్రథమావిభక్తి లోపించక పోవటం, ఈనవర్ణకాంతం మీద విభక్తివివక్షలో తచ్ఛబ్దం చేరటం, తత్సమశబ్దంమీద (మాత్రమే?) రావటం మొద లైనకారణాలనుబట్టి ఇది తద్ధితప్రత్యయం అని చెప్పటం ఉచితం కా దేమో ననిపిస్తుంది. సంబంధార్థంలో సర్వశబ్దాలు తచ్ఛబ్దంతో సమాసం పొందుతా యని బాలవ్యాకరణం చెప్పింది. అలా ఏర్పడిన 'దివ్యతేజంబు(యొక్క) వాడు' అనేషష్ఠీసమాసంలో నగాగమం వచ్చి, ఇటువంటిరూపాలు ఏర్పడతా యని వ్యాఖ్యాతలు భావించారు.

# 7. క్రియాపరిచ్ఛేదం

## 1. తద్ధర్మార్థకవిశేషణం బసహాయతం త్రికాలవాచి యగు. (1)

తద్ధర్మం అంటే ధాతువుధర్మం. ఆఅర్థాన్ని బోధించేవిశేషణం తద్ధర్మార్థకవిశేషణం. 'తృవర్ణకార్థంబునం దెడియెడువన్నియ లగు, వానికి లోపంబు బహుళంబుగా నగు' అనేసూత్రాలప్రకారం ధాతువుమీద ఎడి, ఎడు, వాటికి లోపం వచ్చిన– 'వచ్చెడి, వచ్చెడు, వచ్చు' అనేరీతిరూపాలు తద్ధర్మార్థకవిశేషణాలు. త్రికాలము లంటే భూత, భవిష్యద్, వర్తమానాలు. త్రికాలవాచి అంట పైత్రికాలాలను తెలిపేది.

అసహాయస్థితిలో తద్ధర్మార్థకవిశేషణం భూత, భవిష్యత్, వర్తమానకాలాలు మూడింటిని సందర్భానుసారంగా తెలియజేస్తుంది అని సూత్రానికి అర్థం.

అధర్వణుడు తద్ధర్మార్థాన్ని గురించి చెప్తూ 'భూతాద్యవిషయౌ' అన్నాడు. దీనినిబట్టితద్ధర్మార్థం భూతభవిష్యద్వర్తమానార్థాలను తెలియజేయ దని అర్థం అవుతున్నది. దానివల్ల తద్ధర్మార్థకవిశేషణం గూడా భూతాద్యర్థాలను తెలిపేఅవకాశం లేకపోతుండగా ప్రౌఢవ్యాకర్త ఈలక్షణం చేశాడు.

'వారి అనువయించు సితకృష్ణతంతురాజితతంత్రము' ఇక్కడ 'అనువయించు' అనే తద్ధర్మార్థకవిశేషణం 'అనువయించుచున్న' అనేవిధంగా వర్తమానార్థాన్ని బోధిస్తున్నది.

'నాపడుప్రయాసము' ఇక్కడ 'పడు' అనేతద్ధర్మార్థకవిశేషణం 'పడినప్రయాసలు'

అనేవిధంగా భూతార్థాన్ని బోధిస్తున్నది. ఇలాగే చేయుదుండగములు- చేసిన దుండగములు. మొ.

'జనమేజయు చేయుసర్పయాగము' ఇక్కడ 'చేయు' అనేతద్ధర్మార్థకవిశేషణం 'చేయఁగల' అనేవిధంగా భవిష్యదర్థాన్ని బోధిస్తున్నది.

'తద్ధర్మార్థకవిశేషణంబు' అనటంచేత ఇతరవిశేషణాలు ఈవిధంగా మూడు కాలాలను బోధించవు. 'అనువయించుచున్న' అనేభవచ్ఛత్రర్థకవిశేషణం భూతభవిష్య దర్థాలను బోధించదు. 'పడిన' అనేక్తవదర్థకవిశేషణం భవిష్యద్వర్తమానార్థాలను బోధించదు. 'చేయఁగల' అనేభావిశత్రర్థకవిశేషణం భూతవర్తమానార్థాలను బోధించదు. ఇలాగే ఇతరాలు.

'అసహాయతన్' సహాయతలో తద్ధర్మార్థకవిశేషణం కూడా మూడుకాలాలను బోధించదు. అంటే 'అనువయించెడి, చేసెడు' అనేవిధంగా ఎడి,ఎడుప్రత్యయాలతో గూడిఉన్నపుడు భూతాద్యర్థాలను తెలపదు. అని అర్థం కావచ్చు.

**2. మహద్బహుకర్తృకక్రియకు నేకవచనంబు విభాష నగు.** (6)

'స్త్రీతిర్యగ్జడభిన్నంబులును వానివిశేషణంబులును మహత్తు లనంబడు'ను. ఒకటికంటె ఎక్కువ కర్తలు గలిగినక్రియ బహుకర్తృకక్రియ.

మహత్తు లై, ఏకవచనాంతాలు అయిననకర్తలు అంటే కర్తృవాచకా లయినపదాలు ఒకటికంటె ఎక్కువగా గలిగినక్రియకు వికల్పంగా ఏకవచనం వస్తుం దని సూత్రార్థం.

కర్తలు అనేకం కావటంచేత బహుత్వార్థాన్నిబట్టి క్రియకు బహువచనం రాగా ఆబహువచనానికి ఏకవచనం వస్తుం దని ఈసూత్రం చెప్తున్నది.

'చెప్పనివాడును, సత్యము చెప్పనివాడును నరకపంకమున 'పడున్'. ఇక్కడ పడుట అనేక్రియకు చెప్పనివాడు, సత్యం చెప్పనివాడు అనేవి రెండు కర్తలు. కాబట్టి కర్తృబహుత్వాన్ని అనుసరించి 'పడు' అనేధాతువుమీద ప్రథమపురుషబహువచనంలో 'రు'వర్ణకం రాగా, కర్తలు మహత్తులు కావటంచేత ప్రస్తుతసూత్రంప్రకారం ఏకవచనం వచ్చి, 'పడును' అని అయింది.

'విభాష' అనటంచేత ఏకవచనం రానిపక్షంలో బహువచనం అలాగే ఉండి, 'పడుదురు' అని అవుతుంది. ఉదా. 'ముచ్చిల వేగునతడు, కామాకులచిత్తుడు, నిద్ర లేక కుందుదురు' అని ప్రయోగం.

'మహత్' అనటంచేత అమహత్తులు కర్త లైనపుడు ఈకార్యం రాదు. ఉదా. పిల్లియు నెలుకయు పోరాడుచున్నవి.

('బహు' అనటంచేత) ఏకత్వార్థంలో ఏకవచనం రావటం సామాన్యమే కాబట్టి ఏకకర్తృకాలకు ఇక్కడ ప్రసక్తి లేదు.

బహుకర్తృకం అన్నపుడు కర్తృవాచకశబ్దాలు అనేకంగా ఉండా లని వ్యాకర్త ఉద్దేశించాడో లేదో చెప్పలేము. కాని 'యోగ్యులు పలువురు కలరు' అనేవిధంగా మహత్కర్త బహుత్వంలో ఉంటే, 'యోగ్యులు పలువురు కలదు' అని క్రియకు ఏకవచనం రాదు.

కర్తృపదాలు అనేకంగా ఉన్నా దేని కది బహువచనాంతాలు అయితే ఏకవచనం అసలు రాదు. 'చెప్పనివారును, సత్యము చెప్పనివారును' అని కర్తృపదాలు బహువచనంలో ఉంటే, క్రియ 'పడుదురు' అని బహువచనంలోనే ఉంటుంది. కాని (పడును అని) ఏకవచనం రాదు.

'విభాష' అనటంచేత ఏకవచనం రానిపక్షంలో బహువచనమే అవుతుంది. ప్రముచ్చిల ప్రేగునతడు, కామాకులచిత్తుడు, నిద్ర లేక కుందుదురు.

**3. కొన్నియెడలఁ ద్వరితార్థసూచకం బయి భావిని భూతంబు చూపట్టెడి.** (7)

'భావి' అంటే భవిష్యదర్థం. 'భూతంబు' అంటే భూతకార్యం అని గ్రహించాలి. త్వరితం (తొందర) అనేఅర్థాన్ని తెలియజేసేటపుడు కొన్నిచోట్ల కవిప్రయోగాలలో భవిష్యదర్థంలో భూతార్థంలో లాగా ఆయాకార్యాలు రావటం కనబడుతున్న దని సూత్రానికి అర్థం.

'తా వచ్చె సుదర్శనాయుధుడు' ఇక్కడ (సుదర్శనాయుధుడు) రాగలడు అనేఅర్థంలో భవిష్యదర్థాన్ని అనుసరించి 'భావిని లృ ట్టగు' అనేసూత్రంప్రకారం లృట్టు రాగా, దానికి ప్రస్తుతసూత్రం ప్రకారం భూతకార్యం రావలసియుండగా, 'భూతంబున లి ట్టగు' అనేసూత్రంచేత లిట్టు వచ్చి, వచ్చు-(లిట్)ల్. దీనిపై ప్రథమపురుషైకవచనంలో డుజూ, దానికి 'ఎను'ప్రత్యయమూ వచ్చి, 'వచ్చెను' అని అయింది.

ఇక్కడ వచ్చెను అనేరూపం భవిష్యదర్థంలో ఏర్పడింది గాబట్టి భూతార్థకక్రియా కార్యాలతో ఉన్నా, ఇది భవిష్యదర్థాన్నే బోధిస్తుంది. అందుచేత ఇక్కడ 'వచ్చెను' అంటే 'త్వరగా రాగలడు' అని (భావి)అర్థం.

'కొన్నియెడల' అనటంచేత ఇటువంటిప్రయోగాలు అరు దని అర్థం.

'చూపట్టెడి' అనటంచేత కవిప్రయోగాలలో కనబడినచోట్లనే ఈకార్యాన్ని గ్రహించాలి. కాబట్టి త్వరితార్థం ఉన్నా, భవిష్యదర్థంలో 'రాగలడు' అనేవిధంగా

లృడంతరూపమే సాధారణంగా కవిప్రయుక్తమై ఉన్న దని గ్రహించాలి.

'త్వరితార్థసూచకం బయి' అనటంచేత త్వరితార్థం లేనపుడు భావిక్రియారూపమే ఉంటుంది.

'భావిని' అనటంచేత ఇతరార్థాలలో ఈకార్యం లేదు.

'భూతంబు' అనటంచేత త్వరితార్థంలో భావిని వర్తమానాదు లైన ఇతరకార్యాలు రావు. వచ్చుచున్నాడు, వచ్చును ఇత్యాదిగా ఉండదు.

**4. వ్యతిరేకక్రియ యర్థత్రయబోధకం బగు.** (8)

వ్యతిరేకార్థంలో ఉన్నక్రియ వ్యతిరేకక్రియ. 'వ్యతిరేకంబున లజీ యగు' అనేబాల. సూత్రంప్రకారం లజీ లకారం చివర గలిగినక్రియ అని అర్థం. అర్థత్రయం అంటే వర్తమానం, భూతం, భావి అనేమూడు అర్థాలు.

వ్యతిరేకార్థకక్రియ వర్తమానం భూతం, భావి అనేఅర్థాలతో కూడినవ్యతిరేకార్థాన్ని తెలుపుతుం దని ఈసూత్రానికి అర్థం. వ్యతిరేకక్రియ వ్యతిరేకార్థవిశిష్ట మైనధాత్వర్థాన్ని మాత్రమే తెలుపవలసిఉండగా, వర్తమానాద్యర్థాలను బోధించటం ఇందులోనివిశేషం.

'పాఱడు లేచి దిక్కులకు'. పాఱుధాతువుకు వ్యతిరేకార్థంలో ప్రథమపురుషైకవచనం లో ఏర్పడినరూపం 'పాఱడు' అనేది. ఇక్కడ ఈక్రియ 'పాఱుచున్నవాడు కాదు' అనేవిధంగా వర్తమానార్థవిశిష్ట మైనవ్యతిరేకార్థాన్ని బోధిస్తున్నది.

'నలు గాన మివ్వనంబున'. కనుధాతువుకు ఉత్తమపురుషబహువచనంలో ఏర్పడిన రూపం 'కానము'. ఇది ఇక్కడ 'కనినవారము కాము' అనేతీరుగా భూతార్థవిశిష్ట మైనవ్యతిరేకార్థాన్ని తెలుపుతున్నది.

'వాసుదేవుడున్ రాడు'. వచ్చుధాతువుకు ప్రథమపురుష ఏకవచనంలో ఏర్పడిన రూపం 'రాడు'. ఇది 'రాగలవాడు కాదు' అనేవిధంగా భవిష్యదర్థవిశిష్ట మైనవ్యతిరే కార్థాన్ని బోధిస్తున్నది.

'వ్యతిరేకక్రియ' అనటంచేత వర్తమానాద్యర్థక మైనఇతరక్రియలకు ఈకార్యం లేదు.

'అర్థత్రయము' అనటంచేత విధి మొదలైన ఇతరఅర్థాలను వ్యతిరేకక్రియ బోధింప దని అర్థం చెప్పవచ్చు. 'నిప్పు చల్లగా నుండదు' ఇత్యాదిగా వ్యతిరేకక్రియ కేవలం వ్యతిరేకార్థం మాత్రమే బోధించటం ప్రసిద్ధమే. సూత్రంలో దీనికి కూడ అవకాశం కల్పించవలసిఉంది.

**5. ప్రార్థనాదులం దన్ప్రత్యయాంతక్రియలమీఁదియిమ్ముఁన కీకారంబు విభాష నగు.** (10)

ప్రార్థనం మొదలైనవి ప్రార్థనాదులు. అన్ ప్రత్యయం చివర గలిగినక్రియ అన్ప్రత్యయాంతక్రియ. 'తుమర్థభావలక్షణంబులందు నుజీ యగు' అని చెప్పబడిన నుజీప్రత్యయం చివర గలిగినదానిని ప్రౌఢవ్యాకర్త అన్ప్రత్యయాంతం అని వ్యవహరిస్తాడు. ఈకారం అంటే 'ఈ' అనేవర్ణం. ఇది ఏకాల్లు కావటంచేత ఇమ్ములో చివరిఉకారంస్థానంలో మాత్రమే రావలసిఉన్నా, ఇక్కడ మాత్రం 'ఇమ్ము' అనేశబ్దం మొత్తం స్థానంలో ఆదేశం అవుతుం దని గ్రహించాలి.

ప్రార్థనం మొద లైనఅర్థాలలో 'అన్' (నుజీ)అనేప్రత్యయం చివర గలిగిన క్రియల మీద ఉన్న 'ఇమ్ము' అనేక్రియాపదం స్థానంలో 'ఈ' అనేవర్ణం (సర్వ)ఆదేశంగా వస్తుం దని సూత్రానికి అర్థం.

ఉండన్+ఇమ్ము. ఉండుధాతువుయొక్క అన్ప్రత్యయాంతరూపం ఉండన్. దీనిమీద ఇచ్చుధాతువు చేరి, ప్రార్థనార్థంలో లూణ్మధ్యమపురుషైకవచనంలో ఇమ్ము అనేరూపం ఏర్పడగా (ఉండన్+ఇమ్ము), ప్రస్తుతసూత్రంచేత ఇమ్ము మొత్తంస్థానంలో 'ఈ' ఆదేశ మై, ఉండన్+ఈ= 'ఉండనీ' అని అవుతుంది.

విభాష అనటంచేత ఈఆదేశం రానిపక్షంలో ఇమ్ము అనేది అలాగే ఉండి, ఉండన్+ఇమ్ము=ఉండనిమ్ము అని అవుతుంది.

ఇలాగే నవ్వన్+ఇమ్ము=నవ్వనీ, నవ్వనిమ్ము, మొ.

'ప్రార్థనాదులందు' అనటంచేత శబ్దపల్లవం (ద్వ్యవయవక్రియ) అయినచోట మాత్రమే ఈకార్యం వస్తుంది అని ఊహించాలి. 'కష్టములు తొలఁగన్, ఇ మ్మభీష్టములు' అనేచోట 'తొలగ నీయభీష్టములు' అనేవిధంగా కాదు. ఇక్కడ ఇమ్ము ప్రార్థనార్థకమే కాని అన్నంతంమీద చేరింది కాక స్వతంత్ర మైనశబ్దం కావటంచేత ఈకార్యం రా దని గ్రహించాలి. ఈఅర్థం సూత్రంలో స్పష్టంగా లేదు.

'అన్ప్రత్యయాంతక్రియలమీది' అనటంచేత ఇతరస్థలాలలో ఉన్న ఇమ్ముకు ఈకార్యం రాదు.

అవసానంలో లేదా హల్లు పర మైనపుడు ఇమ్ములో చివరి 'మ్ము'వర్ణకం లోపించగా పూర్వంలోని కృతహ్రస్వానికి దీర్ఘం వస్తుంది. కాబట్టి ఈసూత్రం

ఈవిధంగా చెప్పవలసింది కాదు.

**6. కొఱకు కంటె పొంటెలు పరంబు లగునపుడు భావార్థక టవర్ణకంబునకు లోపంబు విభాష నగు.** (14)

'టవర్ణకంబు భావంబునం దగు' అని భావార్థంలో ధాతువుమీద టవర్ణకం వస్తుంది. ఇది కృత్తు కావటంచేత ప్రాతిపదికం అవుతుంది. కాబట్టి దీనిమీద ప్రథమ మొద లైనవిభక్తులు వస్తాయి.

కొఱకు, పొంటె అనేచతుర్థీవిభక్తులు, కంటె అనేపంచమీవిభక్తి పరంగా ఉన్నపుడు దానికి పూర్వంలో ఉన్న భావార్థక మైన 'ట' అనేప్రత్యయానికి వికల్పంగా లోపం వస్తుంది అని సూత్రానికి అర్థం.

చూపుకొఱకు. చూచు ధాతువు ప్రేరణరూపం చూపు. దానిమీద భావార్థంలో టవర్ణకం వచ్చి, చూపుట అని కాగా ఈకృదంతప్రాతిపదికమీద చతుర్థిలో కొఱకు ప్రత్యయం వచ్చి, చూపుట+కొఱకు అని ఉండగా ప్రస్తుతసూత్రంచేత 'ట' వర్ణకం లోపించి, 'చూపుకొఱకు' అని అవుతుంది.

'విభాష' అనటంచేత లోపం రానిపక్షంలో టవర్ణకం నిలిచిఉండి, చూపుటకొఱకు అనేరూపం ఉంటుంది.

ఇలాగే పట్టుట+పొంటె=పట్టుపొంటె, పట్టుటపొంటె. కలుగుట+కంటె= కలుగుకంటె, కలుగుటకంటె. మొ.

'కొఱకుకంటెపొంటెలు పరంబు లగునపుడు' అనటంచేత ఇతరవిభక్తి పర మైనపుడు ఈకార్యం రాదు. చూపుట, పాలించుటను, పట్టుటయందు. మొ. దాచుచేతనో (ఆము. 2. 33) అని చేతవిభక్తి పర మైనపుడు టలోపం కనిపిస్తుంది.

'భావార్థక' అనటంచేత ఇతరార్థాలలోని టవర్ణకానికి లోపం రాదు. ఆటకొఱకు, పాటకంటె. మొ.

'టవర్ణకంబునకు' అనటంచేత భావార్థకమే అయినా, ఇతరప్రత్యయానికి లోపం రాదు. అలుకకంటె, వినికికొఱకు, మొ.

**7. ఒక్కొకచో భూతార్థకాసమాపకక్రియ హేత్వర్థకంబు నగు.** (15)

'సమానాశ్రయంబులం బూర్వకాలంబునం దివర్ణకం బగు' అని వచ్చిన ఇప్రత్యయం చివర గలిగినశబ్దాన్ని చిన్నయ సంస్కృతానుసారంగా 'క్త్వార్థకం' అని పేర్కొన్నాడు.

దీనినే ప్రౌఢవ్యాకర్త 'ఇప్రత్యయాంతావ్యయము, భూతకాలికాసమాపక క్రియ' అని వ్యవహరించటం గమనించవచ్చు. ఫలసాధనయోగ్యం బగుపదార్థము హేతువు.

క్త్వార్థంలో వచ్చిన ఇ ప్రత్యయం చివర గలిగినశబ్దం కొన్నియెడల హేత్వర్థం ఇస్తుంది అని సూత్రానికి అర్థం.

'రాహుకంఠము దెగి దేహము ధరణిఁ బడియె'. ఈవాక్యంలో తెగి అనేది భూతకాలికాసమాపకక్రియ. (దేహము) పడుటకు (కంఠము) హేతువు. కాబట్టి 'తెగి' అనేభూతకాలికాసమాపకక్రియ 'తెగుటచేత' అనేవిధంగా హేత్వర్థాన్ని కూడ ఇస్తున్నది.

'ఒక్కొకచో' అనటంచేత భూతకాలికాసమాపకక్రియ హేత్వర్థకం కావటం అరుదు. కవిప్రయోగానుసారంగా గ్రహించాలి.

'హేత్వర్థంబును' అనేచోటి సముచ్చయార్థకనుశబ్దంచేత భూతకాలికాసమాపకక్రియ హేత్వర్థకం కావటంతోపాటు క్త్వార్థాన్ని గూడ తెలుపుతుం దని అర్థం. దేహము పడుట అనేక్రియకంటె, కంఠము తెగుట అనేక్రియ పూర్వకాలికం అనేఅర్థం గూడ (హేత్వర్థంతోపాటు) తెలియజేస్తున్నది. తెగి పడియె అనగా, తెగుట అనేక్రియ భూతార్థకమూ, అసమాపకం కావటమూ కావటాన్నిబట్టి ఇది భూతకాలికాసమాపక క్రియార్థాన్ని గూడ తెలుపుతున్న దని వ్యాకర్త అభిప్రాయం.

విధానాన్నిబట్టి భూతకాలికాసమాపకక్రియార్థంలో పూర్వలక్షణానుగుణంగా ఇప్రత్యయం రాగా అది హేత్వర్థకం కావటాన్ని ఈసూత్రం విశేషంగా చెపుతున్నది. అంతే కాని హేత్వర్థంలో ఈసూత్రం ఇప్రత్యయాన్ని విధించటం లే దని గ్రహించాలి.

**8. పకారంబు కొన్నియెడల శత్రర్థపరకచువర్ణకంబునకుం గానంబడెడి.**
(17)

'శతృ' అనేసంస్కృతప్రత్యయంయొక్క అర్థం శత్రర్థం. ఈఅర్థంలో తెలుగులో ధాతువుమీద 'చువర్ణకంబు ద్రుతాంతంబు క్రియాన్వయంబున శత్రర్థంబునం దగు' అని 'చు(ను)' అనేప్రత్యయం వస్తుంది. 'చువర్ణకంబునకు' అని చెప్పినా, చువర్ణంలోని చకారానికే పకారం వస్తుం దని పూర్వలక్షణాలను అనుసరించి గ్రహించాలి. పూర్వవ్యాకరణాలప్రకారం చకారానికి ముత్తు, దుక్కు పరంగా ఉన్నపుడు మాత్రమే పకారం వస్తుంది. శత్రర్థకచువర్ణకం ముత్తు (లేదా దుక్కు) కాకపోవటంచేత పూర్వలక్షణాల ననుసరించి ముందరిచకారానికి పకారం రాకపోతుండగా

ప్రయోగానుసారంగా ఈసూత్రం దానిని విధిస్తున్నది.

శత్రర్థక మైన 'చు'వర్ణకం పరంగా ఉండగా కూడ దానికి పూర్వంలోని ఉన్నచువర్ణంలోనిచకారానికి పకారం రావటం కొన్నియెడల కనబడుతున్న దని సూత్రానికి అర్థం.

గర్జించు అనేధాతువు మీద శత్రర్థంలో 'చువర్ణకంబు ద్రుతాంతంబు' అనేసూత్రంచేత చు(ను) వర్ణకం వచ్చి, గర్జించు+చు అని ఉండగా ప్రస్తుతసూత్రంచేత ముందరి చకారానికి పకారం వచ్చి, 'గర్జింపుచు' అని అవుతుంది.

ఇలాగే – చేరుచు+చును=చేరుపుచును మొ.

'కొన్నియెడల' అనటంచేత శత్రర్థపరకతలో పత్వం క్వాచిత్కం. కాబట్టి శత్రర్థపరకత్వంలో అన్నిచోట్ల పత్వం రాదు. విఱుచుచున్, కాచుచున్ మొ. ఇలా పత్వం రాకపోవటమే సాధారణం.

'శత్రర్థపరక' అనటంచేత ఇతరం పర మైనపుడు ఈకార్యం లేదు. నుతించుచున్నాడు. ఇక్కడ నుతింపుచున్నాడు అనేవిధంగా పత్వం రాదు.

'చువర్ణకంబునకు' అనటంచేత ఇతరవర్ణానికి ఈకార్యం లేదు. పెరుకుచును, తిరుగుచును మొ. చువర్ణంబు అని సామాన్యంగా చెప్పటంచేత 'గర్జింపుచు' అన్నపుడు ఇంచుగాగమంలోని చకారానికి, 'చేరుపుచు' అన్నపుడు చుగాగమంలోని చకారానికి పత్వం వచ్చింది.

చువర్ణ మని సామాన్యంగా చెప్పినా, లేచుచును, వచ్చుచును ఇత్యాదిగా చువర్ణం ఉన్న ప్రతిచోట పకారం అసలు రాదు. పూర్వవ్యాకరణాలనుబట్టి ముత్తు, దుక్కు పర మైనపుడు పత్వం వచ్చేసందర్భాలలోనిచకారానికే ఇక్కడ కొన్నియెడల పకారం వస్తుం దని గ్రహించాలి.

### 10. అన్నంతక్రియ చేయుయోగంబునం బ్రేరణార్థకం బగు. (18)

అన్ ప్రత్యయం చివర గలిగినక్రియ అన్ప్రత్యయాంతక్రియ. 'తుమర్థభావలక్షణంబు లందు నుజీ యగు' అని చెప్పబడిన నుజీప్రత్యయం చివర గలిగినదానిని ప్రౌఢవ్యాకర్త అన్ప్రత్యయాంతం అని వ్యవహరిస్తాడు.

అన్ (నుజీ) అనేప్రత్యయం చివర గలిగినక్రియ చేయు అనేధాతువుతో సంబంధం వలన ప్రేరణార్థాన్ని ఇస్తుంది అని సూత్రానికి అర్థం. ప్రేరణార్థంలో ధాతువుపై

నుజిప్రత్యయమూ దానిపైన చేయుధాతువూ వస్తా యని తాత్పర్యం.

చొక్కఁజేయు. చొక్కు అనేధాతువుయొక్క ప్రేరణార్థాన్ని వివక్షించినపుడు చొక్కు ధాతువు (మీద అన్ (నుజి) ప్రత్యయం చేరి–) అన్‌ప్రత్యయాంతరూపం ఐన 'చొక్కన్' అనేదానిమీద చేయు అనేధాతువు చేరి, చొక్కన్+చేయు. ద్రుతకార్యాలతో చొక్కఁ జేయు. చొక్కంజేయు. అని అవుతుంది. దీనికి చొక్కునట్లు చేయు అనేవిధంగా ప్రేరణం అర్థం. లడాదులు దీనిమీద వస్తాయి. చొక్కఁజేయుచున్నాడు. చొక్కఁ జేయుట. మొ.

ఇలాగే వహించు ధాతువు అన్నంతం కాగా, వహింపన్, దీనిపై చేయుధాతువు చేరి వహింపఁజేయు. ఇలా ప్రేరణార్థంలో ధాతువు అన్నంత మై, పైన చేయుధాతువు చేరడం సంస్కృత ఆచ్ఛికధాతువులు రెంటికి అవుతుంది.

ఇది విశేషకార్యం. కాగా ప్రేరణార్థంలో ధాతువుపై ఇంచుక్, చుక్,పుక్ అనేఆగమాలు వచ్చిన సాధారణరూపాలు వీటికి కూడా ఉంటాయి. చొక్కించు, వహింపించు, మొ. చను అనేధాతువు మీద ప్రేరణార్థంలో ఆగమాలు ఏవీ రావు. ఇక అన్నంతమై చేయుయోగంవల్ల మాత్రమే చనుధాతువుకు ప్రేరణార్థం సిద్ధిస్తుంది. ఈఅంశాన్ని చిన్నయ మరొకవ్యాకరణంలో నిరూపించాడు.

'అన్నంతక్రియ' అనటంచేత ఇతరరూపాలపై ఈకార్యం ఉండదు. చొక్కిచేయు ఇత్యాదు లుండవు. ఇలాగే విజయంచేయు, వేంచేయు మొ.

'చేయుయోగంబున' అనటంచేత చేయుధాతువుతో సంబంధం లేకపోతే (కేవలం అన్నంతక్రియకు) ప్రేరణార్థం ఉండదు. చొక్కన్ – దీనికి చొక్కించు అనేప్రేరణార్థం లేదు.

'అగు' అనటంచేత చేయుయోగంలో అన్నంతక్రియ తప్పక ప్రేరణార్థకం అవుతుంది. చొక్కఁజేయు. దీనికి చొక్కించు అని మాత్రమే కాని చొక్కు ఇత్యాదిగా ఇతరార్థాలు ఉండవు.

ప్రేరణార్థంలో ధాతువుపై అన్‌ప్రత్యయాన్ని, దానిపై చేయుయోగాన్ని విధించి ఉండవలసింది.

**11. తిగుచుధాతువునన్నంతరూపములు తివ్వఁ దివ ననియు.** 20)

అన్ ప్రత్యయం చివర గలిగినరూపం అన్నంతరూపం. 'తుమర్థభావలక్షణంబు లందు నుజి యగు' అని చెప్పబడిన నుజిప్రత్యయం చివర గలిగినదానిని ప్రౌఢవ్యాకర్త

అన్నంతం, అన్నప్రత్యయాంతం అని వ్యవహరిస్తాడు.

తిగుచు అనేధాతువుకు అన్ (నుజీ) ప్రత్యయం చివర చేరగా ఏర్పడేరూపాలు తివ్వన్, తివన్ అనేవిధంగా ఉంటా యని ఈసూత్రానికి అర్థం.

తిగుచు ధాతువుపై అన్ ప్రత్యయం వస్తే శాస్త్రాన్ని (బాల.క్రియ. 88) అనుసరించి 'తిగువన్' అని కావాలి. కాని కవిప్రయోగానుసారంగా తివ్వన్, తివన్ అని వేరేవిధంగా ఉండటాన్ని ఈసూత్రం నియమిస్తున్నది. దీనినే నిపాత అంటారు. తిగుచు+అన్ అని ఉండగా ధాతువులోనితొలియచ్చుమీదివర్ణాలకు ఒకసారి ద్విరుక్త మైనవకారమూ, మరొకపర్యాయం కేవలవకారం ఆదేశంగా రావటం నిపతింపబడినట్లు గ్రహించాలి.

తిగుచు ధాతువుపై అన్ప్రత్యయం వచ్చి, తిగుచు+అన్ అని కాగా ప్రస్తుతసూత్రం చేత తిగుచు ధాతువులోని తొలియచ్చుమీదివర్ణాలకు ద్విరుక్తవకారం రాగా, తివ్వ్+అన్– తివ్వన్ అని అవుతుంది. మరొకపక్షంలో తిగుచు+అన్ అని ఉండగా, ప్రస్తుతసూత్రం చేత తిగుచు ధాతువులోని తొలియచ్చుమీదివర్ణాలకు (ఒక్క)వకారం సర్వాదేశంగా రాగా, తివ్+అన్=తివన్ అని మరొకరూపం అవుతుంది.

(బాల.క్రియ. 40సూ.చే నుజీ, 20సూ.చే ముందు అత్త్వం, 88సూ.చే ముందరిచకారానికి వకారం రాగా 'తిగువన్' అని అవుతుంది. ఇక్కడ గువర్ణానికి వకారం ఆదేశంగా వచ్చి తివ్వన్, లోపం వచ్చి 'తివన్' అనేవిధంగా అవుతుం దని బాల.ప్రక్రియ ననుసరించి గ్రహించాలి.)

'తిగుచుధాతువు' అనటంచేత ఇతరధాతువులకు ఈరూపాలు రావు.

'అన్నంతరూపములు' అనటంచేత 'అన్' అనేదానికంటె ఇతరప్రత్యయాలు వచ్చినపుడు సాధారణరూపాలే ఉంటాయి. తిగువక, తిగువనివాడు మొ.

'తివ్వఁ దివ ననియు' అనేచోటిసముచ్చయార్థకనుశబ్దంచేత తివ్వన్, తివన్ అనేరూపాలతోపాటు, ఈరూపాలు కాకుండా, తిగువన్ అనేసాధారణరూపం కూడ ఉంటుం దని తెలియవచ్చు.

**12. కంటెవర్ణకంబు పరం బగునపుడు విశేషణనవర్ణకంబుమీఁది యమహ త్తచ్ఛబ్దార్థమునకు లోపంబు విభాష నగు.** (21)

'విశేషణనవర్ణకంబు' అంటేధాతుజవిశేషణానికి సంబంధించిననవర్ణకం. 'ఉన్నకలనవర్ణకంబులు భవద్భావిశత్రక్తవదర్థంబులం దగు' అనేసూత్రంచేత క్తవదర్థం లో ధాతువుమీద వచ్చే నవర్ణకం అని అర్థం. 'ధాతుజవిశేషణంబులకు విభక్తి

వివక్షించునపుడు తచ్ఛబ్దం బనుప్రయుక్తం బగు' అని దీనిపై తచ్ఛబ్దం చేరుతుంది.

'కంటె అనేపంచమీవిభక్తి పరంగా ఉండగా, దానికి పూర్వంలో ఉన్న ధాతుజ విశేషణానికి సంబంధించిన'న'వర్ణకానికి పైన (విభక్తివివక్షలో అనుప్రయుక్త మైన) అమహత్తు ఐన తచ్ఛబ్దానికి (దాని అనేశబ్దానికి) వికల్పంగా లోపం వస్తుంది అని సూత్రానికి అర్థం.

కనినకంటె. కను అనేధాతువుమీద క్తవదర్థంలో నవర్ణకం వచ్చి, భూతంబునం దిగాగమం బగు' అని ఇగాగమం వచ్చి, కనిన. దీనిమీద (పంచమీ)విభక్తి వివక్షించి నపుడు తచ్ఛబ్దం అనుప్రయుక్త మై, కనిన+ఆ. పంచమిలో కంటెప్రత్యయం వచ్చి, 'కనినదానికంటె' అని అవుతుంది. ప్రస్తుతసూత్రంచేత విశేషణమైన (కనిన) నవర్ణకం మీద ఉన్నదీ, అమహ త్తయినదీ ఐన తచ్ఛబ్దార్థక మైన 'దాని' అనేశబ్దానికి లోపం వచ్చి, కనినకంటె.

'విభాష' అనటంచేత అమహత్తచ్ఛబ్దార్థం లోపింపనిపక్షంలో – కనినదానికంటె.

ఇలాగే పంచినకంటె, పంచినదానికంటె మొ.

'కంటె వర్ణకంబు పరం బగునపుడు' అనటంచేత ఇతరప్రత్యయం పర మైనపుడు ఈలోపం రాదు. కనినదానిని, పంచినదానియందు. మొ.

'విశేషణనవర్ణకంబుమీది' అనటంచేత ధాతుజవిశేషణాలలోని ఇతరప్రత్యయానికి లోపం రాదు. కనెడుదానికంటె, పంచనిదానికంటె మొ.

'అమహత్తచ్ఛబ్దార్థమునకు' అనటంచేత మహత్తచ్ఛబ్దార్థానికి లోపం రాదు. కనినవానికంటె, పంచినవారికంటె మొ.

**13. ఒకానొకచో సహార్థంబున యుష్మదస్మదర్థంబు లభిహితంబు లగునపుడు క్రియలు తత్కర్తృకంబులు విభాష నగు.** (26)

'సహ' అనేసంస్కృతశబ్దంయొక్క అర్థం సహార్థం. కూడ, కలిసి, (తో) అని అర్థం. యుష్మదర్థం 'నీ' (నీవు, మీరు). అస్మదర్థం 'నా' (నేను, మేము). అభిహితత్వం అంటే క్రియచేత చెప్పబడటం. ఈకార్యం యుష్మదస్మదర్థాలు ఏకవచనాంతాలు అయినపుడే విశేషంగా గుర్తించాలి.

సహార్థంలో క్రియచేత యుష్మదర్థం చెప్పబడేసమయంలో కొన్నిచోట్ల ఆక్రియ వికల్పంగా యుష్మదర్థం కర్తగా గలిగినది అవుతుంది.

నీవును నీనిషాదియున్ వెల్వడుము. ఇక్కడ వెల్వడు అనేక్రియకు కర్తలు రెండు.

నీవు అనేయుష్మదర్థం, నిషాది అనేఅన్యం. ఇటువంటిసందర్భంలో 'అన్యయుష్మదస్మ త్కార్యంబులం దుత్తరోత్తరంబు బలీయంబు' అనేసూత్రంచేత వెల్వడు అనేధాతువుమీద యుష్మత్కార్యం అంటే మధ్యమపురుషప్రత్యయం వస్తుంది. కర్తలు (నీవు, నిషాది) బహుత్వంలో ఉండటంచేత మధ్యమపురుషలో బహువచనం వచ్చి, నీవును నీనిషాదియున్ 'వెల్వడుఁడు' అని కావలసిఉంది.

'నీనిషాదితో నీవు వెల్వడుము' అనేవిధంగా ఇక్కడ సహార్థం ఉన్నది. కాబట్టి ప్రస్తుతసూత్రంచేత (లూట్టులో) నీవు అనేయుష్మదర్థం మాత్రమే కర్తగా ఉండి, అది యేకవచనం కాబట్టి మధ్యమపురుషలో ఏకవచనం కలిగి 'వెల్వడుము' అని ప్రయోగింపబడింది.

'విభాష' అనటంచేత ఈలక్షణం ప్రవర్తింపనిపక్షంలో పూర్వం పేర్కొన్నవిధంగా 'నీవును నీనిషాదియున్ వెల్వడుడు' అనేతీరుగా క్రియ మధ్యమపురుష బహువచనంలో ఉంటుంది.

అలాగే సహార్థంలో క్రియచేత అస్మదర్థం చెప్పబడేసమయంలో కొన్నిచోట్ల ఆక్రియ వికల్పంగా అస్మదర్థం కర్తగా గలిగినది అవుతుంది.

నేను నాసేనయు దాడివెట్టెద. ఇక్కడ (దాడి)పెట్టు అనేక్రియకు నేను, అనే అస్మ దర్థం, నాసేన అనేఅన్యం అనేవి కర్తలు రెండు. ఇటువంటిసందర్భంలో 'అన్యయుష్మదస్మత్కార్యంబులం దుత్తరోత్తరంబు బలీయంబు' అనేసూత్రంచేత పెట్టు అనేధాతువుమీద అస్మత్కార్యం అంటే ఉత్తమపురుషప్రత్యయం వస్తుంది. కర్తలు (నేను, సేన) బహుత్వంలో ఉండటంచేత ఉత్తమపురుషలో బహువచనం వచ్చి, నేను నాసేనయున్ 'దాడివెట్టెదము' అని కావలసిఉంది.

'నాసేనతో నేను దాడివెట్టెదను' అనేవిధంగా ఇక్కడ సహార్థం ఉన్నది. కాబట్టి ప్రస్తుతసూత్రంచేత (లాట్టులో) నేను అనేఅస్మదర్థం మాత్రమే కర్తగా ఉండి, అది యేకవచనం కాబట్టి ఉత్తమపురుషలో ఏకవచనం కలిగి 'దాడివెట్టెద' అని ప్రయోగింపబడింది.

'విభాష' అనటంచేత ఈలక్షణం ప్రవర్తింపనిపక్షంలో పూర్వం పేర్కొన్నవిధంగా 'నేను నాసేనయున్ దాడివెట్టెదము' అనేతీరుగా క్రియ ఉత్తమపురుష బహువచనంలో ఉంటుంది.

'ఒకానొకచో' అనటంచేత ఈకార్యం కవిప్రయోగానుసారంగా అరుదుగా ఉంటుం దని గ్రహించాలి.

'సహార్థంబున' అనటంచేత సహార్థం లేనపుడు ఈకార్యం రాదు.

'యుష్మదస్మదర్థంబులు' అనటంచేత ఇతరశబ్దాల కీకార్యం రాదు. 'రావణుడును రాక్షసులును చచ్చిరి'. ఇక్కడ 'రావణుడు రాక్షసులును చచ్చెను' అనేవిధంగా కాదు.

'అభిహితం బగునపుడు' అనటంచేత క్రియచే చెప్పబడనపుడు ఈకార్యం రాదు. 'నీకును వారికిని మేము నమస్కరింతుము'.

సహార్థంలో అభిహిత మైనయుష్మదస్మదర్థాలు బహువచనాంతాలు అయితే ఈలక్షణం ప్రవర్తించినా, ప్రవర్తించకపోయినా రూపం ఒకేవిధంగా ఉంటుంది. 'మీరును మీవారును రండు'. ఇక్కడ 'మీరును, మీవారును రమ్ము' అని ఉండటానికి వీలు లేదు. కాగా యుష్మదస్మదర్థాలు ఏకవచనాంతాలు అయినపుడు మాత్రమే ఈకార్యాన్ని విధిస్తే చాలు. అందుకే సూత్రకర్త యుష్మదస్మదర్థాలు ఏకవచనాంతాలనే ఉదాహరించా డని గ్రహించవచ్చు.

'విభాష' అనటంచేత ఈలక్షణం ప్రవర్తింపనిసందర్భంలో కూడ 'కడగుండు, దాడివెట్టెదము' అనేవిధంగా కర్త యుష్మదస్మత్కర్తృకమే అవుతుంది. కాబట్టి సూత్రకర్త వచనం విషయం ప్రస్తావించాలి కాని కర్తృత్వాన్ని కాదు.

### 14. కరఁగు తలఁగు మెఱయ్యాదు లంతర్భావితప్రేరణంబులు. (34)

అంతర్భావితప్రేరణం అంటే అంతర్భూత మైన – లోపల ఇమిడి ఉన్న ప్రేరణార్థం కలిగినది. కరఁగు, తలఁగు, మెఱయు మొద లైనధాతువులు అంతర్భవించియున్న ప్రేరణార్థం కలిగిన వని సూత్రార్థం. అంటే ఇవి స్వార్థాన్ని మాత్రమే కాక, సందర్భాన్ని అనుసరించి ప్రేరణార్థకమైన ఇంచుక్ మొ. ఆగమం ఏదీ లేకుండానే ప్రేరణార్థాన్ని కూడ తెలియజేస్తాయి అని తాత్పర్యం.

**కరఁగు** – 'గేహంబులు హరశరాగ్నికీలాజ్వాలలదాహమునఁ గరఁగి'. ఇక్కడ కరఁగి అంటే నశించి అనేవిధంగా కరఁగుధాతువుకు స్వార్థం.

'బాణముల్ గూడ నైదు గరఁగి'. ఇక్కడ కరఁగు ధాతువుకు కరఁగించి అనేవిధంగా ప్రేరణార్థం.

**తలఁగు–** 'ధరణీరాజ్యము తలఁగఁగ'. ఇక్కడ తలఁగఁగ అంటే తొలఁగఁగా అని తలఁగుధాతువు స్వార్థం తెలుపుతుంది.

'ధార్తరాష్ట్రుని చెఱ తలఁగె నితఁడు'. ఇక్కడ తలఁగె అంటే తొలగునట్లు చేశాడు అని, తలగుధాతువు ప్రేరణార్థం ఇస్తున్నది.

**మెఱయు–** 'అనువు మెఱయ'. ఇక్కడ మెఱయన్ అంటే మెఱయునట్లుగా అని మెఱయుధాతువు స్వార్థం తెలుపుతుంది.

'కలితనంబు మెఱయుదురు'. మెఱయుదురు అంటే 'మెఱయింతురు' అని మెఱయు ధాతువు ప్రేరణార్థం తెలుపుతున్నది.

'మెఱయ్వాదులు' అన్నప్పటిఆదిశబ్దంచేత ఆఁగు, కురియు మొద లైనధాతువులను ప్రయోగానుసారంగా గ్రహించాలి.

ఈధాతువులకు ప్రేరణార్థంలో కరఁగించు, తలఁగించు, మెఱయించు, ఆఁపు, కురియించు ఇత్యాదిగా ప్రేరణంలో ఇంచుక్ మొద లైన ఆగమాలు అయినరూపాలు కూడా ఉన్నాయి.

'కరఁగు తలఁగు మెఱయ్వాదులు' అనటంచేత వీటిలో చేరనిధాతువుకు స్వార్థం మాత్రమే ఉంటుంది.

'అంతర్భావితప్రేరణంబులు' అనటంచేత ప్రేరణార్థం అంతర్గతంగా ధాతువులోనే ఉండటంచేత దీనిపై ప్రేరణార్థంలో ఇంచుక్ మొద లైన ఆగమాలు రాకుండానేప్రేరణార్థం ఉంటుం దని తాత్పర్యం. కరఁగు అనేదానికే కరఁగించు అని కూడా అర్థం. ఇలా చెప్పటంచేత వీటికి అప్రేరణార్థం ప్రసిద్ధం అని అర్థం.

ఆదిశబ్దం ఎలాగూ అవసరమే కాబట్టి తరువాతిసూత్రంలో 'అడుగ్వాదులు' అన్నట్లుగా ఇక్కడ కూడా 'కరఁగ్వాదులు' అని చెప్తే చాలు.

### 15. అడుగ్వాదులు ద్వికర్మకంబులు. (35)

అడుగు మొద లైనవి (అడుగు+ఆది) అడుగ్వాదులు. ద్వికర్మకములు అంటే రెండు కర్మలు గలిగినవి. అడుగు మొద లైనధాతువులు రెండు కర్మలు గలిగినధాతువు లని సూత్రానికి అర్థం.

వచ్చు మొద లైనధాతువులు కర్మ లేక అకర్మకాలు కాగా, వండు మొద లైనవి కర్మ కలిగి సకర్మకాలు కాగా, (సకర్మకాలు అయిన) అడుగు మొద లైనధాతువులు రెండు కర్మలు గలిగి ద్వికర్మకాలు అవుతున్నాయి.

'విభీషణుడు అడిగెను'. ఈవాక్యంలో 'అడిగెను' దేనిని అడిగెను? అని కర్మను గూర్చిన ఆకాంక్ష కలుగుతుంది. 'వరమును అడిగెను' అనగా ఆఆకాంక్ష తీరుతుంది. కాని మళ్లీ 'ఎవరిని?' అని మరొక కర్మను గూర్చిన ఆకాంక్ష కలగుతుంది. 'రాముని వరమును అడిగెను'. అని రాముని అనే రెండవకర్మ ఉంటే కాని వాక్యార్థం సమగ్రం

కాదు. కాబట్టి ఇది ద్వికర్మకధాతువు.

'అడుగ్వాదులు' అన్నప్పటిఆదిశబ్దంచేత చెప్పు, పలుకు మొద లైనవి గ్రహింపబడతాయి.

చిన్నయసూరి 'వచ్యర్థాముఖ్యకర్మంబునకు' అని వచ్యర్థాలకు ముఖ్యకర్మ, అముఖ్యకర్మ అని రెండు కర్మలు ఉండటాన్ని ప్రస్తావించాడు. ద్వికర్మకాలు సర్మకాలే కాబట్టి ప్రత్యేకించి చెప్పనవసరం లే దని సూరిఅభిప్రాయ మేమో. ప్రౌఢవ్యాకర్త ద్వికర్మకాలను చెప్పటం యుక్తమే.

# 8. కృదంతపరిచ్ఛేదం

## 1. రాయున కిడివర్ణకంబు నగు. (3)

'వర్ణకంబును' అనేచోటి'ను'శబ్దానికి వికల్పం అని అర్థం. రాయు అనేధాతువుకు 'ఇడి' అనేప్రత్యయం వికల్పంగా వస్తుం దని సూత్రానికి అర్థం. ధాతువుకంటె డుఙ్ భిన్న మైన ఈప్రత్యయం కృత్తు.

రాయు అనేధాతువు మీద ఈసూత్రంప్రకారం ఇడిప్రత్యయం రాగా, రాయు+ఇడి. 'అంద్వవగాగమంబులం దప్ప-' అనేసూత్రంచేత సంధి జరిగి, రాయిడి. కృత్ప్రత్యయం చివర గలిగి(కృదంతమై)న ఈశబ్దం ప్రాతిపదికం. ఈప్రాతిపదిక 'ఆచ్ఛికశబ్దంబు లెల్లం దఱుచుగ స్త్రీసమంబులును-' అనేసూత్రంప్రకారం స్త్రీసమం. కాబట్టి దీనిపైని ప్రథమైకవచనానికి లోపం వచ్చి, 'రాయిడి' అనేప్రథమైకవచనాంత పదం ఏర్పడుతుంది.

'వర్ణకంబును' అన్నచోటినుశబ్దంచేత ఇడిప్రత్యయం ఒకపక్షంలో రాకపోవచ్చు. అపుడు 'పువర్ణకంబు మాయ్యాదుల కగు' అనేసూత్రంచేత 'పు' అనేప్రత్యయం వచ్చి 'రాయు+పు. 'ఇటం గృత్కగతపవేములు పరంబు లగునపుడు కగచయవలకు లోపం బగు' అనేసూత్రంచేత 'యు' వర్ణం లోపించి, 'రాపు' అనేకృదంతప్రాతిపదిక ఏర్పడుతుంది. ఇది స్త్రీసమం. కాబట్టి 'స్త్రీలింగంబుల-' అనేసూత్రంచేత ప్రథమైక వచనం (సు) లోపించి, రాపు అనేప్రథమైకవచనాంతరూపం ఏర్పడుతుంది.

'రాయునకు' అనటంచేత ఇతరధాతువుకు ఈప్రత్యయం రాదు.

సూత్రంలో 'రాచునకు' అనేపాఠం కూడా కనబడుతున్నది కాని, అది సరికాదు.

**2. ఎక్కుదిగులకుం బ్రేరణార్థంబున మతివర్ణకం బగు. అగుచో నెగు ఎక్కున కాదేశం బగు.** (5)

ప్రేరణార్థంలో ఎక్కు, దిగు అనేధాతువులకు పరంగా 'మతి' అనేప్రత్యయం వస్తుంది. మతిప్రత్యయ మైనపుడు ఎక్కు అనేధాతువు స్థానంలో 'ఎగు' అనేశబ్దం ఆదేశంగా వస్తుం దని సూత్రానికి అర్థం.

ఎక్కు అనేధాతువుమీద ప్రస్తుతసూత్రంచేత మతి అనేప్రత్యయం వచ్చి, ఎక్కు+మతి అని అయి, తరువాత ఎక్కు ధాతువుస్థానంలో ఎగు అనేది ఆదేశ మై, ఎగుమతి అని అవుతుంది. కృదంత మైన ఈప్రాతిపదికం స్త్రీసమం. కాబట్టి ప్రథమైకవచనం లోపించి 'ఎగుమతి' అనేప్రథమైకవచనాంతపదం ఏర్పడుతుంది.

దిగు ధాతువుమీద మతిప్రత్యయం కాగా దిగుమతి అని అవుతుంది.

ఎక్కు, దిగు ధాతువులకు 'వ' అనేప్రత్యయం వస్తుంది. అపుడు గూడ ఎక్కుధాతువుకు ఎగు అనేఆదేశం వస్తుంది. కాని ఇది ఎగుమతి, దిగుమతి అనేవాటిలాగా ప్రేరణార్థకం కాదు.

'ఎక్కుదిగులకు' అనటంచేత ఇతర మైనధాతువుకు ఈకార్యం లేదు.

'ప్రేరణార్థంబున' అనటంచేత స్వార్థంలో ఈకార్యం లేదు. ఎగువ, దిగువ.

'అగుచో' అనటంచేత మతిప్రత్యయం పరంగా లేనిపక్షంలో ఎగు అనేఆదేశం రాదు. ఎక్కించుట.

# 9. వాక్యపరిచ్ఛేదం

**1. వాక్యము నా యోగ్యతాకాంక్షాసహితం బగునర్థము గలయాసత్తియుక్త పదసముదాయంబు.** (1)

అర్థములో యోగ్యత, ఆకాంక్ష, గలిగి, ఆసత్తితో గూడినపదముల సమూహం వాక్యం.

పదాలఅర్థానికి పరస్పరం బాధ లేకపోవటం యోగ్యత. సమూహంగా ఏర్పడినపదాలఅర్థాలు ఒకదానితో ఒకటి చక్కగా అన్వయం కలిగిఉండాలి.

నిప్పుచే తడుపుతున్నాడు. ఇక్కడ నిప్పుతో తడపటం అనేది కుదరదు. కాబట్టిపదాలఅర్థానికి పరస్పరం బాధ ఏర్పడటంచేత ఇది వాక్యం కాదు. నిప్పుచే

కాలుచుచున్నాడు అనేరీతిగా ఉంటే పదాలఅర్థం పరస్పరం అన్వయించటంలో బాధ లేదు కాబట్టి అది వాక్యం అవుతుంది.

ఆకాంక్ష అంటే అపేక్ష. పదాలయొక్క అర్థాలు తరువాతిదానిని గూర్చి తెలియాలనేకోరిక. అంటే వినేవాడు ఒక్కొక్కశబ్దం వినగానే దానిఅర్థాన్ని అనుసరించి ఆతరువాత ఏమిటి (తరువాతిపదం అర్థం ఏమిటి?) అనేరూప మైనఆకాంక్ష ఉండాలి.

గోవు గుఱ్ఱము. ఇక్కడ రెండు పదాలు ఉన్నాయి. కాని ఈపదాలతో ఏవిధంగానూ అర్థం పూర్తి కావటం లేదు. ఏమయింది ఇత్యాదిగా ఇంకా తరువాతి(పదాల)అర్థాన్ని గూర్చిన ఆకాంక్ష మిగిలిఉండటంచేత ఈపదసముదాయం వాక్యం కాదు. 'గోవు, గుఱ్ఱము సాధుజంతువులు'. ఈపదాలసమూహంలో అర్థం పరిపూర్ణం అయి, తరువాతిఅర్థాన్నిగూర్చినఅపేక్ష లేకపోవటంచేత ఇది వాక్యం అవుతుంది.

ఇంక పదాలలో ఆసత్తి ఉండాలి.

ఆసత్తి అంటే పదాలచేరిక. పదాలు అన్నీ ఒకదానివెంట ఒకటి ప్రయోగింపబడి ఉండాలి.

దేవదత్తుడు పోవుచున్నాడు. ఇది వాక్యం. ఇందులో దేవదత్తుడు, పోవుచున్నాడు అనేపదాలు రెండూ వ్యవధానం లేకుండా వెంటవెంటనే ప్రయోగింపబడినాయి. కాబట్టి ఇది వాక్యం. ఇలా కాకుండా, 'దేవదత్తుడు' అని ఈరోజు చెప్పి తర్వాత మళ్లీ ఇంకోసమయంలో ఎప్పుడో 'పోవుచున్నాడు' అంటే ఈరెండు పదాలు దగ్గరగా చేరిఉండకపోవటంచేత (శ్రోతకు అర్థం తెలియదు కాబట్టి) ఇది వాక్యం కాదు.

'పదసముదాయంబు' సందర్భాన్నిబట్టి ఒక్కపదం కూడ పూర్తిఅర్థాన్ని బోధిస్తూ వాక్యం అనదగిఉంటుంది. దశరథునిపెద్దకొడు కెవడు? దీనికి సమాధానంగా 'రాముడు' అని చెప్తే అక్కడ ఆపదం ఒక్కటే అవసర మైన అర్థాన్ని సమగ్రంగా చెప్తున్నది కాబట్టి ఆఒక్కపదమే వాక్యం అవుతుంది.

**2. పదము లవి నామంబులు క్రియ లవ్యయంబు లని త్రివిధంబులు.** (3)

1. నామాలు, 2. క్రియలు, 3. అవ్యయాలు అని పదం మూడువిధాలుగా ఉంటుం దని ఈసూత్రం అర్థం. పూర్వసూత్రంలో పదాన్ని నిర్వచించినతరువాత ఇక్కడ ఆపదంలోని భేదాలను వివరించాడు.

1. నామము లంటే వస్తువాచకశబ్దాలు. రాముడు. ఇది దశరథునికొడుకు అనేవిధంగా ఒకానొకవస్తువును బోధిస్తున్నది. కాబట్టి ఇది నామం. ఇలాగే గుఱ్ఱమును, గోడయందు మొ. ఇవే సందర్భాన్నిబట్టి కర్త, కర్మ, విశేష్యం, విశేషణం

ఇత్యాదిగా పేర్కొనబడతాయి.

నామంబనగా ప్రాతిపదిక మని వ్యాకరణం సంప్రదాయం. దానికి భిన్నంగా ఉన్న ఈనిరూపణం ఆంగ్లవ్యాకరణమార్గం.

2. క్రియ లనగా వ్యాపారావబోధకములు. వ్యాపారం అంటే పనిని తెలియజేసే పదాలను క్రియలు అంటారు. వచ్చుచున్నాడు. ఇది వచ్చుట అనేవ్యాపారాన్ని (పనిని) బోధిస్తున్నది కాబట్టి ఇది క్రియ.

ఇవి సకర్మకాలు, అకర్మకాలు అని రెండు విధాలుగా వ్యాకర్త వివరించాడు. ధాతువుల నుద్దేశించి ఇలా చెప్పిఉండాలి. సకర్మకం– (వాడు అన్నమును) తినెను. అకర్మకం–(వాడు) వచ్చెను.

ఈక్రియలు సమాపకక్రియలు, అసమాపకక్రియలు అని రెండు విధాలు. లట్టు, లిట్టు, ఇత్యాదిగా లడాదిలకారాలు చివర గలిగినవి సమాపకక్రియలు. వచ్చుచున్నాడు, రాము మొ. వీటినే సంస్కృతసంప్రదాయానుసారంగా తిజంతాలు = క్రియా విభక్త్యంతాలు అంటారు.

'సుప్తిజంతం పదమ్' అని సంస్కృతంలో పదం సుబంతం తిజంతం అని రెండు విధాలుగా చెప్పబడింది. ఇక్కడి నామాలు సుబంతాలు కాగా, క్రియలు అనేది తిజంతాలు. అవ్యయాలు అనేది వేరుగా చెప్పటం బహుశః ఆంగ్లవ్యాకరణప్రభావం వల్ల కావచ్చు నని విమర్శకులఅభిప్రాయం.

అవ్యయాలు – అవ్యయము లనఁగా లింగవిభక్తివచనశూన్యంబులు. అన్నిలింలింగాలలో, అన్నివిభక్తులలో, అన్నివచనాలలో ఎటువంటిమార్పు లేకుండా ఒకే విధంగా ఉండేది అవ్యయం.

ప్రతిపదోక్తాలు, లాక్షణికాలు అని అవ్యయాలు రెండురకాలు. సహజసిద్ధంగా అవ్యయా లయినశబ్దాలు ప్రతిపదోక్తాలు. ఆహా, అయ్యో మొ. లక్షణం అంటే వ్యాకరణంచేత సిద్ధించినవి లాక్షణికాలు. క్త్వా, తద్వ్యతిరేక, శతృ, తుమ్, ఆనంతర్య, చేదాద్యర్థకాలు లాక్షణికావ్యయాలు. వచ్చి, వచ్చుచున్ మొ.

**3. విషయబోధకము వాక్యము.** (5)

**4. ఉద్దేశ్యవిధేయభిన్నంబు విషయంబు.** (6)

'వాక్యము నా యోగ్యతాకాంక్షాసహితం బగునర్థము గలయాసత్తియుక్తపద సముదాయంబు' అని వాక్యలక్షణాన్ని చెప్పిన వ్యాకర్త మళ్లీ ఇక్కడ వాక్యలక్షణాన్ని

మరోపద్ధతిలో నిరూపిస్తున్నాడు.

విషయాన్ని బోధించేది వాక్యం. విషయం అంటే తెలియదగినఅంశం అని వ్యాకర్త వివరించాడు. తెలియదగినఅంశాన్ని తెలిపేది వాక్యం.

దానినే ఉద్దేశ్యవిధేయభిన్నం విషయం అని సూత్రించాడు. ఉద్దేశ్యవిధేయాలతో కూడినది విషయం. అంటే విషయంలో ఉద్దేశ్యం, విధేయం అనేరెండంశాలు ఉంటాయి.

ఉద్దేశించి చెప్పదగినది ఉద్దేశ్యం. మీద తెలియదగినది విధేయం. దేనిని గురించి చెప్పబడుతుందో అది ఉద్దేశ్యం. దానిని గురించి ఏమి చెప్పబడుతుందో అది విధేయం. విశేష్యం, విశేషణం, సర్వనామం, అన్నంతక్రియలు మొద లైనవి ఉద్దేశ్యాలు అవుతాయి. క్రియ, విశేష్యం, విశేషణం, సర్వనామం, ఏల మొ. అవ్యయాలు మొద లైనవి విధేయాలు అవుతాయి. క్రియలు మాత్రం ఎప్పుడూ ఉద్దేశ్యాలు కావు.

వాగ్భూషణమే సుభూషణము. ఇక్కడ వాగ్భూషణాన్ని ఉద్దేశించి చెప్పటంచేత వాగ్భూషణం అనేది ఉద్దేశ్యం. ఇది విశేష్యం. దానిని గూర్చి 'సుభూషణం' అని చెప్పబడింది. కాబట్టి 'సుభూషణం' అనేది విధేయం. ఇది విశేషణం. వాగ్భూషణం అనేఉద్దేశ్యమూ, సుభూషణం అనేవిధేయమూ రెండూ కలిసిఉన్నది కాబట్టి 'వాగ్భూషణమే సుభూషణము' అనేది వాక్యం.

**5. సంపూర్ణ మసంపూర్ణ మని వాక్యంబు ద్వివిధంబు.** (7)

సంపూర్ణవాక్యం అసంపూర్ణవాక్యం అని వాక్యం రెండు విధాలు అని సూత్రానికి అర్థం.

సమాపకక్రియలు గలవాక్యం సంపూర్ణవాక్యం. వర్తమానం మొద లైన అర్థాలను బోధించే లట్టు, లిట్టు, లృట్టు, మొద లైనలకారాలు చివర గలిగినక్రియలు సమాపక క్రియలు. క్రియావిభక్తులు చివర గలిగినవి, అంటే తిజంతాలు అయినపదాలు సమాపకక్రియలు. విషయాన్ని సంపూర్ణంగా తెలిపేది అంటే ఆకాంక్ష పూర్తి అయ్యేవిధంగా చెప్పటంచేత ఇది సంపూర్ణవాక్యం అనబడుతుంది.

హంస లెల్ల తిరుగుచుండె. ఇక్కడ ఉండెన్ అనేది భూతార్థక(లిడంత)సమాపక క్రియ. కాగా సమాపకక్రియ గలిగినది కాబట్టి ఈవాక్యం సంపూర్ణవాక్యం.

అసమాపకక్రియలు గలవాక్యం అసంపూర్ణవాక్యం. క్త్వా, తద్వ్యతిరేక, శతృ, తుమ్, ఆనంతర్య, చేదాద్యర్థకాలు అయినక్రియలు అసమాపకక్రియలు. ఇవి చివర

గలిగినవాక్యం అసంపూర్ణవాక్యం.

దాని విడిచి పోవఁగా నోపక (అఱచుచు) తిరుగుచు. ఇక్కడ విడిచి (క్త్వార్థకం), పోవఁగాన్ (తుమర్థం), ఓపక (వ్యతిరేకక్త్వార్థకం), (అఱచుచున్) తిరుగుచున్ (శత్రంతం), అనేఅసమాపక క్రియలు గలిగిన వాక్యభాగం అసంపూర్ణవాక్యం. దీనికి పైన సమాపకక్రియ (ఉండెన్) ప్రయోగిస్తే అపుడు మొత్తం కలిసి సంపూర్ణవాక్యం అవుతుంది.

వాక్యాన్ని ఈవిధంగా విభాగించటం ఆంగ్లవ్యాకరణప్రభావంచేత కావచ్చు.

**6. క్రియాన్వయవాక్యంబులు కొన్ని వ్యంగ్యార్థద్యోతకంబు లగు.** (9)

వర్తమానం మొద లైన అర్థాలను బోధించేది, లడాదిలకారాలు చివర గలిగినదీ, అంటే డుజ్ రు మొద లైనక్రియావిభక్తులు చివర గలిగినపదాలకు (సమాపక)క్రియలు అని పేరు. ఇటువంటి క్రియలతో అన్వయం కలిగినవాక్యాలు క్రియాన్వయవాక్యాలు. వాక్యంలోని పదాలు బోధించేఅర్థం(వాచ్యార్థం)కంటె భిన్న మైన వేఱొకఅంద మైనఅర్థం వ్యంగ్యం. అటువంటి వ్యంగ్యార్థాన్ని బోధించేశబ్దం (వాక్యం) వ్యంజకం.

క్రియాన్వయవాక్యాలు కొన్ని వాచ్యార్థంతోపాటు అంతకంటె అందమైన వ్యంగ్యార్థాన్ని కూడా తెలియజేస్తాయి అని సూత్రానికి అర్థం. అవి ఏవో ఈవివరణం పేర్కొంటున్నది.

1. భావక్రియలు గలవాక్యం వ్యతిరేకక్రియ గలవాక్యాన్ని వ్యంగ్యంగా తెలుపుతుంది. భావం అంటే ఉండటం. ఉనికి. ధాతువుయొక్క అర్థ మైనవ్యాపారం ఉండటాన్ని అంటే స్వార్థాన్ని (వస్తువుయొక్క ఉనికిని) బోధించేది భావక్రియ. ఉదా. వచ్చును. పోవును. మొ. దానికి వ్యతిరేక మైనఅర్థాన్ని బోధించేది వ్యతిరేకక్రియ. ఉదా. రాడు పోడు. మొ.

ఈసందర్భంలో వాక్యంలో రెండుభాగా లుంటాయి. రెండు భాగాలలోనూ భావక్రియ, తద్ధర్మార్థకం ఐఉంటుంది. మొదటిభాగంలోనితద్ధర్మార్థకక్రియమీద ఏని అనేశబ్దం ప్రయోగింపబడుతుంది. అది (రెండు భాగాలలోనూ)వ్యతిరేకక్రియలు గలవాక్యాన్ని వ్యంగ్యంగా తెలుపుతుంది.

వాడు వచ్చు నేని వీడు వచ్చును. (ఇందులో వాడు వచ్చును, అనేమొదటిభాగం లోను, వీడు వచ్చును అనేరెండవభాగంలోనూ వచ్చును అని భావక్రియ తద్ధర్మార్థకం) ఈవాక్యానికి 'వాడు వస్తే వీడు వస్తాడు' అని వాచ్యార్థం. ఇది 'వాడు రాకపోతే వీడూ రాడు' అనేవ్యంగ్యార్థాన్ని తెలుపుతుంది. (అంటే 'వాడు రా దేని వీడు రాడు'

అనేవ్యతిరేకార్థకవాక్యాన్ని వ్యంగ్యంగా బోధిస్తుంది. ఇందులో వాడు రాడు, అనేమొదటిభాగంలోను, వీడు రాడు అనేరెండవ భాగంలోనూ రాడు అని క్రియ వ్యతిరేకార్థకం.)

ఇక్కడ వాక్యంలోని మొదటిభాగం తద్ధర్మార్థకం కాకుండా (చేదర్థక) ఇనన్ ప్రత్యయాంతం అయినా, ఈవిధంగానే వ్యతిరేకార్థాన్ని వ్యంగ్యంగా తెలుపుతుంది.

వాడు వచ్చిన వీడు వచ్చును. వచ్చిన అనేది ఇనన్నంతం. ఇది కూడా వాడు వస్తే వీడు వస్తాడు అనేవాచ్యార్థంతోపాటు వాడు రాకపోతే వీడూ రాడు అనేవ్యతిరేకార్థాన్ని వ్యంగ్యంగా బోధిస్తుంది.

2. వ్యతిరేకక్రియలు గలవాక్యం భావక్రియలు గలవాక్యాన్ని వ్యంగ్యంగా తెలుపుతుంది. ఈసందర్భంలో వాక్యంలో రెండుభాగా లుంటాయి. రెండు భాగాలలోనూ వ్యతిరేకక్రియలేఉంటాయి. మొదటిభాగంలోనివ్యతిరేకక్రియమీద ఏని అనేశబ్దం ప్రయోగింపబడుతుంది. అది (రెండు భాగాలలోనూ)భావక్రియలు గలవాక్యాన్ని వ్యంగ్యంగా తెలుపుతుంది.

వాడు రా డేని వీడు రాడు. (ఇందులో వాడు రాడు, అనేమొదటిభాగంలోను, వీడు రాడు అనేరెండవభాగంలోనూ రాడు అని క్రియ వ్యతిరేకార్థకం) ఈవాక్యానికి 'వాడు రాకపోతే వీడు రాడు' అని వాచ్యార్థం. ఇది 'వాడు వస్తే వీడూ వస్తాడు' అనేవ్యంగ్యార్థాన్ని తెలుపుతుంది. (అంటే 'వాడు వచ్చు నేని వీడు వచ్చును' అనే భావార్థకవాక్యాన్ని వ్యంగ్యంగా బోధిస్తుంది. ఇందులో వాడు వచ్చును, అనేమొదటి భాగంలోను, వీడు వచ్చును అనేరెండవభాగంలోనూ వచ్చును అని క్రియ భావార్థకం.)

3. రెండూ రెండింటికి వ్యంజకాలు అవుతాయి. అంటే–

ఈసందర్భంలో వాక్యంలోని రెండు భాగాలలోనూ మొదటిభాగంలోనిది భావక్రియ, రెండవభాగంలోనది వ్యతిరేకక్రియ ఐతే అది మొదటిభాగంలో వ్యతిరేక క్రియ. రెండవభాగంలో భావక్రియ గలవాక్యాన్ని వ్యంగ్యంగా తెలియజేస్తుంది. మొదటిభాగంలోనిభావక్రియ తద్ధర్మార్థకం అయి, పైన ఏని శబ్దం ఉండటం, లేదా తద్ధర్మార్థకం కాకుండా ఇనన్నంతం కావటం అనేది ఇంతకుముందు లాగానే గ్రహించాలి.

వాడు వచ్చు నేని వీడు రాడు. ఇందులో మొదటిభాగంలో వచ్చును భావక్రియ. రెండవభాగంలో రాడు వ్యతిరేకక్రియ. ఇది వాడు రాడేని వీడు వచ్చును అనేవిధంగా మొదట రాడు, అనేవ్యతిరేకక్రియ, రెండవచోట వచ్చును అని తద్ధర్మక్రియ గలవాక్యాన్ని

వ్యంగ్యంగా చెపుతుంది.

ఇలాగే వాడు వచ్చిన వీడు రాడు. ఇది కూడా పైలాగానే వాడు రాడేని వీడు వచ్చును అనేవాక్యాన్ని వ్యంగ్యంగా తెలుపుతుంది.

మొదటిభాగంలో వ్యతిరేకక్రియ (పైన ఏనిశబ్దం), రెండవభాగంలో భావక్రియ ఉన్నవాక్యం మొదటిభాగంలో భావక్రియ, రెండవభాగంలో వ్యతిరేకక్రియ గలవాక్యాన్ని వ్యంగ్యంగా తెలుపుతుంది.

వాడు రాడేని వీడు వచ్చును. ఇందులో మొదటిభాగంలో రాడు వ్యతిరేకక్రియ. రెండవభాగంలో వచ్చును భావక్రియ. ఇది వాడు వచ్చునేని (వచ్చిన) వీడు రాడు అనేవిధంగా మొదట వచ్చును అని తద్ధర్మక్రియ, రెండవచోట రాడు, అనేవ్యతిరేకక్రియగలవాక్యాన్ని వ్యంగ్యంగా చెపుతుంది.

**7. ఇ ట్లనియె, అనియె నని భావ్యర్థకథనప్రారంభపరిసమాప్తులం గ్రమంబుగ నగు.** (10)

సూత్రం అర్థాన్ని సూత్రకర్తే వివరించాడు.

భావ్యర్థకథనప్రారంభంబునఁ బూర్వవాక్యాంతమునందు 'ఇ ట్లనియె' అనియును, ప్రారబ్ధవాక్యపరిసమాప్తియందు 'అనియె' అనియును బదంబులు క్రమంబుగఁ బ్రయుక్తంబు లగు నని యర్థము.

జరగబోయేవిషయాన్ని (భావ్యర్థం) చెప్పటం ప్రారంభించేసందర్భంలో దానికి పూర్వవాక్యంలో చివర 'ఇ ట్లనియె' అని ప్రయోగింపబడుతుంది. ఆవిషయం చెప్పినతరువాత 'అనిన' అని ప్రయోగింపబడుతుంది. అని సూత్రార్థం.

'అయ్యింద్రునకు కలి యి ట్లనియె. ...దమయంతిచే వరియింపబడుదు నని యరిగెద' అనిన నందఱు నగి'. ఇక్కడ జరగబోయే దమయంతీస్వయంవరం అనే విషయాన్ని వర్ణించేటపుడు దానికి ముందుగా 'ఇ ట్లనియె' అని ప్రయోగింపబడింది. భవిష్యదర్థం అయిన దమయంతీస్వయంవరం అనేఅంశం చెప్పటం అయిపోయాక 'అనిన' అనేశబ్దం ప్రయోగింపబడింది.

ఇ ట్లనియె, అనిన అని ప్రయోగింపబడుతుం దని చెప్పినప్పటికీ దానికి పర్యాయమైనపదాలు కూడ ఈసందర్భంలో ప్రయోగించవచ్చు. ఇ ట్లనియె అనటానికి బదులుగా 'ఇట్లు పలికె, ఇట్లు వచించె' అని పలుకుధాత్వర్థకాలైన ఇతరక్రియలను ప్రయోగించవచ్చు. అలాగే అనిన అనడానికి మాఱుగా 'అనగా, అనుడు అనేవిధంగా

పర్యాయాలను ప్రయోగించవచ్చు.

'సురపతి కనియెన్' (ఆర. 1.85) ఇక్కడ ఇట్లు శబ్దం లేకుండా, కేవలం 'అనియెన్' అని మాత్రమే ప్రయోగింపబడింది.

'భావ్యర్థకథనంబున' అనటం కూడ విశేషమే. పైప్రయోగంలో అరిగెద అనేక్రియ 'అరుగుచున్నాను' అని వర్తమానార్థకం. 'అరుగగలను' అనేతీరుగా భావ్యర్థం లేదు. దమయంతీస్వయంవరం భావ్యర్థమే కాని, తదర్థమై 'అరిగెదను' అనేప్రధానాంశం మాత్రం భావ్యర్థం కాదు.

'యుధిష్ఠిరున కి ట్లనియె. వివేకము గలవాడు బుద్ధివికలుం డగునే' మైత్రేయుం డిట్లనియె. పాండవేయులకడనుండి వచ్చితి' అనేవిధంగా భూతతద్ధర్మాద్యర్థాల విషయంలో ఇలా ప్రయోగించవచ్చు.

జరగబోయేవిషయాన్ని చెప్పబోతున్నసందర్భంలో అనియె అని భూతక్రియ ఉండటం విశేషం అన్నఉద్దేశ్యంతో వ్యాకర్త ఈఅంశాన్ని సూత్రించిఉండవచ్చు. కాని కథాభాగంలో అది జరగబోయే దైనా, వర్ణింపబడుతున్నసందర్భంలో అది జరిగిపోయిందే కాబట్టి భూతార్థక్రియ ఉపయోగించవలసిందే. లేకపోతే ఇట్లనగలదు అని భవిష్యదర్థకక్రియ కుదురుతుందా?

ఈలక్షణం ప్రయోజనవంతంగా లే దనవచ్చు.

**8. న్యూనవచోవాక్యంబునఁ దద్వచనంబు లధ్యాహార్యంబు లగు.** (13)

ఐన, ఏని, ఏ , ఓ మొద లైనవి న్యూనవచనా లని వ్యాకర్త వివరించాడు. కాగా న్యూనవచోవాక్యం అంటే ఐన వెుద లైనన్యూనవచనాలు ఉండవలసినవాక్యం. 'తద్వచనంబులు' న్యూనవచనాలు. వాక్యంలో అన్వయానికి అవసర మై వాక్యంలో ప్రయోగింపబడనిపదాన్ని తెచ్చుకోవడం అధ్యాహారం. ఆవిధంగా అధ్యాహారం చేసుకోవలసినపదం అధ్యాహార్యం.

ఐన మొద లైనన్యూనవచనాలు ఉండవలసినవాక్యంలో అవి లేనపుడు ఆన్యూనవచనాలను అధ్యాహారం చేసుకోవా లని సూత్రానికి అర్థం.

'ఎత్తెఱఁగున ధర్మక్రియ చిత్తంబున చేర్పవలయు' ఈవాక్యానికి ఇందులో ప్రయోగింపబడినపదాలు మాత్రమే తీసుకుని అన్వయిస్తే 'ధర్మక్రియ ఏవిధంగా చిత్తంలో చేర్చాలి' అనేవిధంగ ఇది ప్రశ్నార్థాన్ని బోధిస్తుంది. కాని ఇక్కడ చెప్పదలచుకున్న అర్థం 'ఏవిధంగా నైనా ధర్మక్రియ చిత్తంలో చేర్చాలి' అనేది. కాగా 'ఎత్తెఱగున నైన' లేదా 'ఎత్తెఱగున నేని' అనేవిధంగా ఐన, లేదా ఏని

అనేపదాలు లేకుండా ఈవాక్యం వివక్షిత మైనఅర్థాన్ని ఇవ్వలేదు. అందుచేత ఐన, లేదా ఏని అనేన్యూనవచనాన్ని అధ్యాహారం చేసుకుని ఈవాక్యానికి అర్థం చెప్పుకోవాలి.

'కర్మములు మేలు నిచ్చును' ఈవాక్యంలో కర్మములే మేలు నిచ్చును అనేవిధంగా 'ఏ' అనేఅవధారణార్థక మైన అవ్యయాన్ని అధ్యాహారం చేసుకోవాలి.

'న్యూనవచోవాక్యంబున' అనటంచేత ఇతరవాక్యాలో ఈలక్షణం ప్రవర్తించదు. కర్మములు మేలు నిచ్చును. ఇక్కడ కర్మములే అని అవధారణార్థాన్ని వివక్షించకుండా కర్మములు మేలు నిస్తాయి అనేసామాన్యార్థాన్ని మాత్రమే వివక్షించిన ట్లయితే ఏకారం అధ్యాహారం చేయనవసరం లేదు.

'తద్వచనంబులు' అనటంచేత న్యూనవచనాలే అధ్యాహార్యాలు. ఇతరపదాలు అధ్యాహారం చేసుకుంటే ఆఅర్థం సిద్ధించదు కదా.

'అధ్యాహార్యంబు లగు' అనటంచేత ఈకార్యం నిత్యం. అధ్యాహారం చేసుకోకపోతే వివక్షితార్థం సిద్ధించదు. కాబట్టి నిత్యమే.

**9. అనేకకర్తృకక్రియకు సమీపకర్తయొక్క లింగవచనంబు లగు.** (15)

ఒకటికంటె ఎక్కువ కర్తలు గలిగినక్రియ అనేకకర్తృకక్రియ. క్రియాపదానికి దగ్గరలో ప్రయోగింపబడినకర్త సమీపకర్త. ఒకటికంటె ఎక్కువ కర్తలు కలిగినక్రియకు సమీపంలో ప్రయోగింపబడినకర్తయొక్క లింగమూ వచనమూ వస్తా యని సూత్రానికి అర్థం.

ఇక్కడ లింగం అంటే మహత్తు, అమహత్తు అని గ్రహించాలి. అంటే క్రియకు కర్తలు అనేక మై, అందులో ఒకటి మహత్తూ మరొకటి అమహత్తూ అయినపుడు ఆక్రియకు మహత్కార్యం కలుగుతుందా? లేక అమహత్కార్యం కలుగుతుందా? అలాగే ఒకకర్త బహుత్వంలోనూ మరొకకర్త ఏకత్వంలోనూ ఉండగా క్రియకు బహువచనం వస్తుందా లేక ఏకవచనమా అనేసందేహం ఈలక్షణం నివారిస్తున్నది.

ఏవానిబంధుమిత్రులు, జీవధనంబులు డప్పిఁజెందును. ఈవాక్యంలో చెందు అనేక్రియకు బంధుమిత్రులు, జీవధనంబులు అనేవి రెండు కర్తలు. కాబట్టి ఇది అనేకకర్తృకక్రియ. ఇవి రెండూ బహుత్వార్థంలోనే ఉన్నాయి. కాని బంధుమిత్రులు అన్నది మహత్తు, జీవధనంబులు అమహత్తు. వాక్యంలోని 'చెందును' అనేక్రియాపదానికి సమీపంలో ప్రయోగింపబడినకర్త జీవధనంబులు. ఇది జడం (అమహత్తు, బహువచనాంతం). కాబట్టి ప్రస్తుతసూత్రంచేత చెందు అనేక్రియకు

జడ (అమహత్)కార్యం కలిగి 'చెందును' అని అయింది. (జడం కావటంచేత లాట్టు ప్రథమపురుషబహువచనానికి ఏకవచనం వచ్చింది.) మహత్కార్యం కలిగిన ట్లయితే 'చెందుదురు' అని కావాలి.

సర్వభూతంబులు దేవాసురులు (వినాశగతులు) కారె. ఈవాక్యంలో అగుధాతువుకు కర్తలు సర్వభూతంబులు (అమహత్తు), దేవాసురులు (మహత్తు) అనేవి రెండు. వీటిలో క్రియకు సమీపంలో ఉన్న దేవాసురులు అనేకర్త మహత్తు. కాబట్టి క్రియకు మహత్కార్యం కలగి 'కారు' అని అయింది. అహత్కార్యం కలిగిఉంటే 'కాదు' అని కావాలి.

'అనేకకర్తృకక్రియకు' అనటంచేత క్రియ ఏకకర్తృకం ఐనపుడు దానిలింగవచనాలే వస్తాయి కాబట్టి అక్కడ సందేహమే లేదు. అటువంటివాటికి ఇక్కడ ప్రసక్తి లేదు. బంధుమిత్రులు డప్పిఁజెందుదురు, జీవధనంబులు డప్పిఁజెందును. మొ.

'సమీపకర్తయొక్క' అనటంచేత 'బంధుమిత్రులు జీవధనంబులు డప్పిఁజెందుదురు' అనేవిధంగా దూరంగా ఉన్నకర్తయొక్క లింగం (వచనం) రాదు.

వచనం విషయంలో భేదం వ్యాకర్త ఉదాహరించలేదు. 'సర్వభూతంబులు నసురుఁడు వినాశగతుడు కాడె'. 'రామలక్ష్మణులును సీతయును వచ్చెను' అనేవిధమైనప్రయోగాలు లభించిఉన్నట్లయితే వ్యాకర్త ఉదాహించిఉండేవాడే కదా. ఇటువంటిచోట్ల కారె, వచ్చిరి అని ఉండటమే యుక్తం.

**10. భూతార్థకాసమాపకక్రియ వలయుచో వాక్యాంతరజనిస్థానం బగు. అగుచోఁ గర్త తత్కర్తలందలిదియ యెద్దియే నొం డగు.** (16)

ఈసూత్రం అర్థాన్ని సూత్రకర్తే వివరించాడు. 'వలసినప్పుడు కొన్నియెడల భూతార్థకాసమాపకక్రియనుండి వాక్యాంతరము పొడమును. అప్పుడు దానికిఁ గర్త యాయసమాపకక్రియాకర్తృసముదాయంబునం దుండునదియే యే దైన నొక్కటి యగు నని యర్థము'.

భూతార్థకాసమాపకక్రియ అంటే ఇప్రత్యయాంతావ్యయం. అంటే క్త్వార్థకక్రియ. వచ్చి, చూచి మొ. ఇది వాక్యంలో ఆకాంక్షయొక్క అపరిసమాప్తిని బోధింస్తున్నది కాబట్టి ఇది అసమాపకక్రియ. ఇది భూతార్థాన్ని తెలుపుతున్నది కాబట్టి భూతార్థకాసమాపకక్రియ. వాక్యాంతరజనిస్థానం అంటే వేరొకవాక్యం పుట్టేచోటు (ప్రారంభం అయ్యేచోటు).

అవసర మైతే క్త్వార్థకక్రియతో వాక్యం ఏర్పడుతుంది. అలా క్త్వార్థంతో వాక్యం

ప్రారంభం అయినపుడు ఆక్త్వార్థకానికి కర్తలు అయినవాటిలో ఏదోఒకటి ఆతరువాతి వాక్యభాగానికి కర్త అవుతుంది. అని సూత్రానికి అర్థం.

ధవళాక్షుల్ చని కాంచిరి. ఈవాక్యంలో 'చని, కాంచిరి' అనేక్రియలకు కర్త ధవళాక్షులు. అంటే కద్రువ, వినత అనేవాళ్లు ఇద్దరు. 'కని కద్రువ వినతం జూచి' ఈవాక్యం 'కని' అనే క్త్వార్థకక్రియతో ప్రారంభం అయింది. ఈభూతార్థకాసమాపక క్రియకు కర్తలు కద్రువ, వినత ఇద్దరు. కాని ఈక్త్వార్థకంతో ప్రారంభం అయిన తర్వాతిఈవాక్యంలో 'కద్రువ వినతం జూచి' అన్నపుడు కద్రువ ఒక్కరు మాత్రమే కర్త. దీనివల్ల 'కని' అనేక్త్వార్థకక్రియకు కూడా కద్రువ ఒక్కరే కర్త అని భ్రమించగూడదు.

'కని కనగా నందు' అనునర్థము నిచ్చుచున్నది' అని వ్యాకర్త దీనిని సమన్వ యించాడు. కని= కద్రువ, వినత ఇద్దరు చూచి, అందు=ఆఇద్దరిలో ఆచూచిన పెక్కుకర్తలలో కద్రువ అనేఒకకర్త అని సమన్వయం.

'వలయుచో' అనటంచేత ఇటువంటిస్థితి సందర్భాన్నిబట్టి అరుదుగా ఏర్పడుతుం దని గ్రహించాలి.

'భూతార్థకాసమాపకక్రియ' అనటంచేత ఇతరక్రియలకు ఈకార్యం లేదు.

'అగు' అనటంచేత కర్త ఒకటే కావటం నిత్యం. అంటే అన్నిచోట్ల ఒకటే కర్త కావలసిఉంది. 'రామలక్ష్మణులు లంకకు నరిగిరి. అరిగి రావణుం గూల్చిరి' అంటే అరిగి అనేక్త్వార్థకానికి కర్తలు రామలక్ష్మణులు ఇద్దరు అవుతారు. కాబట్టి కర్త ఒక్కటే కావటం అనేది కొన్నియెడల మాత్రమే అని చెప్పటం ఉచితం.

### 11. కొన్నియెడల నవయవకర్తృకక్రియ తదవయవికర్తృకం బగు. (17)

అవయవం కర్తగా గలిగినక్రియ అవయవకర్తృకక్రియ. అవయవి కర్తగా కలిగిన క్రియ అవయవికర్తృకక్రియ. అవయం అంటే అంగం, భాగం. అవయవం కలిగినది అవయవి. ఉదాహరణకు 'తల' అవయవం. తల అనే అవయవం గలిగినవాడు అవయవి. ఇక్కడ అవయవం ఆధారంగానూ, అవయవి ఆధేయంగానూ సంబంధం గుర్తించవచ్చు.

అవయవం కర్తగా కలిగినక్రియ కొన్నిసందర్భాలలో 'అవయవి' కర్తగా గలిగిన దవుతుంది. అవయవి కర్త అయినట్లుగా అర్థాన్ని తెలుపుతుం దని తాత్పరం.

'తలవడంకుచునునందు తనపితృవరుల' (పితృవరులతల వడంకుచున్నది) అనే

చోట 'వడకుట' అనేక్రియకు (వణకటం అనేవ్యాపారానికి) ఆశ్రయం (ఊగేది) కాబట్టి తల అనేఅవయవం కర్త. అందుచేత వడకుట అనేక్రియ (తల అనే) అవయవం కర్తగా గలిగి అవయవకర్తృకం అయింది.

తల అనేఅవయవం కలవారు అంటే అవయవి 'పితృవరులు'. కాగా ప్రస్తుతసూత్రం చేత వడకు అనేఅవయవ(తల)కర్తృకక్రియ – పితృవరులు అనేఅవయవి కర్తగా గలిగినది అవుతుంది. అంటే అవయవిని కర్తగా బోధిస్తుంది. తలవడకుట గలిగినపితృవరులు అని అర్థం. వడకు ధాత్వర్థ మైన ఊగటం అనేవ్యాపారం తల నాశ్రయించియుండగా, ఆతల పితృవరుల నాశ్రయించిఉంది కాబట్టి అవయవం (తల) ద్వారా అవయవి (పితృవరులు) వడకుటకు కర్త ఐనది.

తదవయవము అనేచోటి తచ్ఛబ్దంచేతక్రియకు కర్త ఐనఅవయవం దేనికి సంబంధించిందో ఆఅవయవియె అవయవకర్తృకక్రియకు కర్త అవుతుంది.

'కొన్నియెడల' అనటంచేత ఇది సార్వత్రికం కాదు. 'వడంకుచునుండుతల గలతనపితృవరుల' అని (అవయవకర్తృకంగా) కూడ చెప్పవచ్చు.ఏ

**12. కొన్నియెడల వాక్యంబు వాక్యాంతరగర్భంబు నగు.** (21)

వాక్యాంతరం అంటే వేరొకవాక్యం. వాక్యాంతరం గర్భంలో అంటే లోపల గలిగినది వాక్యాంతరగర్భం.

కొన్నియెడల వాక్యంమధ్యలో వేరొకవాక్యం ఉంటుంది అని సూత్రానికి అర్థం.

'ఇందుల కెంతకాలం బయ్యె రానికారణం బేమి'. ఇందులకు రానికారణం బేమి? అనేది ఒకవాక్యం. ఆవాక్యం మధ్యలో 'ఎంత కాలం బయ్యె' అనేవేరొకవాక్యం ప్రయోగింపబడింది. కాగా ఈవాక్యం గర్భంలో వేరొకవాక్యం గలిగినది కావటంచేత ఇది వాక్యాంతరగర్భవాక్యం.

'కొన్నియెడల' అనటంచేత ఇటువంటిప్రయోగాలు అరుదుగా ఉంటాయి.

'గర్భంబును' అనేచోటిసముచ్చయంచేత ఇక్కడ రెండు వాక్యాలు వేర్వేరుగా కూడ ప్రయోగింపబడవచ్చు. ఉదా. ఇందులకు రానికారణం బేమి? ఎంత కాలం బయ్యె.

**13. పద్యంబులకుం గులకం బగు.** (23)

ఈసూత్రం అర్థాన్ని సూత్రకర్తే వివరించాడు. 'కులకం బనఁ బద్యమునకుఁ బద్యాంతరముతో నన్వయము'.

పద్యానికి వేరొకపద్యంతో అంటే తరువాతిపద్యంతో అన్వయం ఉండటాన్ని కులకం అంటారు అని సూత్రానికి అర్థం.

సంస్కృతంలో 'ఛందోబద్ధం పదం పద్యం, తేన ముక్తేన ముక్తకం, ద్వాభ్యాం తు యుగ్మకం, సంధానితకం త్రిభి రిష్యతే, కలాపకం చతుర్భి శ్చ, తదూర్ధ్వం కులకం మతమ్' అని నాలుగుకంటె ఎక్కువపద్యాలు ఒకేక్రియతో అన్వయం కలిగిఉండటాన్ని కులకం అంటారు. తెలుగులో రెండుపద్యాలకే యిటువంటి అన్వయం ఉంటే చాలు అది కులకం అవుతుంది. దీనినే ఏకక్రియాన్వయం (కలరెండు పద్యాలు) అని వ్యాఖ్యానిస్తారు.

తా నొకపండు చెచ్చెరన్, కొనివ్రచ్చుడు'. చెచ్చెరన్ అని పద్యం ముగియగా కొనివ్రచ్చుడు అనేతరువాతిపద్యంలో కన్వయం కలగటంచేత ఇది కులకం. రెండుపద్యాలకె 'కులకం' అనటం సంస్కృతంకంటె తెలుగులో విశేషం.

'పద్యము' లన్నది వచనాలకు కూడా ఉపలక్షణం. పద్యగద్యాలకు ఈరీతి అన్వయం ఉన్నా, అది కులకం అవుతుంది.

పద్యాంతరంతో అంటే ఒకే పద్యం అని చెప్పనవసరంలేదు. రెంటికంటె ఎక్కువ పద్యాలకు ఎన్నింటి కైనా ఒకేక్రియతో అన్వయం ఉన్నా, అది కులకమే అవుతుంది. భారతం ఆదిపర్వంలో 1.5 నుండి 8 పద్యాలకు ఈవిధ మైనఅన్వయం ఉండటం గమనించవచ్చు.

# 10. ముక్తలక్షణవివేచనం

## 1. దీర్ఘపూర్వక మగులఘురేఫము హ్రస్వపూర్వక మగుచో నలఘురేఫం బగు. (1)

లఘురేఫం అంటే సాధురేఫం (ర). అలఘురేఫం అంటే శకటరేఫం (ఱ).

దీర్ఘం పూర్వంలో ఉన్నలఘురేఫ హ్రస్వపూర్వకం అయినపక్షంలో అలఘురేఫ అవుతుం దని సూత్రానికి అర్థం. అంటే లఘురేఫకు పూర్వంలో ఉన్నదీర్ఘం హ్రస్వం అయితే లఘురేఫకు అలఘురేఫ అవుతుం దని తాత్పర్యం.

చేకూరు అనేచోట లఘురేఫకు పూర్వంలో ఉన్న(కూ) దీర్ఘానికి 'ఆరాటాదులం బ్రథమేతరదీర్ఘంబునకు హ్రస్వంబు విభాష నగు' అనేసూత్రంచేత హ్రస్వం రాగా, 'చేకురు' అని కాగా, ప్రస్తుతసూత్రంచేత సాధురేఫకు శకటరేఫ వచ్చి, 'చేకుఱు' అని

అవుతుంది. 'వెఱవక......చే, కుఱె' అని ఇక్కడి శకటరేఫ ప్రాసస్థానంలో ప్రయోగింపబడింది.

'దీర్ఘపూర్వక మగు' అనటంచేత సహజంగా హ్రస్వపూర్వక మైనలఘురేఫకు ఈకార్యం రాదు. అరుగు, తిరుగు మొ.

'లఘురేఫము' అనటంచేత ఇతరవర్ణానికి ఈకార్యం లేదు. ఆరటము మొ. అలఘురేఫ ఉంటే అది అలాగే ఉంటుంది. కక్కూఱితి – కక్కుఱితి.

'హ్రస్వపూర్వక మగుచో' అనటంచేత ముందరిదీర్ఘానికి హ్రస్వం రానిపక్షంలో ఈకార్యం లేదు. చేకూరు, ఊరక మొ.

అలఘురేఫం 'బగు' అనటంచేత ఈకార్యం నిత్యం. కాబట్టి అలఘురేఫ రానిరూపం ఉండదు. చేకురు, ఉరక ఇత్యాదిగా ఉండదు.

బంగారము–బంగరము, పెండారము–పెండరము ఇత్యాదిగా కొన్నిచోట్ల ఈకార్యం లేదు.

**2. అలఘురేఫము లుప్తాచ్క మగుచో లఘురేఫం బగు.** (2)

లఘురేఫం అంటే సాధురేఫం (ర). అలఘురేఫం అంటే శకటరేఫం (ఱ). లుప్తాచ్కం అంటే అచ్చు లోపించినది.

మీదిఅచ్చు లోపించినపుడు అలఘురేఫస్థానంలో లఘురేఫ వస్తుం దని సూత్రార్థం.

తీఱు అనేధాతువుమీద ప్రేరణార్థంలో చుగాగమం వచ్చి, 'తీఱుచు' అని ఉండగా, 'అచ్చికంబులం బదమధ్యంబులనలడరలయుత్వంబునకు లోపంబు బహుళంబుగా నగు' అనేసూత్రంచేత ఉత్వం లోపించి, 'తీఱ్చు' అని కాగా, ప్రస్తుతసూత్రంచేత శకటరేఫస్థానంలో సాధురేఫ వచ్చి, 'తీర్చు' అని అవుతుంది. 'ఓర్చి భంగపాటు దీర్చికొనుము' అని ప్రాసస్థానంలో తిక్కన ఇక్కడ అలఘురేఫకు లఘురేఫను ప్రయోగించాడు.

ఇలాగే ఏఱులు–ఏర్లు, చిఱుత–చిర్త. మొ.

'అలఘురేఫము' అనటంచేత లఘురేఫకు ఇట ప్రసక్తి లేదు. పెరుగు–పెర్గు, కూరుకు–కూర్కు మొ.

'లుప్తాచ్క మగుచో' అనటంచేత మీది అచ్చు లోపింపనిపక్షంలో లఘురేఫ కాదు. తీఱుచు, ఏఱులు మొ.

'లఘురేఫం బగు' అనటంచేత ఈకార్యం నిత్యం. కాబట్టి అచ్చు లోపించినపుడు

అలఘురేఫ అలాగే ఉండటానికి అవకాశం లేదు. తీఱ్చి, ఏఱ్లు ఇత్యాదిగా ఉండదు.

**3. ద్విత్వరహితం బగుద్వితీయావిభక్తియుకారమున కచ్చు పర మగుచో సంధి రాదు.** (3)

ద్విత్వం లేనిది ద్విత్వరహితం. ద్విత్వం లేనిహల్లుకు పైనున్న ద్వితీయావిభక్తికి సంబంధించిన ఉకారానికి అచ్చు పర మైనపుడు సంధి రాదు. అని సూత్రానికి అర్థం.

నిషేధం ప్రాప్తిపూర్వకం కావాలి. 'ప్రథమేతరవిభక్తిశత్రర్థచువర్ణంబులం దున్నయుకారంబునకు సంధి వైకల్పికముగా నగు' అనేసూత్రంచేత ద్వితీయావిభక్తికి సంబంధించిన ఉకారానికి సంధి ప్రాప్తిస్తుండగా ఈనిషేధం ప్రసక్త మైన దని గ్రహించాలి.

ప్రథమేతరవిభక్తిసూత్రంచేత ద్వితీయావిభక్తిలో నన్ను, నిన్ను, తన్ను, మమ్ము, మిమ్ము, తమ్ము అనేఆరుశబ్దాలలో మాత్రమే ఉత్వానికి సంధి ప్రాప్తిస్తుంది. ద్విత్వం కలిగిన ఈశబ్దాలు ద్విత్వం లేనిరూపంతో నను, నిను, ఇత్యాదిగా కూడా ఒకపక్షంలో ఉంటాయి. కాగా ద్విత్వం లేని పైఆరుశబ్దాలలోను ఉత్వానికి అచ్చు పర మైనపుడు సంధి రా దని సారాంశం.

ననున్–ఎఱిఁగె అని ఉండగా, 'ప్రథమేతరవిభక్తి శత్రర్థచువర్ణంబులం దున్నయుకారంబునకు...' అనేసూత్రంచేత రావలసినసంధి ప్రస్తుతసూత్రాన్ని అనుసరించి రాదు. కాబట్టి ద్రుతం మీదిఅచ్చుతో కలిసి 'నను నెఱిఁగె' అని అవుతుంది. ఇలాగే నిను నడిగి, తము నెఱిఁగి మొ.

'ద్విత్వరహితం బగు' అనటంచేత ద్విత్వసహిత మైనపుడు ఈనిషేధం లేదు. నన్నున్+ఎఱిఁగె=న న్నెఱిఁగె.(నన్ను నెఱిఁగె) మొ.

'ద్వితీయావిభక్తి' అనటంచేత ఇతరవిభక్తులలో ఈనిషేధం లేదు. నాకొఱకున్+ఇచ్చె = నాకొఱ కిచ్చె, నాకొఱకు నిచ్చె. రాముఁడు+అతఁడు = రాముఁ డతఁడు. మొ.

'ఉకారమునకు' అనటం స్పష్టతకే. (ప్రథమేతరవిభక్తులలోని ఉకారేతర మైనఅచ్చుకు సంధికి ప్రాప్తే లేదు. రాముని నడిగెను, వనమున నొక్కడు మొ.)

'అచ్చు పరం బగునపుడు' అనటం కూడ స్పష్టతకే. హల్లు లేదా అవసానం పర మైనపుడు (పరరూప)సంధికి ప్రాప్తే లేదు. ద్రుతకార్యాలు మొద లైనసంధికార్యాలు ద్విత్వం లేకపోయినా వస్తాయి. నను మించెను మొ. అచ్చు పరం బగునపుడు అనేదళం చెప్పకపోయినా అనర్థం లేదు.

# ప్రౌఢవ్యాకరణం - రూపప్రక్రియావివరణం

## సంజ్ఞాపరిచ్ఛేదం

**1. అంటితి నమ శ్శివాయ పాపాత్మురాలి:** (సం. 15) 'అంటితి పాపాత్మురాలి' అనే తెలుగువాక్యం మధ్యలో 'నమ శ్శివాయ' అనేసంస్కృతవాక్యం అనుకరణం లేకుండా ప్రయోగింపబడింది. ('న పదా న్యవ్యయ సుప్ తిఙ్ క్త్వా తుమునామ్, అనుకృతే కస్తి వాక్యం తు' అనే చింతామణిలక్షణం ప్రకారం) అనుకరణం లేకుండా సంస్కృతవాక్యాన్ని తెలుగులో ప్రయోగించుకోవడానికి వీలు లేదు. 'ఒకానొకచో ననుకరణవిరహితంబుగ సంస్కృతవాక్యంబు గానంబడియెడి' అనేసూత్రంప్రకారం పైప్రయోగం సాధువు అవుతున్నది.

**2. అకారము:** (సం. 2) 'అ' అనేవర్ణానికి ఉచ్చారణంలో 'నిర్దేశవిధా నోచ్చారణంబులం దఱచుగ అవర్ణాదులు కారప్రత్యయాంతములును రవర్ణ మిఫప్రత్యయాంతము నగు' అనేసూత్రంచేత 'కార' ప్రత్యయం వచ్చి 'అకార' అని అవుతుంది. (తద్ధిత ప్రత్యయాంత మయిన ఈప్రాతిపదిక అదంత మయిన అమహద్వాచకం కాబట్టి) ప్రథమావిభక్తి ఏకవచనవివక్షలో 'అమహన్నపుంసకముల కదంతములకు మువర్ణకం బగు' అనేసూత్రంచేత ముప్రత్యయం వచ్చి 'అకారము' అని అవుతుంది.

**3. అకారమునకు ఉకారము వచ్చును: ఆకు ఊ వచ్చును :** (సం. 3) 'అ' అనే వర్ణానికి 'ఉ' అనేవర్ణం వస్తుంది. అని దీని కర్థం. ఇందులో 'అ' నిర్దేశం. 'ఉ' విధానం. ఈరెండింటికి 'ఒకచో హ్రస్వంబు దీర్ఘం బగు' అనేసూత్రంచేత దీర్ఘం వచ్చి 'ఆకు ఊ వచ్చును'. దీర్ఘం రాకపోతే 'నిర్దేశవిధానోచ్చారణంబులం దఱచుగ అవర్ణాదులు కారప్రత్యయాంతములును, రవర్ణ మిఫప్రత్యయాంతము నగు' అనేసూత్రంచేత కారప్రత్యయం వచ్చి 'అకారమునకు ఉకారము వచ్చును' అని అవుతుంది.

**4. కఱకంఠుడు:** (సం. 9) కఱ అయిన కంఠము కలవాడు అనేఅర్థంలో కఱ అనే అచ్చతెలుగుశబ్దానికి కంఠము అనేసంస్కృతసమశబ్దానికి బహువ్రీహి సమాసం ఏర్పడింది. తెలుగులో మిశ్రబహువ్రీహి 'స్త్రీసమఘటితంబ...బహువ్రీహి' అనేలక్షణానికి విరుద్ధం. కాబట్టి 'లక్షణవిరుద్ధం బగుభాష గ్రామ్యంబు' అనేసూత్రం ప్రకారం గ్రామ్యం. అయినా నన్నయ ప్రయోగించాడు. కాబట్టి 'ఆర్యవ్యవహారంబుల

దృష్టంబు గ్రాహ్యంబు' అనేసూత్రంచేత గ్రహింపదగినదే అని చిన్నయసూరి పేర్కొన్నాడు.

'తద్భవములందును నలఘురేఫము గలదు' అని ప్రౌఢవ్యాకర్త 'గరళకంఠ' అనేసంస్కృతసమాసంనుండి 'కఱకంఠ' అనేపదం మొత్తం తద్భవంగా ఏర్పడిం దని (ఆతద్భవంలో శకటరేఫ ఉన్న దనీ) చెప్పాడు. అప్పుడు ప్రకృతి అయిన గరళకంఠ శబ్దంవలె తద్భవ మైన 'కఱకంఠ' శబ్దం బహువ్రీహి అవుతుంది. ఇక్కడ కఱ - కంఠము అనేవాటికి తెలుగులో సమాసం చేయడం అనే విధానమే లేదు. కాబట్టి ఇది మిశ్రబహువ్రీహి కాదు, లక్షణవిరుద్ధమూ కాదు, కాగా 'కఱకంఠుడు బహువ్రీహి' గ్రామ్యమే కాదు. అని ప్రౌఢవ్యాకర్తమతం.

**5. కవిలకన్నులు(కవిలగడ్డము-కవిలజడలు):**(సం.13) ఈశబ్దాలను సూరి కపిల కన్నులు ఇత్యాదిగా కపిలశబ్దంతో (పకారమధ్యంగా) గ్రహించాడు. అపుడు కపిల అనేసంస్కృతశబ్దానికి కన్నులు, (గడ్డము, జడలు) అనేఅచ్చతెలుగుశబ్దంతో సమాస మవుతుంది. అటువంటిసమాసం లక్షణానికి విరుద్ధం. కాబట్టి గ్రామ్యం. అయినా నన్నయ ప్రయోగించాడు. కాబట్టి 'ఆర్యవ్యవహారంబుల దృష్టంబు గ్రాహ్యంబు' అని గ్రహించదగినదే. అని సూరిమతం. సూరిమతంలో ఇక్కడ 'కపిల' అని పకారం ఉంటుంది.

'కపిలశబ్దభవంబు కవిలశబ్దం బొందు కానంబడెడి' అనేసూత్రంప్రకారం కపిల శబ్దంనుండి పుట్టి తద్భవ మయినఅచ్చతెలుగుకవిలశబ్దానికి, కన్నులు శబ్దంతో సమాస మయింది. ఇవి రెండు అచ్చతెలుగుశబ్దాలే కాబట్టి ఈసమాసం లక్షణబద్ధమే. కాబట్టి గ్రామ్యం కాదు. అని ప్రౌఢవ్యాకర్తమతం. ప్రౌఢ.మతంలో ఇక్కడ కవిల అని వకారం ఉంటుంది.

**6. కాదన కిట్టి:** (సం.8) (కాదు) అనక+ఇట్టి. ఇక్కడ అనుధాతువుపై వ్యతిరేక క్త్వార్థంలో 'క'ప్రత్యయమూ, ముందు అత్వమూ కలిసి అక (ప్రత్యయం) రాగా 'అనక' అని అయింది. కాబట్టి అనక అనేది అకప్రత్యయాంతం. 'అకప్రత్యయాం తావ్యయంబు కళయు' అనేసూత్రం చేత ఇది కళ. అనక+ఇట్టి అనేచోట 'అత్తునకు సంధి బహుళంబుగా నగు' అనేసూత్రంచేత సంధి జరిగి 'అన కిట్టి' అయింది. సంధి జరిగింది కాబట్టి ఇది కళ.

(ద్రుతప్రకృతికం అయితే అనకన్+ఇట్టి అని ఉండాలి. 'అత్తునకు- రావలసిన సంధి 'ఇకాదులకుఁ దప్ప ద్రుతప్రకృతికములకు సంధి లేదు' అనేసూత్రంచేత

రాదు. అపుడు 'అనక నిట్టి' అని ఉండాలి.)

**7. కారము:** (సం.10) 'సంస్కృతప్రాకృతతుల్యం బగుభాష తత్సమంబు' అని సూత్రించి, సూరి (కటుః)కారో–కారము అని కారము అనేశబ్దం కారో అనేప్రాకృతానికి తుల్య మనీ, తత్సమ మనీ పేర్కొన్నాడు.(అయినా ప్రాకృతసమం కాబట్టి ఆచ్ఛికమే).

'కారము క్షారశబ్దభవము' అని సూత్రించి ప్రౌఢవ్యాకర్త 'క్షార' అనేసంస్కృతశబ్దం నుంచి పుట్టిం దన్నాడు. తెలుగు 'కారము' తద్భవం (సంస్కృతభవం) అని ప్రౌఢవ్యాకర్త మతం.

క్షారశబ్దానికి తెలుగులోని 'కారము' అనేఅర్థం లేకపోవడంచేత రూపసామ్యమే కాని, అర్థసామ్యం లేదు. అవి రెండూ ఉన్న తత్సమం (ప్రాకృతసమం) అనేసూరిమతమే యుక్తం.

**8. కోట:** (సం.11) 'త్రిలింగదేశవ్యవహారసిద్ధం బగుభాష దేశ్యంబు' అని సూత్రించి సూరి 'కోట' శబ్దాన్ని ఉదాహరణల్లో చూపాడు. కాబట్టి కోటశబ్దం దేశ్యం అని సూరిమతం.

'కోటపేఁటలు వైకృతములు' అని ప్రౌఢవ్యాకర్త కోటశబ్దం తద్భవం అన్నాడు. 'కోట్టార ఘట్ట హట్టా శ్చ' అనే నిఘంటువునుబట్టి సంస్కృతంలో 'కోట్ట' అనేశబ్దం ఉంది. దానినుండి తద్భవంగా తెలుగులో 'కోట' శబ్దం పుట్టింది.

సంస్కృతంలోనే 'కోట' అనేశబ్దం కూడా ఉంది. ఒకవేళ దానినుంచి కలిగినా తెలుగులోని కోట తద్భవమే. (సంస్కృతం కోటతో సమంగా ఉంది కదా అని తెలుగు కోట తత్సమం అనుకోగూడదు. సంస్కృతంలోని 'కుండ' అనేశబ్దం ఏమార్పులు లేకుండా సమంగా ఉన్నా తెలుగులో 'కుండ' తద్భవ మయింది. అలాగే కోట కూడా.) కోట్ట లేదా కోట అనే సంస్కృతశబ్దంనుంచి పుట్టిం దనీ, తెలుగులో కోట తద్భవమే కాని సూరి చెప్పినట్లు దేశ్యం కా దనీ ప్రౌఢవ్యాకర్తమతం.

**9.జయ పూతనాఘాత (జయ నారాయణ, జయ దైత్యదమన):** (సం.16) జయ అనేది మధ్యమపురుష ఏకవచనాంత మయినసంస్కృతక్రియాపదం. పూతనాఘాత అనేది సంబోధనాంత మైనతెలుగు(తత్సమ)పదం. సంస్కృతపదం అనుకరణం లేకుండా తెలుగులో ప్రయోగించడానికి వీలు లేదు. 'జయపదం బనుకరణవిరహితంబ తఱచుగ నగు'. అనే ప్రౌఢవ్యాకరణసూత్రంప్రకారం 'జయ' అనేసంస్కృతపదం అనుకరణం లేకుండానే తెలుగులో ప్రయోగించడం సాధువు

అవుతున్నది.

**10. పాండురాజయశము:**(సం. 5) 'ఒకానొకచో జకారం బుభయంబు నగు' అనేసూత్రంప్రకారం 'పాండురాజయశము' అనేశ్లేషస్థలంలోనిజకారం, దంత్యమూ, తాలవ్యమూ రెండూ అయిం దని ప్రౌఢవ్యాకరణమతం.

పాండురాజ! (యశము) అనేవిధంగా భారతార్థంలో 'రాజ'శబ్దంలోనిజకారం దంత్యం. 'మఱియు రాజుశబ్దం బొక్కటి దంత్యయుక్తంబు గానంబడియెడి' అని బాలవ్యాకరణం చెప్పింది. కాబట్టి (పాండు) రాజ శబ్దంలో జకారం దంత్యం.

పాండుర – అజయశము అనేవిధంగా రామాయణార్థంలో 'అజ' శబ్దంలోని జకారం తాలవ్యం. (సంస్కృతంలో దంత్యచజలు లేవు.) భారతార్థంలో దంత్యమూ, రామాయణా ర్థంలో తాలవ్యమూ రెండు విధాలు అయింది. కాబట్టి ఈశ్లేషస్థలంలోని జకారం ఉభయం అని ప్రౌఢవ్యాకర్తమతం.(రాజు అని ఉదంతంగా ఉన్నపుడే దంత్యం. కాబట్టి పాండురాజ లో భారతార్థంలో కూడా తాలవ్యమే. ఉభయం కాదు.)

**11. పేఁట:** (సం. 11) 'త్రిలింగదేశవ్యవహారసిద్ధం బగుభాష దేశ్యంబు' అని సూత్రించి సూరి 'పేట'అనేశబ్దాన్ని ఉదాహరణల్లో ఇచ్చాడు. కాబట్టి పేటశబ్దం దేశ్యం అని సూరిమతం.

'కోటపేఁటలు వైకృతములు' అని ప్రౌఢవ్యాకర్త పేఁట శబ్దం తద్భవం అన్నాడు. 'పింఠా విటజనాశ్రయః' అనే నిఘంటువునుబట్టి సంస్కృతంలో పింఠాశబ్దం ఉంది. దానినుంచి తద్భవంగా తెలుగులో పేఁటశబ్దం పుట్టింది.

పింఠ అంటే విటు లుండేచోటు. తెలుగులో పేఁట అంటే సామాన్యజనావాసం అని అర్థం మారింది. ఇలా ప్రకృతిశబ్దార్థం వికృతిలో మారడం అక్కడక్కడా ఉంది. కాబట్టి ఇది తద్భవమే అని ప్రౌఢవ్యాకర్తమతం.

సూరి ఉదాహరించిన 'పేట' శబ్దంలో అరసున్న లేదు. (పింఠలో నిండుసున్నపేఁ టలో అరసున్న అయింది.) కాబట్టి బిందువు లేని పేట సూరి చెప్పినట్లు దేశ్యం, అరసున్న ఉన్న పేఁటశబ్దం ప్రౌఢవ్యాకర్త చెప్పినట్లు తద్భవం.

**12. ప్రాణగొడ్డము:** (సం. 12) ప్రాణ అనే కేవలసంస్కృతశబ్దానికి, గొడ్డము అనేవికృతిశబ్దంతో సమాసం చేయడంవల్ల ప్రాణగొడ్డము అని ఏర్పడింది. కాని ఇలా సమాసం చేయడం 'కేవలసంస్కృతశబ్దంబు వికృతిశబ్దంబుతోడ సమసింపదు' అనేలక్షణానికి విరుద్ధం. కాబట్టి 'లక్షణవిరుద్ధం బగుభాష గ్రామ్యంబు' అనేసూత్రంచేత గ్రామ్యం. అయినా తిక్కనమహాకవి ప్రయోగించడంచేత 'ఆర్యవ్యవహారంబుల

దృష్టంబు గ్రాహ్యంబు' అనేసూత్రంచేత గ్రహింపదగినది అని సూరి పేర్కొన్నాడు

'ప్రాణగొడ్డ మగ్రామ్యంబు నాఁ దగు' అనేసూత్రంచేత 'ప్రాణకుట్టక' అనేసంస్కృత శబ్దంనుంచి తద్భవంగా ప్రాణగొడ్డము ఏర్పడిం దనీ, ఇక్కడ తెలుగులో సమాసం చేయడం అనేప్రక్రియే లేదు, కాబట్టి ఇది గ్రామ్యమే కా దనీ ప్రౌఢవ్యాకర్తమతం.

**13. మొక్కేము సామి:** (సం. 14) వ్యాకరణం సాధిస్తున్న 'మ్రొక్కెదము' అనేరూపానికి భిన్నంగా ఉన్న మొక్కేము అనేపదం 'లక్షణవిరుద్ధం బగుభాష గ్రామ్యంబు' అనేసూత్రం ప్రకారం గ్రామ్యం. కాబట్టి కావ్యాలలో ప్రయోగించడానికి వీలు లేదు. 'గ్రామ్యంబు తత్తజ్జాతివర్ణనంబునం బ్రయోగార్హం బగు' అనేప్రౌఢవ్యాకరణ సూత్రంచేత కిరాతజాతిసంభాషణలో ఈగ్రామ్యపదప్రయోగం సాధు వవుతున్నది.

**14. రేఫము:** (సం. 2) 'ర' అనేవర్ణంమీద 'నిర్దేశవిధానోచ్చారణంబులం దఱచుగ అవర్ణాదులు కారప్రత్యయాంతంబులును రవర్ణ మిఫప్రత్యయాంతంబు నగు' అనేసూత్రంచేత 'ఇఫ' అనేప్రత్యయం వచ్చి ర–ఇఫ . ఇఫ అనేది సంస్కృతప్రత్యయం. కాబట్టి ఇక్కడ సంస్కృతం ప్రకారం గుణసంధి జరిగి 'రేఫ' అవుతుంది. (తద్ధితాంత మయిన) ఈప్రాతిపదికపై ప్రథమావిభక్తి ఏకవచనంలో తెలుగులో 'అమహ న్నపుంసకములకు– అనేసూత్రంచేత మువర్ణకం వచ్చి రేఫము అని అవుతుంది.

# సంధిపరిచ్ఛేదం

**1. అందచందములు:** (సంధి. 6) అందమును, చందమును అనే అర్థంలో ద్వంద్వసమాసం ఏర్పడి, సమాసవిభక్తి లోపించి, అంద + చంద అని ఉండగా, 'ద్వంద్వంబునం బదంబుపయి పరుషములకు గసడదవ లగు' అనే (బాల.) సూత్రంచేత నిత్యంగా గసడదవాదేశం రావలసిఉండగా 'కొన్నియెడల ద్వంద్వంబునం బదంబుమీఁది చతపలకు సదవలు గానంబడవు' అనే(ప్రౌఢ)సూత్రంచేత(సకార) ఆదేశం రాక, అందచంద. ఈసమాసప్రాతిపదిక పథమావిభక్తి (బహువచనం)లో అందచందములు.

**2. అందిమ్ము:** (సంధి. 2) అంది+ ఇమ్ము అని ఉండగా 'క్త్వార్థం బైనయిత్తునకు సంధి లేదు' అనేబాలవ్యాకరణలక్షణంచేత సంధి రాదు. కాబట్టి 'సంధి లేనిచోట స్వరంబు కంటెం బరం బయినస్వరంబునకు యడాగమం బగు' అనేసూత్రంచేత యడాగమం వచ్చి అందియిమ్ము అని కావలసిఉండగా, 'ఇప్రత్యయాంతావ్యయంబు నకు సంధియుఁ జూపట్టెడి' అనే సూత్రంచేత సంధి జరిగి, 'అందిమ్ము' అని కూడా

అవుతుం దని ప్రౌఢవ్యాకర్తమతం.

**3. అన్నిష్టసఖి :** (సంధి.9) అను+ఇష్టసఖి అని ఉండగా 'ఉత్తున కచ్చు పరం బగునపుడు సంధి యగు' అనేసూత్రాన్ని బాధించి 'ఉదంత మగు తద్ధర్మార్థకవిశేషణముల కచ్చు పర మగునపుడు నుగాగమం బగు' అనేసూత్రంచేత నుగాగమం వచ్చి 'అనునిష్టసఖి' అని బాలవ్యాకరణాన్నిబట్టి ఏర్పడుతుంది.

అను+ఇష్టసఖి అని ఉండగా (నుగాగమాన్ని కూడా బాధించి) 'తఱచుగఁ గర్మధారయసమాసంబునం బెన్వాదులకడహల్లున కచ్చు పరం బగునపుడు ద్విత్వంబు గానంబడియెడి' అనేప్రౌఢ.సూత్రంచేత అచ్చు లోపించి (అన్+ఇష్ట) కడహల్లుకు ద్విత్వం వచ్చి (అన్న్+ఇష్ట) అన్నిష్టసఖి అని అవుతుంది. ద్విత్వం రానిపక్షంలో నుగాగమం వచ్చి, అనునిష్టసఖి.

**4. అన్పురంబు:** (సంధి.13) అను+పురంబు అని ఉండగా, 'అనుకొను లోనగు ధాతుజవిశేషణములయంత్యోకారమునకు హల్లు పరం బగునపుడు లోపంబు వైకల్పికంబు' అనేసూత్రంచేత ఉత్వం లోపించగా 'అన్ పురంబు' అవుతుంది. వైకల్పికం అనడంచేత ఉత్వం లోపింపనిపక్షంలో– 'అనుపురంబు' అని ఉంటుంది.

**5. ఆ డిదె:** (సంధి.18) ఆడుము+ఇదె, అని ఉండగా 'ఉత్తున కచ్చు పరం బగునపుడు సంధి యగు' అనేసూత్రాన్ని బాధించి 'మధ్యమపురుషమువర్ణకంబున కచ్చు పరం బగునపుడును గొన్నియెడల లోపంబు చూపట్టెడి' అనేసూత్రంచేత మువర్ణకం లోపించి, ఆడు+ఇదె, ఇపుడు 'ఉత్తున కచ్చు పరం బగునపుడు' అనేసూత్రం చేత సంధి జరిగి, 'ఆ డిదె' అని అవుతుంది. 'కొన్నియెడల, చూపట్టెడి' అనడంచేత మువర్ణకం లోపించనిపక్షంలో – ఆడుము+ఇదె, ఉత్వసంధి జరిగి, ఆడు మిదె అని అవుతుంది.

(ఆడితె అనేముద్రితపాఠమే అర్థవంతం కావడంచేత ఇక్కడ 'ము' లోపం లేదు.)

**6. ఇంద్రు న్వలెన్:** (సంధి.5) ఇంద్రుని(యొక్క) వలె అనేషష్ఠీసమాసంలో 'షష్ఠీసమాసమందలినిలలమీదియచ్చులకు హల్లు పరం బగుచోఁ గొన్నియెడల లోపంబు గానంబడియెడి' అనేసూత్రంచేత 'ని' వర్ణంలోని ఇకారం లోపించగా ఇంద్రున్ వలెన్. 'కానంబడియెడి' అనడంచేత లోపం రానిపక్షంలో 'ఇంద్రునివలెన్'.

**7. ఎటిం గెటింగి:** (సంధి.3) ఎటింగి+ఎటింగి అని ఉండగా 'అచ్చున కామ్రేడితంబు పరం బగునపుడు సంధి తఱుచుగ నగు' అనేసూత్రంచేత ప్రాప్తిస్తున్న

సంధిని బాధించి 'క్త్వార్థం బయినయిత్తునకు సంధి లేదు' అని సంధి నిషేధం రాగా, దానిని బాధించి 'ఇప్రత్యయాంతావ్యయంబునకు సంధియుఁ జూపట్టెడి' అనే ప్రౌఢ.సూత్రంచేత సంధి జరిగి, 'ఎటిం గెటింగి' అని అవుతుంది. సంధి రానిపక్షంలో యడాగమం వచ్చి, 'ఎటింగి యెటింగి' అని తఱుచుగా ఉంటుంది.

**8. ఎల్లన్ శిష్యులన్:** (సంధి. 7) 'సర్వపర్యాయం బయినయెల్ల శబ్దంబు ద్రుతాంతం బయినయవ్యయంబు, దీని కసమాసంబున విశేష్యంబునకు ముందు ప్రయోగంబు లేదు.' అనేసూరిలక్షణంచేత సమాసం చేయకపోతే ('శిష్యులన్' అనే) విశేష్యానికి పూర్వంలో ఎల్లన్ అనేవిశేషణం ప్రయోగించడానికి వీలు లేదు. 'శిష్యుల నెల్లన్' అని 'ఎల్లన్ విశేష్యానికి తర్వాత ఉండాలి. (ముందు ప్రయోగించా లంటే సమాసం జరిగి ద్రుతం లోపించి, 'ఎల్ల శిష్యులన్' అని ఉండాలి.) కాగా ఎల్లన్ శిష్యులన్ అని ఉండడం సూరిమతంలో లక్షణవిరుద్ధం.

'సర్వపర్యాయం బయినయెల్లశబ్దమునకు సప్తమియు, అసమాసంబున విశేష్యంబునకు ముందు ప్రయోగంబునుం జూపట్టెడు' అనేప్రౌఢ.సూత్రంచేత సమాసం కాకపోయినా ఎల్లన్ విశేష్యానికి పూర్వంలో ప్రయోగించడం సాధువు.

ఇందులో ఎల్లన్ విశేష్యం. శిష్యులన్ విశేషణం. ఇది బాలవ్యాకరణలక్షణాను గుణం.

**9. ఎల్లయందు:** (సంధి. 16) 'సర్వపర్యాయం బయినయెల్లశబ్దంబు ద్రుతాంతం బయిన యవ్యయంబు' అనేబాలవ్యాకరణలక్షణంచేత ఈ 'ఎల్లన్' అవ్యయం. 'అవ్యయము లనగా లింగ విభక్తి వచన శూన్యములు. కాబట్టి ఎల్లశబ్దం మీద విభక్తులు ఉండడానికి వీలు లేదు. కాని 'ఎల్లయందు' అనేచోట ఎల్లశబ్దంమీద 'అందు' అనేసప్తమీవిభక్తి కనబడుతున్నది. అది సూరి చెప్పినలక్షణానికి విరుద్ధం.

'సర్వపర్యాయం బయినయెల్లశబ్దమునకు సప్తమియు. అసమాసంబున విశేష్యంబునకు ముందు ప్రయోగంబునుం జూపట్టెడు' అనేప్రౌఢ. సూత్రంచేత 'అందు' అనే సప్తమీవిభక్తితో (ద్రుతం పోయి, యడాగమం వచ్చి, 'ఎల్లయందు' అని అవుతుంది.

**10. కనకన మను:** (సంధి. 19) కనకన+అను, అని ఉండగా 'అత్తునకు సంధి బహుళంబుగా నగు' అని ప్రాప్తిస్తున్న అత్వసంధిని బాధించి 'ధ్వన్యనుకరణశబ్దముల కనుధాతువు పరం బగుచోఁ గొన్నియెడల ముగాగమం బగు' అనేసూత్రంచేత కనకన అనేధ్వన్యనుకరణశబ్దానికి చివర మకారం ఆగమంగా చేరి కనకనమ్+అను,

'కనకన మను' అని అవుతుంది. ఆగమం నిత్యం కాబట్టి, 'కనక నను', అని సంధి అయినరూపం గానీ, 'కనకన యను' అని సంధి రాక యడాగమం అయినరూపం గానీ ఉండదు.

**11. చిట్టడవి:** (సంధి.4) చిఱు+అడవి అని ఉండగా (ఉత్త్వసంధిని, టుగాగమాన్నీ బాధించి) 'కుఱు చిఱు కడు నడు నిడు శబ్దంబుల ఱడల కచ్చు పరం బగునపుడు ద్విరుక్తటకారం బగు' అనేసూత్రంచేత 'ఱు' వర్ణం స్థానంలో 'ట్ట్' ఆదేశ మై చిట్టడవి అవుతుంది. ఇందులో మొదటిపదం 'చిఱు' అనీ, అందులో ఱు వర్ణానికి 'ట్ట్' ఆదేశ మవుతుం దనీ సూరిమతం.

'చిట్టడవిఁ జిట్టి' అనేసూత్రాన్నిబట్టి చిట్టడవి మొ.వాటిలో పూర్వపదం చిట్టి. కాబట్టి చిట్టి+అడవి అని ఉండగా 'ఇవి సంజ్ఞావాచకములు గావున సంధి నిత్యము' అనే సూత్రకర్తవివరణాన్నిబట్టి సంధి నిత్యంగా జరిగి చిట్టడవి అవుతుంది. ఇందులో పూర్వపదం చిట్టి అనీ, సంజ్ఞలలో దీనికి అచ్చు పర మైనపుడు సంధి నిత్యంగా వస్తుం దనీ ప్రౌఢ.మతం.

సూరిప్రక్రియ సమగ్రమూ, చరిత్ర కనుగుణమూ కనుక యుక్తం.

**12. తామరపాకు:** (సంధి.8) తామర+ఆకు అని ఉండగా 'అత్తునకు సంధి బహుళంబుగా నగు' అనేసూత్రంచేత ప్రాప్తిస్తున్న సంధిని బాధించి, 'తామర కాకు పరం బగునపుడు పుగాగమం బగు' అనేసూత్రంచేత పకారం పొల్లు ఆగమంగా చేరి, తామరప్+ఆకు=తామరపాకు అవుతుంది. (పుగాగమం రాకుండా అత్తుకు సంధి వస్తే తామరాకు, సంధి రాకపోతే యడాగమం వచ్చి తామరయాకు అని కూడా కావచ్చు.)

**13. నీకే బ్రాతియే:** (సంధి.16) ఏమి+బ్రాతియే అని ఉండగా, 'హలవసానం బులు పరంబు లగునపు డేమిశబ్దముయొక్క మికారమునకు లోపంబు వైకల్పికంబు' అనేసూత్రంచేత అవసానంలో 'మి'వర్ణం లోపించగా 'నీకే బ్రాతియే' అని అవుతుంది. వైకల్పికంబు అనడంచేత మివర్ణం లోపించనిపక్షంలో నీ కేమి బ్రాతియే అని ఉంటుంది.

**14. నె న్నడుము:** (సంధి.14) నెఱ+నడ అని ఉండగా 'అన్యంబులకు సహిత మిక్కార్యంబులు కొండొకచోఁ గానంబడియెడి' అనేబాలవ్యాకరణసూత్రంచేత 'నడ' పరంగా ఉండగా, నెఱలోని తొలియచ్చుమీదివర్ణాలు లోపించి (నె+నడ), మీదిహల్లుకు ద్విత్వం రాగా నెన్నడ. ఇందులో పూర్వపదం 'నెఱ' (నిం డైన) అని బాలవ్యాకరణం మతం.

'నె న్నడాదులన్ నెఱి దగు' అనేసూత్రంప్రకారం ప్రౌఢ.మతంలో 'నెఱి+నడ' అని ఉండగా తొలియచ్చుమీదివర్ణాలు లోపించి, పైహల్లుకు ద్విత్వం వచ్చి, నెన్నడ అని అవుతుంది. ఇందులో పూర్వపదం సూరి చూపిన 'నెఱ' కా దనీ, 'రమ్య మైన' అనే అర్థా న్నిచ్చే 'నెఱి' అని సవరించిన ప్రౌఢ.మతం బాగానే ఉంది.

**15. పెన్నరదము:** (సంధి.9) పెనుపు అనేవిశేషణానికి అరదము అనేవిశేష్యంతో కర్మధారయసమాసం ఏర్పడి విభక్తిలోపాదులు వచ్చి పెను+అరద అని ఉండగా ఉత్త్వసంధిని బాధించి రావలసినటుగాగమాన్ని బాధించి, 'తఱచుగఁ గర్మధారయ సమాసంబునం బెన్వాదులగడహల్లున కచ్చు పరం బగునపుడు ద్విత్వంబు గానంబడియెడి' అనేసూత్రంచేత (ఉత్వం లోపించి, పెన్+అరద) చివరిహల్లుకు ద్విత్వం వచ్చి, పెన్నరదము అని అవుతుంది. ఇది తఱచు. కాబట్టి ఇక్కడ పెనుటరదము, లేదా పెనరదము అనేరూపాలు ఉండవు.

**16. పోపొమ్ము:** (సంధి.23) పొమ్ము+పొమ్ము అని ఉండగా 'ఆమ్రేడితంబు పరం బగునపుడు మధ్యమముడుజులకు లోపంబు విభాష నగు' అనేసూత్రంచేత 'మ్ము'వర్ణకం లోపించి, 'పొ+పొమ్ము'. 'ఆమ్రేడితంబు పరం బగునపుడు కృత హ్రస్వంబునకు దీర్ఘం బగు' అనేసూత్రంచేత దీర్ఘం వచ్చి 'పోపొమ్ము' అని అవుతుంది. విభాష అనడంచేత 'మ్ము' వర్ణానికి లోపం రానిపక్షంలో కృతహ్రస్వానికి ఆమ్రేడితం పరంగా లేదు. కాబట్టి దీర్ఘం కూడా రాదు. లెమ్ములెమ్ము అని ఉంటుంది.

**17. బచ్చింట:** (సంధి.10) బచ్చుయొక్క అనే షష్ఠ్యంతానికి 'ఇల్లు' అనేమీదిపదంతో షష్ఠీతత్పురుషసమాస మేర్పడి, విభక్తి లోపించి బచ్చు+ఇల్లు అని ఉండగా, ఉత్త్వసంధిని బాధించి, షష్ఠీసమాసంబునం దుకారబుకారంబుల కచ్చు పర మగునపుడు నుగాగమం బగు' అనే సూత్రంచేత నుగాగమం వచ్చి, బచ్చున్+ఇల్లు అని కాగా, 'కొన్నిచోట్ల షష్ఠీసమాసంబునం దుకారంబున కచ్చు పరం బగునపుడు నుగాగమంబు నకు లోపంబు నగు' అనే ప్రౌఢ.సూత్రంచేత నుగాగమం లోపించి బచ్చు+ఇల్లు. 'ఉత్తున కచ్చు–' అనేసూత్రంచేత ఉత్త్వసంధి జరిగి బచ్చిల్లు. సప్తమీ ఏకవచనంలో బచ్చింట. 'లోపంబును' అనేచోటిసముచ్చయంచేత నుగాగమం లోపింపనిపక్షంలో బచ్చునిల్లు, బచ్చునింట అవుతుంది.

**18. మూన్నాళ్లు:** (సంధి.15) మూఁడు+నాళ్లు, అని ఉండగా 'కొన్నియెడల నవర్ణంబు పరం బగునపుడు పూర్వపదాంత్యడకారంబు నకారం బగు' అనేసూత్రంచేత (మూఁడు అనేపూర్వపదంలో చివరిఅచ్చు లోపించి, (మూఁడ్+నాళ్లు) డకారం

స్థానంలో నకారం ఆదేశంగా వచ్చి మూన్+నాళ్లు, 'సంస్కృతసమేతరంబు లయిన తెలుగుశబ్దములయందుఁ బరుషసరళములకు ముందే బిందువు గానంబడుచున్నది' అనేబాల.సూత్రంచేత స్థిరానికి ముం దున్నఅరసున్న లోపించి మూన్నాళ్లు అవుతుంది. నకారం రానిపక్షంలో, మూఁడునాళ్లు.

**19. లక్ష్మమ్మ:** (సంధి. 1) లక్ష్మి+అమ్మ అని ఉండగా 'శ్రేష్ఠతావాచకంబు లగునార్యాంబాద్యర్థకశబ్దంబులు పరంబు లగుచో నన్నియచ్చులకు సంధి నిత్యము' అనేసూత్రంచేత సంధి నిత్యంగా జరిగి, లక్ష్మమ్మ అని అవుతుంది.

**20. లతాంతములకు మ్మొనసి:** (సంధి. 22) లతాంతములకును+మొనసి, అని ఉండగా, ('ద్రుతమునకు సరళస్థిరంబులు పరంబు లగునపుడు లోపసంశ్లేషంబులు విభాష నగు' అనేసూత్రాన్ని బాధించి) 'ప్రాసంబున మకారంబు పరం బగుచో ద్రుతంబునకు మకారాదేశం బగు' అనేసూత్రంచేత 'ను' అనేద్రుతంమొత్తానికి మకారపుపొల్లు ఆదేశంగా వచ్చి, లతాంత ములకుమ్+మొనసి = లతాంతములకు మ్మొనసి అని అవుతుంది. ద్విత్వమకారప్రాసకంటె ఇతరస్థలాల్లో ద్రుతానికి లోపం వస్తే, లతాంతములకు మొనసి, సంశ్లేషం వస్తే, లతాంతములకు న్మొనసి, స్వత్వంతో, లతాంతములకును మొనసి, అని ఏర్పడతాయి.

**21. రామయ్య** :(సంధి. 9) రామ+అయ్య, అని ఉండగా ('అత్తునకు సంధి బహుళంబుగా నగు' అనేసూత్రంలోనిబహుళపదంచేత తత్సమాకారానికి సంధి రానిస్థితిలో) 'శ్రేష్ఠతావాచకంబు లగునార్యాంబాద్యర్థకశబ్దంబులు పరంబు లగుచో నన్నియచ్చులకు సంధి నిత్యము' అనే సూత్రంచేత సంధి నిత్యంగా జరిగి, రామయ్య అని అవుతుంది.

**22. వడవడ జమదగ్నిసూతి వడకెన్ :** (సంధి. 21) ('వడవడ' అనేది ధ్వన్యనుకరణశబ్దం. 'వడకుట' అనేక్రియలోని ధ్వనిని ఇది అనుకరిస్తున్నది. కాబట్టి 'వడవడ వడకెన్' అని ఇవి రెండూ ఎడం లేకుండా ప్రయోగింపబడడం సహజం. కాని) 'ఇయ్యవి క్రియావ్యవహితంబులు నగు' అనేసూత్రం ప్రకారం వడవడ అనే ధ్వన్యనుకరణశబ్దానికీ, వడకెన్ అనేక్రియాపదానికీ మధ్యలో 'జమదగ్నిసూతి' అనేపదం ప్రయోగించడంవల్ల క్రియతో వ్యవధానం ఏర్పడడం సాధువు అవుతున్నది.

**23. వింజామరము:** (సంధి. 12) వెల్ల+చామరము అని ఉండగా 'సమాసంబునం బ్రాఁతాదులతొలియచ్చుమీదివర్ణంబుల కెల్ల లోపంబు బహుళంబుగా నగు' అనే

సూత్రంచేత తొలియచ్చుమీఁదివర్ణాలు లోపించి, వె+చామర. (అదే సూత్రంలోని బహుళపదంచేత అన్యకార్యంగా) 'సమాసమునందు వర్ణవికారము'. 'వె' లోని ఎత్వానికి ఇత్వం ఆదేశ మై, 'వి+చామర'. 'సమాసమందుఁ దత్సమంబు పరం బగునపుడును నుమాగమాదులు గానంబడియెడి' అనేసూత్రంచేత నుమాగమం వచ్చి విను+చామర. ద్రుతకార్యా లయి, ప్రథమైకవచనంలో, వింజామరము.

**24. వీరల్ గోపించిన :** (సంధి. 5) వీరల్+కోపించిన అని ఉండగా 'ప్రథమమీఁదిపరుషములకు గసడదవలు బహుళంబుగా నగు' అనేసూత్రంచేత రావలసిన గసడదవాదేశం 'తెనుఁగులమీఁదిసాంస్కృతికపరుషములకు గసడదవలు రావు' అనేనిషేధంచేత రాదు. 'కొన్నియెడలఁ దెనుఁగులమీఁదిసాంస్కృతికకతపలకు గదవలు గానంబడియెడి' అనేప్రౌఢ.సూత్రంచేత కకారానికి గకారం ఆదేశ మై, 'వీరల్ గోపించిన' అని అవుతుంది. ఆదేశం రావడం అరుదు. కాబట్టి 'వీరల్ కోపించిన' అనేవిధంగా ఆదేశం రానిరూపాలే తఱచుగా ఉంటాయి.

**25. శిరసుపూ :** (సంధి. 11) 'పూ పూవు' అనేప్రౌఢ. సూత్రంప్రకారం తెలుగులో పూవుశబ్దానికి పర్యాయంగా అంటే పూవు అనేఅర్థంలో పూవుశబ్దంతోపాటు 'పూ' అనేశబ్దం కూడా ప్రత్యేకంగా ఉంది. 'శిరసు పూ' అనే కవిప్రయోగంలో సమాసంలో చివర 'పూ' అనేఏకాక్షరశబ్దం ప్రయోగింపబడింది. (ఇక్కడ 'సమాసంబునం బ్రాఁతాదులతొలియచ్చుమీది వర్ణాలు లోపించిం దనరాదు. ఈ'పూ'శబ్దం ప్రత్యేకం అని ప్రౌఢవ్యాకర్త అభిప్రాయం.)

**26. సర్వము న్నతని:** (సంధి. 3) సర్వమున్+అతని, అని ఉండగా ('ఉత్తున కచ్చు పరం బగునపుడు సంధి యగు' అనేసూత్రంచేత రావలసినసంధిని బాధించి 'ఇఁకాదులకుఁ దప్ప ద్రుతప్రకృతికములకు సంధి లేదు' అనేసూత్రంచేత సంధి రాదు.) 'కొన్నియెడలఁ బ్రామాణికప్రయోగంబుల ద్రుతంబున కచ్చు పరం బగుచో ద్విత్వంబు చూపట్టెడి' అనేప్రౌఢ.సూత్రంచేత ద్రుతంపైన ఇంకో నకారం చేరి, సర్వమున్న్+అతని = సర్వము న్నతని, అని అవుతుంది. 'కొన్నియెడల...చూపట్టెడి' అనడంచేత ద్విత్వం రానిపక్షంలో ద్రుతం మీదిఅచ్చుతో కలిసి 'సర్వము నతని' అని అవుతుంది.

## 3. శబ్దపరిచ్ఛేదం

**1. అప్రియంబులు గావించి:** 'అప్రియములు' అనేది విశేషణం. ఇక్కడ దీనివిశేష్యం ప్రయోగింపబడలేదు. 'విశేషణంబులు కొన్నియెడల విశేష్యలక్షకంబు లగు' అనే సూత్రంప్రకారం, ఈవిశేషణం అప్రియము లైనపనులు అనేవిధంగా పనులు అనేవిశేష్యాన్ని లక్షణావృత్తిచేత తెలియజేస్తుంది.

**2. ఓ వినువీధి నున్నఖచరోత్తములార!:** (ఉన్న) 'ఖచరోత్తములార' అనేసంబోధ్యవాచకానికి పూర్వంలో ' ఓ యామంత్రణంబునం దగు' అనేసూత్రంచేత 'ఓ' అనేశబ్దం ప్రయోగింపబడగా ఓ-ఖచరోత్తములార! ఓ శబ్దానికి ఖచరోత్తములార అనేసంబోధ్యవాచకానికీ మధ్యలో 'ఉన్న' అనేధాతుజవిశేషణంతో అన్వయించే 'వినువీధిన్' అనేశబ్దంతో, వ్యవధానం ఉంది. 'ఓశబ్దం బొక్కచో సంబోధ్యవాచకంబు నకు ముం దితరశబ్దవ్యవహితం బయి కానంబడియెడి' అనేసూత్రంప్రకారం ఇటువంటివ్యవధానం సాధువు.

**3. రమణిరొ :** 'రమణి' అనేది సంబోధ్యవాచకం. సంబోధనంలో దీనికి పరంగా 'రో శబ్దం బొందు సంబోధనంబున స్త్రీవాచకంబునకుఁ బరంబుగ నగు, అయ్యది హ్రస్వాంతంబును నయ్యెడి' – అనేసూత్రంచేత 'రో' అనేశబ్దం చేరగా, రమణిరో. ఈసూత్రంచేతనే దానికి హ్రస్వం వచ్చినపక్షంలో, రమణిరొ. సముచ్చయంచేత హ్రస్వం రానిపక్షంలో రమణిరో అని దీర్ఘం అలాగే ఉంటుంది. రోశబ్దం కూడ రాకుండా రమణీ, రమణి అనేవిధంగా కూడ ఉండవచ్చు.

**4. తల్లికాన :** 'తల్లి' స్త్రీని బోధించేశబ్దం. సంబోధనంలో దీనికి పరంగా 'దేశ్యంబులం గొన్నియెడల స్త్రీవాచక స్త్రీసమంబు లగుసంబోధ్యవాచకశబ్దంబులమీఁద నేకవచనంబునఁ గానశబ్దం బొందును, అల యనునవ్యయం బొందును గానంబడియెడి. అల దీర్ఘాంతంబు నగు' అనేసూత్రంచేత 'కాన' అనేశబ్దం చేరి తల్లికాన. 'కానంబడియెడి' అనడంచేత 'కాన'శబ్దం రానిపక్షంలో తల్లీ-తల్లి అని మొ. విధంగా ఉంటుంది.

**5. అన్నలా :** 'అన్న' సంబోధ్యవాచకం. దేశ్యశబ్దం. 'దేశ్యంబులం గొన్నియెడల స్త్రీవాచక స్త్రీసమంబు లగుసంబోధ్యవాచకశబ్దములమీఁద నేకవచనంబునఁ గానశబ్దం బొందును, అల యనునవ్యయం బొందును గానంబడియెడి, అల దీర్ఘాంతంబు నగు' అనేసూత్రంచేత 'అల'శబ్దం చేరి, దానికి చివర దీర్ఘం రాగా, అన్న+అలా. సంధి జరిగి, అన్నలా. సముచ్చయంచేత దీర్ఘం రానిపక్షంలో 'అన్నల' అని హ్రస్వాంతంగా కూడా ఉంటుంది.

**6. తత్త్వాలు ర్భయం బందఁగన్** : తత్త్వాలురు + భయం బందఁగన్ అని ఉండఁగా 'హలవసానంబులు పరంబు లగునపుడు లురువర్ణకంబులయుత్వంబునకు లోపంబు వైకల్పికంబుగ నగు' అనేసూత్రంచేత ఉత్వం లోపించగా, తత్త్వాలుర్ భయంబు అని అవుతుంది. వైకల్పికం కాబట్టి ఉత్వం లోపింపనిపక్షంలో తత్త్వాలురు భయంబు అని ఉంటుంది.

**7. మునినికాయము.... పూజించిరి** : 'మునినికాయము' అనేసమూహార్థకశబ్దం అమహత్కార్యంతో ఉండడంచేత అది కర్తగా గలిగిన క్రియకు కూడా అమహద్రూపమే కావలసిఉండగా, "మహత్సమూహార్థకశబ్దం బమహత్కార్యయుక్తం బయ్యెఁ దద్విశేషణ క్రియలు మహత్కార్యయోగ్యంబులు విభాష నగు' అనేసూత్రంచేత మహత్కార్యం గలిగి 'పూజించిరి' అని అవుతుంది. విభాష కాబట్టి మహత్కార్యం రానిపక్షంలో అమహత్కార్యం కలిగి 'పూజించెను' అని అవుతుంది.

**8. అర్థిమెయిన్:** అర్థి అనేశబ్దంమీద సహార్థంలో 'కరణసహార్థతుల్యార్థయోగంబులం దృతీయకుం దోడవర్ణకం బగు' అనేసూత్రంచేత 'తోడ' ప్రత్యయం వచ్చి, అర్థితోడ అని ఉండగా 'జడపదంబుమీఁదితోడకు మెయిమైలు వికల్పంబుగ నగు' అనేసూత్రంచేత తోడకు మెయి ఆదేశం అయి, అర్థిమెయిన్, మై అనేది ఆదేశ మైతే అర్థిమైన్, ఏదీ రాకపోతే అర్థితోడ.

**9. ఉత్సవము కేఁగెదు:** ఉత్సవశబ్దం షష్ఠీఏకవచనంలో ఉత్సవము+కును అని ఉండగా 'కువర్ణకంబు పరం బగునపు డుకారబుకారంబులకు నగాగమం బగు' అనేసూత్రంచేత రావలసిన నగాగమం 'కువర్ణకంబు పరం బగునపుడు కవిత్రయంబు వారిప్రయోగంబులం దక్కఁ దక్కినమహాకవిప్రయోగంబులందునుం గొన్నియెడల నగాగమంబు చూపట్టదు' అనేసూత్రా న్ననుసరించి నగాగమం రాకుండగా, ఉత్సవముకును, 'కొన్నియెడల చూపట్టదు' అనడంచేత నగాగమం వచ్చినపక్షంలో ఉత్సవమునకును.

**10. తత్క్రతుశతంబునకంటె :** తత్క్రతుశబ్దం పంచమి ఏకవచనంలో తత్క్రతు శతంబు + కంటె అని ఉండఁగా "కంటెవర్ణకము పరం బగునపుడును గొన్నియెడల నగాగమంబు చూపట్టెడి' అనేసూత్రంచేత నగాగమం వచ్చి, 'తత్క్రతుశతంబునకంటె' అని అవుతుంది. అరుదు గాబట్టి నగాగమం రానిపక్షంలో 'తత్క్రతుశతంబుకంటె' అని కూడా ఉంటుంది.

**11. జవ్వనంబునయందు:** జవ్వనశబ్దం సప్తమీ ఏకవచనంలో జవ్వనంబు+

అందు. ('ఉకారఋకారంబుల కందువర్ణకము పరం బగునపుడు నుగాగమం బగు' అనేసూత్రాన్ని బాధించి, 'ఆగమ ము వు వర్ణంబుల కందువర్ణకము పరం బగునపుడు నుగాగమంబు విభాష నగు' అనేసూత్రంచేత వచ్చే వైకల్పిక మైననుగాగమాన్ని బాధించి,) 'ఉదంతము లగునమహత్తుల కందువర్ణకము పరం బగునపుడు నగాగమంబు కొన్నియెడల గానంబడియెడి' అనేసూత్రంచేత నగాగమం వచ్చి, జవ్వనంబున+అందు. నగాగమవిధానసామర్థ్యంచేత అత్త్వసంధి రాదు. యడాగమం వచ్చి, జవ్వనంబునయందు. 'కొన్నియెడల' అనడంచేత నగాగమం రాకపోతే వైకల్పికనుగాగమం వచ్చి-జవ్వనంబునందు, జవ్వనంబందు అని కూడా ఉంటుంది.

**12. బాలిగాఁడు:** 'బాల' అనేశబ్దంమీద నీచార్థంలో ఏకవచనంలో 'తెనుఁగు నం గొన్ని తత్సమదేశ్యశబ్దములకంటెం బరంబుగ నేకవచనంబున నీచత్వద్యోతకం బయి యిగా యనునొక్కశబ్దంబును, దానిపై డువర్ణకాదులునుం జూపట్టెడి. సంబోధనంబున డువర్ణకంబు చూపట్టదు. తుదిదీర్ఘంబునకు హ్రస్వంబు వైకల్పికంబు' అనేసూత్రంచేత, పైన ఇగాశబ్దం చేరి, బాల+ఇగా. 'అంద్వవగాగమంబులం దప్ప–' అని సంధి జరిగి,బాలిగా. ప్రథమైకవచనంలో డుజ్ వచ్చి, బాలిగాఁడు.

**13. మల్లురు:** మల్ల ప్రాతిపదికపై ప్రథమాబహువచనవివక్షలో 'లువర్ణంబు బహువచనంబు' – మల్ల+లు. 'పుంలింగం బయి మహద్వాచకం బయిననామంబు తుదియత్వంబున కుత్వం బగు' – మల్లు+లు. 'ద్విత్వయుక్తలాంతంబుమీఁదిలులలకు రుర లాదేశంబు లగు' అనేసూత్రంచేత 'లు'వర్ణానికి 'రు' ఆదేశం కాఁగా 'మల్లురు'. ఆదేశం రాని 'మల్లులు' అనేరూపం కూడా ఉంది.

**14. ధర్మువు:** ధర్మ ప్రాతిపదిక. ప్రథమైకవచనవివక్షలో 'అమహన్నపుంసకముల కదంతములకు ముువర్ణకం బగు' అనేసూత్రాన్ని బాధించి' అర్థాదులకడయచ్చున కుత్వంబును మీఁద వువర్ణకంబును వైకల్పికంబుగా నగు' అనేసూత్రంచేత ఉత్వమూ, (ధర్ము) వువర్ణకమూ వచ్చి, ధర్మువు అవుతుంది. వైకల్పికం కాబట్టి ఇవి రాకపోతే ముువర్ణకం వచ్చి ధర్మము.

**15. రాహు:** 'రాహు' అనేశబ్దంమీద ప్రథమైకవచనాన్ని వివక్షించగా (పుంలింగ మగు మహద్వాచకంబునకు డు జగు' అనేసూత్రంచేత వచ్చే డుజ్‌ను బాధించి' ఉకారాంతగోశబ్దంబుల కంతట వువర్ణకం బగు' అనేసూత్రంచేత నిత్యంగా వచ్చే

వువర్ణాన్ని బాధించి,) 'ఉకారాంతం బగుమహుత్తునకు వువర్ణకం బహుళంబుగా నగు' అనేసూత్రంచేత బహుళంగా వువర్ణకం వచ్చినపక్షంలో 'రాహువు'. 'రాహుబాహు శబ్దంబుల కంతట వువర్ణకలోపంబు వైకల్పికంబు' అనేసూత్రంచేత వువర్ణకం లోపిస్తే రాహు. 'వు' లోపింపనిపక్షంలో రాహువు. బహుళ మైన 'వు' రాకపోతే డుఙ్ వచ్చి, రాహుఁడు.

**16. బాహు:** బాహు ప్రాతిపదిక. ప్రథమైకవచనవివక్షలో 'ఉకారాంత గోశబ్దంబుల కంతట వువర్ణకంబు బహుళంబుగా నగు' అనేసూత్రంచేత వువర్ణకం వచ్చి 'బాహువు' అని కాగా 'రాహుబాహుశబ్దంబుల కంతట వువర్ణకలోపంబు వైకల్పికంబు' అనేసూత్రంచేత వువర్ణకం లోపించగా, 'బాహు' అని అవుతుంది. వైకల్పికం కాబట్టి లోపం రానిపక్షంలో– బాహువు.

**17. అయ్యగారు:** అయ్య అనేదేశ్యశబ్దంమీద పూజ్యతలో 'తఱచుగా స్త్రీసమంబు లగుదేశ్యశబ్దంబులకుఁ గడపలఁ గొన్నింటి కేకవచనంబునం బూజ్యతయందు గారుశబ్దం బగు' అనేసూత్రంచేత 'గారు' అనేశబ్దం చేరి 'అయ్యగారు' అవుతుంది.

**18. శ్రీరాములవారు:** 'శ్రీరామ' శబ్దంమీద పూజ్యతలో 'డుమంతంబు లగు తత్సమాదిశబ్దములకుం గొన్నింటికి ద్వితీయాదిబహువచనంబుమీఁదం బూజ్యతయందు గారునకు మాఱుగ వా రగు' అనేసూత్రంచేత ద్వితీయా బహువచనాంత మైన 'శ్రీరాములన్' అనేరూపం వచ్చి, దానిమీద 'వారు' అనేశబ్దం చేరుతుంది. (నడుమ ద్రుతం లోపించి) శ్రీరాములవారు.

**19. అయ్యవారు:** అయ్య శబ్దంమీద ఉపాధ్యాయుడు మొద లైన విశేషార్థాలలో 'అర్థవిశేషంబునం దేకత్వంబునను గొన్నిశబ్దములమీఁద వారు చూపట్టెడు' అనేసూత్రం చేత 'వారు' అనేశబ్దం చేరి 'అయ్యవారు' అని అవుతుంది.

**20. మద్గురువుల నడిగిన:** మద్గురు అనేశబ్దంమీద ద్వితీయలో ఏకత్వంలో పూజ్యతను వివక్షించినపుడు 'పూజ్యతయం దొక్కచో 'నామతదేతద్యుష్మదస్మచ్ఛబ్దంబుల యేకవచనంబునకు బహువచనం బగు' అనేసూత్రంచేత బహువచనం రాగా 'మద్గురువులను' అని అవుతుంది.

**21 చూచివత్తమమ్మ సుదతులార! :** సుదతులార! అనేసంబోధ్యవాచకం బహువచనాంత మైనా, చూచివత్తము అనేక్రియాపదంపై ఉన్న అమ్మ అనేశబ్దం 'సంబోధ్యవాచకంబు బహువచనాంతం బయ్యుఁ గ్రియలమీఁదియమ్మాదు లేకవచనాంతంబుల యగు' అనేసూత్రా న్ననుసరించి ఏకవచనాంత మైంది.

**22. స్వామీ తాము దయచేయవలయును:** పూజ్యార్థంలో నీవు అనేదానికి 'పూజ్యతయం దొక్కచో నామతదేతద్యుష్మదస్మచ్ఛబ్దంబులయేకవచనంబునకు బహువచనం బగు' అనేసూత్రంచేత బహువచనం వచ్చి 'మీరు' అవుతుంది. 'పూజ్య తాతిశయంబున యుష్మదర్థ బహువచనంబునకు మాఱుగా నాత్మార్థబహువచనంబు ప్రయుక్తం బగు' అనేసూత్రంచేత ఆత్మార్థకబహువచనరూపం రాగా, 'తాము దయచేయవలయును' అని అవుతుంది.

**23. మాయత్త :** నాయొక్క అత్త అనేఅర్థంలో 'సంబంధంబున యుష్మదస్మ చ్ఛబ్దములకుం గొన్నియెడల బహుత్వం బగు' అనేసూత్రంచేత బహువచనం రాగా, సమాసంలో విభక్తి లోపించి, యడాగమ మై, మాయొక్క+అత్త=మాయత్త అవుతుంది.

**24. వారలు :** ఆ అనేప్రాతిపదికకు ప్రథమాబహుత్వంలో 'దేశ్యంబునం గొన్నియెడల మహన్మహత్యర్థకనామంబులపై మఱల బహువచనప్రత్యయంబులు చూపట్టెడు. అచ్చో వారు వీరు మీరు శబ్దంబులయంత్యోకారంబున కకారం బగు' అనేసూత్రంచేత, 'వారు' అనేరూప మై, దానిపై 'లు' అనేబహువచనం చేరి (వారు+లు), ముందు అత్వం రాగా, 'వారలు' అవుతుంది.

**25. పళ్యము:** 'పల్లియము' అనేశబ్దంలో "ముత్తియశబ్దేతరంబులయందును దఱచుగ నిత్వలోపంబు గానంబడియెడి' అనేసూత్రంచేత ఇత్వానికి లోపం రాఁగా, పళ్ళ్యము. భిన్నహల్సంయోగంలో సమానమైన నడిమిహల్లు (ళ కారం) లోపించి 'పళ్యము' అవుతుంది. లోపం రాకపోతే పళ్ళియము (పళ్ళెము).

**26. కోడండ్రురయందు:** కోడలు ప్రాతిపదిక. సప్తమీ బహుత్వంలో "దేశ్యంబునం గొన్నియెడల మహన్మహత్యర్థకబహువచనాంతనామంబులపై మఱల బహు వచనంబులు చూపట్టెడు' అనేసూత్రంచేత 'కోడండ్రు' అనేరూపం పొంది, దానిపై సప్తమీబహువచనం చేరి, 'కోడండ్రురయందు' అవుతుంది.

**27. ఎడ్లు:** 'ఎద్దు' ప్రాతిపదిక. ప్రథమాబహువచనవివక్షలో 'లువర్ణంబు బహువచనంబు' ఎద్దు+లు అని ఉండఁగా 'ఎద్దు దేవరశబ్దములకు లులలు పరంబు లగునపుడు దకారంబునకు డకారంబును డకారంబునుత్వంబునకు లోపంబును వైకల్పికముగాను రేఫమునకు ళకారమును ళకారంబునత్వంబునకు లోపంబును నిత్యముగాను గ్రమంబుగ నగు' అనేసూత్రంచేత దకారానికి డకార మై, ఉత్వం (ఒకడకారం) లోపించి ఎడ్లు. ఈకార్యం రాకపోతే ఎద్దులు.

**28. కొంత :** ఒక+అంత అని ఉండగా 'ఈ ఏ ఒక శబ్దములకంటెం బరం

బయినయంతశబ్దమునకారమునకు లోపం బగు, అగుచో నీయేలదీర్ఘమునకు హ్రస్వమును, ఒకకు వర్ణవ్యత్యయసంహితలు నగు'. అనేసూత్రంచేత అకారం లోపించి ఒక+ంత. వర్ణవ్యత్యయ మయి, క+ఒ+ంత. సంధి జరిగి, కొంత అని అవుతుంది.

**29. అన్ని:** భిన్న వస్తుసముదాయం అర్థ మైనపుడు అంత – అనేశబ్దానికి 'అమహదర్థంబున భిన్నవస్తుసముదాయం బర్థ మగుచో బహువచనంబున నంతాదుల తకారంబునకు దిరుక్తనివర్ణం బగు' అనేసూత్రంచేత 'త'వర్ణం మొత్తానికి 'న్ని' ఆదేశ మై, అం+న్ని. సంస్కృతసమేతర మైనతెలుఁగుశబ్దములయందుఁ బరుషసరళములకు ముందే బిందువు గానంబడుచున్నది' అనేసూత్రంప్రకారం స్థిరానికి ముందు సున్న లోపించి, అన్ని' అని అవుతుంది.

**30. అద్ది :** 'ఆ' అనేప్రాతిపదికపై అమహత్త్వంలో ప్రథమైకవచనవివక్షలో 'త్రికంబున కమహదర్థంబునం బ్రథమైకవచనబహువచనంబులం గ్రమంబుగ దివి వర్ణకంబు లగు' అనేసూత్రంచేత 'ది' ప్రత్యయం వచ్చి ఆ+ది. 'ఆఈశబ్దములును ఏశబ్దమును నమహదర్థంబునం బ్రథమావిభక్తి పరం బగునపుడు నిత్యముగాను వైకల్పికముగాను గ్రమంబున హ్రస్వంబు లగు' అనేసూత్రంచేత హ్రస్వం వచ్చి, అ+ది. 'హ్రస్వవ్యస్త త్రికంబుమీఁది దివులకు ద్విత్వంబు నగు' అని ద్విత్వం వచ్చి అద్ది. ద్విత్వం రానిపక్షంలో అది.

**31. దానన్:** ఆశబ్దానికి తృతీయ (సప్తమి) ఏకవచనవివక్షలో 'అది యిది యెది యనువానికిఁ దృతీయాసప్తమ్యేకవచనంబులయందు దాన దీన దేన ననియు వానిబహువచనంబులయందు వాన వీన వేన ననియు రూపంబు లగు' అనేసూత్రం చేత 'దానను' అనేరూపం గల్గుతుంది.

**32. పువ్వులయవ్విధంబునన్:** పువ్వుల(యొక్క) విధము అనేసమాసంలో 'పదాద్యంతగతం బాశబ్దం బమహదర్థకంబు సమస్తంబు వ్యస్తంబు నయి కొన్నియెడల నర్థశూన్యం బగు' అనేసూత్రంచేత విధ మనేఉత్తరపదానికి మొదట ఆశబ్దం చేరి 'త్రికంబుమీఁదియసంయుక్తహల్లునకు ద్విత్వంబు బహుళంబుగా నగు' అనేసూత్రం చేత మీఁదిహల్లుకు ద్విత్వమూ' 'ద్విరుక్తం బగుహల్లు పరం బగునపు డాచ్ఛికం బగుదీర్ఘంబునకు హ్రస్వం బగు' అని హ్రస్వమూ వచ్చి, యడాగమంతో 'పువ్వుల యవ్విధము' అని అవుతుంది.

**33. ఈవు:** నీవు అనేశబ్దంలో 'నీమీనేమే హల్లులకు లోపంబు విభాష నగు' అనేసూత్రంచేత నకారం లోపించగా, 'ఈవు' అవుతుంది. విభాష గాబట్టి లోపం

రానిపక్షంలో 'నీవు' అనే ఉంటుంది.

**34. తా వచ్చె సుదర్శనాయుధుఁడు:** 'సుదర్శనాయుధుఁడు' అనేనామార్థాన్ని గ్రహించేటపుడు 'నామతదేద్యత్కిమర్థంబులకుం బునర్గ్రహణంబునఁ బ్రథమాద్యంత మయి పూర్వపరంబులుగ నాత్మార్థం బభిహితం బగు' అనేసూత్రంచేత పూర్వంలో 'తాను' అనేది ప్రయోగింపబడి (స్థిరపరకద్రుతలోపంతో) పైరూప మయింది.

**35. ఒకానొకఁడు:** ఒకఁడు అనేశబ్దానికి 'ఒకా నొకచో నర్దిష్టార్థమం దొక శబ్దమునకుం బూర్వాగమం బగు' అనేసూత్రంచేత పూర్వంలో 'ఒకాన్' అనేది ఆగమమై (ఒకాన్+ఒకఁడు) 'ఒకానొకఁడు' అవుతుంది.

**36. ఎల్లరు :** ఎల్ల అనే(సర్వనామ)శబ్దానికి ప్రథమావిభక్తిలో 'లువర్ణంబు బహువచనంబు' అని లువర్ణ మై, ఎల్ల+లు అని కాగా 'సర్వనామంబులకు మహదర్థంబునఁ దఱచుగ లులలకు రుర లగు' అనేసూత్రంచేత 'లు'వర్ణానికి 'రు' అనేది ఆదేశ మై, 'ఎల్లరు' అని అవుతుంది.

**37. అందఱు:** అంత+వారు అని ఉండగా 'అంతాదులకు వారు పరం బగుచో వాకు లోపంబును రురలకు ఱుఱ లాదేశంబు నగు' అనేసూత్రంచేత 'వా'లోపించి, రువర్ణానికి 'ఱు' ఆదేశ మై, అంత+ఱు. 'వాలోపంబుతఱి వానితకారంబునకు దకారం బగు' అనేసూత్రంచేత 'త' కారానికి దకార మై – అందఱు.

**38. ముగ్గురు**: మూఁడు అనేశబ్దానికి ప్రథమాబహువచనంలో 'లువర్ణంబు బహువచనంబు' – మూఁడు+లు. 'సంఖ్యావాచకంబులకు విభక్తి పరం బగునపుడు కొన్నింటియంత్యాక్షరంబులకు లోపం బగు' – మూ+లు. 'సర్వనామంబులకు మహదర్థంబునఁ దఱచుగ లులలకు రుర లగు' – 'మూ+రు'. 'రురవర్ణకంబులు పరంబు లగునపుడు సాధారణంబుగ సంఖ్యావాచకంబులకు గువర్ణంబు పూర్వాగమం బగు' – మూగురు. 'విభక్తి పరం బగుచో మూఁడు నాలుగుల దీర్ఘంబునకు హ్రస్వంబు బహుళంబుగా నగు' – ముగురు. 'ప్రాప్తహ్రస్వంబు లగుమూడేలమీఁదివర్ణంబులకు ద్విత్వంబు బహుళంబుగా నగు' ముగ్గురు.

**39. ఏ దగుపర్వము :** ఏడు అనేశబ్దంమీద పూరణార్థంలో సంఖ్యకుం బూరణార్థంబునం దవగాగమం బగు' అనేసూత్రంచేత అవగాగమం వచ్చి, ఏడు+అవ అని ఉండగా, 'కొన్నియెడల నవ కగు కానంబడియెడి' అనేసూత్రంచేత 'అవ' స్థానంలో 'అగు' ఆదేశ మై, ఏడు+అగు అని ఐనతర్వాత 'ఉత్తున కచ్చు పరం బగునపుడు సంధి యగు' అనేసూత్రంచేత సంధి జరిగి, 'ఏ దగుపర్వము' అని

అవుతుంది. 'అగు' రాకపోతే 'అవ'తో – ఏడవపర్వము.

**40. అసురు లఱువదివేలు :** 'అసురులు' అనేమహత్తుకు విశేషణ మైన 'అరువదివేలు అనేశబ్దం 'మహద్విశేషణసంఖ్యావాచకంబులకుం గొన్నియెడల నమహత్కార్యంబు చూపట్టెడి' అనేసూత్రంచేత '(అసురులు) అఱువదివేలు' అనేరూపం అవుతుంది. అమహత్కార్యాలు గలుగనిపక్షంలో విశేష్యా న్ననుసరించి మహత్కార్యంతో 'అసురు లఱువదివేగురు' అని అవుతుంది.

**41. చెయ్యి :** చేయి అనేశబ్దానికి 'ఔపవిభక్తికాంతంబు లగు చేయి నేయి లోనగుశబ్దంబులయాద్యచ్చునకు హ్రస్వంబును, మీఁదిహల్లునకు ద్విత్వంబును బ్రథమైకవచనంబునందు వైకల్పికంబుగ నగు' అనేసూత్రంచేత హ్రస్వద్విత్వాలు రెండూ వచ్చినపక్షంలో – చెయ్యి. హ్రస్వం మాత్రం వస్తే – చెయి. రెండూ రాకపోతే చేయి.

**42. ఊరన్:** ఊరు శబ్దంమీద సప్తమ్యేకవచనంలో 'ఉదంతజడంబుసప్తమికి న వర్ణకం బగు' అనేసూత్రంచేత నవర్ణక మయి 'తృతీయాదులకు నుగాగమం బగు' అని ద్రుతం చేరగా ఊరునను. 'ఊరుచోటుమేన్వాదు లున్లుగ్విషయంబులు' అనేసూత్రంచేత 'ఉన్' లోపించి 'ఊర్+అను=ఊరను' అని అవుతుంది. ఉన్ లోపం రాని పక్షంలో– ఊరునన్ అని ఉంటుంది.

**43. పాడియయ్యె:** 'పాడి' అనేశబ్దంమీద 'నామపదంబు లార్యార్థపరకంబు లయి వ్యతిరేకవ్యంజకప్రశ్నార్థకంబు లగు' అనేసూత్రంచేత 'అయ్యె' అన్నది చేరి 'పాడియయ్యె' అని అవుతుంది. ఇది 'పాడికాదు' అని వ్యతిరేకార్థాన్ని వ్యక్తం చేస్తూ 'పాడి యగునా' అనేవిధంగా ప్రశ్నార్థకం అవుతుంది.

# 4. కారకపరిచ్ఛేదం

**1. మముగుఱిచి :** 'నా' అనే (అస్మద్) ప్రాతిపదికకు 'కర్మంబున ద్వితీయ యగు' అనేసూత్రంచేత ద్వితీయావిభక్తి వచ్చి, బహువచనంలో మమున్ అని అవుతుంది. ఇక్కడ ఉద్దేశార్థం కూడ ఉండడంచేత 'ఉద్దేశార్థంబునందు ద్వితీయకు గుఱిచియు ననుప్రయుక్తం బగు' అనేసూత్రంచేత ద్వితీయావిభక్తి మీద 'గుఱిచి' అనేశబ్దం చేరి (సరళపరకతలో ద్రుతం లోపించి) 'మము గుఱిచి'. 'గుఱిచియు' అన్నప్పటి సముచ్చయంచేత కూర్చి వస్తే (ద్రుతకార్యాలతో) మముఁ గూర్చి అని అవుతుంది.

**2. తన్ను నర్థితో గుఱిచి :** తాశబ్దానికి ఉద్దేశార్థంలో ద్వితీయ వచ్చి ఏకవచనంలో 'తన్నున్' అని అవుతుంది. 'ఉద్దేశార్థంబునందు ద్వితీయకు గుఱిచియు ననుప్రయుక్తం బగు' అని గుఱిచి చేరగా, తన్నున్+గుఱిచి 'అయ్యది వ్యవహితంబు నగు' అనేసూత్రంచేత 'తన్నున్ అర్థితో గుఱిచి, అన్నపుడు ద్వితీయకూ దానికి అనుప్రయుక్త మైన గుఱిచికీ నడుమ 'అర్థితో' అనేపదంతో వ్యవధానం సాధు వవుతున్నది.

**3. సంబోధనఁజేసి :** (4) సంబోధనశబ్దంమీద హేత్వర్థంలో ('చేతవర్ణకంబు హేతుకరణంబులకు గ్రహ్యాదియోగజం బగుపంచమికిని బహుళంబుగా నగు' అని) చేతప్రత్యయం వచ్చి, 'సంబోధనచేతన్'. జడంబుతృతీయాసప్తములకు ద్వితీయ బహుళంబుగా నగు' అనేసూత్రంప్రకారం 'చేత' అనేతృతీయకు ద్వితీయ(ను) వచ్చి 'సంబోధనన్'. కొన్నియెడల, జేతవిభక్త్యర్థకవర్ణకంబులకును వలనవర్ణకంబునకుఁ దఱచుగఁ జేసి యనుప్రయుక్తం బగు' అనేసూత్రంచేత 'చేసి' అనేపదం చేరి (ద్రుతకార్యాలతో) సంబోధనఁజేసి. 'తఱచుగ' అనడంచేత చేసి రాకుంటే, సంబోధనన్. బహుళం అనడంచేత ద్వితీయ కూడా రాకుంటే తృతీయతో – సంబోధనచేతన్.

**4. తోడ మాటాడక :** 'తోడ' అనేది తృతీయావిభక్తి ప్రత్యయం. కాబట్టి పదం కాదు. పదం కాకపోతే 'ఆపదం న ప్రయుంజీత' ప్రయోగార్హం కాదు. అయినా 'ఒకానొకచో తోడకు ప్రత్యేకప్రయోగంబునుం జూపట్టెడి' అనేసూత్రంప్రకారం ప్రాతిపదికను ఆశ్రయించకుండా స్వతంత్రంగా ప్రయోగించడం సాధువు అవుతున్నది. ఇందులో ('తోడ' విభక్తి కాదు. 'తోడు' శబ్దంనుంచి ఏర్పడిన ప్రత్యేకపదం. తోడఁ బుట్టువు. తోడికోడలు మొ.)

**5.ప్రాణముతోడుతన్:** ప్రాణశబ్దం మీద సహార్థంలో ('కరణసహార్థతుల్యార్థ యోగంబునం దృతీయకుం దోడవర్ణకం బగు' అని) తోడ ప్రత్యయం వచ్చి, ప్రాణముతోడన్. 'ఒకానొకచోఁ దోడకుఁ దోడుత నని రూపాంతరంబును గలదు. అయినను దానికి వలె దీని కితర కార్యంబు గలుగదు' అనేసూత్రంచేత తోడ ప్రత్యయం 'తోడుత' అని మార్పు చెందగా 'ప్రాణముతోడుతన్' అని అవుతుంది.

**6. కార్యసంప్రయోగముపొంటెన్ :** 'కార్యసంప్రయోగ' శబ్దంమీద ఉద్దేశార్థంలో 'సంప్రదానంబునకుం జతుర్థి యగు' అని చతుర్థీవిభక్తి వస్తుంది. కొఱకు వస్తే సంప్రదానముకొఱకున్. కయి ప్రత్యయం అయితే సంప్రదానముకై. 'చతుర్థికిం బొంటె వర్ణకంబు నగు.' అనేసూత్రంచేత చతుర్థికి పొంటె రాగా, సంప్రయోగము పొంటెన్. 'పొంటెయు' అన్నప్పటిసముచ్చయంచేత పొంటె రానిపక్షంలో కొఱకు,కయి

అలాగే ఉంటాయి.

**7. బ్రహ్మలోకంబుననుండి :** బ్రహ్మలోకశబ్దంపై అపాయార్థంలో (అపాయ భయ జుగుప్సా పరాజయ ప్రమాద గ్రహణ భవన త్రాణ విరామాంతర్ధివారణంబు లెద్దాన నగు దానికి వలన వర్ణకం బగు) వలన ప్రత్యయం వచ్చి 'బ్రహ్మలోకంబు వలనన్'. 'ఉండి పదం బొకానొకచో వలనవర్ణకంబున కనుప్రయుక్తం బగు' అని వలనపై 'ఉండి' చేరి 'బ్రహ్మలోకంబువలనన్+ఉండి' అని ఉండగా 'ఉండిపదంబు పరం బగునపుడు వలనకు ద్వితీయాసప్తములు ప్రాయికంబుగ నగు' అనేసూత్రంచేత వలనకు సప్తమి. ఆసప్తమికి 'ఉండి పదంబు పరం బగుచో వలన కందువర్ణక మట్లు నవర్ణకంబు నగు' అనేసూత్రంచేత 'న' ప్రత్యయం వచ్చి, బ్రహ్మలోకంబుననుండి. (సప్తమికి అందు వస్తే – బ్రహ్మలోకంబునందుండి, ద్వితీయ వస్తే – బ్రహ్మలోకంబు నుండి, ఏదీ రాకుంటే – బ్రహ్మలోకంబువలననుండి. ఉండి కూడా రాకపోతే– బ్రహ్మలోకంబువలనన్).

**8. అదితిగర్భమున్ వెలువడు :** (అదితి) గర్భశబ్దంపై అపాయార్థంలో (అపాయ భయ జుగుప్సా––) వలన ప్రత్యయం. గర్భమువలనన్, 'ఉండిపదం బొకానొకచో వలనవర్ణకంబున కనుప్రయుక్తం బగు' అని వలనపై ఉండి చేరి, గర్భమువలనన్+ ఉండి. 'ఉండి పదంబు పరం బగునపుడు వలనకు ద్వితీయాసప్తములు ప్రాయికంబుగ నగు' అని వలనకు ద్వితీయ వచ్చి, గర్భమున్+ఉండి అని ఉండగా, 'వలన కాదేశంబు లగుద్వితీయాసప్తములమీఁది యుండికి లోపంబు బహుళంబుగా నగు' అనేసూత్రంచేత ఉండి లోపించి, (అదితి) గర్భమున్ అని అవుతుంది. ఉండి లోపించకపోతే – గర్భమునుండి.

(గర్భశబ్దంపై 'అపాయభయ–– సూత్రంచే రావలసిన వలన విభక్తిని బాధించి' ఒకానొకవిభక్తికి మఱి యొకవిభక్తియు నగు' అనేసూత్రంచేత ద్వితీయ రాగా 'గర్భమున్' అని అవుతుంది అని బాలవ్యాకరణమతం.)

**9. కలుగంగఁబట్టి:** (కలుగుధాతువుపై నుజీ ప్రత్యయమై కలుగన్. దానిమీద 'నుజీ' అంత మైన అగుధాతువు చేరి, కలుగంగాన్–(దానికి హ్రస్వం రాగా) కలుగంగన్– అనేఅవ్యయశబ్దంపై 'కొన్నియెడల హేతువునం దన్నంతక్రియలమీఁ దను బట్టివర్ణకంబు విభాష నగు' అనేవిశేషవిధానంచేత 'పట్టి' అనేపంచమీవిభక్తి ప్రత్యయం వచ్చి, ద్రుతకార్యాలతో, కలుగంగఁబట్టి.

**10. వేటకుఁ బోయిరి:** వేట అనేశబ్దంమీద కర్మార్థంలో 'కర్మంబున ద్వితీయ

యగు' అని ద్వితీయ వచ్చి పొలమును. ఆద్వితీయకు 'షష్ఠీస్థానికం బగుకువర్ణకం బొక్కొకచో ద్వితీయాదివిభక్తులకు మాఱుగాఁ దత్తదర్థంబులం జూపట్టెడి' అని 'కు' అనే షష్ఠీవిభక్తి వచ్చి, 'పొలమునకున్' అని అవుతుంది. కుషష్ఠి రాకపోతే ద్వితీయతో పొలమున్.

**11. కొండొకసేపునకున్:** కాలపరిమాణాన్ని తెలియజేసే 'కొండొకసేపు' అనేశబ్దంమీద 'వీప్సయందును గాలపరిమితియందును నామంబులకుం గువర్ణకం బగు' అనేసూత్రంచేత 'కు' అనేషష్ఠీవిభక్తి వచ్చి 'కొండొకసేపునకున్' అవుతుంది.

**12. బాహుకు రథంబు గడపునేర్పు:** కడపు అనేధాతుజవిశేషణంతోటి అన్వయం కలిగిన 'బాహుక' అనేకర్తకు 'భావార్థకాదియోగంబునం గర్తకుం బ్రథమ యగు' అని ప్రథమావిభక్తి వచ్చి – బాహుకుడు.... కడపు. ఆప్రథమకు 'ధాతుజవిశేషణ భావార్థక పూర్వవ్యవహితావ్యవహిత కర్తృపదప్రథమకుఁ దఱచుగ యొక్క షష్ఠి యగు' అనేసూత్రంచేత 'యొక్క' అనేషష్ఠీవిభక్తి వచ్చి, బాహుకుయొక్క'. 'యొక్కకు లోపంబు బహుళంబు' అనేసూత్రం(లోని బహుళపదం)చేత యొక్క నిత్యంగా లోపించి బాహుకు రథంబు కడపు నేర్పు. యొక్కవిభక్తి రానిపక్షంలో ప్రథమావిభక్తి అలాగే ఉండి – బాహుకుఁడు రథము గడపునేర్పు.

**13. ఏనుఁగున నేనుఁగు:** ఏనుఁగు శబ్దంమీద కరణార్థంలో 'కరణ సహార్థ తుల్యార్థ యోగంబులం దృతీయకుం దోడవర్ణకం బగు' అనేసూత్రంచేత తోడప్రత్యయం వచ్చి ఏనుఁగుతోడ. ఈతృతీయకు ('ఒక్కచో ఉదంతజడంబు తృతీయకు నవర్ణకం బగు' అని బాలవ్యాకరణసూత్రంచేత రాకుండగా) 'ఒక్కచో నుదంతం బగునజడంబు తృతీయకును నవర్ణకంబు గానంబడియెడి' అనేసూత్రంచేత (సప్తమీ) నవర్ణకం వచ్చి 'ఏనుఁగునన్ – (ఏనుఁగు) అయింది.

**14. మనుజుల విప్రుండు:** 'మనుజ' శబ్దంమీద నిర్ధారణలో (నిర్ధారణషష్ఠికి లోపల వర్ణకం బగు' అని రావలసిన లోపలవిభక్తికి బదులు) అందు అనేసప్తమీవిభక్తి వచ్చి, మనుజులయందు. ఈసప్తమికి ('జడంబు తృతీయాసప్తములకు ద్వితీయ బహుళంబుగా నగు' అనేసూత్రంచేత ప్రాప్తింపకుండగా) 'కొన్నియెడల నజడంబు తృతీయాసప్తములకును బహుత్వంబున ద్వితీయ చూపట్టెడి' అనేసూత్రంచేత ద్వితీయావిభక్తి వచ్చి మనుజులన్– విప్రుడు. స్థిరపరకతలో ద్రుతం లోపించి– మనుజుల విప్రుండు.

**15. మదనాగ మెదిర్చి:** మదనాగశబ్దానికి కర్మార్థంలో 'కర్మంబున ద్వితీయ

యగు' అని ద్వితీయ వచ్చి మదనాగమును. ఈద్వితీయకు (జడంబుద్వితీయకుం బ్రథమ బహుళంబుగా నగు' అని ప్రథమ రాకుండగా) 'కొన్నియెడల నజడంబు ద్వితీయకును బ్రథమ కానంబడియెడి' అనేసూత్రంచేత ప్రథమావిభక్తి వచ్చి, మదనాగము (ఎదిర్చి) – మదనాగ మెదిర్చి.

**16. చి చ్చుటికిన:** చిచ్చుశబ్దంపై అధికరణార్థంలో 'అధికరణంబునకు సప్తమి యగు' అని సప్తమీవిభక్తి వచ్చి, చిచ్చునందు (చిచ్చున) అని కాగా 'ఒక్కొకచో జడంబు సప్తమికిం బ్రథమయు నగు' అనేసూత్రంచేత ప్రథమావిభక్తి వచ్చి చిచ్చు (ఉటికిన)= చి చ్చుటికిన 'ప్రథమయు' అనేచోటిసముచ్చయంచేత ప్రథమ రానిపక్షంలో సప్తమితో – చిచ్చునం దుటికిన.

**17. తల్లి ద్రౌపదితోడన్ :** ద్రౌపదితోడన్ అనేవిశేష్యాన్ని అనుసరించి తల్లి అనేవిశేషణానికి 'విశేష్యంబునకుం బోలె విశేషణంబునకు లింగవిభక్తివచనంబు లగు' అనేసూత్రంచేత తృతీయా (ఏకవచన) విభక్తి వచ్చి, తల్లితోడన్. 'కొన్నియెడల విశేషణంబు ద్వితీయాదులకుఁ బ్రథమ చూపట్టెడి' అనేసూత్రంచేత ప్రథమావిభక్తి వచ్చి 'తల్లి (ద్రౌపదితోడన్). ప్రథమ రానిపక్షంలో తల్లితోడన్ అని తృతీయ అలాగే ఉంటుంది.

**18. ఈతనితో సాటి యనంగ మే లన :** మేలు అనేదానితో అన్వయించేటప్పుడు 'ఈతనితో' అనేచోటితృతీయావిభక్తికి 'కొన్నియెడల విభక్తిపరిణామంబు గ్రాహ్యంబు' అనేసూత్రంచేత – (కంటె వర్ణకం బన్యార్థాదియోగజం బగుపంచమి కగు– అనే సూత్రానికి అనుగుణంగా) ఈతనికంటె (మేలు) అని పంచమిగా మార్పు చెందుతుంది.

**19. నన్ను చెట్టవట్టినన్ :** 'చెట్ట' అనేదానికి స్వామి యైన 'నా' శబ్దానికి సంబంధార్థంలో 'శేషషష్ఠికి యొక్కయు నగు' అని 'యొక్క' అనేషష్ఠీవిభక్తి వచ్చి, నాయొక్క చెట్టవట్టినన్, 'క్రియాన్వయంబున రెండుపదంబులకు స్వ స్వామి సంబంధము గలచో సంబంధిపదంబు షష్ఠికి ద్వితీయ యగు' అనేసూత్రంచేత యొక్కకు ద్వితీయ వచ్చి – 'నన్ను' చెట్టవట్టినన్.

**20. (మీరు) చూచినారు :** చూచిన – అనేధాతుజవిశేషణం తచ్ఛబ్దాంతమై (చూచిన+వారు) చూచినారు అని కాగా ఇది మీరు అనేయుష్మదర్థానికి విశేషణం

కాబట్టి 'ప్రథమాంతంబు లగుయుష్మదస్మద్విశేషణంబుల కేకత్వంబున వునులును, బహుత్వంబున రుములు నంతాగమంబులు ప్రాయికంబుగ నగు' అని 'రు' అనేఆగమమూ, 'ఈయాగమంబులు పరంబు లగునపు దుత్వంబున కత్వం బగు' అని దానికి ముందు అత్వము(అరు) రావలసిఉండగా' తచ్ఛబ్దాంతము లగుధాతుజ విశేషణంబులమీఁద నరు చూపట్టదు' అనేసూత్రంప్రకారం రాదు. కాబట్టి చూచినారరు అని కాక, చూచినారు అనే ఉంటుంది.

## 5. సమాసపరిచ్ఛేదం

**1. అరదంబునయురవడి :** అరదంబుయొక్క, ఉరవడి అనేఅర్థంలో షష్ఠీతర్పురుష సమాసమై 'సమాసవిభక్తికి లోపం బగు, లట్టునకుఁ గాదు' అని విభక్తులు లోపించి, అరదంబు+ఉరవడి అని ఉండగా (ఉత్వసంధిని బాధించి, షష్ఠీసమాసమునం దుకార బుకారముల కచ్చు పరం బగునపుడు నుగాగమం బగు' అనేసూత్రాన్ని బాధించి) 'షష్ఠీతత్పురుషంబులందు నగాగమంబు విభాష నగు' అనేసూత్రంచేత నగాగమం వచ్చి, అరదంబున + ఉరవడి. అత్వసంధి రాక, యడాగమం వచ్చి, అరదంబున యురవడి. విభాష గాబట్టి నగాగమం రాకపోతే పైసూరిసూత్రంప్రకారం నుగాగమం వచ్చి, అరదంబునురవడి. (ఈసమాసప్రాతిపదిక స్త్రీసమం కాబట్టి ప్రథమైకవచనానికి లోపం వస్తుంది.)

**2. రామారావు:** రాముఁడు అనేపురుషసంజ్ఞకు 'రావు' అనేబిరుదవాచకంతో కర్మధారయసమాసం ఏర్పడి, రాముఁడు+రావు. 'కర్మధారయం బియ్యది మిశ్రంబు సిద్ధసమాసంబట్ల యగు' అనేసూత్రంచేత ప్రాతిపదికరూపం మాత్రమే మిగిలి, మిగిలిన దంతా లోపించగా, రామ+రావు. 'కర్మధారయంబు బిరుదాద్యుత్తంపదం బయ్యె నేని ద్వ్యక్షరాదంత స్త్రీ పుం సంజ్ఞావాచకం బగుపూర్వపదంబు నంత్యాక్షరంబున కంతట దీర్ఘంబు బహుళంబుగా నగు' అనేసూత్రంచేత దీర్ఘం వచ్చి, రామారావు. ఈసమాసప్రాతిపదిక స్త్రీసమం కాబట్టి దీనిపై ప్రథమైకవచనం లోపించి 'రామారావు' అనేపదం ఏర్పడుతుంది. బహుళం అనడంచేత దీర్ఘం రానిపక్షంలో రామరావు.

**3. సుబ్బిసెట్టి:** సుబ్బఁడు అనేపురుషసంజ్ఞకు సెట్టి అనేబిరుదవాచకంతో కర్మధారయసమాసం అయి సుబ్బఁడు+సెట్టి. 'సమాసవిభక్తి కి లోపం బగు లట్టునకుఁ గాదు' అని విభక్తి లోపించి సుబ్బ+సెట్టి 'ఇటఁ బూర్వపదంబునత్వంబున కిత్వం

బగు' అనే సూత్రంలోనిబహుళపదంచేత మొదటిపదం చివరిఅత్వానికి నిత్యంగా ఇత్వం వచ్చి సుబ్బిసెట్టి. ఈసమాస ప్రాతిపదిక స్త్రీసమం కాబట్టి ప్రథమైకవచనం లోపించి 'సుబ్బిసెట్టి' అనేపదం ఏర్పడుతుంది.

**4. నన్నయభట్టు :** నన్న అనేపురుషసంజ్ఞకు 'భట్టు' అనేబిరుదవాచకంతో కర్మధారయసమాసం ఏర్పడి (కర్మధారయం బియ్యది మిశ్రంబు సిద్ధసమాసం బట్ల యగు) నన్న+భట్టు 'కొన్నియెడల నిచ్చో ననాపామాయాగమంబు లగు' అనేసూత్రం చేత 'అయ' ఆగమమై నన్న+అయ+భట్టు. 'అంద్వవగాగమంబులం దప్ప' అని సంధి జరిగి నన్నయభట్టు. (ఈసమాసప్రాతిపదిక స్త్రీసమం కాబట్టి ప్రథమైకవచనం లోపించింది).

**5. ముంగోపము:** క్రొత్తాదులలోని 'ముందు' అనే(ఆచ్ఛిక)శబ్దానికి కోపము అనేతత్సమశబ్దంతో సమాసం చేయదలచినపుడు 'క్రొత్తాదులు లుప్తశేషంబులు దేశ్యంబులతోడంబలెఁ దత్సమంబులతోడం గొన్నియెడలఁ గర్మధారయం బగు' అనేసూత్రంచేత మొదటిఅక్షరం మిగిలి దానికి పై తత్సమశబ్దంతో సమాసమై (విభక్తులు లోపించి) ము+కోప. "సమాసమందుఁ దత్సమంబు పరం బగునపుడును నుమాగమాదులు గానంబడియెడి' అనేసూత్రంచేత నుమాగమం వచ్చి, ముసు+కోప. ద్రుతకార్యాలతో (ప్రథమైకవచనంలో) – ముంగోపము.

**6. చదువునట్లు:** చదువు అనేధాతుజవిశేషణానికి "ధాతుజవిశేషణంబులు తథార్థ కావ్యయంబుతోడం గర్మధారయం బగు' అనేసూత్రంచేత 'అట్లు' అనేఅవ్యయంతో కర్మధారయసమాస మై, చదువు+అట్లు. 'ఉదంత మగుతద్ధర్మార్థకవిశేషణంబుల కచ్చు పరం బగునపుడు నుగాగమం బగు' అనేసూత్రంచేత నుగాగమం వచ్చి చదువునట్లు.

**7. అట్టిఁడు:** అట్టి అనేవిశేషణంపై విభక్తివివక్షలో తచ్ఛబ్దం చేరి మహదర్థంలో ప్రథమావిభక్తి ఏకవచనంలో అట్టి+వాఁడు అని ఉండగా, 'అట్టి యిట్టి యెట్టి విశేషణంబులమీఁదితచ్ఛబ్దవకారంబునకు లోపంబు విభాష నగు' అనేసూత్రంచేత 'వా' అనేఅక్షరం లోపించి, అట్టిఁడు.('జిత్తు బిందుపూర్వం బగు' అనేసూత్రంచేత డువర్ణానికి పూర్వంలో నిండుసున్న వచ్చినపక్షంలో అట్టిండు.)

**8. ముయ్యేడు:** మూఁడు శబ్దానికి ఏడు శబ్దంతో కర్మధారయసమాస మై, మూఁడు + ఏఁడు– అని ఉండగా 'సమానాధికరణం బగునుత్తరపదంబు పరం బగునపుడు మూఁడుశబ్దము డుజ్వర్ణంబునకు లోపంబును, మీఁదిహల్లునకు

ద్విత్వంబు నగు' అనేసూత్రంచేత డుజ్‌లోపించి (మూ+ఏడు)(యడాగమమై, మూ+యేడు) మీదిహల్లుకు ద్విత్వం వచ్చి, మూయ్యేడు. 'ద్విరుక్తం బగు హల్లు పరం బగునపు డాచ్ఛికం బగుదీర్ఘంబునకు హ్రస్వం బగు' అని హ్రస్వం వచ్చి మొదటిదీర్ఘానికి హ్రస్వం వచ్చి, ముయ్యేడు. 'ముయ్యేడ్వాదులందు హ్రస్వద్విత్వంబులు నిత్యంబులు' అనేసూత్రంప్రకారం హ్రస్వద్విత్వాలు నిత్యం కాబట్టి మూడేడు–అనే విధంగా హ్రస్వద్విత్వాలు రానిరూపాలు ఉండవు.

**9. గనగననినిప్పులు :** గనగన అనేధ్వన్యనుకరణ విశేషణశబ్దానికి నిప్పులు అనేవిశేష్యంతో కర్మధారయసమాసం ఏర్పడి, విభక్తులు లోపించి, గనగన+నిప్పు అని ఉండగా 'ధ్వన్యనుకరణశబ్దంబులు కొన్నింటినందు నిగాగమం బగు' అనేసూత్రం చేత నిగాగమం వచ్చి, గనగననినిప్పు. ఈసమాసప్రాతిపదికపై ప్రథమా బహువచనంలో 'లువర్ణంబు బహువచనంబు' అని లువర్ణకమై – గనగననినిప్పులు.

**10. కమ్మందేనె :** కమ్మ నయినతేనె అనేఅర్థంలో కమ్మ అనేవిశేషణానికి తేనె అనేవిశేష్యంతో కర్మధారయసమాస మై (విభక్తులు లోపించి) కమ్మ+తేనె. 'గుణవచనంబు లగునల్లాదులకుం గర్మధారయంబునందు నిగాగమంబు బహుళంబుగా నగు' అని నిగాగమం వచ్చి కమ్మని+తేనె. 'గుణవాచకంబులు కొన్నింటినిగాగమంబునకుఁ బరుషంబులు పరంబు లగునపుడు బిందు వగు' అనేసూత్రంచేత నివర్ణానికి అరసున్న వస్తే, కమ్మఁదేనె. నిండుసున్న వస్తే, కమ్మందేనె. ఈబిందువు వచ్చేటప్పుడు పైపరుషం సరళం అవుతుం దని గ్రహించాలి.

**11. చక్కంగ:** (చక్క అనేగుణవాచకానికి 'నవర్ణకంబు గుణవచనంబు లగునల్లాదుల కగు' అని నవర్ణకం వచ్చి చక్కన. ఇది క్రియకు విశేషణ మైనపుడు 'నుజ్యంతం బగునగుధాతువు క్రియావిశేషణంబుల కనుప్రయుక్తం బగు, నుజికి విభాష నగు' అని 'కాను' అనేది చేరి, చక్కన+కాను. 'దానికి హ్రస్వంబు విభాష నగు' అని హ్రస్వం వచ్చి, చక్కన+కను. 'ప్రథమమీఁదిపరుషములకు గసడదవలు బహుళంబుగా నగు' అనేసూత్రంలో బహుళశబ్దంచేత గకారం నిత్యంగా వచ్చి) చక్కన+గను అని ఉండగా 'గుణవాచకంబు క్రియావిశేషణం బగుచో నొక్కెడ నవర్ణకంబునకు బిందువు గానంబడియెడి' అనేసూత్రంచేత నవర్ణంస్థానంలో అరసున్న వస్తే – చక్కఁగను. నిండుసున్న వస్తే చక్కంగను.

**12. తమ్ముఁగుట్టులు:** కుట్టు లైనతమ్ములు అనేఅర్థంలో కుట్టులు అనేవిశేషణానికి తమ్ములు అనేవిశేష్యంతో కర్మధారయసమాసం ఏర్పడి కుట్టులు+తమ్ములు అని

ఉండగా 'తమ్ముఁగుఱ్ఱలు చిలుకవెుకరి యిత్యాదులు విశేష్యపూర్వపద కర్మధారయంబులు' అనేసూత్రంచేత విశేష్య మైన 'తమ్ములు' అనేది సమాసంలో పూర్వపదంగా మారి, (తమ్ములు+కుఱ్ఱలు) విభక్తులు లోపించి, (తమ్ము+కుఱ్ఱ) సూత్రనిర్దేశసామర్థ్యంచేత నుగాగమం వచ్చి, ద్రుతకార్యాలతో (తమ్ముఁగుఱ్ఱ) ప్రథమాబహువచనంలో 'తమ్ముఁగుఱ్ఱలు' అని అవుతుంది.

**13. అలరుఁబోఁడి :** అలరువంటి పోఁడి (మనోజ్ఞత్వము కలది) అనేఅర్థంలో 'అలరు' అనే(ఉపమాన)విశేషణానికి, పోఁడి అనేవిశేష్యంతో 'అలరుఁబోఁడీత్యాదు లుపమానపూర్వపదకర్మధారయంబులు' అనేసూత్రంచేత (ఉపమానపూర్వపద) కర్మధారయసమాసం ఏర్పడి, 'అలరు+పోఁడి' అని ఉండగా 'ఇటఁ బోఁడి పరం బగుచో నెల్లెడల ను మ్మగు' అనే ప్రౌఢవ్యాకర్త వివరణాన్ని అనుసరించి నుమాగమం వచ్చి, ద్రుతకార్యాలు జరిగి, 'అలరుఁబోఁడి' అని అవుతుంది.

**14. నల్దిక్కు:** నాలు గైన దిక్కులు అనేఅర్థంలో నాలుగు అనేసంఖ్యావిశేషణానికి 'దిక్కు' అనేసంస్కృతసమవిశేష్యంతో మిశ్రకర్మధారయసమాస మై, నాలుగు+దిక్కు అని ఉండగా సామాసికవర్ణవికారాలతో నలు+దిక్కు - నల్దిక్కు. అని కాగా బహుత్వార్థంలో ఈసమాసప్రాతిపదికపై బహువచనం రావలసిఉండగా, ('ద్విగువున కేకవచనంబు ప్రాయికంబుగ నగు, మిశ్రంబునకుఁ గాదు' అనేసూత్రంచేత ఈమిశ్రద్విగువుకు ఏకవచనం రాకపోతుంటే) 'ఒక్కచో ద్విగువు మిశ్రం బేకవచనాంతంబు నగు' అనేసూత్రంచేత ఏకవచనం వస్తుంది. ప్రథమావిభక్తిలో ('ఇగ్లొరై' సూత్రంచేత ఏకవచనం లోపించి) నల్దిక్కు. ఏకవచనం రానిపక్షంలో బహువచనంతో 'నల్దిక్కులు' అని ఉంటుంది.

**15. పంద్రెండు:** (పది అధిక మైనరెండు అనేఅర్థంలో) పది + రెండు అని ఉండగా 'పదికి రెం డిరు తొమ్మిదులు పరంబు లగునపుడు బిందుపూర్వకడకారంబును, ద్విరుక్తనివర్ణంబును బిందువును గ్రమంబున దివర్ణంబున కగు' అనేసూత్రంచేత 'ది'వర్ణం స్థానంలో 'ండ్' అనేది ఆదేశ మై, పండ్+రెండు. పంద్రెండు.

**16. ఏఁబది:** ఏను (ఐదు) అయిన పదులు అనేఅర్థంలో ఏను అనేవిశేషణానికి, పది అనేవిశేష్యంతో కర్మధారయసమాస మేర్పడి, ఏను+పది అని ఉండగా 'పది యుత్తరపదం బగుచో నేను దొమ్ములనుమ్ములకు బిందువును ఎని కెనును, ఏడునకు వర్ణవ్యత్యయంబును, ఆపరుషంబునకు సరళంబును గ్రమంబుగ నగు' అనేసూత్రంచేత 'ఏను' లో నువర్ణానికి అరసున్న వచ్చి (ఏఁ+పది) పది పకారానికి బకారమై, ఏఁ

బది. 'పది యుత్తరపదం బగుచోఁ బూర్వపదంబుదీర్ఘంబునకు హ్రస్వం బగు' అని రావలసినహ్రస్వం 'ఏను నేకు రాదు' అని ఏనులో ఏకు రాదు. కాబట్టి దీర్ఘం అలాగే ఉండగా 'దీర్ఘముమీఁద సాధ్యపూర్ణము లేదు' కాబట్టి నిండుసున్న రాదు. (ఏంబది అని కాదు).

**17. ముప్పది**: మూఁడు + పది అని ఉండగా 'సంఖ్యావాచకంబులకు విభక్తి పరం బగునపుడు కొన్నింటియంత్యాక్షరంబులకు లోపం బగు' అనేసూత్రంచేత సమాసంలో 'డుఙ్' లోపించి మూ+పది. 'పది యుత్తరపదం బగుచోఁ బూర్వపదంబు దీర్ఘంబునకు హ్రస్వం బగు, ఏనునేకు రాదు' అని మూదీర్ఘం హ్రస్వ మై, ము+పది. 'ప్రాప్తహ్రస్వంబు లగు మూ డేలమీఁదివర్ణంబులకు ద్విత్వంబు బహుళంబుగా నగు' అనేసూత్రంచేత మీదిహల్లుకు ద్విత్వ మై, ముప్పది.

**18. నలువది :** నాలుగు+పది అని ఉండగా 'సంఖ్యావాచకంబులకు విభక్తి పరంబగునపుడు కొన్నింటియంత్యాక్షరంబులకు లోపం బగు' అని 'గు' వర్ణం లోపించి నాలు+పది. 'పది యుత్తరపదం బగుచోఁ బూర్వపదంబు దీర్ఘంబునకు హ్రస్వం బగు, ఏను నేకు రాదు' అనేసూత్రంచేత దీర్ఘానికి హ్రస్వం వచ్చి, నలు+పది. ప్రథమమీఁదిపరుషములకు గసడదవలు బహుళంబుగా నగు' అనేసూత్రంలోని బహుళశబ్దంచేత ఇక్కడ పకారానికి వకారం నిత్యంగా వచ్చి– నలువది.

**19. ఎనుబది:** ఎనిమిది+పది అని ఉండగా, 'సంఖ్యావాచకంబులకు విభక్తి పరం బగునపుడు కొన్నింటియంత్యాక్షరంబులకు లోపం బగు' అనేసూత్రంచేత అంత్యాక్షరమూ (ది), 'అక్షరంబులకు' అనడంచేత ఇక్కడ ఉపాంత్యాక్షరం(మి) కూడా లోపించి, ఎని+పది. 'పది యుత్తరపదం బగుచో నేనుదొమ్ముల నుమ్ములకు బిందువును, ఎని కెనును, ఏడునకు వర్ణవ్యత్యయంబును, ఆపరుషంబునకు సరళంబును గ్రమంబుగ నగు' అనేసూత్రంచేత 'ఎని'కి ఎను ఆదేశ మై (ఎను+పది) పదిలో పకారం బకార మై – ఎనుబది అని అవుతుంది.

**20. డెబ్బది:** ఏడు+పది అని ఉండగా, పది యుత్తరపదం బగుచో...... అనేసూత్రంచేత ఏడులో వర్ణాలు తారుమా రయి (డు+ఏ=)డే+పది. పకారం బకార మై, డే+బది. 'పది యుత్తరపదం బగుచోఁ బూర్వపదంబు దీర్ఘంబునకు హ్రస్వం బగు. ఏను నేకు రాదు' అని 'డే' కు హ్రస్వం వచ్చి, డె+బది. 'ప్రాప్తహ్రస్వంబు లగుమూడేలమీఁదివర్ణంబులకు ద్విత్వంబు బహుళంబుగ నగు' అని బహుళగ్రహణం చేత ద్విత్వం నిత్యంగా వచ్చి– డెబ్బది.

**21. పన్నిద్దఱు:** పది+ఇరుగురు అని ఉండగా 'పదికి రెం డిరు తొమ్మిదులు పరంబు లగునపుడు బిందుపూర్వకడకారంబును, ద్విరుక్తనివర్ణంబును బిందువును గ్రమంబున దివర్ణంబున కగు' అనేసూత్రంచేత 'ది'వర్ణం స్థానంలో, 'న్ని' వర్ణం వచ్చి, పన్ని + ఇరుగురు 'ఇరుగురున కిద్ద ఱాదేశం బగు' అని ఇరుగురు శబ్దంస్థానంలో ఇద్దఱు ఆదేశ మై, పన్ని+ఇద్దఱు. (సంధి జరిగి) పన్నిద్దఱు. ఇద్ద ఱాదేశం కాకపోతే ఇరుగురు. అలాగే ఉండి, పన్నిరుగురు.

**22. అన్నాదమ్ములు :** అన్నయును, తమ్ముఁడును అనేఅర్థంలో 'ఆచ్ఛికశబ్దంబుతోడ స్త్రీసమంబు ప్రాయికంబుగ ద్వంద్వం బగు' అని ద్వంద్వసమాస మేర్పడి, అన్న+తమ్ముఁడు. సమాసవిభక్తి లోపించి అన్న + తమ్ము. 'కొన్నియెడల మహద్ద్వంద్వంబునం బూర్వపదాంత్యస్వరంబునకు దీర్ఘంబునుం జూపట్టెడు' అనేసూత్రంచేత మొదటిపదం చివరిఅచ్చుకు దీర్ఘం వచ్చి, అన్నా+తమ్ము (ద్వంద్వంబునం బదంబుపయిపరుషము లకు గసడదవ లగు' అని దకారం వచ్చి అన్నాదమ్ము) ఈసమాసప్రాతిపదికపై ప్రథమావిభక్తిలో 'లువర్ణంబు బహువచనంబు' అని లువర్ణక మై, అన్నాదమ్ములు.

**23. వెచ్చసచ్చములు:** వెచ్చమును సచ్చమును అనేఅర్థంలో ('ఆచ్ఛికశబ్దంబుతోడ స్త్రీసమంబు ప్రాయికంబుగ ద్వంద్వం బగు' అనేసూత్రంచేత క్లీబసమానికి (వెచ్చము) ద్వంద్వసమాసం కలగకపోతుండగా) 'ఒకానొకచో ద్వంద్వంబునం బూర్వపదంబు క్లీబసమం బగు నగుచో నాముపర్ణకంబునకు లోపం బగు' అనేసూత్రంచేత ద్వంద్వ సమాస మై, ముపర్ణకం లోపించి, ఉత్తరపదంలో సమాసవిభక్తి లోపించి, వెచ్చ+సచ్చ. ప్రథమాబహువచనంలో – వెచ్చసచ్చములు.

**24. కూరగాయ**: కూరయును, కాయయును అనేఅర్థంలో ద్వంద్వసమాస మై, గసడదవాదేశంతో కూరగాయ – అనే సమాసప్రాతిపదిక ఏర్పడుతుంది. ఇది బహుత్వార్థంలో ఉన్నది కాబట్టి బహువచనం రావలసిఉండగా 'ద్వంద్వం బప్రాణి వాచకకృదంతశబ్దఘటితం బేకవచనాంతంబు నగు' అనేసూత్రంచేత ఏకవచనం వస్తుంది. ఇది స్త్రీసమం కాబట్టి ప్రథమావిభక్తిలో 'స్త్రీలింగంబులప్రథమైకవచనంబు నకు లోపం బగు' అని ఏకవచనం లోపించగా – కూరగాయ. 'ఏకవచనాంతంబును' అనేచోటిసముచ్చయంచేత ఏకవచనం రానిపక్షంలో బహువచనంతో, కూరగాయలు.

**25. ఔగాములు:** ఔట(అగుట)యును, కామియును అనేఅర్థంలో ఔట, కామి

అనేశబ్దాలకు 'ఆచ్ఛికశబ్దంబుతోడ స్త్రీసమంబు' అనేసూత్రంచేత ద్వంద్వసమాస మేర్పడి, ఔట+కామి అని ఉండగా 'భావద్వంద్వంబునం దొలిపదంబు టవర్ణకంబునకు లోపం బగు' అనేసూత్రంచేత మొదటిపదం చివర 'ట' ప్రత్యయం లోపించి, ఔ+కామి ('ద్వంద్వంబునం బదంబుపయి పరుషములకు గసడదవ లగు' అని) గసడదవాదేశం వచ్చి, ఔగామి. ఈసమాసప్రాతిపదిక ప్రథమావిభక్తిలో బహువచనంతో – ఔగాములు అని అవుతుంది.

**26. తౌవదమ్మివిందు** : తౌవవిందును, తమ్మివిందును అనేఅర్థంలో 'ఆచ్ఛికశబ్దంబుతోడ స్త్రీసమంబు' అనేసూత్రంచేత ద్వంద్వసమాస మై (సమాసవిభక్తి లోపించి) తౌవవిందు+తమ్మివిందు. 'ద్వంద్వంబునం బూర్వపదాంత్యావయవంబునకు లోపం బొండె నగు' అనేసూత్రంచేత మొదటిపదంలో రెండవభాగం లోపించి తౌవ+తమ్మివిందు, 'ద్వంద్వంబునం బదంబుపయి పరుషములకు గసడదవ లగు' అని గసడదవాదేశం వచ్చి తౌవదమ్మివిందు. 'ద్వంద్వం బప్రాణివాచకకృదంతశబ్ద ఘటితం బేకవచనాంతంబు నగు' అని ఏకవచనం వస్తుంది. స్త్రీసమం కాబట్టి ప్రథమావిభక్తిలో ఏకవచనం లోపించి – తౌవదమ్మివిందు. 'ఏకవచనాంతంబును' అనేచోటిసముచ్చయంచేత ఏకవచనం రాకపోతే బహువచనంతో 'తౌవదమ్మివిందులు.

**27. అవసరమక్కఱలు :** అవసరమును అక్కఱయును అనేఅర్థంలో (తత్సమ మైన అవసరము (స్త్రీసమం కాదు) శబ్దానికి 'ఆచ్ఛికశబ్దంబుతోడ స్త్రీసమంబు' అనేసూత్రంచేత ద్వంద్వసమాసం కలుగకపోతుండగా) 'ఒకానొకచో ద్వంద్వంబు మిశ్రంబుగను నందలిపూర్వపదంబు క్లీబసమంబుగను గానంబడియెడి' అనేసూత్రంచేత ద్వంద్వసమాస మై, అవసరము + అక్కఱ 'సమాసవిభక్తికి లోపం బగు' అని కవిప్రయోగానుగుణంగా పూర్వపదవిభక్తి లోపించక, ఉత్తరపదవిభక్తి మాత్రం లోపించగా, ఉత్వసంధి జరిగి, 'అవసరమక్కఱ'. ఈసమాసప్రాతిపదిక ప్రథమాబహువచనంలో – 'అవసరమక్కఱలు' అవుతుంది.

**28. పదికడవలనేయిఁ బెరుగు:** "ఒక్కొకచో సమాసగతపూర్వపదంబు వ్యవహితోత్తరపదం బొంటితోడను, వానిపెక్కింటితోడను నన్వయించెడి' అనేసూత్రం ప్రకారం 'పదికడవలనేయి' అనేసమాసంలో పూర్వపద మయిన 'పదికడవల' అనే శబ్దం 'నేయి' అనేఉత్తరపదంతోపాటు పెరుగు, పాలు మొద లైన తరువాతిపదాలతో గూడా అన్వయిస్తుంది. పదికడవలపెరుగు, పదికడవలపాలు మొ.

**29. వారణావతంబునవారు** : వారణావతంబునన్ అనే సప్తమీవిభక్త్యంతపదానికి 'వారు' అనేమీదిపదంతో (సప్తమీ)తత్పురుష సమాసం ఏర్పడగా 'సమాసవిభక్తికి

లోపం బగు లట్టునకుఁ గాదు' అనేసూత్రంచేత (ఉత్తరపదవిభక్తితోపాటు) పూర్వపద విభక్తి అయిన'న'వర్ణకం లోపించవలసిఉండగా 'కొన్నియెడల సప్తమీతత్పురుషము నందు నవర్ణకంబు నగు' అనేసూత్రంప్రకారం లోపించదు. 'సమాసంబునయందు ద్రుతంబునకు లోపం బగు' అని ద్రుతం మాత్రం లోపించి, ప్రథమాబహువచనంలో 'వారణావతంబునవారు' అని అవుతుంది.

**30. అందాఁక:** అంత+దాఁక – అనేఆచ్ఛికశబ్దాలకు ఏర్పడినసమాసంలో అంత+దాఁక, అని ఉండగా. 'ఆచ్ఛికసమాసములం దఱచుగ వర్ణలోపాగమాదేశ వికారంబులు నిత్యవైకల్పికములుగాఁ బెక్కులు గానంబడియెడి' అనేసూత్రంచేత 'త' వర్ణం లోపించి, అందాఁక  అవుతుంది. ఈలోపం వైకల్పికం. కాబట్టి లోపం రాని పక్షంలో – అంతదాఁక.

# తద్ధితపరిచ్ఛేదం

**1.ఆఁకొన్నతనము:** ఆఁకొన్నవానియొక్క భావం అనేఅర్థంలో ఆఁకొన్నవానియొక్క అనేషష్ఠ్యంతశబ్దం మీద 'తనవర్ణకంబు త్వార్థంబునం దగు' అనేసూత్రంచేత తనప్రత్యయం వచ్చి, ఆఁకొన్నవానియొక్క+తన. 'తద్ధితప్రత్యయములు పరంబు లగునపుడు పదంబులదువర్ణకాదులకు లోపం బగు' అనేసూత్రంచేత యొక్కప్రత్యయం లోపించి, ఆఁకొన్నవాని+తన. 'తనవర్ణకంబు పరంబగునపుడు తచ్ఛబ్దార్థమునకు లోపం బగు' అనేసూత్రంచేత 'వాని' అనేతచ్ఛబ్దం లోపించి, ఆఁకొన్నతన. తద్ధితాంత మైనయీప్రాతిపదికం క్లీబసమం. కాబట్టి దీనిమీద ప్రథమైకవచనంలో 'అమహ న్నపుంసకముల' కనేసూత్రంచేత మువర్ణకం వచ్చి, 'ఆఁకొన్నతనము' అని అవుతుంది. విభాష అనడంచేత తచ్ఛబ్దం (వాని) లోపింపనిపక్షంలో 'ఆఁకొన్నవానితనము' అని అవుతుంది.

**2. పూజారి:** పూజ అనేఆచ్ఛికశబ్దంమీద కలవాడు అనేఅర్థంలో 'అరివర్ణకంబు మతుబర్థంబున జాలాదుల కగు' అనేసూత్రంచేత అరి ప్రత్యయం వచ్చి, పూజ+అరి. 'అంద్వవగాగమంబులం దప్ప–' అని సంధి జరిగి, పూజరి. 'మతుబర్థంబునం దరివర్ణకంబు పరం బగునపుడు పూజసొన్నముల కడయచ్చునకు వైకల్పికముగాను, నిత్యముగాను దీర్ఘం బగు' అనేసూత్రంచేత దీర్ఘం వచ్చి, పూజారి. (ఇందులో జకారం దంత్యం.) వైకల్పికము అనడంచేత దీర్ఘం రానిపక్షంలో పూజరి. ఈతద్ధితాంత ప్రాతిపదిక స్త్రీసమం కాబట్టి ప్రథమైకవచనం లోపించి, పూజారి, పూజరి. (ఇలాగే

సొన్నారి.)

**3. చెంచిత:** చెంచు జాతికి చెందినస్త్రీ అనేఅర్థంలో చెంచు అనే ప్రథమైక వచనాంతంమీద 'తవర్ణకంబు కులవాచకంబునకు స్త్రీ వాచ్యం బగునపుడు మతు బర్థంబునం దగు' అనేసూత్రంచేత 'త' ప్రత్యయం వచ్చి, చెంచు+త. 'తద్ధిత ప్రత్యయములు పరంబు లగునపుడు పదంబులడువర్ణకాదులకు లోపం బగు' అనేసూత్రంచేత చెంచు శబ్దంమీదిప్రథమావిభక్తి (సు) లోపించి, చెంచు+త. 'మతుబర్థంబునం జెంచునకుఁ దవర్ణకంబు పరం బగుచో నిత్వం బగు' అని ఇత్వం వచ్చి, చెంచిత. తద్ధితాంత మైనఈప్రాతిపదికం స్రీసమం. కాబట్టి దీనిమీద ప్రథమైకవచనం లోపించి, చెంచిత. ఇత్వం రానిపక్షంలో బాలవ్యాకరణం ప్రకారం చెంచెత, చెంచుత అనేరూపాలు కూడా అవుతాయి.

**4. చెడుఁగఁడు :** చెడుగు కలిగినవాడు అనేఅర్థంలో చెడుగు అనేప్రథమైకవచనాంత శబ్దంమీద 'చెడుగు దుడుకు నిడుపులకుఁ బుంస్త్వంబున మతుబర్థం బకారం బగు' అనేసూత్రం చేత 'అ' ప్రత్యయం వచ్చి, చెడుగు+అ. 'తద్ధితప్రత్యయములు పరంబు లగునపుడు పదంబుల డువర్ణకాదులకు లోపం బగు' అనేసూత్రంచేత ప్రథమైకవచనం లోపించి, 'అంద్వవగాగమంబులం దప్ప–' అని సంధి జరిగి, చెడుగ. తద్ధితాంత మైనఈప్రాతిపదికం (పుంలింగ తుల్యం) మగాదులలోనిది కాబట్టి 'మహత్తు లగు మగాదులకు–' అనేసూత్రంచేత ప్రథమైకవచనంలో ఉత్త్వం రాక, డుజ్ మాత్రమే వచ్చి, చెడుగఁడు.

**5. వేఱడము:** వేఱు అనేశబ్దంమీద అదే అర్థంలో 'వేఱున కడవర్ణకంబు స్వార్థంబునం దగు' అనేసూత్రంచేత 'అడ' ప్రత్యయం వచ్చి, వేఱు+అడ. 'అంద్వవ గాగమంబులం దప్ప–' అని సంధి జరిగి, వేఱడ. తద్ధితాంత మైన ఈప్రాతిపదికం క్లీబసమం. కాబట్టి ప్రథమైకవచనంలో 'అమహన్నపుంసకముల కదంతములకు–' అనేసూత్రంచేత మువర్ణకం వచ్చి, వేఱడము అని అవుతుంది.

**6. వెల్లడి:** వెల్ల అనేశబ్దంమీద అదే అర్థంలో 'వెల్ల కడివర్ణకంబు స్వార్థంబునం దగు' అనేసూత్రంచేత అడి అనేప్రత్యయం వచ్చి వెల్ల+అడి. 'అంద్వవగాగమంబులం దప్ప– అనేసూత్రంచేత సంధి జరిగి వెల్లడి. ఈతద్ధితాంతప్రాతిపదిక స్త్రీసమం కాబట్టి ప్రథమైకవచనం లోపించి – వెల్లడి అనేపదం ఏర్పడుతుంది.

**7. తెలివిడి:** తెలివి అనేశబ్దంమీద అదే అర్థంలో 'తెలివి, విరివి, వినికి, లేమి,

రాపులకు స్వార్థంబునం దిఁడి వర్ణకం బగు' అనేసూత్రంచేత ఇఁడి ప్రత్యయం వచ్చి తెలివి+ఇడి. 'అంద్వవగాగమంబులం దప్ప – అనేసూత్రంచేత సంధి జరిగి, తద్ధితాంత మైనఈప్రాతిపదిక స్త్రీసమం కాబట్టి ప్రథమైకవచనం లోపించి – తెలివిడి అనేరూపం ఏర్పడుతుంది. (ఇలాగే వినికిడి రాపిడి మొ.)

**8. ఇంపితము:** ఇంపు అనేశబ్దంమీద అదే అర్థంలో 'ఇతవర్ణకం బింపు బిగుపోరులకు స్వార్థంబునం దగు' అనేసూత్రంచేత ఇత అనేప్రత్యయం వచ్చి, ఇంపు+ఇత. అంద్వవగాగమంబులం దప్ప – అనేసూత్రంచేత సంధి జరిగి, ఇంపిత. తద్ధితాంత మైనఈక్లీబసమప్రాతిపదికకు ప్రథమైకవచనంలో 'అమహన్నపుంసకముల కదంతములకు మువర్ణకం బగు' అనేసూత్రంచేత మువర్ణకం వచ్చి – ఇంపితము అనేరూపం ఏర్పడుతుంది.

**9. ఒప్పిదము:** ఒప్పు అనేశబ్దంమీద అదే అర్థంలో 'ఇదవర్ణకం బొప్పు తప్పు పెల్లులకు స్వార్థంబునందును, క్రొవ్వు బెట్టులకు మతుబర్థంబునందు నగు' అనేసూత్రం చేత ఇదప్రత్యయం వచ్చి ఒప్పు+ఇద. అంద్వవగాగమంబులం దప్ప– అనేసూత్రంచేత సంధి జరిగి ఒప్పిద. తద్ధితాంత మైనఈక్లీబసమప్రాతిపదికమీద ప్రథమైకవచనంలో 'అమహన్నపుంసకములకు – అనేసూత్రంచేత ముప్రత్యయం వచ్చి – ఒప్పిదము అనేరూపం ఏర్పడుతుంది.

**10. వాఁపిరి:** వాఁపు అనేశబ్దంమీద అదే అర్థంలో 'స్వార్థంబునం దిరివర్ణకంబు వాఁపున కగు' అనేసూత్రంచేత ఇరిప్రత్యయం వచ్చి, వాఁపు+ఇరి. 'అంద్వవ గాగమంబులం దప్ప–' అని సంధి జరిగి, వాఁపిరి. తద్ధితాంత మైనయీస్త్రీసమ ప్రాతిపదికపై ప్రథమైకవచనం లోపించి – వాఁపిరి అనేప్రథమైకవచనాంతపదం ఏర్పడుతుంది.

**11. నాయఁకరము:** నాయఁకునియొక్క భావము అనేఅర్థంలో నాయఁకునియొక్క అనేషష్ఠ్యంతం మీద 'కరవర్ణకంబు నాయఁకశబ్దంబునకు భావంబునం దగు' అనేసూత్రంచేత అరప్రత్యయం వచ్చి, విభక్తి లోపించి, నాయఁకుని+కర. 'కుని' అనేభాగం లోపించి, నాయఁకర. తద్ధితాంత మైనఈక్లీబసమప్రాతిపదికపై ప్రథమైక వచనంలో 'అమహన్నపుంసకములకు– అనేసూత్రంచేత మువర్ణకం వచ్చి, నాయఁ కరము అనేరూపం ఏర్పడుతుంది.

**12. చెలికారము:** చెలియొక్క భావము అనేఅర్థంలో చెలియొక్క అనేషష్ఠ్యంతపదం మీద 'కారవర్ణకంబు చెలినయములకు భావంబునందును, నుజి కొలలకు

స్వార్థంబునందు నగు, ఈకకారంబు కొన్నియెడల గకారం బగు' అనేసూత్రంచేత కారప్రత్యయం వచ్చి చెలికార. తద్ధితాంత మైనఈక్లీబసమప్రాతిపదికమీద ప్రథమైకవచనంలో 'అమహన్నపుంసకములకు–' అనేసూత్రంచేత ముప్రత్యయం వచ్చి – 'చెలికారము' అనేరూపం ఏర్పడుతుంది.

**13. చలిమిరి**: చలిశబ్దంమీద అదే అర్థంలో 'చలికి మిరి వర్ణకంబు స్వార్థంబునం దగు' అనేసూత్రంచేత మిరి అనేప్రత్యయం వచ్చి చలిమిరి. తద్ధితాంత మైనఈస్త్రీసమ ప్రాతిపదికమీద ప్రథమైకవచనం లోపించి – చలిమిరి అనేపదం ఏర్పడుతుంది.

**14. ఒంటి:** భావార్థంలో ఒండు (ఒండుయొక్క అనేషష్ఠ్యంతశబ్దంమీద టి అనేతద్ధితప్రత్యయం వివక్షించినపుడు 'తద్ధితప్రత్యయములు పరంబు లగునపుడు పదంబుల దువర్ణకాదులకు లోపం బగు' అనేసూత్రంచేత యొక్కప్రత్యయం లోపించి, ఒండు అని కాగా) శబ్దంలోనిడువర్ణంస్థానంలో 'టివర్ణకం బొండు నంత్యవర్ణంబునకు భావంబునం దగు' అనేసూత్రంచేత 'టి' అనేవర్ణం ఆదేశ మై, ఒంటి. తద్ధితాంత మైనఈస్త్రీసమశబ్దంపై ప్రథమైకవచనానికి లోపం వచ్చి, ఒంటి అనేపదం ఏర్పడుతుంది.

**15. కటిబంటి:** కటియొక్క పరిమాణం లోతు కలది అనేఅర్థంలో కటియొక్క అనేషష్ఠ్యంతంమీద 'దఘ్నార్థంబున బంటికొలఁదు లగు' అని బాలవ్యాకరణంలో చెప్పబడిన బంటి ప్రత్యయం 'దఘ్నార్థంబునం దత్సమపదంబులమీఁదను బంటి కానంబడియెడి' అనేసూత్రంచేత కటి అనేసంస్కృతసమశబ్దంమీద వచ్చి కటియొక్క+బంటి. 'తద్ధితప్రత్యయములు పరంబు లగునపుడు–' అనేసూత్రంచేత యొక్కవిభక్తి లోపించి, కటిబంటి. తద్ధితాంత మైనఈస్త్రీసమశబ్దంమీద ప్రథమైకవచనం లోపించి, కటిబంటి అనేపదం ఏర్పడుతుంది.

**16. తనమయము:** తనయొక్క ప్రాచుర్యము అనేఅర్థంలో 'ప్రాచుర్యార్థంబునం దెలుఁగుపదంబులమీఁదను మయప్రత్యయము చూపట్టెడు' అనేసూత్రంచేత 'మయ' అనేప్రత్యయం వచ్చి తనమయ. తద్ధితాంత మైనఈక్లీబసమప్రాతిపదికమీద ప్రథమైకవచనంలో 'అమహన్నపుంసకముల కదంతములకు–' అనేసూత్రంచేత

ము[ప్రత్యయం వచ్చి తనమయము అనేరూపం ఏర్పడుతుంది.

**17. దివ్యతేజంబునవాఁడు :** దివ్యతేజంబు కలవాడు అనేఅర్థంలో దివ్యతేజంబు అనేశబ్దంమీద 'ఒకానొకచో మతుబర్థంబున నవర్ణకంబు చూపట్టెడి' అనేసూత్రంచేత నవర్ణకం వచ్చి, దివ్యతేజంబున. తద్ధితప్రత్యయాంత మైన యీప్రాతిపదికం పుంలింగతుల్యం. విభక్తివివక్షలో దీనిమీద తచ్ఛబ్దం చేరి, (మహదర్థంలో) ప్రథమైకవచనంలో – దివ్యతేజంబునవాఁడు అని అయింది. (ఈతద్ధితప్రత్యయం సంస్కృతసమంమీద రావడమూ, అది పరంగా ఉండగా విభక్తి లోపించకపోవడమూ ఇక్కడివిశేషాలు.)

# క్రియాపరిచ్ఛేదం

**1. జనమేజయు చేయుసర్పయాగము:** 'తద్ధర్మార్థకవిశేషణం బసహాయతం త్రికాలవాచి యగు' అనేసూత్రం ప్రకారం ఇక్కడి 'చేయు' అనే తద్ధర్మార్థకవిశేషణం 'చేయఁగల' అనేవిధంగా భవిష్యదర్థక మవుతున్నది.

**2. చన్నే:** చనునే అనేస్థలంలో 'ఒకానొకచోఁ దద్ధర్మార్థకము లగు నుండు చను చేరుకొనులు ప్రశ్నార్థకైకారపరకంబు లగునపుడు వానికడయచ్చులకు లోపంబు విభాష నగు, అగుచో నుండుడకారంబు నకారం బగు' అనేసూత్రంప్రకారం చనులో ఉకారం లోపించి (చన్నే) చన్నే అని రూపం ఏర్పడుతుంది.

**3. పంచితయ్యే:** పంచితి(వి) అనేభూతక్రియమీద 'తద్ధర్మభూతక్రియ లార్యాద్యర్థ పరకంబు లయి ప్రశ్నార్థకంబు లగు' అనేసూత్రంచేత అయ్య అనేఆర్యార్థకం చేరి, పంచితి+అయ్య. 'అంద్వవగాగమంబులం దప్ప–' అని సంధి జరిగి – పంచితయ్య అని అవుతుంది. ఈశబ్దం పంచితివా? అనేవిధంగా ప్రశ్నార్థం ఇస్తుంది.

**4. చెల్లునటమ్మ:** చెల్లున్ అనేతద్ధర్మప్రథమపురుషైకవచనాంతక్రియమీద 'ఒక్కొకచోఁ దద్ధర్మభూతక్రియ లార్యాద్యర్థపరకం బయి వ్యతిరేకవ్యంజకప్రశ్నార్థకం బగు' అని 'అమ్మ'శబ్దం చేరి, చెల్లున్+అమ్మ. 'ఆర్యాద్యర్థక మొక్కచో నటుశబ్దపూర్వకం బగు' అని ముందు అటు అనేశబ్దం చేరి చెల్లున్+అటు+అమ్మ. సంధి జరిగి చెల్లునటమ్మ. ఇది 'చెల్లదు' అని ప్రశ్నార్థాన్ని ఇస్తూ చెల్లునా? అనేవిధంగా వ్యతిరేకార్థాన్ని వ్యక్తం చేస్తుంది.

**5. తా వచ్చె సుదర్శనాయుధుఁడు:** సుదర్శనాయుధుడు త్వరలో రాగలడు అనేవిధ మైన భవిష్యదర్థంలో వచ్చు ధాతువుమీద లృట్ లకారం వచ్చి, వచ్చు+ల్. 'కొన్నియెడలం ద్వరితార్థసూచకం బయి భావిని భూతంబు చూపట్టెడి' అనేసూత్రాన్ని అనుసరించి 'భూతంబున లి ట్టగు' అని లిట్టు వచ్చి, వచ్చు+ల్. ప్రథమపురుషైక వచనంలో – వచ్చెన్ అని అవుతుంది. ఇక్కడ వచ్చెన్ అంటే త్వరలో రాగలడు అని అర్థం.

**6. ప్రోవఁగదన్న:** ప్రోవన్ అనే నుజ్యంతక్రియమీద 'ప్రార్థనంబునం దన్నృత్యయాంతక్రియలమీఁదఁ గదకదవుపూర్వకంబు లన్నాదు లనుప్రయుక్తంబు లగు' అని 'కద+అన్న' అనేది అనుప్రయుక్త మై, ప్రోవన్+కద+అన్న=ప్రోవఁ గదన్న అని అవుతుంది.

**7. ఉండనీ :** ఉండన్+ఇమ్ము అని ఉండగా 'ప్రార్థనాదులం దన్నృత్యయాంతక్రియల మీఁదియిమ్మున కీకారంబు విభాష నగు' అనేసూత్రంప్రకారం ఇమ్ము అనేశబ్దం మొత్తం స్థానంలో 'ఈ' అనేది ఆదేశంగా వచ్చి ఉండన్+ఈ=ఉండనీ అని అవుతుంది.

**8. రాపొండు:** రండు+పొండు అని ఉండగా 'ఒకానొకచో రండుపొండులకు రాపొం దనియు రూపంబు గానంబడియెడి' అనేసూత్రంప్రకారం 'రాపొండు' అనే రూపం ఏర్పడుతుంది. 'కానంబడియెడి' అనడంచేత ఈరూపం రానిపక్షంలో 'రండుపొండు' అనే ఉంటుంది.

**9. అనుటయు లుబ్ధకుం డి ట్లనియె:** అనుట అనే భావార్థకరూపంమీద అనిన వెంటనే అనేఆనంతర్యార్థంలో 'కొన్నియెడల భావార్థకరూపము నుశబ్దపరకం బయి యానంతర్యార్థకం బయ్యెడి' అనేసూత్రంప్రకారం (యువర్ణపూర్వకంగా) నుశబ్దం చేరి అనుటయును అనేరూపం ఏర్పడుతుంది. అనిన అనంతరం (వెంటనే) అని అర్థం.

**10. ఇచ్చుకోలు :** ఇచ్చుకొనుట అని ఉండగా 'భావంబునం దనుప్రయుక్తం బగు కొనుటకుం గోలు విభాష నగు' అనేసూత్రం ప్రకారం కొనుట అనేదానిస్థానంలో 'కోలు' అనేశబ్దం ఆదేశంగా వచ్చి 'ఇచ్చుకోలు' అనేరూపం ఏర్పడుతుంది. విభాష అనడంచేత ఈఆదేశం రానిపక్షంలో 'ఇచ్చుకొనుట' అని అలాగే ఉంటుంది.

**11. పాలించుకొఱకునై :** పాలించుటకొఱకునై అని ఉండగా 'కొఱకు కంటె పొంటెలు పరంబు లగునపుడు భావార్థకటవర్ణకంబునకు లోపంబు విభాష నగు' అనేసూత్రంచేత టవర్ణకం లోపించి పాలించుకొఱకునై అని అవుతుంది. విభాష

అనడంచేత లోపం రానిపక్షంలో – పాలించుటకొఱకున్నై అని ఉంటుంది.

**12. పోరించని :** పోరించు అనేధాతువుమీద వ్యతిరేకతృవర్ణకార్థంలో ని(జి)ప్రత్యయం వచ్చి, ముందు అత్వంతో పోరించ+ని అని ఉండగా నిజి జిత్తు కాబట్టి ముత్తు పరంగా ఉండడంచేత 'ఆగమాన్యచకారంబుల కద్విరుక్తంబులకు ముత్తు పరం బగునపుడు పవ లగు' అనేబాలవ్యాకరణసూత్రంచేత చకారానికి పకారం రావలసిఉండగా 'కవిత్రయేతరప్రయోగంబులం గొన్నియెడల నిప్రత్య యాదులు పరంబు లగునపుడు పకారం బించుక్చకారంబున కేనిఁ గానంబడదు' అనేప్రౌఢవ్యాకరణసూత్రం ప్రకారం పకారం రాక, చకారం అలాగే ఉండి, 'పోరించని' అని ఉంటుంది. పకారం వచ్చినపక్షంలో – పోరింపని అని అవుతుంది.

**13. గర్జింపుచున్:** గర్జ ధాతువుమీద ఇంచుగామం వచ్చి గర్జించు. శత్రర్థంలో దీనిమీద 'చువర్ణంబు ద్రుతాంతంబు క్రియాన్వయంబున శత్రర్థంబునం దగు' అనేసూత్రంచేత చున్ ప్రత్యయం వచ్చి గర్జించు+చున్. 'పకారంబు కొన్నియెడల శత్రర్థపరకచువర్ణకంబునకుం గానంబడెడి' నని పత్వం రాగా, గర్జింపుచున్ అని అవుతుంది. 'కొన్నియెడల, కానంబడెడి' అనడంచేత పత్వం రానిపక్షంలో – చకారం అలాగే ఉండి, గర్జించుచున్.

**14. చొక్కఁజేయు :** చొక్కు ధాతువు ప్రేరణార్థంలో 'అన్నంతక్రియ చేయుయోగంబునం బ్రేరణార్థకం బగు' అనేసూత్రంచేత అన్ప్రత్యయాంత మై, చొక్కన్ అని ఐ, దానిమీద చేయుధాతువు చేరి, చొక్కన్+చేయు. ద్రుతకార్యాలతో – చొక్కఁ జేయు అని అవుతుంది. చొక్కఁజేయు అంటే చొక్కించు అని ప్రేరణం అర్థం.

**15. ఎండఁబాఱె :** ఎండటానికి ఉన్ముఖం (అనుకూలం) అయింది అనేఅర్థంలో 'వ్యాపారోన్ముఖత్వంబున నన్నంతక్రియలకుఁ బాఱుధాతు వనుప్రయుక్తం బగు' అనేసూత్రంచేత అన్ ప్రత్యయాంతం ఐన ఎండు ధాతువు (ఎండు+నుజి– ఎండు+అన్=ఎండన్) మీద 'పాఱు' అనేధాతువు చేరి, ఎండన్+పాఱు. ద్రుత కార్యాలతో ఎండఁబాఱు అని అవుతుంది. ఇది ప్రథమపురుషైకవచనంలో ఎండఁ బాఱె అని అవుతుంది. ఎండటానికి సిద్ధంగా ఉన్నది అని అర్థం.

**16. తివన్ :** తిగుచు అనేధాతువుమీద అన్ ప్రత్యయం వచ్చి, ('తుమర్థ భావలక్షణంబులందు నుజి యగు' అనేసూత్రంచేత నుజి ప్రత్యయం)వచ్చి తిగుచు+అన్. అని ఉండగా, (తిగువన్ అని కావలసిఉంది.) 'తిగుచుధాతువు నన్నంతరూపములు తివ్వఁ దివ ననియు' అనేసూత్రంప్రకారం తొలియచ్చుమీది

వర్ణాలకు దివరుక్తవకారం వచ్చి, (తివ్‌వ్–అన్) తివ్వన్. లేదా ఒక్కవకారం వచ్చి, (తివ్–అన్) తివన్ అని రూపా లవుతాయి.

**17. కనినకంటె :** కనిన అనేధాతుజవిశేషణం అమహదర్థంలో పంచమీవిభక్తిలో కనినదానికంటె అని ఉండగా 'కంటె వర్ణకంబు పరం బగునపుడు విశేషణనవర్ణకంబు మీఁదియమహత్తచ్ఛబ్దార్థమునకు లోపంబు విభాష నగు' అనేసూత్రంచేత దాని అనే అమహత్తచ్ఛబ్దం లోపించి 'కనినకంటె' అని అవుతుంది. విభాష అనడంచేత లోపం రానిపక్షంలో 'కనినదానికంటె' అని ఉంటుంది.

**18. పెల్లు దొఱఁగునెత్తురు నై :** తొఱగు అనేక్రియకు విశేషణం ఐన పెల్లు శబ్దానికి 'నుఙ్యంతం బగునగుధాతువు క్రియావిశేషణంబుల కనుప్రయుక్తం బగు, నుఙికి విభాష నగు' అని 'కాను' అనేది అనుప్రయుక్తం ఐ, పెల్లుగా తొఱగు అని ఉండగా 'క్రియావిధేయవిశేషణంబులమీఁదియగుధాతువున కన్నంతమునకు లోపంబు విభాష నగు' అనేసూత్రంచేత 'కాను' అనేది లోపించి, 'పెల్లు దొఱఁగు' అని అవుతుంది. విభాష అనడంచేత లోపం రానిపక్షంలో 'పెల్లుగాఁ దొఱఁగు' అని ఉంటుంది.

**19. నాథుఁడు గనున్న:** భవిష్యదర్థాన్ని తెలియజేసేసందర్భంలో అగు ధాతువుకు అన్ ప్రత్యయాంతరూప మైన 'కాను' అనేశబ్దంమీద 'ఉన్న' అనేశబ్దం అనుప్రయుక్త మై, (నాథుడు) కాన్ ఉన్న= కానున్న అని ఉండగా, 'ఒకానొకచో నన్నంత మగునగు ధాతువు దీర్ఘంబునకు భావ్యర్థంబున నున్న పరం బగునపుడు హ్రస్వమును గానంబడియెడి' అనేసూత్రం చేత 'కా' దీర్ఘానికి హ్రస్వం వచ్చి, (నాథుడు) కనున్న= నాథుడు గనున్న అని అవుతుంది. 'నాథుడు గనున్న=నాథుడు కాబోయే' అని ఇది భవిష్యదర్థాన్ని బోధిస్తుంది.

**20. తూటాడి యాడి :** తూటాడి అనేశబ్దం ద్విరుక్త మై, తూటాడి తూటాడి అని ఉండగా 'శబ్దపల్లవక్రియలు కొన్ని ద్విరుక్తంబు లయి పునర్గృహీతంబు లగుచో నుత్తరపదంబు పూర్వావయవంబునకు లోపంబు విభాష నగు' అనేసూత్రంచేత రెండవ 'తూటాడి' లో మొదటిభాగ మైన 'తూటు' శబ్దం లోపించి, తూటాడి+ఆడి. సంధి లేదు. కాబట్టి యడాగమం వచ్చి, 'తూటాడియాడి' అని అవుతుంది. విభాష అనడంచేత లోపం రానిపక్షంలో 'తూటాడి తూటాడి' అని ఉంటుంది.

**21. నేను నాసేనయు దాడిపెట్టెద:** ఇక్కడ దాడిపెట్టు అనేక్రియకు 'నాసేన' అనేనామమూ, 'నేను' అనేఅస్మదర్థమూ రెండూ కర్తలు. నాసేనతో కూడి నేను

దాడిపెట్టెదను అనేవిధంగా సహార్థం ఉన్నది. కాబట్టి 'ఒకానొకచో సహార్థంబున యుష్మదస్మదర్థంబు లభిహితంబు లగునపుడు క్రియలు తత్కర్తృకంబులు విభాష నగు' అనేసూత్రంచేత నేను అనేకర్తకు అనుగుణంగా దాడిపెట్టెదను అని క్రియ 'ఉత్తమపురుష'లో 'ఏకవచనం'లో వచ్చి, 'దాడిపెట్టెదను' అని అయింది.

విభాష అనటంచేత ఇలా కానిపక్షంలో 'అన్యయుష్మదస్మత్కార్యంబులం దుత్తరోత్తరంబు బలీయంబు' అనేసూత్రంప్రకారం అస్మత్కార్యమే వస్తుంది, కాని కర్తృబహుత్వాన్నిబట్టి క్రియకు బహువచనం వస్తుంది. (నేను నాసేన) 'దాడిపెట్టెదము' అని అవుతుంది.

**22. దయాంబురాశివి గదమ్మ :** దయాంబురాశివి గద అనేదానిమీద 'తఱచుగఁ గ్రియలమీఁది కద కదవుల కన్నాదులు పర్యాయంబున ననుప్రయుక్తంబు లగు' అనేసూత్రంప్రకారం అమ్మ అనేశబ్దం అనుప్రయుక్తం ఐ, సంధి జరిగి 'దయాంబురాశివి గదమ్మ' అని అవుతుంది. అనుప్రయుక్తం కానిపక్షంలో 'దయాంబురాశివి గద' అని ఉంటుంది.

# కృదంతపరిచ్ఛేదం

**1. నొప్పి :** నొచ్చు ధాతువుమీద 'డయ్యి దయ్యి నొచ్చు పుచ్చుల కివర్ణకం బగు, అగుచో వానికడహల్లులు పకారంబు లగు' అనేసూత్రంచేత ఇ ప్రత్యయం వచ్చి, నొచ్చు+ఇ. చకారాలకు పకారాలు వచ్చి, నొప్పు+ఇ. 'అంద్వవగాగమంబులం దప్ప- అని సంధి జరిగి నొప్పి. కృదంత మైనఈప్రాతిపదికం స్త్రీసమం కాబట్టి ప్రథమైకవచనానికి లోపం వచ్చి, 'నొప్పి' అనేప్రథమైకవచనాంతపదం ఏర్పడుతుంది.

**2. రాయిడి :** రాయు ధాతువుమీద 'రాయున కిడి వర్ణకంబు నగు' అనేసూత్రంచేత ఇడి ప్రత్యయం వచ్చి రాయు+ఇడి. 'అంద్వవగాగమంబులం దప్ప- అని సంధి జరిగి రాయిడి. కృదంత మైనఈప్రాతిపదికం స్త్రీసమం కాబట్టి, ప్రథమైకవచనానికి లోపం వచ్చి - రాయిడి అనేపదం ఏర్పడుతుంది.

సముచ్చయంచేత ఇడి ప్రత్యయం రానిపక్షంలో 'పువర్ణకంబు మాయ్యాదుల కగు' అని పు ప్రత్యయం వచ్చి, రాయు+పు. 'ఇటం గృత్కగతపవేములు పరంపు లగునపుడు కగచయవలకు లోపం బగు' యువర్ణం లోపించి, రా+పు. కృదంత మైనఈస్త్రీసమప్రాతిపదికమీద ప్రథమైకవచనం లోపించి - రాపు అనేపదం ఏర్పడుతుంది.

**3. ఉప్పెన :** ఉబ్బు అనేధాతువుమీద 'ఈ ర్చుబ్బు కందు దువ్వు వడ్డించుల కెన వర్ణకం బగు, అగుచో ఈర్చుబ్బులచకారబకారంబులు పకారంబు లగు వడ్డించు నించు లుప్తం బగు' అనేసూత్రంచేత ఎన ప్రత్యయం వచ్చి, ఉబ్బు+ఎన. బకారాలకు పకారాలు వచ్చి, ఉప్పు+ఎన. 'అంద్వవగాగమంబులం దప్ప– అని సంధి జరిగి, ఉప్పెన. కృదంత మైన ఈస్త్రీసమప్రాతిపదికమీద ప్రథమైకవచనం లోపించి – ఉప్పెన అనేపదం ఏర్పడుతుంది.

**4. కాఁపురము :** కాఁచు ధాతువుమీద 'పురవర్ణకంబు కాఁచు దాఁచు దాయ్యాదుల కగు' అనేసూత్రంచేత' పుర అనేప్రత్యయం వచ్చి, కాఁచు+పుర. 'ఇటం గృత్కగతప వేములు పరంబు లగునపుడు కగచయవలకు లోపం బగు' అనేసూత్రంచేత చువర్ణం లోపించి, కాఁపుర. కృదంత మైనఈక్లీబసమప్రాతిపదిక క్లీబసమం కాబట్టి, ప్రథమైక వచనవివక్షలో 'అమహన్నపుంసకముల కదంతములకు మువర్ణకం బగు' అనేసూత్రంచేత ము ప్రత్యయం వచ్చి – 'కాఁపురము' అనేరూపం ఏర్పడుతుంది.

**5. ఎగుమతి :** ఎక్కు ధాతువుమీద 'ఎక్కు దిగులకుం బ్రేరణార్థంబున మతివర్ణకం బగు, అగుచో ఎగు ఎక్కున కాదేశం బగు' అనేసూత్రంచేత మతిప్రత్యయం వచ్చి, ఎక్కు+మతి. ఎక్కు అనేశబ్దంస్థానంలో 'ఎగు' అనేది ఆదేశ మై, ఎగుమతి. కృదంత మైన ఈప్రాతిపదికం స్త్రీసమం కాబట్టి, ప్రథమైకవచనం లోపించి – ఎగుమతి అనేపదం ఏర్పడుతుంది.

**6. ఉలివు :** ఉలియు ధాతువుమీద 'వువర్ణకం బులియ్యాదుల కగు' అనేసూత్రంచేత వు ప్రత్యయం వచ్చి, ఉలియు+వు. 'ఇటం గృత్కగతపవేములు పరంబు లగునపుడు కగచయవలకు లోపం బగు' అనేసూత్రంచేత యువర్ణం లోపించి, ఉలివు. కృదంత మైనఈప్రాతిపదిక స్త్రీలింగం కాబట్టి ప్రథమైకవచనానికి 'స్త్రీలింగంబులప్రథమైక వచనంబునకు లోపం బగు' అని లోపం వచ్చి, 'ఉలివు' అనేపదం ఏర్పడుతుంది.

**7. కావలి:** కాచు ధాతువుమీద 'కాచు వీచులకు వలి వర్ణకం బగు' అనేసూత్రంచేత వలి అనేప్రత్యయం వచ్చి కాచు+వలి. 'ఇటం గృత్కగతపవేములు పరంబు లగునపుడు కగచయవలకు లోపం బగు' అనేసూత్రంచేత చువర్ణం లోపించి కావలి. కృదంత మైనఈప్రాతిపదిక స్త్రీసమం కాబట్టి ప్రథమైకవచనానికి లోపం వచ్చి, కావలి అనేపదం ఏర్పడుతుంది.

000000000

## వాక్యపరిచ్ఛేదం

**1. దానవేశ్వరునకుఁ దమ్ములకు:** 'కొన్నియెడల సంబంధమునం బూర్వవాక్యంబు నందలిపదం బధ్యాహార్యం బగు' అనేసూత్రంచేత తమ్ములకు అనేస్థలంలో దానికి పూర్వంలో ఉన్న దానవేశ్వరునకు అనేదాని ననుసరించి దానవేశ్వరునియొక్క అనేది అధ్యాహరింపబడి దానవేశ్వరునితమ్ములకు అనే అర్థాన్ని తెలుపుతుంది.

**2. నన్నుఁ జూచి నగరె :** 'కొన్నియెడలఁ గర్తృకర్మక్రియ లధ్యాహార్యంబు లగు' అనేసూత్రం ప్రకారం కర్తను తెలియజేసే 'జనులు' అనేపదం అధ్యాహరింపబడి 'నన్నుఁ జూచి జనులు నగరె' అనే అర్థాన్ని బోధిస్తుంది.

## పారిభాషికపదవివరణం

**1. అంతర్భావితప్రేరణము:** అంతర్భవించినప్రేరణం కలిగినది అంతర్భావితప్రేరణం. లోపల ప్రేరణార్థం కలది. ధాతువు స్వస్వరూపంతోనే తనలోపల ప్రేరణార్థం సైతం కలిగిఉంటుంది. అంటే వివక్షనుబట్టి స్వార్థాన్ని మాత్రమే కాక, ధాతువు ప్రేరణార్థాన్ని కూడా ఇస్తుంది. 'కరఁగు తలఁగు మెఱయ్యాదు లంతర్భావిత ప్రేరణంబులు'. దాహమున కరఁగి. కరఁగి=ద్రవించి. స్వార్థం. బాణముల్ కరఁగి ఘటించిరి. కరఁగి=కరిగించి. ప్రేరణం. ఇలాగే ఆఁగు మొ.

**2. అంతస్థము :** ( యరలవా అంతస్థాః) య-ర-ల-వ. అనే నాలుగు వర్ణాలకు అంతస్థాలు అని పేరు. స్పర్శ (క కారంనుంచి మ కారం వరకున్న ) వర్ణాలకూ, ఊష్మ (శషసహ) వర్ణాలకు నడుమ (అంతః) ఉన్న (స్థ) వర్ణాలు, కాబట్టి వీటికి అంతఃస్థాలు అని సంజ్ఞ, ఉచ్చారణంలో గాలి లోపల నిలిచిఉండడంచేత కూడ ఇవి అంతస్థాలు.

**3. అకప్రత్యయాంతావ్యయము :**(సంజ్ఞ. 8) అక అనేప్రత్యయం అంతంలో కలిగిన అవ్యయం అకప్రత్యయాంతావ్యయం. 'కజీ వ్యతిరేకక్త్వార్థంబునం దగు' అని వ్యతిరేకక్త్వార్థంలో విధింపబడిన 'క' ప్రత్యయానికి ముందు ఉత్వానికి అత్వం వస్తుంది. అవి రెండూ కలిపి 'అక' ప్రత్యయం అన్నాడు ప్రౌఢవ్యాకర్త. అను+అక, అనక. మొ. ఇలాగే లేక, ఈక మొ. కూడా అక ప్రత్యయాంతాలే. కాగా అకప్రత్యయాంతం

అంటే వ్యతిరేకక్త్వార్థకం అని అర్థం. ఇది క్రియయొక్క అపరిసమాప్తిని తెలియజేసేది కాబట్టి అసమాపకక్రియ. ఆక్రియార్థ మైనవ్యాపారం జరిగిపోవడంచేత భూతకాలిక అసమాపకక్రియ. అది వ్యతిరేకార్థంతో ఉండడంవల్ల వ్యతిరేకార్థక భూతకాలిక అసమాపకక్రియ అని వ్యాకర్త వివరించాడు.

**4. అకర్మకకర్తరిప్రయోగము:**(వాక్య.3) కర్త, (కర్మ,) క్రియ కలిగినవాక్యానికి ప్రయోగం అని పేరు. అటువంటివాక్యంలో క్రియచేత కర్త చెప్పబడితే అది కర్తరిప్రయోగం. కర్మ లేని ధాతువునుండి ఏర్పడిన క్రియతో ఉన్నకర్తరిప్రయోగం అకర్మక కర్తరిప్రయోగం. రాముఁడు వచ్చెను. ఇక్కడ వచ్చు (వచ్చెను) ధాతువు అకర్మకం (కర్మ లేనిది). ఈవాక్యంలోని వచ్చెను అనేక్రియ కర్త (రాముడు)ను తెలుపుతున్నది. కాబట్టి ఈవాక్యం అకర్మకకర్తరిప్రయోగం.

**5. అక్షరము :** ( ఉభయే త్వక్షరాణి, అనుస్వారో వ్యంజన శ్చాక్షరాంగమ్) హ్రస్వం, దీర్ఘం (ప్లుతం) అనేభేదం కలిగిన అచ్చు – అక్షరం. అనుస్వారం, (విసర్గ) పొల్లుహల్లు అనేవి అక్షరంలో భాగాలే కాని అక్షరాలు కావు. 1.అచ్చు (అ మొ.) 2.అచ్చుతో గూడిన హల్లు(లు) (క, క్ర, మొ.) 3.అనుస్వార, విసర్గలతో గూడిన అచ్చు (అఁ, అం, అః), అనేవి అక్షరం అనే సంజ్ఞ కలిగినవి.

**6. అగ్రామ్యము :**(సంజ్ఞ.12) 'లక్షణవిరుద్ధం బగుభాష గ్రామ్యంబు' వ్యాకరణానికి విరుద్ధంగా ఉన్నశబ్దానికి గ్రామ్యం అని పేరు. గ్రామ్యం కానిది అగ్రామ్యం. అంటే లక్షణబద్ధ మైనది అని అర్థం. 'ప్రాణగొడ్డ మగ్రామ్యంబు నాఁదగు' అంటే ప్రాణగొడ్డము అనేశబ్దం లక్షణబద్ధ మై, సాధు వయినపదమే అని తాత్పర్యం.

**7. అధ్యాహారము: 8. అధ్యాహార్యము:** 'ఆకాంక్షావిషయపదానుసంధానం అధ్యాహారః. వాక్యంలో ఆకాంక్షిత మైనఅర్థాన్ని బోధించేపదం ప్రయోగింపబడనపుడు అన్వయం కుదరడానికి ఆపదాన్ని తెచ్చుకోవడం అధ్యాహారం. అలా తెచ్చుకోవలసిన పదం అధ్యాహార్యం. 'నన్నుఁ జూచి నగరె' ఈవాక్యంలో ఎవరు? అని కర్త ఆకాంక్షితం కాగా ఆకర్తృపదం వాక్యంలో ప్రయోగింపబడలేదు. అన్వయం కుదరా లంటే ఆపదం అవసరం. కాబట్టి వాక్యంలో లేని ఆపదాన్ని తెచ్చి అన్వయించుకోవాలి. నన్ను జూచి జనులు నగరె. ఇలా అన్వయంకోసం వాక్యంలో లేని పదాన్ని తెచ్చుకోవడం అధ్యాహారం. తెచ్చుకోవలసినపదం (ఇక్కడ జనులు) అధ్యాహార్యం.

**9. అనుస్వారము :** (అనుగతః స్వరాన్ ఇతి అనుస్వారః) స్వరాలను అంటే

అచ్చులను (ఉచ్చారణంలో, లేఖనంలో కూడా) అనుసరించి ఉండేది కాబట్టి అనుస్వారం. ఇది తెలుగులో పూర్ణానుస్వారం (నిండుసున్న) అర్ధానుస్వారం (అరసున్న) అని రెండు రకాలు. అం– అఁ, అనుస్వారం కాబట్టి పూర్వంలో అచ్చు లేకుండా ఇది ఉండదు. (పొలఁతి, పొల్తి)

**10. అన్నంత(క్రియ)ము:** 'అన్' అనేప్రత్యయం చివర కలిగినది అన్ప్రత్యయాంతం. అన్+అంత = అన్నంతము. 'తుమర్థభావలక్షణంబులందు నుజీ యగు' అని వచ్చిన ను(జీ) ప్రత్యయం, 'జీత్తు పరం బగునపుడుత్వంబున కత్వం బగు' అని దానికి ముందు (ధాతువు చివరిఉత్వానికి) వచ్చే అత్వం, కలిసి (అను) ప్రత్యయంగా ప్రౌఢవ్యాకర్త వ్యవహరించాడు. ఇది నుజ్యంతం, తుమర్థక్రియ మొ. వందు – వండన్ – మొ.

**11. అన్వయము :**'పదములకుఁ బరస్పరము గలసంబంధ మన్వయ మనంబడు' వాక్యంలో ఉన్నపదాలకు ఒకదానికి మరొకదానితో ఉన్నసంబంధాన్ని అన్వయం అంటారు. 'రాముడు రావణుని చంపెను' ఇక్కడ రాముడు అనేది కర్తగాను, రావణుని అనేది కర్మగాను, మొదలుగా పదాలు అన్నీ పరస్పరం సంబంధం కలిగిఉన్నాయి. ఇటువంటిసంబంధాన్నే అన్వయం అంటారు.

**12. అప్రధానము :** 'విశేష్యంబు ప్రధానం బితరంబప్రధానంబు'. వాక్యంలో విశేష్యం ప్రధానం. ఇతరం అంటే విశేషణం. కాగా విశేషణం అప్రధానం. కరుణాళుం డగు శంకరుండు వర మిచ్చెను. ఇక్కడ విశేషణ మైన కరుణాళుండు అప్రధానం. 'శంకరుండు వర మిచ్చెను' అని వాక్యార్థసిద్ధికి శంకరుండు అనేవిశేష్యం ముఖ్యం కాబట్టి అది ప్రధానం. ఈవిశేష్యం లేకుండా, కరుణాళుండు వర మిచ్చెను అనేవిధంగా విశేషణం మాత్రమే ఉంటే వాక్యార్థం స్పష్టం కాదు. కాబట్టి కరుణాళుండు అనేవిశేషణం అప్రధానం.

**13. అప్రాణివాచకము –** (చూ. జడము.)

**14. అవ్యయము :**(సంజ్ఞ.8) 'సదృశం త్రిషు లింగేషు, సర్వాసు విభక్తిషు, వచనేషు చ సర్వేషు య న్న వ్యేతి త దవ్యయమ్' అవ్యయం అంటే లింగ, విభక్తి, వచన శూన్యం. లింగం, విభక్తి, వచనాలకు సంబంధించి శబ్దంలో ఎటువంటిమార్పు లేక స్థిరంగా ఉండేశబ్దం అవ్యయం. వ్యాకరణంచేత సాధింపబడినఅవ్యయాలను లాక్షణికాలు అంటారు. అకప్రత్యయాంతాలు మొ. అనక, అని, మొ. శబ్దం పుట్టుకతోటే అవ్యయా లయితే అవి ప్రతిపదోక్తాలు. ఆహా, ఓహో. మొ.

**15. అలఘురేఫము :**(సంజ్ఞ. 9) 'విఱుగు, మెఱుగు ఇత్యాదులందలిరేఫం బలఘువు. ఇదే శకటరేఫ మని చెప్పంబడు' అనేవివరణాన్నిబట్టి శకటరేఫ, అంటే బండిఱాకు అలఘురేఫ అని పేరు. 'య స్యోచ్చారణే జిహ్వాగ్రోపాగ్ర మధ్య మూలానాం శైథిల్యం జాయతే స లఘూచ్చారణః' అని చెప్పబడినలఘుత్వం లేనిది కాబట్టి శకటరేఫ అలఘువు. (ఉచ్చారణలోని లఘుత్వంవల్ల సాధురేఫ లఘువు. కరుగు, పెరుగు మొ.)

**16. అసంపూర్ణవాక్యము :** 'అసమాపకక్రియలు గలవాక్యము అసంపూర్ణము' క్త్వార్థకాలు మొద లైనవి అసమాపకక్రియలు. ఇటువంటిక్రియలు గలిగినవాక్యం అసంపూర్ణవాక్యం. 'నలుడును దమయంతి దోడ్కొని'. 'తోడ్కొని' అనే (క్త్వార్థక – భూతకాలిక) అసమాపకక్రియ గలిగినఇది అసంపూర్ణవాక్యం.

**17. అసమాపకక్రియ:**(వాక్య. 1) వ్యాపారావబోధకాలు క్రియలు. అసమాపకం అంటే ముగియనిది. అటువంటిక్రియ అసమాపకక్రియ. వాక్యంలో ఆకాంక్ష పూర్తి కాకుండ అంటే క్రియను గూర్చినఆకాంక్ష కలిగేవిధంగా చెప్పబడిఉన్నక్రియ, అసమాపకక్రియ. 'క్త్వా, తద్వ్యతిరేక, శతృ, తుమున్, చేత్, ఆనంతర్యార్థకాలు అసమాపకక్రియలు. ఇవి ఆఱు. 'హంస లెల్ల పిండుగట్టి' ఏమి చేశాయి అనేవిధంగా ఆకాంక్ష ముగియకపోవటంచేత 'పిండుగట్టి' అనేది (క్త్వార్థకం) అసమాపకక్రియ.

**18. ఆంధ్రము :**(సంజ్ఞ. 1) 'ఆంధ్రభాషకు వర్ణంబు లేఁబదియైదు' అని యీసంజ్ఞను ప్రౌఢవ్యాకరణం సూత్రంలో ఉపయోగించింది. 'తెనుఁగునకు వర్ణములు ముప్పదియాఱు' అని చెప్పిన(సంస్కృతసమేతర మయిన) తెనుగుభాషే ఆంధ్రం. 'ఋఋూ (ఌౡ)....సంస్కృతసమంబులను గూడి తెలుఁగున వ్యవహరింపఁ బడు' అని తెనుగునే తెలుగు అని కూడా అంటారు. సంస్కృతసమంతో కలిసిన(55 వర్ణాల) భాషకు గూడా తెనుగు, తెలుగు, ఆంధ్రం అనే వ్యవహారం సమానం.

**19. ఆకాంక్ష:** 'ఆకాంక్ష అనఁగా నిలుపుదల లేక పయిఁ బయిఁ బోయెడి పదార్థములమీఁదియాదరము'. ఒకపదంయొక్క అర్థం తెలిసినవెంటనే ఆతరువాతి అర్థాన్ని తెలియాలి అనేకోరిక ఆకాంక్ష. 'గోవు–గుఱ్ఱము'. అర్థానికి పరస్పరం సంబంధం లేకుండా పదాలను కూర్చితే ఆకాంక్ష లేకపోవటంచేత ఆపదసముదాయం వాక్యం కాదు. గోవు వచ్చెను,గుఱ్ఱము పోయెను అనేరీతిగా ఆకాంక్ష తీరేవిధంగా కూర్చిన పదసముదాయం వాక్యం అవుతుంది.

**20. ఆసత్తి :** ఆసత్తి అంటే పదాల చేరిక. వాక్యంలో పదాలు అన్నీ ఒకదానివెంట

ఒకటి చేరిఉండాలి. దేవదత్తుడు పోవుచున్నాడు. ఇందులో దేవదత్తుడు అనే పదాన్ని ఉచ్చరించినతరువాత ఎప్పుడో 'పోవుచున్నాడు' అనేపదాన్ని ఉచ్చరిస్తే ఆపదాలకు ఆసత్తి ఉండదు కాబట్టి ఈపదాలసముదాయం వాక్యం కాదు.

**21. ఇత్యర్థకము :**(క్రియ. 33) ఇతి అనే(సంస్కృత)శబ్దంయొక్క అర్థం కలిగినశబ్దం ఇత్యర్థకం. 'అని' అని ఇతిశబ్దార్థం. 'అకా నిత్యర్థకం బగు'. తెలుగులో 'అకాన్' అనేశబ్దం ఇతి- అనేశబ్దం అర్థం తెలుపుతుంది. అపజయ మకా లక్షించి. అకాన్=అని. (అపజయమ - కాన్=అగునట్లుగా అని ఈఅర్థంలో విశేషం లేదు. సహజమే.)

**22. ఇనన్నంతక్రియ :**(వాక్య. 18) ఇనన్ అనేది అంతంలో కలిగినక్రియ ఇనన్నంత క్రియ. 'చేదర్థంబునందును వృత్తం బగుభావలక్షణంబునందును నవర్ణకంబు ద్రుతాంతం బగు' అని వచ్చిన 'నన్ (నను)' అనేప్రత్యయంతో, 'భూతంబునం దిగాగమం బగు' అని పూర్వంలో (ధాతువుకు చివర) చేరే 'ఇ'వర్ణాన్ని కలిపి, ఇనన్ అని ప్రౌఢవ్యాకర్త వ్యవహరిస్తాడు. ఉదా. వచ్చినన్. (చేదాద్యర్థకం.)

**23. ఇప్రత్యయాంతావ్యయము :**(సంధి. 12) 'ఇ' అనేప్రత్యయం అంతంలో కలిగిన అవ్యయం ఇప్రత్యయాంతావ్యయం. ఇక్కడి ఇప్రత్యయం 'సమానాశ్రయంబులం బూర్వకాలంబునం దివర్ణకం బగు' అని చెప్పబడింది. వచ్చు+ఇ. వచ్చి. చను+ఇ. చని. మొ. ఈఇప్రత్యయం చివర కలిగినశబ్దాలు అవ్యయాలు. వీటినే క్త్వార్థకాలు అని వ్యవహరిస్తారు. ఇది క్రియయొక్క అపరిసమాప్తిని బోధించడంచేత అసమాపకక్రియ. ఆక్రియ (జరిగిపోయినదిగా) భూతకాలానికి చెందినది గావడంచేత భూతకాలికాసమాపకక్రియ, అని వివరించాడు ప్రౌఢవ్యాకర్త.

**24. ఉద్దేశార్థము (ఉద్దేశ్యము) :** (కార. 2) క్రియకు లక్ష్యభూతం కావడం ఉద్దేశం. అలా లక్ష్యభూత మైనది ఉద్దేశ్యం. 'మము గుఱిచి అర్చన చేయగా'. అర్చించడం అనేక్రియకు 'మేము' లక్ష్యంగా చేసికొనడం(ఉద్దేశించడం) ఉద్దేశార్థం. అలా ఉద్దేశింపబడింది కాబట్టి 'మేము' అనేది ఉద్దేశ్యం. (దానికి ద్వితీయావిభక్తి, పైన గురిచి మొ. వస్తాయి. మముగుఱిచి)

**25. ఉద్దేశ్యము :**(వాక్య. 6) ఉద్దేశించి చెప్పదగినది ఉద్దేశ్యం. ఇది చెప్పేవాడికి, వినేవాడికీ, ఇద్దరికీ తెలుస్తుంది. క్రియలకంటె వే రైనవిశేష్యం, విశేషణం మొద లైనవి ఉద్దేశ్యాలు. దేనిని గురించి (ఉద్దేశించి) చెప్పబడుతుందో అది ఉద్దేశ్యం.

రాముడు మెచ్చెను. ఇక్కడ రాముడిని (గూర్చి) ఉద్దేశించి చెప్పటంచేత రాముడు ఉద్దేశ్యం.

**26. ఉపమానపూర్వపదకర్మధారయము:** విశేషణానికి విశేష్యంతో సమాసం కర్మధారయం. అందులో పూర్వపదం ఐన విశేషణం ఉపమానం అయితే అది ఉపమానం పూర్వపదంగా కలిగినకర్మధారయం కాబట్టి ఉపమానపూర్వపద కర్మధారయం అవుతుంది. ఉదా. చిగురుంగయిదువ. ఇక్కడ చిగురు అనేవిశేషణానికి కయిదువ అనేవిశేష్యంతో సమాసం అయింది కాబట్టి ఇది కర్మధారయసమాసం. ఇందులో చిగురు అనేవిశేషణం ఉపమానం. అది ఈకర్మధారయసమాసంలో పూర్వ పదంగా ఉంది. కాబట్టి ఇది ఉపమానపూర్వపదకర్మధారయం.

**27. ఏకార్థీభావసామర్థ్యము :** (ఏకార్థీభావలక్షణసామర్థ్యం తు ప్రక్రియాదశాయాం ప్రత్యేక మర్థవత్త్వేన పృథ గ్గృహీతానాం పదానాం సముదాయశక్త్యా విశిష్టైకార్థ ప్రతిపాదకతారూపమ్) అర్థవంతా లై, ప్రక్రియాదశలో, వేర్వేరుగా ఉన్నపదాలు, సముదాయశక్తిచేత విశిష్ట మైనఒక్కఅర్థాన్ని బోధించడం ఏకార్థీభావసామర్థ్యం. రామునిబాణము (1) రామునియొక్క, (2) బాణము అని వేర్వేరుగా అర్థవంతాలైన పదాలు కలిసి రామునికి సంబంధించిన దయినబాణం అని ఏకార్థాన్ని తెలుపుతుంది. కాబట్టి ఇది ఏకార్థీభావ సామర్థ్యం, (వృత్తి రేకార్థీభావః) ఇటువంటి చోట్ల సమాసం అవుతుంది.

**28. కర్తరిప్రయోగము :**(వాక్య. 3) కర్త, (కర్మ,) క్రియ కలిగినవాక్యానికి ప్రయోగం అని పేరు. అటువంటి వాక్యంలో క్రియ(క్రియావిభక్తి)చేత కర్త చెప్పబడితే అది కర్తరిప్రయోగం. ఉదా. రాముడు రావణుని చంపెను. ఇక్కడ 'చంపెను' అనేక్రియ కర్త అయిన రాముడిని బోధిస్తున్నది. కాబట్టి ఇది కర్తరిప్రయోగం.

**29. కర్తృభూతక్రియ :** (క్రియ. 27) కర్త అయినక్రియ కర్తృభూతక్రియ. వే రొక వ్యాపారానికి కర్త అయినవ్యాపారం అని అర్థం. 'వలయ్వాదిక్రియలకుం గర్త యగు భావంబు నందు నుజి యగు'ను. 'రావలయును'. ఇక్కడ 'వలయును' అనేక్రియకు కర్త కావడంచేత 'వచ్చు' అనేధాతువు (నుజి ప్రత్యయాంత మై, 'రాన్'.) కర్త అయినక్రియ కాబట్టి కర్తృభూతక్రియ.

**30. కర్మణిప్రయోగము :**(వాక్య. 3) కర్త, కర్మ, క్రియ, కలిగినవాక్యానికి ప్రయోగం అని సంజ్ఞ. అందులో క్రియ(క్రియావిభక్తి)చేత కర్మ చెప్పబడితే, దానిని కర్మణిప్రయోగం అంటారు. 'రామునిచేత రావణుఁడు చంపఁబడెను'. ఈప్రయోగంలో చంపబడెను

అనేక్రియ కర్మ ఐన రావణుడిని తెలుపుతున్నది. కాబట్టి ఇది కర్మణిప్రయోగం.

**31. కర్మప్రవచనీయము :** క్రియామ్ ప్రోక్తవంతః కర్మప్రవచనీయాః. క్రియా నిరూపిత మైనసంబంధవిశేషాన్ని ద్యోతనం చేసేది కర్మప్రవచనీయం. సంస్కృతంలో 'అను' మొ. వాటికి ఈసంజ్ఞ విధింపబడింది. తెలుగులో గురించి, కూర్చి మొద లైనవి ఇటువంటివిగా కొందరు వ్యాకర్తలు భావించారు. వర్షముంగూర్చి జపించెను. నిజానికి ఇక్కడ ఉన్నది ఉద్దేశార్థమే. సంస్కృతంలోని కర్మప్రవచనీయం ఇందుకు భిన్నం.

**32. కులకము :** 'కులకం బనఁగాఁ బద్యమునకుఁ బద్యాంతరముతో నన్వయము' పద్యంలో వాక్యార్థం (అన్వయం) అక్కడ ముగియకుండా, తరువాతిపద్యంలోకి కొనసాగితే అది తెలుగులో కులకం అనబడుతుంది.

తా నొకపండు చెచ్చెరన్, కొనివ్రచ్చుదు'. చెచ్చెరన్ అనుపద్యం ముగియగా కొనివ్రచ్చుడు అనేతరువాతిపద్యంలో కన్వయం కలగటంచేత ఇది కులకం. రెండుపద్యాలకె 'కులకం' అనటం సంస్కృతంకంటె తెలుగులో విశేషం.

**33. క్రియ :**(వాక్య. 3) 'క్రియ లనఁగా వ్యాపారావబోధకము లయినవి'. క్రియ అంటే వ్యాపారం–పని. శబ్దశాస్త్రంలో పనిని బోధించేశబ్దానికి క్రియ అని సంజ్ఞ. 'క్రియ లనఁగా వర్తమానాద్యర్థకము లైనసమాపక క్రియలు'. లడాదిలకారాలు చివర గలిగినవి అంటే తిఙంతాలకు క్రియ లని వ్యవహారం. 'మధ్యమపురుష క్రియలయం దిత్తునకు సంధి యగును' ఇత్యాదిగా లాక్షణికవ్యవహారం. చదువుచున్నాఁడు, మొ.

**34. క్రియాజన్యవిశేషణము :** క్రియనుంచి ఏర్పడిన విశేషణరూపం క్రియాజన్యవిశేషణం. క్రియ అంటే ధాతువు అని చింతామణి పేర్కొంది. దానినిబట్టి క్రియాజన్యవిశేషణం అంటే ధాతుజవిశేషణం. ఎడి ప్రభృతి వర్ణకాంతంబు లేడును ధాతుజవిశేషణంబులు. చదివెడువాఁడు. చదువనివాఁడు మొ. (చూ. ధాతుజ విశేషణము)

**35. క్రియాన్వయవాక్యము:** క్రియలు అంటే లట్ మొ. లకారాలు చివర కలిగిన వర్తమానం మొద లైనఅర్థాలను తెలియజేసే సమాపకక్రియలు. ఇటువంటి సమాపకక్రియలతో అన్వయం కలిగినవాక్యం క్రియాన్వయవాక్యం. 'అవివేకి చెడున్.' చెడున్ అనే సమాపకక్రియతో అన్వయం కలిగిఉండటంచేత ఇది క్రియాన్వయవాక్యం.

**36. క్రియాప్రయుక్త విశేషణము** (క్రియావిశేషణము) క్రియ అంటే వ్యాపారం (పని). క్రియను గూర్చి తెలిపేవిశేషణం క్రియాప్రయుక్తవిశేషణం. వచ్చినవాడు ఫల్గునుడు. ఇక్కడ వచ్చినవాడు అనేది ఫల్గునుడు అనేవిశేష్యంలోని – వచ్చిఉండటం అనేవిశేషాన్ని తెలుపుతూ విశేషణ మైనది. 'వచ్చుట' అనేవిశేషం క్రియారూప మైనది. క్రియారూప మయినవిశేషాన్ని తెలపుతుండడంచేత 'వచ్చినవాడు' క్రియా ప్రయుక్తవిశేషణం. (ధాతుజవిశేషణాలే క్రియాప్రయుక్తవిశేషణాలు అని స్థూలంగా చెప్పవచ్చు)

**37. క్రియాऽభిన్నకర్తృకము :** (వాక్య. 1) క్రియ లంటే తిజంతాలు. క్రియాపదంతో (భిన్నం కాని) సమాన మైనకర్త కలిగినది క్రియా అభిన్న కర్తృకం. వాక్యంలోని క్రియాపదానికి ఏది కర్త అయిందో, అదే తనకు కూడా కర్తగా కలిగినది (అసమాపకక్రియ). అసమాపకక్రియలలో క్త్వా, తద్వ్యతిరేక, శతృ, తుమర్థకాలు ఇటువంటివి. ఉదా. హంసలు పిండుగట్టి తిరుగుచుండె. ఇక్కడ ఉండెను అనేసమాపకక్రియకు కర్త అయిన'హంస'లే పిండుగట్టి, అనేక్త్వార్థకానికి, తిరుగుచున్ అనేశత్రర్థకానికి కూడా కర్త. కాబట్టి ఇవి క్రియాऽభిన్న కర్తృకా(అసమాపకక్రియ)లు.

**38. క్రియావిభిన్నకర్తృకము :**(వాక్య. 1) క్రియ లంటే తిజంతాలు. క్రియాపదానికి కర్త ఏదో దానికంటె వే రైనది కర్తగా కలిగినది క్రియావిభిన్నకర్తృకం. అసమాపక క్రియలలో (వృత్తం బగు) భావలక్షణం, చేత్, ఆనంతర్యార్థకాలు ఇటువంటివి. ఉదా. రాజ్యము తలఁగఁగ నలుఁడు వెలువడియె. ఇక్కడ 'వెలువడియె' అనేక్రియా పదానికి కర్త నలుడు. తలఁగఁగన్ అనేక్రియకు కర్త 'రాజ్యము'. క్రియాపదంకర్తకంటె ఈభావలక్షణార్థక అసమాపకక్రియకు కర్త భిన్నం కాబట్టి ఇది క్రియావిభిన్నకర్తృకం.

**39. క్రియేతరాన్వయవాక్యము:** క్రియలకంటె వే రైన– విశేష్యం, విశేషణం మొ.నామపదాలతో అన్వయం గలిగినవాక్యం క్రియేతరాన్వయవాక్యం. 'వాగ్భూషణమే సుభూషణము'. ఇక్కడ 'సుభూషణము' అనేక్రియేతర(విశేష్య)ంతో అన్వయం కలిగిఉండటంచేత ఇది క్రియేతరాన్వయవాక్యం.

**40. గుణప్రయుక్త విశేషణము :** గుణాన్ని తెలియజేసేవిశేషణం గుణప్రయుక్త విశేషణం. 'నల్లనివాడు రాముడు' ఇక్కడ 'నల్లనివాడు' అనేది రాముడు అనేవిశేష్యం లోని నల్లగా ఉండటం అనేవిశేషాన్ని తెలుపుతూ విశేషణ మైంది. నలుపు అనేది గుణం. కాబట్టి గుణమూలక మైన 'నల్లనివాడు' అనేఈవిశేషణం గుణప్రయుక్త విశేషణం.

**41. జాతిప్రయుక్తవిశేషణము :** జాతి ననుసరించి ప్రయోగింపబడినవిశేషణం జాతిప్రయుక్తవిశేషణం. ఈవిశేషణం జాతివిశేషాన్ని తెలుపుతుంది. ద్రోణుడు బ్రాహ్మణుడు. ఇక్కడ బ్రాహ్మణుడు అనేది ద్రోణు డనేవిశేష్యంలోని బ్రాహ్మణత్వం అనేవిశేషాన్ని తెలుపుతూ విశేషణ మయింది. బ్రాహ్మణత్వం జాతిరూప మయినది, కాబట్టి జాతినిబట్టి కూర్చబడిన 'బ్రాహ్మణుడు' అనేశబ్దం జాతిప్రయుక్తవిశేషణం అవుతున్నది.

**42. తాదర్థ్యార్థకక్రియ :** (సమా. 41) తస్మై కార్యాయ ఇదం తదర్థమ్. తదర్థస్య భావః తాదర్థ్యమ్. తదర్థం అంటే దానికొఱకు. అది ప్రయోజనంగా అని అర్థం. అది ప్రయోజనంగా కలిగిఉండటం తాదర్థ్యం. తుమర్థమే తాదర్థ్యం. ఆఅర్థంలో ఉన్నక్రియలు తాదర్థ్యార్థక (తుమర్థక) క్రియలు. 'తుమర్థభావలక్షణంబులందు నుజీ యగు'. చైత్రుండు వండఁ బోయెను. వండన్=వండుటకొఱకు. అది (వండటం) ప్రయోజనంగా కలిగిఉండటం (తాదర్థ్యం) అనేఅర్థంతో (నుజీ వచ్చి) ఉన్న 'వండన్' అనేది తాదర్థ్యార్థకక్రియ.

**43. ద్రవ్యప్రయుక్తవిశేషణము:** ద్రవ్యం (వస్తువు-ధనం, మొ.)ను అనుసరించి ప్రయోగింపబడినవిశేషణం ద్రవ్యప్రయుక్తవిశేషణం. ధనవంతుడు, ధనం (కలిగిఉండటం) అనేద్రవ్యరూప మైనవిశేషాన్ని ప్రస్తావిస్తున్నది గాబట్టి ఇది ద్రవ్యప్రయుక్తవిశేషణం.

**44. ద్రుతము :**(సంజ్ఞ. 9) ప్రౌఢవ్యాకరణం 'నకారం బసాధారణంబు ద్రుతంబు' అని విశేషంగా పేర్కొన్నది. 'ప్రత్యయం గానీ, ఆగమం గానీ, అవ్యయం గానీ అయి హ్రస్వ మయిన ఉకారంతో కూడిన నకారానికి (ను) ద్రుతం అని సంజ్ఞ. నేను, (ప్రత్యయం) నాచేతను (ఆగమం), రాముడును (అవ్యయం), మొ. 'వలెను' మొద లైనఅవ్యయాలలో చివరినువర్ణం ద్రుతం. వలెను, పోలెను, మొ. ఈనువర్ణంలో ఉత్వం ఇత్వ మైనా, లేదా ఉత్వ, ఇత్వాలు లోపించి పొల్లునకారంగా మిగిలి ఉన్నా అది ద్రుతమె. హరిని, నాచేతన్ మొ.

**45. ద్వికర్మకము :** (క్రియ. 35) ధాత్వర్థఫలాశ్రయం కర్మ. కర్మలు రెండు కలిగినధాతువు ద్వికర్మకం. 'అడుగ్వాదులు ద్వికర్మకంబులు' చైత్రుడు మైత్రుని పుస్తకమును అడిగెను. మైత్రుడు, పుస్తకము అనేవి రెండు కర్మలుగా కలిగినది కాబట్టి అడుగు అనేధాతువు ద్వికర్మకం. (చూ.అముఖ్యకర్మ)

**46. ద్వ్యవయవక్రియ :**(క్రియ. 25) రెండు అవయవాలు కలిగినక్రియ ద్వ్యవయవ

క్రియ. ఇక్కడ క్రియ అంటే ధాతువు. ఉదా. 'చననిచ్చు'. ఇందులో చనన్, ఇచ్చు అని రెండు అవయవాలు ఉన్నాయి. కాబట్టి ఇది ద్వ్యవయవక్రియ. ఇలాగే రావచ్చు, పోఁదగు మొ. అసమాపకక్రియలపై అగు మొద లైనవి చేరడంచేత ఏర్పడినది ద్వ్యవయవక్రియ అని కొంద రంటారు.

**47. ధాతువు :**(భూవాదయో ధాతవః.క్రియావాచినః భ్వాదయః ధాతుసంజ్ఞాః స్యుః) క్రియను (వ్యాపారాన్ని) బోధించే 'భూ' మొద లైనవాటికి ధాతువులు అని పేరు. తెలుగులో గూడ ఇలాగే పనిని తెలియజేసే ప్రకృతులకు ధాతువు లని పేరు. తిను, చదువు మొ.

**48. ధ్వన్యనుకరణము :**(సంధి.19) ఇతరులు పలికినదానిని యథాతథంగా గ్రహించడం అనుకరణం. ధ్వనిని అనుకరించేశబ్దం ధ్వన్యనుకరణం. గడగడ మొ. ఇక్కడ 'గడగడ' అనేశబ్దం వణకడం(మొద లయినవాటి)లోని ధ్వనిని అనుకరించి చెప్తున్నది. కాబట్టి ధ్వన్యనుకరణం.ఇలాగే సలసల, పుటుక్కున మొ.

**49. నామ(పద)ములు:** (వాక్య.3) నామములు నా వస్తువాచకశబ్దములు. ద్రవ్యాన్ని (లింగసంఖ్యాన్వయిపదార్థాన్ని) బోధించేశబ్దాలు నామాలు. ప్రథమ మొద లైననామవిభక్తులు చేరటంచేత ఏర్పడినపదం = నామవిభక్త్యంతం. సుబంతం నామపద మవుతుంది. ఇవే సందర్భవశంగా కర్త లనీ, కర్మ లనీ, చెప్పబడతాయి. రాముడు, సింహమును, వనమునందు.మొ.

**50. నిత్యము :** (సంధి.1) (నియమేన నియతం వా భవతి ఇతి నిత్యః) లక్షణంచేత చెప్పబడినకార్యం లక్ష్యాలలో నియతంగా అంటే తప్పకుండా వర్తించడం నిత్యం. 'శ్రేష్ఠతావాచకంబు లగునార్యాంబాద్యర్థకశబ్దంబులు పరంబు లగునపు డన్నియచ్చులకు సంధి నిత్యము' రామ+అయ్య = రామయ్య. ఇక్కడ రామయయ్య ఇత్యాదిగా సంధి రాకపోవడం ఉండదు. కాబట్టి నిత్యం.

**51. నిత్యబహువచనాంతము:** ఎప్పుడూ చివర్లో బహువచనమె కలిగిఉండేశబ్దాలు నిత్యబహువచనాంతాలు. ఇటువంటిశబ్దాలమీద అన్నివిభక్తులలోనూ ఎల్లప్పుడు బహువచనం మాత్రమె ఉంటుంది. ఎక్క డైనా ఏకత్వార్థాన్ని చెప్పదలచుకున్నా ఈశబ్దాలమీద బహువచనం మాత్రమే అవుతుంది. అందలు, గుజ్జెనగూళ్లు , కందులు మొ.

**52. నిత్యైకవచనాంతము:** నిత్యంగా ఏకవచనం మాత్రమే చివర ఉండేశబ్దాలు నిత్యైకవచనాంతాలు. అన్నివిభక్తులలోనూ, ఎల్లపుడూ ఏకవచనమె కాని యీశబ్దాల

మీద బహువచనం చేరదు. అంటే బహుత్వార్థంలో సయితం ఏకవచనమే వస్తుంది. అప్పుడు. మొ.

**53. నిర్దేశము :** (సంజ్ఞ. 2) (నిర్దిశ్యతే అభిధీయతే ఇతి నిర్దేశః) లక్షణంచేత కార్యం దేనిని ఉద్దేశించి విధింపబడుతుందో అది నిర్దేశం. 'అకారమునకు ఉకారము వచ్చును' ఇక్కడ ఉకారం విధింపబడింది. అది 'అ' అనేవర్ణానికి చెప్పబడింది. కాబట్టి 'అ' నిర్దేశం.దానికి కార ప్రత్యయం లేదా దీర్ఘం వచ్చి, 'అకారమునకు' లేదా 'ఆకు' అని అవుతుంది.

**54. న్యూనవచనాలు : 55. న్యూనవచోవాక్యము :** (వాక్య. 13) న్యూనవచనాలు= ఐన, ఏని, ఏ, ఓ, మొ. ఐన మొద లైనవాటిని న్యూనవచనాలు అని ప్రౌఢవ్యాకర్త వ్యవహరించాడు. పరిమాణంలో తక్కువ (అక్షరాలు కలిగిన) మాట లని కావచ్చును. ఈన్యూనవచనాలు ఉండవలసినవాక్యం న్యూనవచోవాక్యం. 'ఎవ్విధి నైన దక్కునె' ఏని అనేన్యూనవచనం గలది కాబట్టి ఈవాక్యం న్యూనవచోవాక్యం.

**56. పదము :** (వాక్య. 2) 'పద మనఁగాఁ బ్రయోగార్హంబు ననన్వితంబు నేకంబు నర్థబోధకంబు నైనవర్ణము లేక వర్ణసముదాయము.' (వాక్యంలో) ప్రయోగించడానికి తగిన దై, వే రొకశబ్దంతో సంబంధం లేకుండ, ఒక్కటిగా ఉన్నవర్ణం గానీ, లేదా వర్ణాలసమూహం గానీ పదం అనేసంజ్ఞ పొందుతుంది. ఉదా. రాముఁడు. మొ.

**57. పూర్వాగమము :** (శబ్ద. 91) ఆగమం బనఁగా వర్ణాధిక్యంబు. వర్ణం (వర్ణాలు) అధికంగా వచ్చి చేరడం ఆగమం. విధింపబడే దానికి పూర్వంలో అంటే మొదట్లో వచ్చి చేరేది పూర్వాగమం. ఉదా : ఇరుగురు. ఇక్కడ 'రు' అనేవిభక్తికి పూర్వంలో ఆగమంగా వచ్చింది కాబట్టి 'గు' అనేవర్ణం పూర్వాగమం.

**58. ప్రతిపదోక్తావ్యయము:** 'అవ్యయము లనఁగా లింగవిభక్తివచన శూన్యములు.' అన్నిలింగాలలో (మహదమహదర్థాలలో) అన్ని విభక్తులలోను, అన్ని వచనాలలోను ఎటువంటిమార్పు పొందక నిలిచిఉండేశబ్దం అవ్యయం. 'ప్రకృతిసిద్ధములు ప్రతిపదోక్తాలు'. ప్రకృతిచేతనే అంటే పుట్టుకచేతనే అవ్యయాలు అయినశబ్దాలు ప్రతిపదోక్తాలు. ఆహా, ఓహో మొ.

**59. ప్రధానము :** (శబ్ద. 6) 'విశేష్యంబు ప్రధానం బితరం బప్రధానంబు' విశేషణం అప్రధానం కాగా విశేష్యం ప్రధానం. కర్త, కర్మ మొద లైనరూపంలో క్రియతో అన్వయం కలిగి (ఉండడం ప్రాధాన్యం) నది ప్రధానం. 'ఆర్తరక్షకు శ్రీరాము

నభినుతింతు' ఇక్కడ (కర్మగా క్రియతో అన్వయిస్తున్న) విశేష్యం అయిన 'శ్రీరాముడు'– ప్రధానం.

**60. ప్రయోగము** : (వాక్య. 3) 'కర్తృకర్మక్రియలు గూడఁ బ్రయోగ మనంబడు' కర్త, కర్మ, క్రియ కలిగినవాక్యానికి ప్రయోగం అని సంజ్ఞ. ఉదా. రాముడు రావణుని చంపెను. ఇక్కడ రాముడు–కర్త. రావణుని –కర్మ. చంపెను– క్రియ. కూడిఉన్నాయి కాబట్టి ఈవాక్యానికి ప్రయోగం అని పేరు. క్రియ అకర్మక మైనపుడు అంటే అకర్మకకర్తరి ప్రయోగంలో కర్మ ఉండదు. రాముడు వచ్చెను.

**61. ప్రాచుర్యార్థము** :(తద్ధి. 18) ప్రచురంయొక్క భావం ప్రాచుర్యం. ప్రచురం అంటే (బహుళం) అధికంగా ఉండటం. ప్రాచుర్యం అంటే అధికంగా ఉండటం. ఈఅర్థంలో తెలుగులో 'మయ' అనేతద్ధితప్రత్యయం వస్తుంది. ప్రోవులమయము. అధిక మైనప్రోవులు కలిగినది అని అర్థం. ఈప్రాచుర్యం 'నిండినంత' కావటం తెలుగులో విశేషం. ప్రోవులమయం అంటే ప్రోవులతో నిండినది అని అర్థం.

**62. భావద్వంద్వము:** (సమా. 31) భావార్థకాలు అయిన (కృదంత) శబ్దాలకు చేసినద్వంద్వసమాసం భావద్వంద్వం. ఉదా : చెల్లు చెల్లములు, చెల్లుట, చెల్లమి అనే భావార్థకశబ్దాలకు ఏర్పడింది కాబట్టి ఈద్వంద్వసమాసం భావద్వంద్వం, భావద్వంద్వంలో మొదటిశబ్దం స్వార్థంతో ఉన్నభావార్థకం, రెండవది వ్యతిరేకార్థంతో కూడినభావార్థకం కావడం గమనించవచ్చు.

**63. భూతకాలికాసమాపకక్రియ** :(సంధి. 2) చూ. ఇప్రత్యయాంతావ్యయం.

**64. మహద్ద్వంద్వము** : (సమా. 28) మహత్తు లయినశబ్దాలకు ఏర్పడిన ద్వంద్వసమాసం మహద్ద్వంద్వం. మహత్ (మహత్ చ– మహతీ చ) అనేఏకశేష సమాసంచేత మహత్తు – మహతి అనేరెండింటిని బోధిస్తుంది. కాబట్టి స్త్రీ(మహతీ) పురుష (మహత్) వాచకాలకు ప్రత్యేకంగా కానీ, కలిపి కాని ఏర్పడినద్వంద్వం మహద్ద్వంద్వం. అన్నదమ్ములు (పురుష) అక్కచెల్లెండ్రు (స్త్రీ) తల్లిదండ్రులు (స్త్రీపురుష) మొ.

**65. మహావాక్యము** : 'వాక్యసముదాయము మహావాక్యము నాఁబడు. అయ్యది రామాయణాదికము' మహావాక్యం వాక్యంలో భేదం కాదు. ఇంక అనేక మైనవాక్యాలు కలిసినది మహావాక్యం. రామాయణం మొ. కావ్యం మొత్తం కలిసి ఒకమహావాక్యం అవుతుంది.

**66. యోగ్యత :** 'యోగ్యత యనఁగా పదార్థములకు పరస్పరసంబంధమునందు బాధ గలుగకుండుట'. పదసముదాయంలో వాని అర్థాలు పరస్పరం ఒకదానితో ఒకటి అన్వయించటంలో బాధ లేకుండాలి. నిప్పుతో కాల్చుచున్నాడు. ఇక్కడ నిప్పు కాలుస్తుంది కాబట్టి ఇక్కడ ఈపదాల అర్థం ఒకదానితో తరువాతిది అన్వయించటంలో బాధ లేదు. అలా బాధ లేకపోవటాన్ని యోగ్యత అంటారు. నిప్పుచే తడుపుచున్నాడు అంటే నిప్పుకు తడపటం అనేలక్షణం లేకపోవటంచేత ఈపదాలఅర్థానికి అన్వయంలో బాధ గలుగుతున్నది. కాబట్టి ఇక్కడ యోగ్యత లేదు. (అందుచేత ఈపదసముదాయం వాక్యం కాదు.)

**67. లాక్షణికావ్యయము :** 'అవ్యయము లనఁగా లింగవిభక్తివచనశూన్యములు.' అన్నిలింగాలలో (మహదమహదర్థాలలో) అన్ని విభక్తులలోను, అన్ని వచనాలలోను ఎటువంటి మార్పు పొందక నిలిచిఉండేశబ్దం అవ్యయం. 'లక్షణసిద్ధములు లాక్షణికములు'. శబ్దశాస్త్రంచేత సిద్ధించిన అవ్యయాలు లాక్షణికాలు. క్త్వా, తద్వ్యతిరేక ఆద్యర్థకాలు అయిన అసమాపకక్రియలు మొద లైనవి వ్యాకరణంచేత సాధింప బడినవి. అవి లాక్షణికావ్యయాలు. పలికి, వచించుచున్.

**68. లుక్సమాసము :** 'సమాస మనఁగా సంయోగదశయందుఁ గలిగెడు విభక్తి లోపాత్మక పదస్వరూపసంగ్రహము. ఇది లుక్సమాసవిషయము' అని ప్రౌఢవ్యాకర్త సమాస నిర్వచనంలో లుక్సమాసాన్ని వివరించాడు. విభక్తులు లోపించేసమాసం లుక్సమాసం. రామునియొక్క, బాణము అనేపదాలకు సమాసం ఏర్పడగా విభక్తులు లోపించి, రామునిబాణ. ఈసమాసంలో విభక్తులు లోపించాయి. కాబట్టి ఇది లుక్సమాసం.

**69. వాక్యము :** (వాక్య. 1)'వాక్యము నా యోగ్యతాకాంక్షాసహితం బగునర్థము గల యాసత్తియుక్తపదసముదాయంబు'. పదాల అర్థానికి పరస్పరసంబంధంలో బాధ లేకుండా (యోగ్యత), మీదిపదంయొక్క అర్థంమీద ఆదరం (ఆకాంక్ష) తో, వెంట వెంటగా కలిసి(ఆసత్తి) ఉన్నపదాలసమూహం వాక్యం. ఉదా. రాముడు రావణుని చంపెను.

**70. వాక్యము :**(వాక్య. 6) 'ఉద్దేశ్యవిధేయభిన్నంబు విషయంబు'. 'విషయ బోధకము వాక్యము'. దేనిని గూర్చి చెప్పబడుతుందో అది ఉద్దేశ్యం. దానిని గూర్చి ఏమి చెప్పబడుతుందో అది విధేయం. ఈరెండూ కలిసిఉన్నది వాక్యం. ఉదా. రాముడు రావణుని చంపెను. ఇందులో రాముడు ఉద్దేశ్యం. రావణుడిని చంపటం

విధేయం. ఇవి రెండూ కలిసి ఉన్నాయి కాబట్టి ఇది వాక్యం.

**71. వాక్యాంతరగర్భవాక్యము :**(వాక్య. 21) వేరొకవాక్యాన్ని తనగర్భంలో గలిగివాక్యం వాక్యాంతరగర్భవాక్యం. 'కొన్నియెడల వాక్యంబు వాక్యాంతరగర్భంబు నగు' ఉదా. ఇందుల కెంతకాలం బయ్యె రానికారణం బేమి? ఇక్కడ 'ఇందులకు రానికారణం బేమి?' అనేవాక్యంలోపల 'ఎంత కాలం బయ్యె' అనేమరోవాక్యం ఉన్నది. కాబట్టి పైవాక్యం వాక్యాంతరగర్భవాక్యం.

**72. విధానము :**(సంజ్ఞ. 2) (అప్రాప్తప్రాపణం విధానమ్.) కలుగజేయబడింది విధానం. దేనికి విధింపబడుతుందో అది నిర్దేశం. దానికి ఏది విధింపబడుతుందో అది విధానం. 'అకారమునకు ఉకారము వచ్చును.' ఇక్కడ 'అ' అనేవర్ణానికి (నిర్దేశం) 'ఉ' అనేవర్ణం వచ్చేటట్లు చెప్పబడింది. కాబట్టి 'ఉ' విధానం. దీనికి కార ప్రత్యయం (లేదా దీర్ఘం) వచ్చి ఉకారము(ఊ)అని వ్యవహరింపబడుతుంది. (విధానం సాధారణంగా ప్రథమా విభక్త్యంతంగా ఉంటుంది.)

**73. విధేయము :**(వాక్య. 6) (ఉద్దేశ్యాన్ని గురించి) మీఁదఁ దెలియఁదగినది విధేయము. ఇది వక్తకు (చెప్పేవాడికి) మాత్రమే (మొదట) తెలిసిఉంటుంది. క్రియ, విశేష్యం మొ. విధేయాలు. ఉద్దేశ్యాన్ని గురించి ఏమి చెప్పబడుతుందో అది విధేయం. 'రాముడు వచ్చెను' ఇక్కడ రామునిగూర్చి చెప్పబడిన 'వచ్చెను' అనేక్రియ విధేయం.

**74. విధేయవిశేషణము :** దేని నైన (ఉద్దేశ్యాన్ని) గురించి ఏమి చెప్పబడుతుందో అది విధేయం. విశేష్యం (కర్త, కర్మ) లోని జాతి, మొద లైనవిశేషాన్ని తెలిపేది విశేషణం. విధేయం అయినవిశేషణం విధేయవిశేషణం. 'వాని నెఱుఁగు బ్రాహ్మణకులుఁగాన్' – ఇక్కడ 'వానిని' అనేవిశేష్యం (కర్మ) ఉద్దేశ్యం. దానిలోనిజాతి రూప మైనవిశేషాన్ని చెప్తున్న 'బ్రాహ్మణకులున్' అనేది విశేషణం. ఉద్దేశ్య మైన 'వాని'ని గురించి తెలియవలసినఅంశాన్ని చెప్తున్నది. కాబట్టి 'బ్రాహ్మణకులున్' అనేవిశేషణం విధేయ మై, విధేయవిశేషణ మయింది.

**75. విభక్తిపరిణామము:** (కార. 26) విభక్తిపరిణామం అంటే విభక్తికి సంబంధించిన మార్పు. లక్ష్యంలో ఉన్న నామవిభక్తి అన్వయానికి అనుగుణంగా వేరొకవిభక్తిగా మార్పు చెందడం అని తాత్పర్యం. ఈతనితో సాటి యనంగ మేలన, ఇక్కడ 'ఈతనితో సాటి' అన్నపుడు సాటిశబ్దంతో అన్వయించే 'తో' అనేతృతీయావిభక్తి 'మేలు' తో అన్వయించేటపుడు 'ఈతనికంటె మేలు' అని పంచమిగా మార్పు చెందుతుంది. కాబట్టి ఇది విభక్తిపరిణామం.

**76. విశేషణోభయపదకర్మధారయము :** చూ.పుట151

**77. విశేష్యపూర్వపదకర్మధారయము :** చూ.పుట151

**78. విశేష్యలక్షకము:** (శబ్ద.12) (ముఖ్యార్థానికి భాధ కలగగా, రూఢి, లేదా ప్రయోజనాన్నిబట్టి ముఖ్యార్థానికి సంబంధించిన వేరొక అర్థాన్ని బోధించే శక్తితో) లక్ష్యార్థాన్ని తెలిపేశబ్దం లక్షకం. విశేష్యాన్ని లక్ష్యార్థంగా చెప్పే విశేషణం విశేష్యలక్షకం. ఉదా: అప్రియంబులు కావించి. ఇక్కడ అప్రియములైన 'పనులు' అనేవిధంగా పనులు అనేవిశేష్యార్థాన్ని లక్ష్యార్థంగా చెప్పడంచేత 'అప్రియములు' అనే విశేషణం–విశేష్యలక్షకం.

**79. విషయము :** 'ఉద్దేశ్యవిధేయభిన్నంబు విషయంబు' ఉద్దేశ్యవిధేయాలతో కూడినది విషయం. దేనిని గూర్చి చెప్పబడుతుందో అది ఉద్దేశ్యం. విశేష్యం మొద లైనవి ఉద్దేశ్యాలు. (దానినిగురించి) ఏమి చెప్పబడుతుందో అది విధేయం. క్రియ మొద లైనవి విధేయాలు. ఈరెండూ కలిసినది విషయం. దానిని బోధించేది వాక్యం.

'వాగ్భూషణమే సుభూషణము' ఇందులో 'వాగ్భూషణం' గురించి చెప్పబడు తున్నది. కాబట్టి అది ఉద్దేశ్యం. దానినిగురించి 'సుభూషణం' అని చెప్పబడుతున్నది. కాగా ఇది విధేయం. ఈరెండింటితో గూడిన పైపదసముదాయం 'వాగ్భూషణమే సుభూషణము' అనేది వాక్యం అవుతుంది.

**80. వీప్స:** (కార.14) (క్రియాగుణద్రవ్యేషు యుగపద్ వ్యాప్తుం ఇచ్ఛా వీప్సా) అనేకమైన వస్తువులు మొ. వానిలో ఒకేసారిగా వ్యాపించే కోరిక వీప్స. 'వీప్సయందును గాలపరిమితియందును నామంబులకుం గువర్ణకం బగు' మ్రానిమ్రానికి. 'అనేక మయినమ్రాకులకు' అని అర్థం. అలాగే – పోయి పోయి, పుల్లపుల్లగా మొ.

**81. వైకృతము :**(సంధి.12) చూ. వికృతి.

**82. వ్యతిరేకార్థకభూతకాలికాసమాపకక్రియ:** (సంజ్ఞ.8) క్త్వా, తద్వ్యతిరేకం మొద లైనవి అసమాపకక్రియలు.జరిగిపోయినదానిని తెలిపేది (పూర్వకాలికం) భూతకాలికం. వ్యతిరేకార్థంతో కూడినభూతార్థాన్ని తెలిపేఅసమాపకక్రియ వ్యతిరేకార్థకభూతకాలికాసమాపక క్రియ. వ్యతిరేకక్త్వార్థం అని అర్థం. అదే అక ప్రత్యయాంతావ్యయం. కజీ వ్యతిరేకక్త్వార్థంబునం దగును. వండక, తినక మొ.

**83. వర్ణవ్యత్యయము (వ్యత్యస్తము):** వ్యత్యయం అంటే (విపర్యయం) తారుమారు కావడం. ముందరివర్ణం తరువాతిదీ, తరువాతివర్ణం ముందరిదీ కావడం వర్ణ

వ్యత్యయం. ఒక+అంత. ఇక్కడ 'ఒక'కు వర్ణవ్యత్యయం రాగా క+ఒ. (అంత) కొ (అంత) – కొంత అవుతుంది. వ్యత్యయాన్ని పొందినవర్ణం వ్యత్యస్తం. ఇక్కడ క+ఒ= కొ– అనేది వ్యత్యస్తం.

**84. వ్యస్తము:** (శబ్ద.4) వ్యస్తం అంటే విడిగా–వేరుగా ఉన్నది. సమాసంగా వేరొకపదంతో కలియకుండా ప్రత్యేకంగా ఉన్నపదం వ్యస్తం. 'రథములు డెబ్బదియొక్కటి' ఇందులో పదాలు రెండూ సమాసం గాకుండా వేరుగా ఉన్నాయి. కాబట్టి వ్యస్తాలు. సమాసంలో ఉంటే సమస్తాలు – డెబ్బదియొక్క రథములు)

**85. వ్యాకృతి, వ్యాకరణము** : (వ్యాక్రియంతే వ్యుత్పాద్యంతే అర్థవత్తయా ప్రతిపాద్యంతే శబ్దాః ఇతి వ్యాకరణమ్. వ్యాక్రియంతే వివిచ్య ప్రదర్శ్యంతే ఇతి వ్యాకరణమ్.) శబ్దాలనిష్పత్తిని గూర్చి అర్థవంతంగా చెప్పేది వ్యాకరణం. సాధు, అసాధుశబ్దజ్ఞానాన్ని కలిగించేది. ప్రకృతి ప్రత్యయాదులుగా, వాక్యాన్ని, పదాన్ని విభజించి చూపేది కాబట్టి వ్యాకరణం. వ్యాకరణమే వ్యాకృతి. ఉదా. రాము డున్నాడు. రాముడు+ఉన్నాడు. రామ–ప్రాతిపదిక, డు–ప్రత్యయం ఇత్యాదిగా నిరూపించేది కాబట్టి ఆశాస్త్రం వ్యాకరణం.

**86. వ్యాసవాక్యము :** (వాక్య.20) విస్తరించి చెప్పబడినవాక్యం వ్యాసవాక్యం. 'ఇది యేమి? ఎందులకు బోయెద వని యడిగిన' ఇక్కడ 'ఇది యేమి?' అనేదానిలోని అభిప్రాయమే విస్తరించి చెప్పేది కాబట్టి 'ఎందులకుం బోయెదవు' అనేది వ్యాసవాక్యం.

**87. సంఖ్యాప్రయుక్తవిశేషణము(సంఖ్యావాచకము) :** 'సంఖ్యను తెలియజేసేశబ్దం సంఖ్యావాచకం. ఒకటి, రెండు మొ. ఇది విశేషణం అయితే సంఖ్యాప్రయుక్తవిశేషణం. ఒక్కఁడు, ఒక్క – అనేసంఖ్య ననుసరించి ప్రయోగింపబడినది కాబట్టి ఇది సంఖ్యాప్రయుక్తవిశేషణం.

**88. సంగ్రహవాక్యము :** (వాక్య.20) వక్తవ్య మైనవాక్యార్థాన్ని సంక్షేపించి చెప్పేవాక్యం సంగ్రహవాక్యం. 'ఇది యేమి? ఎందులకుం బోయెదవు?' ఇక్కడ 'ఎందులకు బోయెదవు?' అనేవాక్యార్థాన్ని సంగ్రహంగా చెప్తున్నది కాబట్టి 'ఇది యేమి?' అనేవాక్యం సంగ్రహవాక్యం.

**89. సంజ్ఞాప్రయుక్తవిశేషణము:** సంజ్ఞ (పేరు)ను తెలిపేవిశేషణం సంజ్ఞాప్రయుక్తవిశేషణం. దేవదత్తుఁడు. 'దేవదత్త' అనేసంజ్ఞను గూర్చి ప్రయుక్త మైనది గాబట్టి ఇది సంజ్ఞాప్రయుక్త విశేషణం.

**90. సంపూర్ణవాక్యము :** 'సమాపకక్రియలు గలవాక్యము సంపూర్ణవాక్యము'. 'లడాదిలకారాలు చివర గలిగినవి సమాపకక్రియలు. అవి కలిగినవాక్యం సంపూర్ణవాక్యం. నలుడును దమయంతి దోడ్కొని వెలువడియె. 'వెలువడియె' అని (లిడంత మైన)సమాపకక్రియాపదం కలిగిన ఈవాక్యం సంపూర్ణవాక్యం.

**91. సంయుక్తము : 92. సంయోగము :** సంయోగాన్ని పొందినది సంయుక్తం. సంయోగం అంటే మేళనం, కలయిక. ఇక్కడ (నడుమ అచ్చులు లేకుండ) అనేకం అయిన (ఒకటికంటె ఎక్కువ)హల్లులు కూడటం సంయోగం. 'క్ష' ఇక్కడ 'క్' అనేహల్లు 'ష్' అనేహల్లుతో కలియటం సంయోగం. అలా కూడినవర్ణం – క్ష్ – సంయుక్తం. ఇలాగే క్ష్మ, త్న్ల మొ. (హల్లు అచ్చుతో కూడితే అది సంయోగం కాదు. ఉదా. కాకి.

**93. సకర్మకకర్తరిప్రయోగము:** (వాక్య.3) కర్త, కర్మ, క్రియ కలిగినవాక్యం ప్రయోగం. కర్మ కలిగినధాతువు సకర్మకం. అటువంటి క్రియ(క్రియావిభక్తి)చేత కర్త తెలుపబడితే, ఆవాక్యం సకర్మకకర్తరిప్రయోగం. 'రాముడు రావణుని చంపెను.' కర్త (రాముడు), కర్మ (రావణుడు), క్రియ (చంపెను) కలిసిఉన్నది కాబట్టి ఈవాక్యం 'ప్రయోగం'. ఇందులో క్రియ (చంపెను) కర్త(రాముడు)ను బోధిస్తున్నది కాబట్టి ఇది కర్తరిప్రయోగం. ఈకర్తరిప్రయోగంలో క్రియ (చంపెను) కర్మ (రావణుడు) ను కలగిఉన్నది కాబట్టి ఇది సకర్మకకర్తరిప్రయోగం.

**94. సమస్తము :** (శబ్ద.4) సమాసంగా కూడినది, అంటే సమాసగతం అయినది సమస్తం. 'డెబ్బదియొక్క రథములు' ఇక్కడ డెబ్బదియొక్కటి, రథములు అనేపదాలు సమాసంగా కలిశాయి. డెబ్బదియొక్క అనేపదమూ, రథములు అనేపదమూ సమాసంలో ఉన్నాయి కాబట్టి ఆపదాలు సమస్తాలు.

**95. సమాపకక్రియ :**(వాక్య.1) వాక్యార్థంలో ఆకాంక్షాపరిసమాప్తిని కలిగించే క్రియ సమాపకక్రియ. 'క్రియ లనఁగా వర్తమానాద్యర్థకము లైనసమాపకక్రియలు.' లట్ మొద లైనలకారాలు=క్రియావిభక్తులు చివర గలిగినది (తిఙంతం) సమాపకక్రియ. ఉదా. చదువుచున్నాఁడు. చదువుదుము మొ. సమాపకక్రియలనే క్రియాపదాలు, క్రియలు అని కూడా వ్యవహరిస్తారు.

**96. స్త్రీవాచకం :** స్త్రీవ్యక్తిని బోధించే శబ్దం స్త్రీవాచకం. అమ్మ. సీత మొ. ఈశబ్దాలచేత స్త్రీ బోధింపబడుతున్నది కాబట్టి (స్త్రీ వాచ్యం కావడాన్నిబట్టి) ఇవి స్త్రీవాచకాలు. వీనినె మహతి (మహతీవాచకం) అని కూడా అంటారు.

**ప్రౌఢ. ఉపయోగించినఈక్రిందిపారిభాషికపదాలను బాలవ్యాకరణంనుంచి గ్రహించదగును.**

*అంబడిపూడి నాగభూషణం*

# ప్రౌఢవ్యాకరణం-విషయవివరణం

## 1.సంజ్ఞాపరిచ్ఛేదం

### 1. ఆంధ్రవర్ణాలనుగూర్చి ప్రౌఢవ్యాకర్త చెప్పినవిశేషాలు తెలపండి.

'ఆంధ్రభాషకు వర్ణంబు లేఁబది యైదు.' అని ప్రౌఢవ్యాకర్త ఆంధ్రభాషకు 55 వర్ణాలు ఉన్నా యని చెప్పాడు. అంతకు ముందు చిన్నయసూరి 'తెనుగునకు వర్ణములు ముప్పదియాఱు' అని తెనుగుభాషకు వర్ణాలు 36 మాత్రమే అన్నాడు. అయితే 'ఋఋూ(ఌౡ)విసర్గ ఖఛఠథఫ ఘఝఢధభ ఙఞ శషలు సంస్కృతసమంబులను గూడి తెలుఁగున వ్యవహరింపఁబడు' అని సంస్కృతసమాలద్వారా మరో 19వర్ణాలు కొత్తగా తెలుగులో వచ్చి చేరతా యన్నాడు. దీనితో తెనుగు అన్నా తెలుగు అన్నా ఒకటే ననీ, సంస్కృతసమం కలియని అచ్చ మయినతెలుగుకు 36 వర్ణాలు కాగా, సంస్కృతసమాలద్వారా చేరే 19 వర్ణాలతో కలుపుకొని మొత్తం తెలుగుకు వర్ణాలు (36+19) 55 అని స్పష్టం. కాగా 55వర్ణాలుగా ప్రౌఢవ్యాకర్త చెప్పిన ఆంధ్రం కూడా ఆభాషే. తెనుగు, తెలుగు రెండుసంజ్ఞలను సూరి పేర్కొనగా ప్రౌఢవ్యాకర్త మనభాషకు 'ఆంధ్రం' అనే మరోసంజ్ఞను ఈసూత్రంతో పరిచయం చేస్తున్నాడు.

ఆ55వర్ణాలు ఏవి అనేవిషయంలో శాస్త్రకర్తలు విచారణ చేశారు. అహోబలాదులు చేసిన చర్చ సారాంశాన్ని ప్రౌఢవ్యాకర్త సంగ్రహించాడు.

అ ఆ ఇ ఈ ఉ ఊ ఋ ఋూ (ఌ ౡ) ఎ ఏ ఐ ఒ ఓ ఔ అఁ అం అః. క ఖ గ ఘ ఙ, చ చ ఛ జ జ ఝ ఞ, ట ఠ డ ఢ ణ, త థ ద ధ న, ప ఫ బ భ మ, య ర ల వ, శ, ష, స హ ళ.

**(ౡ)కారం వర్ణాంతరం :** (ఌ)కారస్య ద్వాదశ. తస్య దీర్ఘాభావాత్. అని పాణినీయం సంస్కృతంలో '(ౡ)' అనేదీర్ఘం లే దని చెప్పింది. కాబట్టి దీర్ఘ మైన(ౡ)కారం సంస్కృతంలో లేదు. 1. అయినా ఇతరసంస్కృతవ్యాకర్తలు సంస్కృతంలో (ఌ)కారం ఉన్న దన్నారు. 2. వరరుచి, హేమచంద్రుడు మొద లయినప్రాకృతవ్యాకర్తలు కూడా సంస్కృతంలో (ౡ)కారం ఉన్న దన్నారు. 3. మాతృకాపూజనాదులలో (సరస్వతీదేవి ఎడమచెక్కిలిగా) ఉపయోగింపబడుతూ మంత్రశాస్త్రంలో సంస్కృతంలో ప్రసిద్ధం. కాబట్టి (ౡ)కారం వర్ణాంతరంగా అంగీకరించవలసిందే.

యథార్థానికి సంస్కృతంలో గూడా '(లూ)కార'శబ్దం తప్ప '(లూ)'కారం ఉన్న పదాలు లేవు. (క్లు)ప్త, (క్లు)ప్తి శబ్దంలో ఒకటి రెండుచోట్ల హ్రస్వ మయిన (లు)కార మయినా ఉన్న దేమో కాని, (లూ)కారం కనబడదు. (లూ)కారం అంగీకరించకపోతే భాషకు కలిగేనష్టం ఏమిటో పరిశీలించాలి. ఇపుడు (లు,లూ) రెండూ పూర్తిగా వ్యవహారంనుంచి పోయాయి.

**ఱకారం వర్ణాంతరం కాదు :** 'యరలవలు లఘువు లని యలఘువు లని ద్వివిధంబు లగు' అని సాధురేఫ లఘువు కాగా శకటరేఫ అలఘువు. ఈబండిఱాను కొంతమంది వర్ణమాలలో చేర్చారు. 'సప్త త్రింశ దిహ' '...రయుగ' అని అప్పకవి చింతామణిలోనే బండిఱా వర్ణమాలలో చేరింది. అహోబలుడు ఇదీ బాగానే ఉంది అన్నాడు. ప్రౌఢవ్యాకర్త దానిని తిరస్కరించాడు సూరిలాగానే. 'యవల'లలాగా రేఫ కూడా రెండువిధాలు గావడానికి ఉచ్చారణలో ప్రయత్నభేదం మాత్రమే కారణం. స్థాన, కరణ భేదం లేకుంటే వేటినీ, వేరు వర్ణాలుగా పరిగణించడానికి వీలు లేదు. యవలలు అందుకే లఘువులూ అలఘువులూ విడిగా వర్ణమాలలో చెప్పలేదు. లఘు, అలఘురేఫలు కూడా అలాగే, స్థాన, కరణాలు సమానం కావడంవల్ల వేరు వర్ణాలు గావు. కాబట్టి అలఘురేఫ (బండి ఱా)ను వర్ణమాలలో చేర్చరాదు.

**క్షకారం వర్ణాంతరం కాదు :** అనంతుడు మొద లయినతెలుగులాక్షణికులు క్ష కారాన్ని వేరే వర్ణంగా పరిగణించారు. అకారాది క్షకారాంతం అని (అక్షమాల ఇత్యాదులలో) సంస్కృతంలో క్షకారం వర్ణాంతరంగా కొందఱు పేర్కొన్నారు. అచ్చతెలుగులో ఈవర్ణం లేదు. కాబట్టి సంస్కృతసమాలద్వారా సంస్కృతంనుంచి తెలుగులోకి రావాలి. అయితే ఇది కకారం షకారంతో కూడడంవల్ల ఏర్పడిన సంయుక్తవర్ణం. వర్ణద్వయమే కాని ఏకవర్ణం కాదు. క్ష అనేది వేరే వర్ణ మయితే అకారాదిక్రమంలో క్షకారాంతశబ్దాలను వేరుగా చూపాలి. కాని సంస్కృతం నిఘంటువుల్లోనూ, ధాతుపాఠంలోనూ అక్ష, భిక్ష ఇత్యాదులను షకారాంతశబ్దాలుగా చూపించారు. కాగా క్షకారం (కకారషకార)సంయుక్తవర్ణమే కాని, వర్ణాంతరం కాదు.

అయితే క్-ష్ అనేసంయుక్తవర్ణధ్వనికి, క్ష అనేవర్ణం ధ్వనికి భేదం ఉంది. ఆభేదం వల్లనే అది వర్ణాంతర మనేఅభిప్రాయానికి అవకాశం గలిగింది. ఏసంయుక్తవర్ణానికి లేనిసందేహం క్ష విషయంలో కలగడానికి కారణం అదే.

**ళకారం :** యవలకు (సంస్కృతంలోలాగానే) లఘుత్వం కొత్తగా కలిగిన విశేషం. అంటే వర్ణమాలలో ఉన్న యవలు అలఘువులు. ల,ర, విషయంలో అలా కాకుండా

అలఘుత్వం విశేషంగా విహితం. అలఘు వనీ, వర్ణాంతర మనీ, సూరి ళకారాలు రెండు చెప్పాడు. యవలకు లేని లఘ్వలఘులిపిభేదం లర (ళఱ) లకు మొదటినుంచీ ఏర్పడింది. సూరి వర్ణాంతర మన్నళకారాన్ని ప్రాచీనలాక్షణికులు కొందఱు అలఘు వన్నారు. ళకారంగూర్చినవివాదం గురించి ప్రౌఢవ్యాకర్త ప్రస్తావించలేదు.

ఏ మైనా వర్ణమాలను గురించి విస్తృతంగా పరిశోధన జరగవలసింది.

## 2. చజలవిషయంలో ప్రౌఢవ్యాకర్త పేర్కొన్నవిశేషాలను తెలపండి.

'ఇఈఎఏలం గూడినచజలు తాలవ్యంబులు', 'అఆఉఊఔలం గూడినచజలు దంత్యంబులు'. తెలుగులో చకారం, జకారం, అనేహల్లులు వాటిమీద చేరేఅచ్చునుబట్టి తాలవ్యాలు, దంత్యాలు అని రెండు రకాలు. చిలుక, జముదు. మొ. ఈభేదం అచ్చతెలుగులోనే. సంస్కృతంలో చజలు పైన ఏఅచ్చు లున్నా, తాలవ్యాలు మాత్రమే. కాబట్టి తెలుగులోనిసంస్కృతసమాల్లోనూ చజలు తాలవ్యాలు మాత్రమే అవుతాయి. అర్చులు, వాజులు, మొద లైనచోట్ల బహువచనంలోనూ, రాజు అనేశబ్దం ఒక్కదానిలోనూ, మాత్రం సంస్కృతసమాల్లో దంత్యత విశేషంగా సూరి పేర్కొన్నాడు.

**ఉభయాలు**: ఇక్కడ ప్రౌఢవ్యాకర్త 'ఒకానొకచో జకారం బుభయంబు నగు.' అన్నాడు. శ్లేషస్థలంలో జకారం ఒకఅర్థంలో దంత్యమూ, ఇంకో అర్థంలో తాలవ్యమూ అవుతుం దని వివరించాడు.

'పాండురాజయశము' ఇక్కడ పాండు 'రాజ' అన్నపుడు భారతార్థంలో దంత్యం. పాండుర–అజ, అన్నపుడు రామాయణార్థంలో తాలవ్యం. కాబట్టి ఉభయం.

రాజు అనేతీరుగా ఉదంత మయితేనే జకారం దంత్యం. పాండు 'రాజ' అని ఉన్నచోట జకారం తాలవ్యమే. కాబట్టి రెండర్థాలలోనూ ఇక్కడి జకారం తాలవ్యమే. కాబట్టి ఇది సరి ఐనలక్ష్యం కాదు. ధర్మరాజితరక్షమాపాల– మొ. ఉదాహరించు కోవచ్చు. (ధర్మరాజు–ఇతర. రాజుశబ్దంలో జకారం దంత్యం. ధర్మ రాజిత తాలవ్యం.

'తీయగఁ బంచదార వెనుదీయగఁ గైకొను నన్ ద్వితీయగన్.' చక్కెర అనేఅర్థంలో ఈఅచ్చతెలుగుశబ్దంలో చకారం దంత్యం. ఐదుగురి(పంచ) భార్య (దార)అనే మరో అర్థంలో సంస్కృతసమంలో తాలవ్యం. పౌఢవ్యాకర్త జకారానికి చెప్పినస్థితి చకారానికి గూడా ఉన్నది.

అయినా ఒకే (అర్థంలో)సారి దంత్యమూ, తాలవ్యమూ, రెండూ కావడం లేదు. అందుచేత ఉభయత్వప్రతిపాదనం సరి కాదు.

**రాజు :** 'రాజు వైకృతం బని కొంద ఱందురు' అని ప్రౌఢవ్యాకర్త రాజుశబ్దం కొందఱిమతంలో తద్భవం అన్నాడు. తద్భవం అయితే అచ్చతెనుగు అవుతుంది. సూరి చెప్పినట్లుగా రాజులో జకారం దంత్యమే అని ప్రౌఢవ్యాకర్త అంగీకరిస్తున్నాడు. కాని సూరి 'రాజు' సంస్కృతసమం అంటే ప్రౌఢవ్యాకర్త అచ్చతెనుగు అంటున్నాడు. అంటే పాండురాజు వంటితత్సమాల్లో జకారం తాలవ్యమే అనాలి. అని ప్రౌఢవ్యాకర్త అభిప్రాయంగా చెప్పాలి. అటువంటపుడు 'జకారం బుభయంబు నగు' అనేసూత్రం, దానివివరణం సరి కాకుండాపోతాయి. (రెం డర్థాలలోనూ జకారం తాలవ్యమే అవుతున్నది కదా.)

రాజు తద్భవం అనేవిషయంలో ప్రౌఢవ్యాకర్తకు నిశ్చయం లే దనిపిస్తుంది. అందుకే వైకృతం బని 'కొంద ఱందురు' అని ఉండాలి.

**అర్చులు, వాజులు :** రాజు వైకృత మయితే 'అపుడు తత్సమంబునందలిచజలు దంత్యములు కా వని యూహించునది.' అన్నాడు ప్రౌఢవ్యాకర్త. అంటే సూరి తత్సమాల్లో దంత్యాలుగా చెప్పిన అర్చులు, వాజులు మొద లయినస్థలాల్లో కూడా చజలు తాలవ్యాలే అని ప్రౌఢవ్యాకర్త భావించిఉండాలి. కాని ఆవిషయం స్పష్టంగా చెప్పలేదు.

ఇంకా అచ్చు మొద లయినసంస్కృతసమాల్లో దంత్యత వినిపిస్తున్నది.

ఏది ఏ మైనా సంస్కృతసమాల్లో దంత్యచజలవిషయమై ప్రౌఢవ్యాకర్తకు ఒకనిశ్చయాభిప్రాయం ఏర్పడలే దని తోస్తుంది.

### 3. ద్రుతాన్నిగూర్చి ప్రౌఢవ్యాకర్త పేర్కొన్నవిశేషాలను తెలపండి.

చూ. 'నకారం బసాధారణంబు ద్రుతంబు' సూత్రవ్యాఖ్య.

### 4. తత్సమాలవిషయంలో బాలప్రౌఢవ్యాకర్తలమతభేదాలను పేర్కొనండి.

సూరి తత్సమాలుగా పేర్కొన్నశబ్దాలు కొన్ని తత్సమాలు గా వని వాటిని వేరే విధంగా నిరూపిస్తూ ప్రౌఢవ్యాకర్త సూరిమతంతో భేదించటం గమనింపవచ్చు.

**1. కారము :** 'సంస్కృతప్రాకృతతుల్యం బగుభాష తత్సమంబు' అని సూత్రించి సూరి 'కటుః–కారో–కారము' అని 'కారము' అనేతెలుగుశబ్దం 'కారో' అనేప్రాకృత శబ్దంతో తుల్య మనీ, తత్సమ మనీ చెప్పాడు.

ప్రౌఢవ్యాకర్త 'కారము క్షారశబ్ద భవము' అని సూత్రించి, 'క్షార' అనేసంస్కృత

శబ్దంనుంచి పుట్టిం దనీ, 'కారము' తద్భవ మనీ చెప్పాడు.

కాని క్షారశబ్దానికి కారం అనేఅర్థం లేకపోవడంచేత సూరిమతమె ఉచితం.

**2. విశ్వకర్ముఁడు:** 'విశ్వకర్మాదులకు స్త్రీత్వం బగు' అని సూత్రించి సూరి స్త్రీత్వాతిదేశంచేత దీనికి ఉత్వడుజులు లే వని స్పష్టం చేశాడు. అందువల్ల సూరిలక్షణం చేత, 'విశ్వకర్మ' అనే ఉంటుంది. కాని 'విశ్వకర్ముఁడు' అని ఉండరాదు.

ప్రౌఢవ్యాకర్త 'విశ్వకర్ముఁ డనియు రూపంబు' అని సూత్రించి విశ్వకర్మశబ్దానికి ఉత్వడుజులు (పుంలింగకార్యం) రావడం కూడా ఉన్న దని పేర్కొన్నాడు. 'విశ్వకర్మునికూఁతు' అనేఎఱ్ఱనగారి ఒకే ఒక్కప్రయోగం గుర్తింపదగియే ఉన్నది.

**3. రాజు :** 'మఱియు రాజు శబ్దం బొక్కటి దంత్యయుక్తంబు గానంబడియెడి' అని సూరి సంస్కృతసమ మైన'రాజు' అనేశబ్దంలో జకారం దంత్య మని వివరించాడు.

ప్రౌఢవ్యాకర్త 'రాజు వైకృతం బని కొంద ఱందురు' అని సూత్రించి 'రాజు' అనేది తద్భవంగా కొందరిమతాన్ని ప్రస్తావించాడు.

తద్భవ రాజుశబ్దం ఉన్నా 'మహారాజు', 'ఖగరాజు' మొద లైనచోట్ల 'రాజు' సంస్కృతసమం కూడా ఉంది. 'ఒకానొకచో జకారం బుభయంబు నగు' అని చెప్పి 'పాండురాజ' అన్నపుడు తత్సమరాజశబ్దంలో జకారం దంత్యం కావడాన్ని ప్రౌఢవ్యాకర్త కూడా పేర్కొన్నాడు. కాబట్టి ఈవిషయంలో ప్రౌఢవ్యాకర్త నిశ్చయంగా సూరిమతాన్ని విభేదించా దనడానికి లేదు. కాని 'రాజు' అని ఉత్వంతో గూడిఉన్నపుడే తత్సమశబ్దంలో జకారం దంత్య మవుతుం దని సూరిమతం. 'పాండురాజ' అన్నపుడు అత్త్వంతో గూడినది సూరిమతంలో కూడా తాలవ్యమె. అదీ దంత్యమే అనేప్రౌఢవ్యాకర్తమతం సరి కాదు. అటువంటి ఉచ్చారణమూ లేదు.

**4. విధము :** 'కంధరాదులు క్లీబతుల్యంబులు బహుళంబుగా నగు' అని సూత్రించి బహుళశబ్దంచేత విధా అనేస్త్రీలింగశబ్దానికి క్లీబతుల్యత నిత్యంగా వచ్చి విధము అని అవుతుం దని నని సూరి పేర్కొన్నాడు.

ప్రౌఢవ్యాకర్త 'విధాశబ్దంబు సంస్కృతంబునం బుంలింగంబు నగు' అని సూత్రించి పుంలింగ మగు 'విధ' శబ్దమె తత్సమ మయి 'విధము' (వృక్షః-వృక్షము) అని యవుతుం దనీ, స్త్రీలింగ మైన విధాశబ్దానికి తెలుగులో ప్రయోగం లే దనీ చెప్పాడు. అంటే 'విధా' శబ్దానికి సూరి క్లీబతుల్యత చెప్పటం అనవసర మని ప్రౌఢవ్యాకర్తమతం.

కాని యెక్కడో ఒకకోశంలో ఉన్నా, పుంలింగ మైన విధ శబ్దం అప్రసిద్ధం.

కాబట్టి ప్రసిద్ధ మైనస్త్రీలింగశబ్దంనుంచే తత్సమరూపాన్ని సాధించినసూరిమతం సముచితం.

**5. దంష్ట్ర :** 'కంధరాదులు క్లీబతుల్యంబులు బహుళంబుగా నగు' అని సూత్రించి సూరి 'దంష్ట్రా' అనేస్త్రీలింగశబ్దాన్ని కంధరాదులలో చేర్చి వైకల్పికక్లీబతుల్యత్వంచేత దంష్ట్రము-దంష్ట్ర అనేరూపాలను సాధించాడు.

ప్రౌఢవ్యాకర్త 'దంష్ట్ర' అని సంస్కృతంలో ఇది పుంలింగం కూడ అయిఉన్నట్లు పేర్కొన్నాడు. పుంలింగశబ్దంనుంచి దంష్ట్రము (వృక్షః-వృక్షము) అనీ, స్త్రీలింగశబ్దం నుంచి దంష్ట్ర అనీ తత్సమరూపం ఏర్పడుతుంది. కాబట్టి సూరి దంష్ట్రాశబ్దాన్ని కంధరాదులలో చేర్చి వైకల్పికక్లీబతుల్యత చెప్ప నవసరం లే దని ప్రౌఢవ్యాకర్త మతం.

కాని పుంలింగదంష్ట్రశబ్దం ఏదో ఒకకోశంలో ఉన్నా, అప్రసిద్ధం కావడంచేత ప్రసిద్ధ మైనస్త్రీలింగశబ్దంనుంచే తత్సమరూపాలను సాధించినసూరిమతం ఉచితం.

**6. అర్ఘువు-ధర్మువు:** 'అమహన్నపుంసకముల కదంతములకు మువర్ణకం బగు' అనేసూత్రంచేత సూరి వీటిమువర్ణకాంతరూపాలను మాత్రమే సాధించాడు. అర్ఘము-ధర్మము మొ.

'అర్ఘాదులకడయచ్చున కుత్వంబును మీఁద వువర్ణకంబును వైకల్పికంబుగా నగు' అని సూత్రించి ప్రౌఢవ్యాకర్త అర్ఘువు, ధర్మువు అనేరీతిరూపాలను విశేషంగా సాధించాడు. (ఇలాంటివువర్ణకాంతాలను సూరి తనసూత్రాంధ్రవ్యాకరణంలో సాధించాడు.)

**7. రాహు :** 'ఉకారాంతం బగుమహత్తునకు వువర్ణకంబు బహుళంబుగా నగు' అని సూత్రించి రాహువు,(రాహుఁడు) అనేరూపాలను సూరి సాధించాడు.

ప్రౌఢవ్యాకర్త 'రాహు బాహుశబ్దంబుల కంతట వువర్ణకలోపంబు వైకల్పికంబు' అని సూత్రించి 'రాహు' అనేరూపాన్ని సాధించాడు. పైసూరిసూత్రంలోని బహుళ శబ్దంచేత ఈరూపం బాలవ్యాకరణంలోనూ సాధింపబడుతుంది.

**8. బాహు :** 'ఉకారాంతగోశబ్దంబుల కంతట వువర్ణకం బగు' అనేసూత్రంచేత 'బాహువు' అనేరూపం మాత్రమె బాలవ్యాకరణంచేత సిద్ధిస్తుంది. 'రాహుబాహు శబ్దంబుల కంతట వువర్ణకలోపంబు వైకల్పికంబు' అనేసూత్రంచేత ప్రౌఢవ్యాకర్త వువర్ణకం లోపించిన 'బాహు' అనేరూపాన్ని గూడ సాధించాడు. కాని 'బాహు'

అను ప్రథమైకవచనాంతరూపం కనబడడం లేదు.

**9. మల్లురు** ః 'మల్ల' అనేశబ్దం లోపధం. కాని దీర్ఘపూర్వకం గాకపోవడంచేత 'అదంతం బయి దీర్ఘపూర్వలోపధం బయినమహత్తుమీఁదివిభక్తిలకారంబునకు రేఫం బగు' అనేసూత్రంచేత దానిపైన లకారానికి రేఫం రాదు. కాబట్టి బాలవ్యాకరణంచేత 'మల్లులు' అనే అవుతుంది గాని 'మల్లురు' అని కాదు. 'ద్విత్వయుక్తలాంతంబుమీఁదిలులలకును రుర లాదేశంబు లగు' అనేసూత్రంచేత 'మల్లురు' అనేరూపాన్ని ప్రౌఢవ్యాకర్త సాధించాడు. అటువంటిరూపాలు అరుదు. తిక్కనాదులు ప్రాస ఘటితంగా 'మల్లులు' అని ప్రయోగించారు.

## 5. దేశ్యశబ్దాలవిషయంలో బాలప్రౌఢవ్యాకర్తలమతభేదాలను పేర్కొనండి.

బాలవ్యాకర్త దేశ్యాలుగా చెప్పిన కొన్ని శబ్దాలను ప్రౌఢవ్యాకర్త దేశ్యాలు కావన్నాడు. మఱి కొన్నింటి విషయంలలోనూ భేదాభిప్రాయాలు గోచరిస్తున్నాయి.

**1. కాఱియ** : 'శకటరేఫము తత్సమతద్భవములందు లేదు' అని బాలవ్యాకర్త పేర్కొన్నాడు. కాని సూరి తననిఘంటువులో 'తద్భవములందును అరుదుగ శకట రేఫము గల' దని చెప్పి 'కాఱియ' అని చూపించా డట. బాలవ్యాకరణంలో తద్భవాలలో శకటరేఫ లే దని నిశ్చయించి, 'ఇయకు మాఱుగా నామాంతంబున కెత్వంబు బహుళంబుగా నగు' అనేచోట 'కాఱియ' శబ్దాన్ని చూపించాడు. దీనినిబట్టి బాలవ్యాకర్త ఇది దేశ్య మని తలచా డేమో అని సందేహం కల్గుతుంది. ప్రౌఢవ్యాకర్త 'తద్భవములందును నలఘురేఫము గలదు' అని సూత్రించి తద్భవాలలో శకటరేఫ ఉండటాన్ని పేర్కొన్నాడు. కారికాశబ్దభవంగా కాఱియ తద్భవ మనీ, ఇలా తద్భవాలలో శకటరేఫ ఉన్న దనీ ప్రౌఢవ్యాకర్తమతం.

**2. కోట** : 'త్రిలింగదేశవ్యవహారసిద్ధం బగుభాష దేశ్యంబు' అని సూత్రించి బాలవ్యాకర్త 'కోట' అనేశబ్దం దేశ్యంగా ఉదాహరించాడు. ప్రౌఢవ్యాకర్త 'కోటపేఁటలు వైకృతములు' అని సూత్రించి దీన్ని తద్భవంగా పేర్కొన్నాడు. కోట్ట లేదా కోట, అనేసంస్కృతశబ్దాలనుంచి ఇది తద్భవంగా ఏర్పడిం దని ప్రౌఢవ్యాకర్త మతం. ఏ దైన నిఘంటువులో ఉన్నా ఈశబ్దాలు అప్రసిద్ధాలు కావటంచేత వీటినుంచి తద్భవంగా కోట ఏర్పడిం దనేప్రౌఢవ్యాకర్త మతంకంటె బాలవ్యాకర్తమతం యుక్తంగా తోస్తున్నది.

**3. పేట :** 'త్రిలింగదేశవ్యవహారసిద్ధం బగుభాష దేశ్యంబు' అని సూత్రించి బాలవ్యాకర్త 'పేట' శబ్దాన్ని దేశ్యంగా ఉదాహరించాడు. కాని ప్రౌఢవ్యాకర్త 'కోటపేఁ టలు వైకృతములు' అని సూత్రించి పేఁట తద్భవ మనీ, పింతా(విటజనాశ్రయః) శబ్దంనుంచి పుట్టిం దనీ పేర్కొన్నాడు. ప్రౌఢవ్యాకర్త ఇలా పేర్కొనడంలో ఇది దేశ్యం అనేబాలవ్యాకర్తమతం సరిగా దని అభిప్రాయం. కాని బాలవ్యాకర్త దేశ్యంగా చూపిన పేటశబ్దంలో అరసున్న లేదు. దీనికి హారంలోనివరుస మొద లయినవి అర్థాలు. శబ్దరత్నాకరంలో దీనిని ప్రౌఢవ్యాకర్త దేశ్యంగానే పేర్కొన్నాడు. ప్రౌఢవ్యాకర్త తద్భవ మని సూత్రించిన 'పేఁట'లో అఱసున్న ఉన్నది. (నగరం–నగరశాఖ) సూరి ఉదాహరించింది ఇది కాదు. కాబట్టి ఇక్కడ ఇద్దరిమతంలోనూ భేదం లే దనవచ్చు.

**4. కన్య :** 'ఇయకు మాఱుగా నామాంతంబున కెత్వంబు బహుళంబుగా నగు' అనేసూత్రందగ్గర బాలవ్యాకర్త 'ముత్తియశబ్దంబునందు మాత్ర మిత్వలోపంబు గానంబడియెడి' అని వివరించాడు. 'ముత్తియ' అనేదానికంటె వే ఱైనశబ్దంలోని ఇయలో ఇకారానికి లోపం లే దని బాలవ్యాకర్తమతం. ప్రౌఢవ్యాకర్త 'ముత్తియ శబ్దేతరంబులయందును దఱచుగ నిత్వలోపంబు గానంబడియెడి' అని సూత్రించి ఇతరశబ్దాలలో గూడా 'ఇ' కారలోపాన్ని పేర్కొన్నాడు. కన్నియ – కన్య. వీడియము– వీడ్యము మొ. ప్రౌఢవ్యాకర్త అభిప్రాయం కొంతవఱ కుచితమే.

**5. ఎల్లను :** బాలవ్యాకర్త 'సర్వపర్యాయం బయినయెల్లశబ్దంబు ద్రుతాంతం బయిన యవ్యయంబు' అని చెప్పాడు. ప్రౌఢవ్యాకర్త 'సర్వపర్యాయం బయినయెల్ల శబ్దమునకు సప్తమియు విశేష్యమునకు ముందు ప్రయోగంబునుం జూపట్టెడు' అని సూత్రించి ఎల్ల శబ్దంమీద సప్తమీవిభక్తి ఉన్న దన్నాడు. విభక్తి ఉన్న దనడాన్నిబట్టి యిది అవ్యయం కా దనీ, సర్వనామ మనీ ప్రౌఢవ్యాకర్త తలచినట్లు పైకి తోస్తుంది.

కాని ప్రౌఢవ్యాకర్త శబ్దరత్నాకరంలో సమస్తం అనేఅర్థంలో ఇది ద్రుతాంత మైనఅవ్యయమే అని బాలవ్యాకర్తమతాన్నే అనుసరించాడు. అవ్యయ మైనా, ఎల్లయందు అని ఎల్లశబ్దంమీద సప్తమీవిభక్తి ఉండడాన్ని అక్కడ వివరించాడు. ఎల్లయందు అన్నది మార్గాంతరంలో సాధించుకోవచ్చును. ఏ మైనా సర్వపర్యాయ మైన ఎల్ల శబ్దం ద్రుతాంత మైనఅవ్యయం అనడంలో బాలప్రౌఢవ్యాకర్తలమతంలో భేదం లేదు. అవ్యయంమీద 'అందు' అనేసప్తమీవిభక్తి ఉండడం అనేవిశేషాన్ని ప్రౌఢవ్యాకర్త పేర్కొన్నాడు.

**6. ఎల్లన్ శిష్యులన్ :** 'సర్వపర్యాయం బయినయెల్లశబ్దంబు ద్రుతాంతం బయిన యవ్యయంబు' అని చెప్పిన బాలవ్యాకర్త 'దీని కసమాసంబున విశేష్యంబునకు ముందు ప్రయోగంబు లే' దన్నాడు. దీన్ని తిరస్కరిస్తూ ప్రౌఢవ్యాకర్త 'సర్వపర్యాయం బయిన యెల్లశబ్దమునకు సప్తమియు విశేష్యమునకు ముందు ప్రయోగంబునుం జూపట్టెడు' అని సూత్రించి 'ఎల్లన్ శిష్యులన్' అనేశ్రీనాథప్రయోగాన్ని చూపాడు. ఇక్కడ సమాసం గాకపోయినా, శిష్యులన్ అనేవిశేష్యానికి ముందు 'ఎల్లన్' అనేది ప్రయోగింపబడింది.

కాని యిక్కడ శిష్యులన్ అనేదే విశేషణంగానూ, ఎల్లన్ అన్నది విశేష్యంగానూ తోస్తున్నది. ఈపక్షంలో బాలవ్యాకర్త మతంతో విరోధం లేదు.

## 6. అనింద్యగ్రామ్యాలవిషయంలో బాల,ప్రౌఢవ్యాకర్తలమతభేదాలను తెలపండి.

'లక్షణవిరుద్ధం బగుభాష గ్రామ్యంబు' అని చెప్పినసూరి 'ఆర్యవ్యవహారంబుల దృష్టంబు గ్రాహ్యంబు. అని సూత్రించి, 1. కఱకంఠుడు 2. కపిలగడ్డము, కపిల జడలు, కపిలకన్నులు, 3. ప్రాణగొడ్డము 4. జీవగఱ్ఱ (మొ.) అనేవి పెద్దలు వ్యవహరించినమాటలు కాబట్టి గ్రామ్యా లయినా గ్రహించాలి అన్నాడు. వీటినే అనింద్యగ్రామ్యా లని వ్యవహరిస్తుంటారు.

వీటిలో 'జీవగఱ్ఱ' విషయంలో ప్రౌఢవ్యాకర్త ఏమీ మాటాడలేదు. దానినిగూర్చి సూరి చెప్పినఅంశాన్ని అంగీకరించా డన్నమాట. కాని మిగిలినవి మాత్రం అసలు గ్రామ్యాలే కావు అని ప్రతిపాదించాడు.

చూ. రూపప్రక్రియ. 1. కఱకంఠుడు 2. కవిలగడ్డము, కవిలజడలు, కవిలకన్నులు, 3. ప్రాణగొడ్డము.

## 7. అనుకరణసంధికార్యాలనుగూర్చి ప్రౌఢవ్యాకర్త పేర్కొన్నవిశేషాలు తెలపండి.

'న పదా న్యవ్యయ సుప్ తిఙ్ క్త్వా తుమునామ్' అనుకృతే కస్తి వాక్యం తు' అని చింతామణి సంస్కృతవాక్యాన్ని తెలుగులో అనుకరణం లేకుండా ప్రయోగించరాదు, అని చెప్తున్నది. 'వినానుకరణం కేచి దాద్యశబ్దం ప్రయుంజతే' అని అధర్వణుడు అనుకరణం లేకుండా ప్రయోగింపబడుతున్నవిషయాన్ని ప్రస్తావించాడు. చిన్నయసూరి ఈవిషయాలను స్పష్టంగా చెప్పలేదు.

అధర్వణుడిఅభిప్రాయాన్ని అంగీకరిస్తూ ప్రౌఢవ్యాకర్త ఇలా చెప్పాడు.

*అనుకరణరాహిత్యం:*

**1. సంస్కృతవాక్యం:** 'ఒకానొకచో ననుకరణవిరహితంబుగ సంస్కృత వాక్యంబు గానంబడియెడి' అనుకరణం లేకుండా కూడా సంస్కృతవాక్యాన్ని తెలుగులో ప్రయోగించుకో వచ్చును. 'అంటితి నమ శ్శివాయ పాపాత్మురాలి' ఇక్కడ 'అంటితి పాపాత్మురాలి' అనేతెలుగువాక్యం మధ్యంలో 'నమ శ్శివాయ' అనేసంస్కృతవాక్యం ప్రయోగింపబడింది. ఇలాగే 'నమో విశ్వసృజే విన మింతకు' మొ.

**2. సంస్కృతపదం:** 'జయపదం బనుకరణవిరహితంబ తఱచుగ నగు' సంస్కృత(మధ్యమ పురుష ఏకవచనక్రియా)పద మైన 'జయ' అన్నది తెలుగులో అనుకరణం లేకుండా ప్రయోగింపబడుతున్నది. ఉదా. జయ పూతనాఘాత, మొ.

ప్రౌఢవ్యాకర్త ప్రదర్శించినఈలక్ష్యసందర్భాలలో సంస్కృతవాక్యం లేదా పదం తర్వాత అనుకరణం ఉండే అవకాశమే లేదు. ఇక్కడ అనుకరింపబడేది సంస్కృతవాక్యం ఒక్కటే కాదు. అనుకరింపబడే పాత్రసంభాషణలో మధ్యలో ఉండటంచేత ఇక్కడ సంస్కృతవాక్యం తరువాత అనుకరణం కుదరదు. కాబట్టి లక్ష్యాలు ఈలక్షణానికి అనుగుణ మైనవి కావు.

**ధ్వన్యనుకరణాలు:**

'ధ్వన్యనుకరణశబ్దంబుల కనుధాతువు పరం బగుచో గొన్నియెడల ముగాగమం బగు' అనుకరణం పరంగా ఉన్నపుడు ధ్వనిని అనుకరించేశబ్దాలకు పైన మకారం ఆగమంగా వస్తుంది.

కనకన+అను. కనకన అనేధ్వన్యనుకరణశబ్దానికి చివర మకారం ఆగమ మై, కనకనమ్+అను = కనకన మను. మొ.

'ఇయ్యవి క్రియావ్యవహితంబులు నగు' అని ధ్వన్యనుకరణశబ్దాలకూ, వాటిక్రియా పదాలకూ మధ్య వేరే పదాలతో వ్యవధానం ఒకవిశేషంగా చెప్పాడు.

వడవడ జమదగ్నిసూతి వడకెన్. ఇక్కడ వడవడ అనే ధ్వన్యనుకరణశబ్దానికీ, వడకెన్ అనేక్రియాపదానికీ మధ్యలో 'జమదగ్నిసూతి' అనేపదంతో వ్యవధానం

ఏర్పడింది.

## 2. సంధిపరిచ్ఛేదం

**1. స్వరసంధివిషయంలో బాల,ప్రౌఢవ్యాకర్తలమతభేదాలను పేర్కొనండి.**

| | | | |
|---|---|---|---|
| 1. ఆర్యాద్యర్థపరకసంధి. | చూ. | రామయ్య. | (రూపప్రక్రియ) |
| 2. క్వార్థకేకారసంధి. | – | ఎఱిం గెఱింగి | ,, |
| 3. ద్రుతద్విత్వం. | – | సర్వము న్నతని. | ,, |
| 4. ద్విరుక్తటకారం. | – | చిట్టడవి. | ,, |

**2. ప్రౌఢవ్యాకర్త చెప్పిన లోపసంధికార్యాలను పేర్కొనండి.**

| | | | |
|---|---|---|---|
| 1. మధ్యమములోపం. | – | ఆడిదె. | ,, |
| 2. నుగాగమలోపం | – | బచ్చింట | ,, |
| 3. ని,ల – స్వరలోపం | – | ఇంద్రున్ వలెన్. | ,, |
| 4. ధాతుజవిశేషణాలు–ఉత్వలోపం | – | అన్పురంబు. | ,, |
| 5 మికారలోపం. | – | నీ కే వ్రాతియే | ,, |

**3. ప్రౌఢవ్యాకర్త చెప్పిన ఆగమసంధికార్యాలను పేర్కొనండి.**

| | | | |
|---|---|---|---|
| 1. నుమాగమం. | – | ముంగోపము. | ,, |
| 2. పుగాగమం | – | తామరపాకు. | ,, |
| 3. ముగాగమం | – | కనకన మను. | ,, |

**4. ప్రౌఢవ్యాకర్త చెప్పిన ఆదేశసంధికార్యాలను పేర్కొనండి.**

| | | | |
|---|---|---|---|
| 1. నకారాదేశం. | – | రెన్నాళ్లు. | ,, |
| 2. మకారాదేశం. | – | చేసె మ్మహానది. | ,, |

**5. ప్రౌఢవ్యాకర్త చెప్పిన గసడదవాదేశవిశేషాలను పేర్కొనండి.**

| | | | |
|---|---|---|---|
| 1. ఆదేశం. | – | వీరల్ గోపించిన | ,, |
| 2. ఆదేశాభావం. | – | అందచందములు. | ,, |

# 3. శబ్దపరిచ్ఛేదం

## 1. సంబోధనంలో సంబోధ్యవాచకానికి చేరే ఆయాశబ్దాలనుగూర్చి వ్యాకర్తలు పేర్కొన్న అంశాలను తెలపండి.

సంబోధ్యవాచకాలకు ముందుగానూ, వెనుకగానూ చేరే ఆయాశబ్దాలనుగూర్చి బాలప్రౌఢవ్యాకరణాలు ఇలా పేర్కొన్నాయి.

**1. ఓ :** 'ఓ యామంత్రణంబునం దగు' – సంబోధ్యవాచకం (మహ త్తయినా, అమహ త్తయినా, ఏకవచనాంత మయినా, బహువచనాంత మయినా) ముందుగా 'ఓ' అనుశబ్దం చేరుతుంది. ఓరామ, ఓరాములార.

**వ్యవధానం :** ఇక్కడ ప్రౌఢవ్యాకరణం 'ఓశబ్దం బొక్కచో సంబోధ్యవాచకంబునకు ముం దితరశబ్దవ్యవహితం బయి కానంబడియెడి' అన్నది. ధాతుజవిశేషణాల సందర్భంలో ఓశబ్దానికీ, సంబోధ్యవాచకానికీ నడుమ వ్యవధానం ఉంటుది. 'ఓ వినువీధి నున్నఖచరోత్తములార'.

**2. ఓయి :** 'ఓశబ్దంబునకుం బురుషనీచస్త్రీపురుషామంత్రణంబులందు యిసిరి వర్ణంబులు విభాష నంతాగమంబు లగు' పురుషసంబోధనంలో ఓశబ్దానికి పైన యివర్ణం చేరి, ఓయి అని అవుతుంది. ఓయి రామ – (ఓరామ) ఇది బహువచన స్థలంలో చాలా అరుదు. ఓయి వెఱ్ఱులార.

**3. ఓసి :** పయిసూత్రంచేత నీచస్త్రీసంబోధనంలో 'సి' వర్ణం చేరి ఓసి అనేది కూడా అవుతుంది. ఓసి దుష్టురాల. (ఓ దుష్టురాల) 'ఓరి యోసి మైత్రియందుం గలవు'. అని ఓసి మైత్రిలో కూడా వస్తుంది. ఓసి ముద్దుబాల.

**4. ఓరి :** పయిసూత్రంచేతనె నీచపురుషసంబోధనంలో ఓశబ్దానికి 'రి' వర్ణం చేరి ఓరి అని కూడా అవుతుంది. ఓరి దుష్టుఁడ. (ఓ దుష్టుఁడ) ఇది మైత్రిలో కూడా ప్రయోగింపబడుతుంది. ఓరి చిన్నికృష్ణ.

ఓయి, ఓరి, ఓసి అనేవి సంబోధ్యవాచకం లేకుండ స్వతంత్రంగా ప్రయోగింపబడటం కూడా ఉంది. సంగతియ యోయి. మొ.

**5. రో, రొ :** 'రోశబ్దం బొండు సంబోధనంబున స్త్రీవాచకంబునకుఁ బరంబుగ నగు, అయ్యది హ్రస్వాంతంబును నయ్యెడి' అని ప్రౌఢవ్యాకరణం. స్త్రీవాచకాల కేకత్వంలో సంబోధ్యవాచకానికి పరంగా రో అనేది వస్తుంది. కమలదళాక్షిరో. దానికి హ్రస్వం కూడా వస్తుంది. రమణిరొ. ఇంకా అన్నరో, ఏనుంగురో అని కూడా ప్రయోగా లున్నాయి.

**6. కాన :** 'దేశ్యంబులం గొన్నియెడల స్త్రీవాచక స్త్రీసమంబు లగుసంబోధ్యవాచక శబ్దములమీఁద నేకవచనంబునఁ గానశబ్దం బొండును అల యనునవ్యయం బొండును గానంబడియెడి, అల దీర్ఘాంతంబు నగు' అని ప్రౌఢవ్యాకరణం కొన్ని శబ్దాలకు పరంగా సంబోధనంలో 'కాన' అనేశబ్దం చేరుతుంది. తల్లి కాన. ఇంకా పాపజాతికాన, దురాచారులారకాన అని కూడా ప్రయోగాలు ఉన్నాయి.

**7. అల-అలా :** పయిసూత్రంచేత కొన్ని శబ్దాలకు పైన 'అల' అనేశబ్దం చేరుతుంది. అమ్మలక్క లని. అల అనేదానికి చివర దీర్ఘం కూడా వస్తుంది. అన్నలా. అల, అలా అనేవి సంబోధనంలో వచ్చాయి అనడం విచార్యం.

| సంబోధనశబ్దం | సంబోధ్యవాచకం | ఉదాహరణం |
|---|---|---|
| 1. ఓ | అన్ని శబ్దాలకు - పూర్వంలో | ఓరామ, ఓ సీతలార |
| | వ్యవధానంతో | ఓ వినువీధి నున్న ఖచరోత్తములార ! |
| 2. ఓయి | పురుషసంబోధనంలో | ఓయి రామ. |
| | సంబోధ్యవాచకం లేకుండ | సంగతియ యోయి |
| 3. ఓరి | నీచపురుషసంబోధనంలో | ఓరి దుష్టుఁడ |
| | మైత్రియందు | ఓరి చిన్నికృష్ణ |
| | సంబోధ్యవాచకం లేకుండ | ఓరోరి ! |
| 4. ఓసి | నీచస్త్రీసంబోధనంలో | ఓసి దుష్టురాల |
| | మైత్రియందు | ఓసి ముద్దుబాల |
| | సంబోధ్యవాచకం లేకుండ | ఓసి పోవే |
| 5. రో | స్త్రీవాచకానికి-పరంగా | కమలదళాక్షిరో |
| 6. రొ | స్త్రీవాచకానికి-పరంగా | రమణిరొ |
| 7. కాన | స్త్రీసమానికి - పరంగా | తల్లి కాన |

8. అల స్త్రీసమానికి – పరంగా అమ్మ లక్కల

9. అలా స్త్రీసమానికి – పరంగా అన్నలా

**2. విశేషణభేదాలను ప్రౌఢవ్యాకర్త పేర్కొన్నప్రకారంగా నిరూపించండి.**

'శబ్దములు విశేష్యములు విశేషణము లని ద్వివిధంబులు' అయ్య – అక్క మొద లైనవి విశేష్యాలు. మిగిలినవి విశేషణాలు. కీడుతలపులు మొ.చోట్ల కీడు మొద లయినకొన్ని విశేషణాలు విశేష్యాలు కూడా అవుతాయి. విశేషణాలు కొన్ని చోట్ల విశేష్యలక్షకాలు కూడా అవుతాయి. అప్రియములు గావించి = అప్రియ కార్యములు గావించి.

**విశేషణం :** 'విశేషణము నా జాత్యాదివిశేషములను దెలుపునది.' జాతి, గుణము మొద లయినవిశేషాలను తెలియజేసేశబ్దం విశేషణం. క్షత్రియుడు – క్షత్రియత్వం అనేజాతిరూప మయినవిశేషాన్ని తెలియజేయడంచేత 'క్షత్రియుడు' అనేది విశేషణం. విశేష్యాలను భేద్యము లనీ, విశేషణాలను భేదకా లనీ కూడా వ్యవహరిస్తారు.

**విశేషణభేదాలు :** 'విశేషణము జాత్యాదిభేదంబుచే షడ్విధంబు' జాతి మొద లయినవిశేషాలను తెలిపేదే విశేషణం. కాగా విశేషణం తెలిపే ఈజాతి మొద లయినవిశేషాల ననుసరించి ఇది ఆరు విధాలు.

**1. జాతిప్రయుక్తవిశేషణం :** జాతి ననుసరించి ప్రయోగింపబడినవిశేషణం జాతిప్రయుక్తవిశేషణం. ఈవిశేషణం జాతివిశేషాన్ని తెలుపుతుంది. ద్రోణుడు బ్రాహ్మణుడు. ఇక్కడ బ్రాహ్మణుడు అనేది ద్రోణు డనేవిశేష్యంలోని బ్రాహ్మణత్వం అనేవిశేషాన్ని తెలుపుతూ విశేషణ మయింది. బ్రాహ్మణత్వం జాతిరూప మయినది, కాబట్టి జాతినిబట్టి కూర్చబడిన 'బ్రాహ్మణుడు' అనేశబ్దం జాతిప్రయుక్తవిశేషణం అవుతున్నది.

**2. క్రియాప్రయుక్తవిశేషణం :** క్రియ అంటే వ్యాపారం (పని). క్రియనుగూర్చి తెలిపేవిశేషణం క్రియాప్రయుక్తవిశేషణం. వచ్చినవాడు ఫల్గునుడు. ఇక్కడ వచ్చినవాడు అనేది ఫల్గుణుడు అనేవిశేష్యంలోని – వచ్చిఉండటం అనేవిశేషాన్ని తెలుపుతూ విశేషణ మైనది. 'వచ్చుట' అనేవిశేషం క్రియారూప మైనది. క్రియారూప మయిన విశేషాన్ని తెలపుతుండడంచేత 'వచ్చినవాడు' క్రియాప్రయుక్తవిశేషణం. (ధాతుజ విశేషణాలే క్రియాప్రయుక్తవిశేషణాలు అని స్థూలంగా చెప్పవచ్చు)

**3. గుణప్రయుక్తవిశేషణం :** గుణాన్ని తెలియజేసేవిశేషణం గుణప్రయుక్తవిశేషణం. 'నల్లనివాడు రాముడు' ఇక్కడ 'నల్లనివాడు' అనేది రాముడు అనేవిశేష్యంలోని నల్లగా ఉండటం అనేవిశేషాన్ని తెలుపుతూ విశేషణ మైంది. నలుపు అనేది గుణం. కాబట్టి గుణమూలక మైన 'నల్లనివాడు' అనేఈవిశేషణం గుణప్రయుక్తవిశేషణం.

**4. ద్రవ్యప్రయుక్తవిశేషణం :** ద్రవ్యం (వస్తువు–ధనం, మొ.)ను అనుసరించి ప్రయోగింపబడినవిశేషణం ద్రవ్యప్రయుక్తవిశేషణం. ధనవంతుడు, ధనం (కలిగి ఉండటం) అనేద్రవ్యరూప మైనవిశేషాన్ని ప్రస్తావిస్తున్నది గాబట్టి ఇది ద్రవ్యప్రయుక్త విశేషణం.

**5. సంఖ్యాప్రయుక్తవిశేషణం :** 'సంఖ్యను తెలియజేసేవిశేషణం సంఖ్యాప్రయుక్త విశేషణం. ఒక్కఁడు, ఒక్క–అనేసంఖ్య ననుసరించి ప్రయోగింపబడినది కాబట్టి ఇది సంఖ్యాప్రయుక్తవిశేషణం.

**6. సంజ్ఞాప్రయుక్తవిశేషణం :** సంజ్ఞ (పేరు)ను తెలిపేవిశేషణం సంజ్ఞాప్రయుక్త విశేషణం. దేవదత్తుఁడు. 'దేవదత్త' అనేసంజ్ఞను గూర్చి ప్రయుక్త మైనది గాబట్టి ఇది సంజ్ఞాప్రయుక్తవిశేషణం.

ఇలా విశేషణాన్ని ఆరు విధాలుగా ప్రౌఢవ్యాకరణం నిరూపించింది.

## 3. తెలుగులోని నిత్యైకవచనాంతశబ్దాలను గూర్చి తెలపండి.

నిత్యంగా ఏకవచనాంతాలు అయిఉండేశబ్దాలు నిత్యైకవచనాంతాలు. అన్నివిభక్తులలోనూ, ఎల్లపుడూ ఏకవచనమె కాని యీశబ్దాలమీద బహువచనం చేరదు. అంటే బహుత్వార్థంలో సయితం ఏకవచనమే వస్తుంది. అప్పుడు. మొ.

**1. అప్పుడు–మొ :** 'అప్పు డిప్పు డిప్పు డనుశబ్దములు నిత్యైకవచనాంతము' లని చిన్నయసూరి ఒకసందర్భంలో పేర్కొన్నాడు. అప్పుడు, ఇప్పటికి, ఎప్పటన్ మొ.

ఇటువంటివాటిని ప్రౌఢవ్యాకర్త మఱి కొన్నిటిని నిరూపించాడు.

**2. అక్కడాదులు :** 'దేశ్యమునం దక్కడాదులు నిత్యైకవచనాంతములు' అక్కడ మొద లయిన దేశ్యశబ్దా లెప్పుడూ ఏకవచనాంతాలె అయిఉంటాయి. అక్కడ, ఇక్కడికి, ఎక్కడన్ మొ.

ఇరులు కేలు అనేశబ్దాలు బహువచనాంతాలు అని కొందరు చెప్తారు, కానీ

అవి కూడా నిత్యైకవచనాంతాలె. ఇరులున–మొ. ఇవి అక్కడ మొద లయినవాటిలో చేరిఉన్నాయి.

**3. సస్యవాచకాలు :** 'సస్యవాచకశబ్దములును' పైరును బోధించేశబ్దాలు కూడా నిత్యైకవచనాంతాలే. కంది(పైరు) పెసర–మినుము మొ. బియ్యము, జీలకఱ్ఱ మొ. ధాన్యవాచకశబ్దాలు కూడా నిత్యైకవచనాంతాలె.

**4. సంభారవాచకాలు :** 'కతిపయసంభారవాచకశబ్దములును' గృహోపయోగు లయిన వస్తువులను బోధించేశబ్దాలు కొన్ని ఎప్పుడూ ఏకవచనాంతాలే అయిఉంటాయి. ఉప్పు, చింతపండు మొ.

**5. లోహవాచకాలు :** 'లోహవాచకశబ్దములును' లోహాలను బోధించేశబ్దాలు కూడా ఎప్పుడూ ఏకవచనాంతాలే అవుతాయి. వెండి, బంగారము మొ.

**6. సమానార్థకాలు :** 'సమానార్థకము లయిన యీ డెన సరి సాటి లోనగుదేశ్య విశేషణశబ్దములును' సమానం అనేఅర్థాన్ని ఇచ్చే – ఈడు, ఎన, సరి, సాటి మొద లయినవిశేషణశబ్దాలు నిత్యం ఏకవచనాంతాలే అవుతాయి. అవి సరి గావు. సతు లెనయే మొ.

'సరులు లేని' అనేరీతిగా ఒకటి, రెండు ప్రయోగాలు విశేషస్థలాలు.

**7. గుణరసవాచకాలు :** 'గుణరసవాచకములైన దేశ్యవిశేషణశబ్దములును' గుణాన్నీ రసాన్నీ (రుచి) బోధించేశబ్దాలు నిత్యైకవచనాంతాలు. గుణము–కాళ్లు 'నలుపు'; రసము– పండ్లు 'తీపు'.

## 4. తెలుగులోని నిత్యబహువచనాంతశబ్దాలను గూర్చి తెలపండి.

ఎప్పుడూ చివర్లో బహువచనమె కలిగిఉండేశబ్దాలు నిత్యబహువచనాంతాలు. ఇటువంటిశబ్దాలమీద అన్నివిభక్తులలోనూ ఎల్లప్పుడు బహువచనం మాత్రమె ఉంటుంది. ఎక్కడైనా ఏకత్వార్థాన్ని చెప్పదలుచుకున్నా ఈశబ్దాలమీద బహువచనం మాత్రమే అవుతుంది.

**1. అందఱ్ఱాదులు :** 'అందఱ్ఱాదులు నిత్యబహువచనాంతములు'. అందఱు మొద లయినమహత్సర్వనామశబ్దాలు ఎప్పుడూ బహువచనంతోనె ఉంటాయి. అందఱు, ఇందఱును, ఎందఱకు, పలుగురు మొ.

**2. అదర్వాదులు :** 'అదరులు లో నగుశబ్దములును' అదరులు మొద లయిన శబ్దాలు ఎప్పుడూ బహువచనాంతాలే అవుతాయి. అదరులు. మిడుగురులు మొ.

ఇవి వృత్తిలో ఏకవచనాంతా లయి కూడ కనబడతాయి. అదరుటగ్గి. మిడుగురుంబురువు.

**3. ధాన్యవాచకములు :** 'తఱచుగ ధాన్యవాచకశబ్దములును' ధాన్యాన్ని బోధించే శబ్దాలు చాలవరకు నిత్యం బహువచనాంతా లైఉంటాయి. కందులు– పెసలు– మినుములు. మొ. తఱచుగ అనడంచేత బియ్యము, జీలకఱ్ఱ మొద లయిన కొన్ని నిత్యైకవచనాంతాలు గ్రహింపబడతాయి.

**4. కొన్ని క్రీడావాచకాలు :** 'క్రీడావిశేషవాచకశబ్దములును' కొన్ని ప్రత్యేక మయిన ఆటలను బోధించేశబ్దాలు నిత్యబహువచనాంతాలు అవుతాయి. అచ్చనగాయలు, గుజ్జెనగూళ్ళు, కుప్పిగంతులు మొ.

# 4. కారకపరిచ్ఛేదం

## 1. కారకం అంటే ఏమిటో పేర్కొని వివిధకారకాలను వివరించండి.

**కారకం :** 'కారక' శబార్థాన్నీ, ఆయాకారకాలనూ సూరి ప్రత్యేకంగా పేర్కొనలేదు. మిగిలిన కొన్ని సంజ్ఞాదులవలె ఈఅంశం కూడా సంస్కృతంనుండే గ్రహించాలి అని సూరిఅభిప్రాయం గావచ్చు.

'క్రియాజనకమ్'– క్రియను గూర్చిన ఆకాంక్షను గలుగజేసేది కారకం. 'రాముడు' అని ఉచ్చరిస్తే 'ఏమి చేశాడు' అనేవిధంగా క్రియను గూర్చినఆకాంక్ష కలుగుతుంది. ఇటువంటివి కారకాలు. 'రామునియొక్క' అన్నపుడు పైరీతిగా క్రియాకాంక్ష ఉండదు. కాబట్టి అది (యొక్క షష్ఠి) కారక మనిపించుకోదు.

'క్రియాన్వయమును కలిగించునది అనగా క్రియాన్వయము గలది' అని కారకశబ్దము యొక్క అర్థాన్ని ప్రౌఢవ్యాకరణం వివరించింది.

**కారకబేధాలు :** 'కారకంబు లనం గర్మాదులు' అని సూత్రించిన ప్రౌఢవ్యాకర్త కర్మ మొద లయినకారకాలను ఆరింటిని పేర్కొన్నాడు.

**1. కర్తృకారకము :** 'చేతవర్ణకంబు కర్త కగు' అని కర్తృవాచక మయినశబ్దానికి 'చేత' అనేతృతీయావిభక్తిప్రత్యయం వస్తుంది. ధాత్వర్థవ్యాపారాశ్రయం కర్త. దేవదత్తునిచేత వంటకము వండబడెను. ఇక్కడ చేత అనేతృతీయావిభక్తి కర్త్రర్థంలో వచ్చి కర్తృరూపంలో క్రియతో అన్వయం గలిగిఉన్నది. కాబట్టి 'చేత' అనేతృతీయ కర్తృకారకం.

**2. కర్మకారకము :** కర్మ అయిన కారకం. 'కర్మంబున ద్వితీయ యగు' అని కర్మకు ద్వితీయావిభక్తి వస్తుంది. ధాత్వర్థఫలాశ్రయం కర్మ. దేవదత్తుడు వంటకమును వండెను. ఇక్కడ 'ను' అనేద్వితీయావిభక్తి కర్మార్థంలో వచ్చి కర్మరూపంగా క్రియతో అన్వయిస్తుంది. కాబట్టి ఈ 'ను' ద్వితీయావిభక్తి కర్మకారకం.

**3. కరణకారకము :** కరణం అయిన కారకం కరణకారకం. 'కరణ సహార్థ తుల్యార్థ యోగంబులం దృతీయకుం దోడవర్ణకం బగు' అని కరణానికి 'తోడ' (చేత) అనేతృతీయావిభక్తి వస్తుంది. 'క్రియాసిద్ధిం బ్రకృష్టోపకారకంబు కరణంబు'. కోలతోడ (చేత) కూల్చె. ఇక్కడ తోడ(చేత) అనేతృతీయావిభక్తి కరణార్థంలో వచ్చి కరణరూపంలో క్రియతో అన్వయిస్తున్నది. కాబట్టి ఈతృతీయావిభక్తి కరణకారకం.

**4. సంప్రదానకారకం :** 'సంప్రదానంబునకుం జతుర్థి యగు' అని సంప్రదానానికి చతుర్థీవిభక్తి వస్తుంది. 'త్యాగోద్దేశ్యంబు సంప్రదానంబు నాబడు'. రామునికొఱకు కన్య నిచ్చెను. ఇక్కడ కొఱకు అనేది సంప్రదానార్థంలో వచ్చి, సంప్రదానరూపంలో క్రియతో అన్వయిస్తున్నది. కాబట్టి చతుర్థీవిభక్తి సంప్రదానకారకం.

**5. అపాదానకారకం :** అపాయము మొద లయినువాటివలన కలిగేఎడబాటు అపాదానం. (అపాయ భయ జుగుప్సా- మొద లయినసూత్రంచేత) ఇక్కడ వలన అనేపంచమీవిభక్తిప్రత్యయం వస్తుంది. రాజ్యమువలన భ్రష్టు డయ్యె. ఇక్కడ వలన అనేపంచమి అపాదానార్థంలో వచ్చి, అపాదానరూపంలో క్రియతో అన్వయిస్తున్నది. కాబట్టి ఈ 'వలన' పంచమి అపాదానకారకం.

**6. అధికరణకారకం :** అధికరణంబు నా నాధారంబు. 'అధికరణంబునకు సప్తమి యగు' అని ఇక్కడ సప్తమీవిభక్తి వస్తుంది. ఘటమందు జల మున్నది. ఇక్కడ అందు అనేసప్తమి అధికరణార్థంలో వచ్చి అధికరణరూపంలో క్రియతో అన్వయిస్తున్నది. కాబట్టి సప్తమీవిభక్తి అధికరణకారకం.

**2. ప్రౌఢవ్యాకర్త పేర్కొన్న ఒకవిభక్తికి మ ఱొకవిభక్తి వచ్చేస్థలాలను తెలపండి.**

తెలుగులో ఆయాఅర్థాలలో విధింపబడిన ఆయావిభక్తులకు మాఱుగా వేఱొకవిభక్తి రావటం కొన్నిచోట్ల కనబడుతున్నది.

*ప్రథమ*

**1. ద్వితీయకు:** 'జడంబుద్వితీయకుం బ్రథమ బహుళంబుగా నగు' అని సూరి జడవాచకాలకు పైన ఉన్నద్వితీయకు మాఱుగా ప్రథమావిభక్తి చెప్పగా ప్రౌఢవ్యాకర్త 'కొన్నియెడల నజడంబు ద్వితీయకును ప్రథమ కానంబడియెడి' అని జడాలు గాని శబ్దాలపైన గూడా పయికార్యాన్ని సాధించాడు. అమ్మదనాగ మెదిర్చి (మదనాగమును ఎదిర్చి. మదనాగము – ఏనుగు – తిర్యక్కు కాబట్టి అజడం. అయినా ద్వితీయకు ప్రథమ వచ్చింది. కాని ఈకార్యానికి ఈఒక్కప్రయోగం మాత్రమే లభిస్తున్నది. అందుచేత ఇది విశేషస్థలంగా గుర్తింపదగినది.

**2. సప్తమికి :** 'ఒక్కొకచో జడంబుసప్తమికిం బ్రథమయు నగు' జడశబ్దాలమీద సప్తమీ విభక్తికి ప్రథమావిభక్తి వస్తుంది. 'తీర్థమందు ఆడి ఇక్కడ తీర్థమందు అన్నచోట జడంమీద ఉన్నసప్తమీవిభక్తికి ప్రథమావిభక్తి వచ్చి, తీర్థము ఆడి– తీర్థమాడి అని అవుతుంది. ఇలాగే నెఱంకులాడి మొ.

*ద్వితీయ*

**1. తృతీయాసప్తములకు :** 'కొన్నియెడల నజడంబు తృతీయాసప్తములకును బహుత్వంబున ద్వితీయ చూపట్టెడి' అని సూత్రించాడు. చక్రవాకములతో నలరు. ఇక్కడ సహార్థంలో చక్రవాక అనేతిర్యక్కు అయిన అజడవాచకం మీదవచ్చిన తోడ అనేతృతీయావిభక్తికి ద్వితీయావిభక్తి వచ్చి 'చక్రవాకములను'అలరు అని ప్రయోగింపబడింది.

మనుజులందు విప్రుండు. ఇక్కడ మనుజ అనే మహత్తు అయిన అజడవాచకంమీద నిర్ధారణార్థంలో షష్ఠికి (మనుజులలోపల విప్రుడు) బదులుగా వచ్చిన సప్తమికి ద్వితీయావిభక్తి వచ్చి, 'మనుజులను' విప్రుండు. సూరి 'జడంబుతృతీయాసప్తములకు ద్వితీయ బహుళంబుగా నగు' అనిజడవాచకాలకు పైన మాత్రమే ఈకార్యం చెప్పాడు.

**2. షష్ఠికి** : 'క్రియాన్వయంబున రెండుపదంబులకు స్వస్వామిసంబంధము గలచో సంబంధిపదంబుషష్ఠికి ద్వితీయ యగు' ద్వితీయ కొన్నిచోట్ల షష్ఠీవిభక్తికి మాఱుగా

వస్తుంది. ఉదా. నాయొక్క చెట్టపట్టినన్- ఇక్కడ సంబంధార్థంలో సంబంధిపదానికి షష్ఠీవిభక్తి వచ్చి నాయొక్క అని ఉండగా, ఈసూత్రంచేత షష్ఠికి ద్వితీయ వచ్చి, 'నన్ను' చెట్టవట్టిన అని ప్రయోగింపబడింది.

తృతీయ, చతుర్థి, పంచమీ విభక్తులు వేరొకదానికి రావటం కనబడదు.

## షష్ఠి

**ద్వితీయాదులకు 'కు' షష్ఠి :** 'షష్ఠీస్థానికం బగు కు వర్ణకం బొక్కొక్కచో ద్వితీయాదివిభక్తులకు మాఱుగాఁ దత్తదర్థంబులం జూపట్టెడి' షష్ఠి ఐన కు విభక్తి షష్ఠికంటె ఇతర మైనవిభక్తులకు మాఱుగా వస్తుంది.

1. **ద్వితీయకు** – ఉద్దేశార్థంలో – పొలమున కేగెను. (పొలమును)
2. **తృతీయకు** – తుల్యార్థయోగంలో – చైత్రునకు మైత్రుండు తుల్యుండు (చైత్రునితో)
3. **చతుర్థికి** – సంప్రదానంలో – రామునకు గన్య నిచ్చెను. (రామునికొఱకు)
   ఉద్దేశమాత్రంలో – పురుషార్థమునకు యత్నింపవలె. (పురుషార్థముకొఱకు)
4. **పంచమికి** – అపాదానంలో – చోరునకు భయపడె. (చోరునివలన)
   అన్యార్థాదియోగంలో – రామునకు నన్యంబు దైవంబు లేదు. (రామునకంటె)
5. **యొక్క షష్ఠికి** – సంబంధంలో – నాకు తమ్ముడు (నాయొక్క)

**ప్రథమకు యొక్క :** 'ధాతుజవిశేషణభావార్థకపూర్వ వ్యవహితావ్యవహితకర్తృపద ప్రథమకుఁ దఱచుగ యొక్క షష్ఠి యగు' ప్రథమకు యొక్క అనేషష్ఠీవిభక్తి వస్తుంది. మాపఠింపనిశాస్త్రము– మేము పఠింపని శాస్త్రము. పఠింపని అనేధాతుజవిశేషణంతో యోగంవల్ల నా అనేశబ్దానికి 'భావార్థకాదియోగంబునం గర్తకుం బ్రథమ యగు' అని ప్రథమావిభక్తి వచ్చి, బహుత్వార్థంలో 'మేము' పఠింపని అని ఉండగా ఆప్రథమకు యొక్క అనే షష్ఠీవిభక్తి వచ్చి 'మాయొక్క' పఠింపని. 'యొక్కకులోపంబు బహుళంబు' కాబట్టి యొక్క లోపించి 'మా' పఠింపనిశాస్త్రము.

## సప్తమి

**తృతీయకు 'న' :** 'ఒక్కచో నుదంతం బగునజడంబు తృతీయకును నవర్ణకంబు గానంబడియెడి' అజడవాచకశబ్దాలమీద ఉన్న తృతీయకు 'న' అనే సప్తమి వస్తుంది. 'ఏనుగుతో ఏనుగును' ఇక్కడ కరణార్థంలో ఏనుగు అనేతిర్యక్కు అయిన అజడశబ్దంమీద తోడ అనేతృతీయావిభక్తి వచ్చి 'ఏనుగుతో' అని ఉండగా ఆతృతీయకు మాఱుగా 'న' అనేసప్తమీవిభక్తి వచ్చి, 'ఏనుగున నేనుగు' అని ప్రయోగింపబడింది. ఇటువంటి ప్రయోగ మిం కొకటి లేదు. సూరి 'ఉదంతజడంబుతృతీయకు నవర్ణకం బగు' జడంపైన మాత్రమే ఈకార్యాన్ని అంగీకరించాడు.

## 3. ప్రౌఢవ్యాకర్త పేర్కొన్నవిశేషణలింగవిభక్తివచనాలలోనివిశేషాలను పేర్కొనండి.

**విశేష్యానుగుణం :** 'విశేష్యంబునకుంబోలె విశేషణంబులకు లింగ విభక్తి వచనంబు లగు' విశేష్యం ఏలింగం, ఏవిభక్తి, ఏవచనంలో ఉంటుందో విశేషణం కూడా అదే లింగం, అదే విభక్తి, అదే వచనంలో ఉంటుంది.

రాముఁడు సుగుణాభిరాముఁడు. సీత సుగుణాభిరామ. సుగుణాభిరాములను సీతారాములను. మొ.

కొన్నిచోట్ల విశేషణం లింగవిభక్తివచనాలు విశేష్యంకంటె భిన్నంగా ఉండటం కూడా కనిపిస్తున్నది.

### *1. లింగవ్యత్యాసం :*

**1. మహత్తు – అమహత్కార్యం :** 'మహద్విశేషణ సంఖ్యావాచకంబులకుం గొన్ని యెడల నమహత్కార్యంబు చూపట్టెడి' మహ త్తయినవిశేషణానికి ఆయాస్థలాల్లో మహత్కార్యానికి బదులుగా అమహత్కార్యం వస్తుంది. అసురులు 'అరువదివేలు' మహత్తు అయిన అసురులు అనేదానికి విశేషణం అయిన పదివేయి అనే సంఖ్యావిశేషణానికి మహత్కార్యమే రావాలి. కాని అమహత్కార్యం వచ్చి 'పదివేలు' అని ప్రయోగింపబడింది. మహత్కార్యం వచ్చినపక్షంలో 'అసురులు పదివేవురు' అని ఉంటుంది.

**2. మహత్కార్యం :** 'మహత్సమూహార్థకశబ్దం బమహత్కార్యయుక్తం బయ్యుఁ దద్విశేషణక్రియలు మహత్కార్యయోగ్యంబులు విభాష నగు' విశేష్యం మహత్తే. కాని సమూహార్థకం అయి అమహత్కార్యంతో ఉండగా దానివిశేషణానికి (క్రియకు కూడ) విశేష్యానుగుణంగా అమహత్కార్యానికి బదులుగా మహత్కార్యం రావడం కనిపిస్తున్నది. ఉదా. గీర్వాణగణంబు....చేసిరి, అఖర్వపరాక్రములు...ఉద్ధతులై.

ఇక్కడ అఖర్వపరాక్రములు, ఉద్ధతులు అనేరెండు విశేషణాలు మహత్కార్యాన్ని పొందాయి. అమహత్కార్యం వచ్చినపక్షంలో 'పరాక్రమములు, ఉద్ధతములు' అని ఉండాలి.

## 2. విభక్తివ్యత్యాసం

'విశేష్యవిభక్తికంటె భిన్నంగా విశేషణానికి ఇంకొకవిభక్తి రావటం కొన్నిచోట్ల కనబడుతున్నది.

**1. షష్ఠికి - ప్రథమ :**'ఒక్కచో సమాసాంతర్గతవిశేష్యంబుల కగువిశేషణంబుల షష్ఠికిని బ్రథమ చూపట్టెడి' షష్ఠ్యంతవిశేష్యం సమాసగత మై ఉండగా, విడిగా ఉన్న విశేషణంయొక్క షష్ఠికి కూడా ప్రథమ రావటం కవిప్రయోగాలలో ఉన్నది. ఉదా. 'దేవుఁడు' త్రివిక్రము సొమ్ములు. త్రివిక్రముయొక్క అని విశేష్యం షష్ఠ్యంతం. కాబట్టి విశేషణ మైనదేవశబ్దానికి కూడా షష్ఠి వచ్చి, దేవునియొక్క అని ఉంటుంది. త్రివిక్రము యొక్క అనేవిశేష్యం సమాసంలో ఉండి యొక్క విభక్తి లోపించి, త్రివిక్రముసొమ్ములు అని ఉండగా విశేషణం షష్ఠికి ప్రథమ వచ్చి, 'దేవుడు త్రివిక్రముసొమ్ములు'.

**2. ద్వితీయకు - ప్రథమ :** 'ఒక్కచో ద్వితీయాంతవిధేయవిశేషణంబునకుం బ్రథమయు నగు'. విధేయవిశేషణాలద్వితీయావిభక్తికి ప్రథమావిభక్తి వస్తుంది. 'ఎవ్వనిం బురోహితుఁడు'గా చేకొనువారము. ఎవ్వనిన్ అనేవిశేష్యం ద్వితీయలో ఉంది. కాబట్టి దానికి విశేషణ మైన పురోహిత శబ్దానికి కూడా ద్వితీయావిభక్తి వచ్చి, 'పురోహితునిగా' అని ఉంటుంది. ప్రస్తుతసూత్రంచేత ఆవిధేయవిశేషణం ద్వితీయకు ప్రథమ వచ్చి, ఎవ్వనిని 'పురోహితుడుగా' అని ప్రయోగింపబడింది. ప్రథమ రానిపక్షంలో ద్వితీయతో 'పురోహితునిగా' అని ఉంటుంది

**3. ద్వితీయాదులు - ప్రథమ** : సూరి విశేషణంషష్ఠికి మాత్రమే ప్రథమ చెప్పగా ప్రౌఢవ్యాకరణం 'కొన్నియెడల విశేషణంబు ద్వితీయాదులకుఁ బ్రథమ చూపట్టెడి' అని (అగు మొద లయినవాటితో వ్యవధానం లేకపోయినా) విశేషణంయొక్క ద్వితీయ మొదలుగా అన్నివిభక్తులకు కూడా ప్రథమ వస్తుం దని పేర్కొన్నది. ఉదా : ఘనుల్ ... దైత్యపతులను. ఇక్కడ 'దైత్యపతులను' అని విశేష్యం ద్వితీయ ననుసరించి 'ఘనులను' అని విశేషణానికి వచ్చిన ద్వితీయకు ప్రథమ వచ్చి 'ఘనుల్' అని ప్రయోగింపబడింది. ఇలాగా 'తల్లి' ద్రౌపదితోడన్ (తృతీయకు ప్రథమ.) 'ఆద్యుడు' హిరణ్యగర్భునందు (సప్తమికి ప్రథమ) మొ.

**విశేష్యం - వచనవ్యత్యాసం**

ప్రౌఢవ్యాకరణంలో ఒకచోట విశేష్యానికి వచనంలో మార్పు చెప్పబడింది. 'సంఖ్యాప్రయుక్తవిశేషణ మేకాంతం బయి యమహద్విశేష్యక మయ్యుఁ, దదంశాంతం బయి మహదమహద్విశేష్యక మయ్యు, సమస్తంబు వ్యస్తంబు నగుచో విశేష్యంబు క్రమంబుగ నుత్తరపదంబు నేకవచనాంతంబును, పూర్వపదంబు బహువచనాంతంబు నగు'. ఒకటి, అర, పాతిక మొద లైనశబ్దాలు చివర ఉన్నసంఖ్యావిశేషణాల విశేష్యం బహుత్వార్థంలో ఏకవచనాంతం కావడం విశేషం. డెబ్బదియొక్క రథము. సమాసం కాకపోతే బహువచనాంతం అవుతుంది. రథములు డెబ్బదియొక్కటి. ఇలాగే రెండున్నర రూపాయ, రూపాయలు రెండున్నర.

# 5.సమాసపరిచ్ఛేదం

## 1. ప్రౌఢవ్యాకర్త పేర్కొన్నసమాసవిశేషాలను గూర్చి వివరించండి.

తత్పురుషం, ద్వంద్వం, బహుప్రీహి అనేసమాసాలను వాటిలక్షణాలతోనూ, భేదాలతోనూ చిన్నయసూరి బాలవ్యాకరణంలో వివరించాడు. అందులో స్పష్టం చేయబడనిమటి కొన్ని సమాసవిశేషాలను ప్రౌఢవ్యాకరణం ప్రస్తావించింది.

**కర్మధారయవిశేషాలు :**

తత్పురుషభేద మయినకర్మధారయంలో కొన్ని విశేషాలను ప్రౌఢవ్యాకరణం ఇలా పేర్కొన్నది.

**1. అవ్యయంతో కర్మధారయం :** 'ధాతుజవిశేషణంబులు తథార్థకావ్యయంబు తోడం గర్మధారయం బగు' ధాతుజాలు ఐనవిశేషణాలకు 'తథా' అనేసంస్కృతావ్యయం యొక్క అర్థాన్ని తెలియజేసే 'అట్లు' అనేఅవ్యయంతో కర్మధారయసమాస మవుతుంది. చదువునట్లు, పోయినయిట్లు మొ. దీనినిబట్టి 'అట్లు' అనేది తప్ప మిగిలిన యే అవ్యయంతోనూ కర్మధారయసమాసం ఉండ దని గ్రహింపవచ్చు. అలాగే ధాతుజ విశేషణాలు తప్ప ఇతర మైనయేవిశేషణాలకూ 'అట్లు' అనేదానితో గూడా సమాసం లేదు. కర్మధారయంలో ఉత్తరపదం అవ్యయం కావటం ధాతుజవిశేషణం పూర్వపదం కాగా 'అట్లు' అనేఅవ్యయంతో మాత్రమే.

**2. అవయవితో సమాసం :** 'ఒకానొకచో గుణవాచకధాతుజవిశేషణంబు లవయవవిశేష్యపూర్వకంబు లై యవయవితో సమసించెడి'. కర్మధారయం అంటే విశేషణానికి విశేష్యంతో చేసినసమాసం. గుణవాచకాలూ, ధాతుజా లైన కొన్ని

విశేషణాలు కొన్నిచోట్ల విశేష్య మైన అవయవవాచకంతో సమాసం పొందక, విశేష్యం పూర్వప్రయుక్తం అవుతుండగా, విశేష్యం కానిఅవయువితో, కర్మధారయసమాసాన్ని పొందుతున్నాయి. 'తనువు మీన్పొలవల్చు జాలరిదాన' ఇందులో 'వల్చు' అనేది ధాతుజవిశేషణం. దానివిశేష్యం 'తనువు'. 'మీన్పొల వల్చు తనువు' అని కర్మధారయం కావటం సామాన్యం. కాని యీవిశేషణాన్ని (తనువు) పూర్వంలో ఉంచుకొని 'తనువు' (మీన్పొలవల్చు అనేది) ఆఅవయవం గలిగిన అవయవి అయిన 'జాలరిది' అనేశబ్దంతో సమాసాన్ని పొందింది.

ఇలాగే 'ఒడలు తెల్లనితురగోత్తము' తెల్ల గుణవిశేషణం. ఒడలు విశేష్యం. విశేషణానికి పూర్వంలో ఉన్నది. ఇది (ఒడలు) కలిగిన తురగోత్తమ' మనేశబ్దంతో, అది విశేష్యం గాకపోయినా కర్మధారయం ఐంది.

**3. లుప్తశేషం – మిశ్రసమాసం :** 'క్రొత్తాదులు లుప్తశేషంబులు దేశ్యంబులతోడం బలెఁ దత్సమంబులతోడం గొన్నియెడలం గర్మధారయం బగు' అనేలక్షణంలో లుప్తశేషా లయిన క్రొ(త్త) మొద లయిన ఏకాక్షర లేదా ద్వ్యక్షర శబ్దాలు తత్సమాలతో గూడ సమాసం పొందుతాయి. క్రొంబులకలు మొ.

లుప్తశేషానికి సమాసం చెప్పటం ఇందులో విశేషం.

**1. బిరుదాద్యుత్తరపదకర్మధారయం :** 'కర్మధారయంబు బిరుదాద్యుత్తరపదం బయ్యె నేని ద్వ్యక్షరాదంతస్త్రీపుంసంజ్ఞావాచకం బగుపూర్వపదంబునంత్యాక్షరంబున కంతట దీర్ఘంబు బహుళంబుగా నగు' మొద లైనలక్షణంచేత రామాశాస్త్రి, సుబ్బిశెట్టి, నన్నపార్యుడు మొ. బిరుదాద్యుత్తరపదకర్మధారయాలు ప్రస్తావించబడ్డాయి. 'కర్మధారయం బియ్యది మిశ్రంబు సిద్ధసమాసం బట్ల యగు'.

**2. విశేష్యపూర్వపదకర్మధారయం :** 'తమ్ముఁగుట్టలు చిలుకమొకరి యిత్యాదులు విశేష్యపూర్వపదకర్మధారయంబులు' విశేషణానికి విశేష్యంతో అయినసమాసం కర్మధారయం. ఇందులో విశేషణం పూర్వపదంగానూ విశేష్యం ఉత్తరపదంగానూ ఉంటుంది. అటువంటిసమాసాలు కొన్నింటిలో విశేష్యం పూర్వపద మై, విశేషణం ఉత్తరపద మవుతుంది. కుట్ట లైనతమ్ములు, తమ్ముఁగుట్టలు. విశేష్యం పూర్వపదం కావడంచేత వీటిని విశేష్యపూర్వపదకర్మధారయా లని ప్రౌఢవ్యాకర్త పేర్కొన్నాడు. ఇవే విశేషణోత్తరపదకర్మధాంయా లనీ వ్యవహరింపబడుతుంటాయి.

**3. విశేషణోభయపదకర్మధారయం :** 'ఆయాత్యాదిఘటితంబులు విశేషణోభయపద

కర్మధారయంబులు' ఆ – ఈ మున్నగువిశేషణాలు ఒకటికంటె ఎక్కువ కలిసి విశేష్యంతో సమాసం పొందడం ఉన్నది. ఆయానేరములు – తెలినునుసోగవెన్నెలలు మొ. అనేకవిశేషణాలు ఉన్నకర్మధారయమె విశేషణోభయపదకర్మధారయంగా ఈలక్షణంచేత ప్రౌఢవ్యాకర్త చెప్పదలచుకున్నాడు. 'పూర్వోత్తరపదాలు' రెండూ విశేషణా లయినపుడే యీపేరు తగును అనిపిస్తుంది.

**ద్వంద్వవిశేషాలు :**

**1. క్లీబసమానికి ద్వంద్వం :** 'ఆఛ్ఛికశబ్దంబుతోడ స్త్రీసమంబు ప్రాయికంబుగ ద్వంద్వం బగు' అనేసూరిలక్షణంచేత ద్వంద్వంలో పూర్వపదం స్త్రీసమమే కావాలి.

'ఒకానొకచో ద్వంద్వంబునం బూర్వపదంబు క్లీబసమంబు నగు, అగుచో నాముపర్ణకంబునకు లోపంబు నగు' అని క్లీబసమానికి సైతం ద్వంద్వం కావడాన్ని ప్రౌఢవ్యాకర్త పేర్కొన్నాడు. అందచందములు–వెచ్చసచ్చములు. సూరిసూత్రంలోని ప్రాయికశబ్దంచేత ఇటువంటి అరు దయినసమాసాలను సంగ్రహించుకోవడానికి అవకాశం ఉన్నా, ప్రౌఢవ్యాకరణం స్పష్టం చేయడం మేలె.

**2. మిశ్రద్వంద్వం :** 'ఒకానొకచో ద్వంద్వంబు మిశ్రంబును అందలిపూర్వపదంబు క్లీబసమంబునుగ గానంబడియెడి' అని ప్రౌఢవ్యాకర్త ద్వంద్వంలో మిశ్రసమాసాలను బాలవ్యాకరణంకంటె విశేషంగా ప్రతిపాదించాడు. అవసరమక్కఱలు, ఇటువంటిప్రయోగ మిం కొక్కటి కనబడదు. ఇది కూడా 'మొక్కేము సామి' అనే సందర్భంలో ఉండి అటువంటిదిగా గ్రహింపదగిఉండడం గమనించవలసిఉంది.

**అలుక్సమాసం :**

**నవర్ణకాలుక్సమాసం :** 'చేత, తోడ, వలన, అందు' అలుక్సమాసాలను బాల వ్యాకరణం సందర్భవశంగా చూపింది. 'కొన్నియెడల సప్తమీతత్పురుషమునందు నవర్ణకంబు నగు' అని ప్రౌఢవ్యాకర్త సప్తమీనవర్ణకం లోపింపనిసమాసాలను మార్గాంతరంలో పేర్కొన్నాడు. కువలయంబునవారు, మొ.

**ఉగలుక్సమాసాలు :**

అట్లు, కరణి, పోలె, బలె, వలె మొ. ఇవార్థకాలతోనూ, 'అట్టి, పోని, బోటి, వంటి' అనువదర్థకాలతోనూ ఉగలుక్సమాసాలను ప్రౌఢవ్యాకర్త విశేషంగా ప్రస్తావించాడు. నారాయణునట్లు – నన్ను వంటి మొ.

**2. ద్వంద్వసమాసంలో ప్రౌఢవ్యాకర్త విశేషంగా చెప్పినకార్యాలను తెలపండి.**

'ద్వంద్వంబునం బదంబుపయి పరుషములకు గసడదవ లగు' అని సూరి ద్వంద్వ సమాసంలో గసడదవాదేశాన్ని పేర్కొన్నాడు.

**1. (సదవ) ఆదేశాభావం :** 'కొన్నియెడల ద్వంద్వంబునం బదంబుమీఁది చతపలకు సదవలు గానంబడవు' అని ప్రౌఢవ్యాకర్త ఆదేశం రాకపోవడాన్ని పేర్కొన్నాడు. అందచందములు, కండతుండెములు, రాకపోకలు.మొ.

**2. లోపం :** 'భావద్వంద్వంబునం దొలిపదంబుటవర్ణకంబునకు లోపం బగు' భావార్థకకృదంతశబ్దాలకు జేసినద్వంద్వసమాసంలో మొదటిపదంలో చివరి 'ట' మొదలైనభావార్థక కృత్ ప్రత్యయాలకు లోపం వస్తుంది. చెల్లుటయును చెల్లమియును – చెల్లుచెల్లములు, వినికియును, వినమియును, వినివినములు మొ.

**3. అంత్యావయవలోపం :** 'ద్వంద్వంబునం బూర్వపదాంత్యావయవంబునకు లోపం బొండె నగు' రెండుఅవయవాలు గలిగి, రెండుపదాలలోనూ రెండవఅవయవం సమానంగా ఉన్నపదాలకు ఏర్పడినద్వంద్వసమాసంలో మొదటిపదంలో చివరి (రెండవ) అవయవానికి (వికల్పంగా) లోపం వస్తుంది. పుట్టుగట్టును క్రుంకుగట్టును – పుట్టుగ్రుంకుగట్లు.

**4. దీర్ఘం :** 'కొన్నియెడల మహద్ద్వంద్వంబునం బూర్వపదాంత్యస్వరంబునకు దీర్ఘంబునుం జూపట్టెడు' స్త్రీ పురుషవాచకా లయినశబ్దాలకు కలిగినద్వంద్వసమాసంలో మొదటిపదం చివరిఅచ్చుకు కొన్నిచోట్ల దీర్ఘం వస్తుంది. అన్నాదమ్ములు (అన్న దమ్ములు), అప్పాచెల్లెండ్రు (అప్పచెల్లెండ్రు), తల్లీదండ్రులు (తల్లిదండ్రులు) మొ.

**5. ఏకవచనం :** 'ద్వంద్వం బప్రాణివాచకకృదంతశబ్దఘటితంబేకవచనాంతంబు నగు' ప్రాణం లేనివాటిని బోధించేశబ్దాలకు, కృదంతాలు అయినశబ్దాలకు కలిగిన ద్వంద్వసమాసం చివర బహువచనం రావలసిఉండగా ఏకవచనం రావటం కొన్నిచోట్ల కనబడుతున్నది. కూరగాయ (కూరగాయలు), కూడుగుడ్డ (కూడుగుడ్డలు) మొ.

# తద్ధితపరిచ్ఛేదం

## 1. ప్రౌఢవ్యాకరణం పేర్కొన్నతద్ధితప్రత్యయాలను పేర్కొనండి.

**తద్ధితము :** తస్మై ప్రయోగాయ హితమ్, తద్ధితమ్'. అని దీనివ్యుత్పత్తి. స్వార్థం, మతుబర్థం, మొద లయినఅర్థాలలో ప్రథమ మొద లయినవిభక్తులు చివర కలిగినశబ్దాలమీద చేరే ప్రత్యయాలు తద్ధితాలు. చిఱుతుక. చిఱుత శబ్దంమీద స్వార్థంలో వచ్చిన'ఉక' ప్రత్యయం తద్ధితం.

### 1. త్వార్థం :

'త్వ' అనేసంస్కృతప్రత్యయంయొక్క అర్థం త్వార్థం. అంటే భావార్థం. ప్రకృతిజన్య బోధంబునందు ప్రకారంబు భావంబు. ప్రాతిపదికవలన తెలియబడేవస్తువుయొక్క ధర్మం, భావం. రామునితనము – రామ అనేప్రకృతిచేత బోధింపబడే రాముడు అనేవ్యక్తియొక్క ధర్మం – రామునితనం.

ప్రౌఢవ్యాకరణం త్వార్థంలో ఈతద్ధితప్రత్యయాలను పేర్కొన్నది.

**1. కర వర్ణకం:** 'కరవర్ణకంబు నాయఁకశబ్దమునకు భావంబునం దగు'. నాయఁక అనేఅచ్చతెలుగుశబ్దంమీద త్వార్థంలో కర అనేప్రత్యయం వస్తుంది. సంస్కృతంలోని త్వప్రత్యయంలాగానే షష్ఠ్యంతంమీద అవుతుంది.

నాయఁకునియొక్క భావము అనేఅర్థంలో నాయఁకునియొక్క అనేషష్ఠ్యంతంమీద 'కర'అనేప్రత్యయం వచ్చి. రామునాయఁకునియొక్క కర. 'తద్ధితప్రత్యములు పరంబులగునపుడు పదంబులడువర్ణకాదులకు లోపం బగు' అని యొక్కవిభక్తి, ఆదిశబ్దంచేత ముందరి 'కుని' లోపించి నాయఁకర. 'కృత్తద్ధితసమాసా శ్చ' అని తద్ధితప్రత్యయాంతానికి ప్రాతిపదిక అనేసంజ్ఞ కలుగుతుంది. కాబట్టి దీనిపై ప్రథమాదివిభక్తులు వస్తాయి. తనప్రత్యయాంతం 'ఆచ్ఛికశబ్దంబు లెల్ల' అనేసూత్రంప్రకారం క్లీబసమం. కాబట్టి 'అమహన్నపుంసకములకు' అనేసూత్రంచేత ప్రథమైకవచనంలో ముువర్ణకం వచ్చి – రామునితనము అని అవుతుంది.

**2. కార ప్రత్యయం:** కారవర్ణకంబు చెలినయములకు భావంబునందును, నుడికొలలకు స్వార్థంబునందు నగు. ఈకకారమునకుఁ గొన్నియెడల గకారం బగు' చెలి, నయము అనేశబ్దాలకు మీద భావార్థంలో కార అనేప్రత్యయం వస్తుంది. చెలిశబ్దంమీద కార ప్రత్యయం వచ్చి, చెలికార. కారప్రత్యయాంతం క్లీబసమం. కాబట్టి ప్రథమైకవచనంలో ముువర్ణకం. చెలికారము. నయము శబ్దంమీద కార కకారానికి గకారం కూడా వస్తుంది. నయగారము.

### 2. స్వార్థం :

స్వ-అర్థ. అంటే స్వీయార్థం. స్వార్థం అంటే ఇక్కడ ప్రాతిపదికార్థం. అరమర అనేశబ్దంమీద స్వార్థంలో ఇకవర్ణకం వచ్చి, అరమరిక. అరమర అనే అర్థం. స్వార్థంలో విధింపబడినప్రత్యయాలు స్వార్థికాలు. ఈప్రత్యయాలు ప్రాతిపదికమీద చేరతాయి.

**1. అడ ప్రత్యయం :** 'వేఱున కడవర్ణకంబు స్వార్థంబునం దగు'. వేఱు అనేశబ్దంమీద అదే అర్థంలో 'అడ' అనేప్రత్యయం వస్తుంది. వేఱు+అడ, 'అంద్వ గాగమంబులం దప్ప' అని సంధి జరిగి, వేఱడ. అడ అనేతద్ధితప్రత్యయాంతం క్లీబసమం. కాబట్టి ప్రథమైకవచనంలో 'అమహన్నపుంసకములకు –' అని మువర్ణకం వచ్చి వేఱడము. వేఱు అంటే ఏ మర్థమో, వేఱడము అన్నా, అదే అర్థం.

**2. అడి :** 'వెల్ల కడివర్ణకంబు స్వార్థంబునం దగు'. వెల్ల అనేశబ్దంమీద అదే అర్థంలో అడి అనేప్రత్యయం వస్తుంది. ఈ 'అడి' ప్రత్యయాంతం స్త్రీసమం. కాబట్టి ప్రథమైకవచనం లోపిస్తుంది. వెల్ల-అడి. సంధి జరిగి, వెల్లడి.

**3. ఇడి :** 'తెలివి విరివి వినికి లేమి రాపులకు స్వార్థంబునం దిడివర్ణకం బగు' తెలివి మొద లైనశబ్దాలకు స్వార్థంలో ఇడి అనేప్రత్యయం వస్తుంది. తెలివి+ఇడి. సంధి జరిగి 'తెలివిడి'. తద్ధిత మైన 'ఇడి'ప్రత్యయాంతం స్త్రీసమం. కాబట్టి ప్రథమైకవచనం లోపించి – తెలివిడి. తెలివి అంటే ఏది అర్థమో తెలివిడి అన్నా అదే అర్థం. ఇలాగే విరివిడి, రాపిడి మొ.

**4. ఇత :** 'ఇతవర్ణకం బింపు బిగు పోరులకు స్వార్థంబునం దగు'. ఇంపు, బిగు, పోరు అనేశబ్దాలకు స్వార్థంలో ఇత అనేప్రత్యయం వస్తుంది. ఇంపు అనేశబ్దంమీద అదే అర్థంలో ఇత ప్రత్యయం వచ్చి, ఇంపు-ఇత. సంధి జరిగి ఇంపిత. తద్ధిత మైన ఈ 'ఇత'ప్రత్యయాంతం క్లీబసమం. కాబట్టి ప్రథమైకవచనంలో మువర్ణకం వచ్చి, ఇంపితము. ఇలాగే, బిగితము,

**5. ఇద :** 'ఇదవర్ణకం బొప్పు తప్పు పెల్లులకు స్వార్థంబునందును, క్రొవ్వు బెట్టులకు మతుబర్థంబునందును నగు' ఒప్పు, తప్పు, పెల్లు అనేశబ్దాలకు స్వార్థంలో ఇద అనేప్రత్యయం వస్తుంది. ఒప్పు+ఇద. సంధి జరిగి, ఒప్పిద. ఇదప్రత్యయాంతం క్లీబసమం. కాబట్టి ప్రథమైకవచనంలో మువర్ణకం వచ్చి, ఒప్పిదము. ఇలాగే తప్పిదము, పెల్లిదము.

**6. ఇరి :** 'స్వార్థంబునం దిరివర్ణకంబు వాఁపున కగు' వాఁపు శబ్దంమీద

స్వార్థంలో ఇరి అనేప్రత్యయం వస్తుంది. వాఁపు+ఇరి. అపదాదిస్వరసంధి జరిగి, వాఁపిరి. తద్ధిత మైన ఇరి ప్రత్యయాంతం స్త్రీసమం. కాబట్టి ప్రథమైకవచనం లోపించి, వాఁపిరి.

**7. కార :** 'కారవర్ణకంబు చెలి నయములకు భావంబునందును, నుడి కొలలకు స్వార్థంబునందు నగు. ఈకకారమునకుఁ గొన్నియెడల గకారం బగు.' నుడి, కొల అనేశబ్దాలకు మీద స్వార్థంలో కార అనేప్రత్యయం వస్తుంది. నుడిశబ్దంమీద కార ప్రత్యయం వచ్చి, నుడికార. కారప్రత్యయాంతం క్లీబసమం. కాబట్టి ప్రథమైకవచనంలో మువర్ణకం. నుడికారము. కొలశబ్దంమీద కార కకారానికి గకారం కూడా వస్తుంది. కొలగారము.

**8. మిరి :** 'చలికి మిరివర్ణకంబు స్వార్థంబునం దగు' చలి అనేశబ్దంమీద స్వార్థంలో మిరి అనేప్రత్యయం వస్తుంది. చలి+మిరి. చలిమిరి. తద్ధిత మైన మిరి ప్రత్యయాంతం స్త్రీసమం. కాబట్టి ప్రథమైకవచనం లోపించి – చలిమిరి.

### 3. మతుబర్థం :

**మతుబర్థము,మత్వర్థము:** మతుప్ అనేసంస్కృతప్రత్యయంయొక్క అర్థం (మతుప్–అర్థ) మతుబర్థం. లేదా (మతు–అర్థ) మత్వర్థం. 'త ద స్యా స్త్యస్మి న్న స్తీతిమతుప్' అని యిది సంస్కృతంలో అస్త్యర్థంలో విధింపబడింది. కలది, కలవా డని స్థూలంగా దీనిఅర్థం. అందగత్తియ. (అందము కలది) ఆటగాడు.(ఆట కలవాడు.)

**1. అ ప్రత్యయం :** 'చెడుగు దుడుకు నిడుపులకుఁ బుంస్త్వర్థంబున మతుబర్థం బకారం బగు' చెడుగు, దుడుకు, నిడుపు అనేశబ్దాలకు పైన మతుబర్థంలో పురుషుడిని బోధించేసందర్భంలో 'అ' అనేప్రత్యయం వస్తుంది. అ ప్రత్యయాంతం మగాదులలోనిది కాబట్టి ప్రథమైకవచనంలో ఉత్వం రాకుండా డుజ్ మాత్రమే వస్తుంది. చెడుగు అనేశబ్దంమీద చెడుగు కలిగినపురుషుడు అనేఅర్థంలో ఈసూత్రంచేత అ ప్రత్యయం వచ్చి, చెడుగు+అ. అపదాదిస్వరసంధి జరిగి, చెడుగ. 'మహత్తు లగుమగాదులకుం గయిరాదులకు డు జగు, నుత్వంబు గాదు' అనేసూత్రంచేత ప్రథమైకవచనంలో డుజ్ వచ్చి, చెడుగఁడు. ఇలాగే దుడుకఁడు, నిడుపఁడు.

**2. ఇద :** 'ఇదవర్ణకం బొప్పు తప్పు పెల్లులకు స్వార్థంబునందును, క్రొవ్వు బెట్టులకు మతుబర్థంబునందును నగు' క్రొవ్వు, బెట్టు అనేశబ్దాలకు మతుబర్థంలో

ఇద అనేప్రత్యయం వస్తుంది. క్రొవ్వు+ఇద. సంధి జరిగి, క్రొవ్విద. ఈ ఇదప్రత్యయాంతం క్లీబసమం. కాబట్టి ప్రథమైకవచనంలో ముమవర్ణకం వచ్చి, క్రొవ్విదము. క్రొవ్వు కలిగినది అని అర్థం. ఇలాగే బెట్టిదము.

**3. న :** 'ఒకానొకచో మతుబర్థంబున నవర్ణకంబు చూపట్టెడి' అరుదుగా కొన్నిశబ్దాలమీద మతుబర్థంలో న అనేప్రత్యయం వస్తుంది. దివ్యతేజంబు కలవాడు అనేఅర్థంలో దివ్యతేజంబు అనేప్రథమైకవచనాంత మైనశబ్దంమీద ఈసూత్రంచేత న ప్రత్యయం వచ్చి( కవిప్రయోగానుసారంగా ముందరిప్రథమైకవచనవిభక్తి లోపించక) దివ్యతేజంబున అని అవుతుంది. (కవిప్రయోగానుసారంగానే) తద్ధిత మైన ఈ న ప్రత్యయాంతశబ్దంమీద విభక్తివివక్షలో తచ్ఛబ్దం అనుప్రయుక్త మై, దానిమీద ప్రథమాదివిభక్తులు వస్తాయి అని ఊహించాలి. మహదర్థంలో దివ్యతేజంబునవాఁడు. (అమహదర్థంలో దివ్యతేజంబునది.) మొ.

**5. ప్రాచుర్యార్థం :**

**మయట్ ప్రత్యయం :** 'ప్రాచుర్యార్థంబునం దెనుఁగుపదంబులమీఁదను మయట్ ప్రత్యయము చూపట్టెడు' సంస్కృతం అయిన మయట్ అనే ప్రత్యయం ప్రాచుర్యం (అధికం) అనేఅర్థంలో అచ్చతెలుగుశబ్దాలమీద కూడా కవిప్రయోగాలలో కనబడుతున్నది. ఇది షష్ఠ్యంతంమీద వస్తుంది. మయ ప్రత్యయాంతం క్లీబసమం. కాబట్టి ప్రథమైకవచనంలో ముమవర్ణకం వస్తుంది. తనయొక్క అనేశబ్దంమీద అధికం (తనతో నిండినది) అనేఅర్థంలో మయ ప్రత్యయం వచ్చి, ముందరిషష్ఠీవిభక్తి లోపించి, తనమయ. దీనిపై ప్రథమైకవచనంలో ముప్రత్యయం వచ్చి, తనమయము. ఇలాగే ప్రోవులమయము మొ.

# కృదంతపరిచ్ఛేదం

## ప్రౌఢవ్యాకర్త పేర్కొన్న కృత్ప్రత్యయాలను గూర్చి తెలపండి.

**కృత్తు :** ధాతువుకంటె విధింపబడిన 'దుఞ్ఞ' అనేదానికంటె భిన్న మైన ప్రత్యయానికి కృత్తు అని పేరు. భావం, కర్మం, మొద లైన ఆయాఅర్థాలలో ఈప్రత్యయాలు వస్తాయి. ఆఅర్థం లక్ష్యాల ననుసరించి తెలియవలసిఉంది.

ప్రౌఢవ్యాకరణం పేర్కొన్న కృత్ప్రత్యయాలు ఈవిధంగా గ్రహింపవచ్చు.

| సూత్రం | కృత్తు | కృదంతం |
|---|---|---|

1. డయ్యు, దయ్యు, నొచ్చు, పుచ్చుల కివర్ణకం బగు.
అగుచో వానికడహల్లులు పకారంబు లగు. ఇ దప్పి
2. రాయున కిడి వర్ణకంబు నగు. ఇడి రాయిడి
3. ఈర్చుబ్బుకందుదువ్వవడ్డించుల కెన వర్ణకం బగు.
అగుచో ఈర్చుబ్బుల చకారబకారంబులు పకారంబు లగు, ఎన ఈర్పెన,ఉప్పెన
వడ్డించునించు లుప్తం బగు. వడ్డెన
4. పురవర్ణకంబు కాఁపు దాఁచు దాయ్యాదుల కగు. పుర కాపురము
5. ఎక్కు దిగులకుం బ్రేరణార్థంబున మతివర్ణకం మతి దిగుమతి
బగు. అగుచో ఎగు ఎక్కున కాదేశం బగు. ఎగుమతి
వ ఎగువ
6. వువర్ణకం బులియ్యాదుల కగు. వు ఉలివు
7. కాచువీచులకు వలివర్ణకం బగు వలి – కావలి,వీవలి

# వాక్యపరిచ్ఛేదం

## 1. పదం అంటే ఏమిటో నిర్వచించి పదంలో భేదాలను వివరించండి.

పదసంజ్ఞను సూరి వివరింపలేదు. 'సుప్తిఙంతమ్ పదమ్' అనేసంస్కృతలక్షణాన్ని అనుసరించి తెలియాలి. ప్రథమ మొద లైననామవిభక్తులు చివర ఉండేశబ్దం సుబంతం. రాముఁడు, సీత మొ. డుఙ్, రు మొ. క్రియావిభక్తి చివర కలిగినశబ్దం తిఙంతం. ఘటించుచున్నాఁడు, ఘటించున్ మొ. దీనివలన సుప్తిఙంతాలు కాని – ప్రాతిపదికలు, ధాతువులు ప్రత్యయాలు మొద లైనవాటికి పదం అనేసంజ్ఞ ఉండదు. రామ, తిను, డుఙ్ మొ.అపదాలు అవుతాయి. 'అపదం న ప్రయుఞ్జీత' అనటంచేత పదం కానిశబ్దం ప్రయోగించటానికి అర్హం కాదు. 'పద మనఁగాఁ బ్రయోగార్హంబు, ననన్వితంబు, నేకంబు, నర్థబోధకంబు నైనవర్ణము లేక వర్ణసముదాయము' అని ప్రౌఢవ్యాకరణం చెప్తున్నది. ప్రయోగించటానికి అర్హ మై, వేరొకదానితో అన్వయం కలిగిఉండక, ఒక్కటి ఐ, అర్థవంత మైఉన్నవర్ణం లేదా వర్ణాలసమూహానికి పదం అని పేరు. రాముఁడు ఇది సుబంతం. కాబట్టి ప్రయోగించటానికి అర్హం. మ

రొకశబ్దంతో అన్వయించటం లేదు. ఒక్కటిగా ఉన్నది. దశరథాపత్యం అనేవిధంగా అర్థవంతం. కాబట్టి ఈవర్ణసముదాయానికి పదం అనేసంజ్ఞ కలుగుతున్నది.

రామ–డు మొద లైనప్రకృతి, ప్రత్యయాదులు ప్రయోగింపబడవు. కాబట్టి వాటికి పదం అనేసంజ్ఞ ఉండదు. 'ఖంబు' ఘటంబున దోఁచెడి' అన్నపుడు అన్వయం గలిగిఉండటంచేత దీనిమొత్తానికి పదసంజ్ఞ ఉండదు. ఖంబు, ఘటంబున, అనేసుబంతాలు, తోఁచెడి అనేతిజంతమూ వేర్వేరుగా పదా లవుతాయి. 'ఖంబును, ఘటంబును' అనేకం కావటంచేత ఇది మొత్తం కలిసి పదం కాదు. 'ఖంబును' అని ఏక మై ఉన్నది పదం. ఇలాగే ఘటంబును. క–చ–ట– మొదలుగా ఏఅర్థాన్ని బోధించనిశబ్దం పదసంజ్ఞను పొందదు.

నిజానికి 'సుప్తిఙంతమ్ పదమ్' అనేలక్షణం అభిప్రాయమే ఇక్కడ వివరింపబడినట్లు ఉన్న దనవచ్చు. 'ప్రయోగార్హంబు' అనేదళం ఈలక్షణాన్ని అనుసరించిఉన్నది.

**భేదాలు:** 'పదము లవి నామంబులు క్రియ లవ్యయంబు లని త్రివిధంబులు' 1. నామాలు. 2. క్రియలు. 3. అవ్యయాలు. అని పదాలు మూడు విధాలు.

**1. నామాలు:** 'నామములు నా వస్తువాచకశబ్దములు'. ఏ దైన వస్తువును బోధించేశబ్దానికి నామం అని పేరు. ఇది ధాత్వర్థవ్యాపారాశ్రయ మైతే కర్త. ధాత్వర్థ ఫలాశ్రయ మైతే కర్మ. రాముడు, రావణుడు. మొ. ఇవి ఇంకా ఆయాలక్షణాలనుబట్టి విశేష్యాలు, విశేషణాలు ఇత్యాదిగా వ్యవహరింపబడతాయి. ఇవి అన్నీ నామభేదాలే. ప్రాతిపదిక అయిన నామసంజ్ఞ కంటె ఇది భిన్నంగా గ్రహించాలి. ప్రౌఢవ్యాకరణంలోని ఈపదవిభాగంలో కొంత ఆంగ్లవ్యాకరణప్రభావం ఉన్నట్లు విమర్శకులు పేర్కొంటారు.

**2. క్రియలు:** 'క్రియ లనఁగా వ్యాపారావబోధకము లయినవి'. వ్యాపారాన్ని అంటే పనిని బోధించేవి క్రియలు. ఇవి రెండు విధాలు.

**1. సకర్మకం:** కర్మ గలిగినది సకర్మకం. కర్మనుగూర్చినఆకాంక్ష కలిగినక్రియ సకర్మకం. (అన్నమును) తిను, (పుస్తకమును) చదువు మొ.

**2. అకర్మకం:** కర్మ లేనిది అకర్మకం. కర్మను గూర్చినఆకాంక్ష లేనిక్రియ అకర్మకం. పోవు, సంతోషించు. మొ.

**3. అవ్యయాలు:** 'అవ్యయము లనఁగా లింగవిభక్తివచనశూన్యములు'. అన్ని లింగాలలో (మహదమహదర్థాలలో) అన్ని విభక్తులలోను, అన్ని వచనాలలోను

ఎటువంటిమార్పు పొందక నిలిచిఉండేశబ్దం అవ్యయం.

**1. ప్రతిపదోక్తాలు:** 'ప్రకృతిసిద్ధములు ప్రతిపదోక్తాలు'. ప్రకృతిచేతనే అంటే పుట్టుకచేతనే అవ్యయాలు అయినశబ్దాలు ప్రతిపదోక్తాలు. ఆహా, ఓహో మొ.

**2. లాక్షణికాలు:** 'లక్షణసిద్ధములు లాక్షణికములు'. శబ్దశాస్త్రంచేత సిద్ధించిన అవ్యయాలు లాక్షణికాలు. క్త్వా, తద్వ్యతిరేక ఆద్యర్థకాలు అయిన అసమాపకక్రియలు మొద లైనవి వ్యాకరణంచేత సాధింపబడినవి. అవి లాక్షణికావ్యయాలు. పలికి, వచించుచున్.

## 2. వాక్యాన్ని గురించి వివరించి వాక్యభేదాలను పేర్కొనండి.

**వాక్యం :** వాక్యలక్షణాన్ని చిన్నయసూరి పేర్కొనలేదు. ఆలంకారికమతానుసారంగా ప్రౌఢవ్యాకర్త పేర్కొన్నాడు.

**1. పదసముదాయం:** 'వాక్యము నా యోగ్యతాకాంక్షాసహితం బగునర్థము గల యాసత్తియుక్త పదసముదాయంబు'. పదాలసముదాయం వాక్యం. ఆపదాలు శబ్ద, అర్థ స్వరూపాలలో కొన్ని నియమాలు కలిగి ఉండాలి.

**ఆసత్తి:** పదాల(శబ్ద)స్థితిలో ఆసత్తి ఉండాలి. ఆసత్తి అంటే పదాల చేరిక. వాక్యంలో పదాలు అన్నీ ఒకదానివెంట ఒకటి చేరిఉండాలి. దేవదత్తుడు పోవు చున్నాడు. ఇందులో దేవదత్తుడు అనేపదాన్ని ఉచ్చరించినతరువాత ఎప్పుడో 'పోవుచున్నాడు' అనేపదాన్ని ఉచ్చరిస్తే ఆపదాలకు ఆసత్తి ఉండదు. కాబట్టి ఆపదాల సముదాయం వాక్యం కాదు.

అలాగే ఈపదాలఅర్థంలో యోగ్యత, ఆకాంక్ష అనేలక్షణాలు ఉండాలి.

**యోగ్యత:** 'యోగ్యత యనఁగా పదార్థములకు పరస్పరసంబంధమునందు బాధ గలుగకుండుట'. పదసముదాయంలో వాని అర్థాలు పరస్పరం ఒకదానితో ఒకటి అన్వయించటంలో బాధ లేకుండాలి. నిప్పుతో కాల్చుచున్నాడు. ఇక్కడ నిప్పు కాలుస్తుంది కాబట్టి ఇక్కడ ఈపదాల అర్థం ఒకదానితో తరువాతిది అన్వయించటంలో బాధ లేదు. అలా బాధ లేకపోవటాన్ని యోగ్యత అంటారు. నిప్పుచే తడుపుచున్నాడు అంటే నిప్పుకు తడపటం అనేలక్షణం లేకపోవటంచేత ఈపదాలఅర్థానికి అన్వయంలో బాధ గలుగుతున్నది. కాబట్టి ఇక్కడ యోగ్యత లేదు. (అందుచేత ఈపదసముదాయం వాక్యం కాదు.)

**ఆకాంక్ష:** 'ఆకాంక్ష అనఁగా నిలుపుదల లేక పయిఁ బయిఁ బోయెడిపదార్థముల

మీఁదియాదరము'. ఒకపదంయొక్క అర్థం తెలిసినవెంటనే ఆతరువాతిఅర్థాన్ని తెలియాలి అనేకోరిక ఆకాంక్ష. 'గోవు-గుఱ్ఱము'. అర్థానికి పరస్పరం సంబంధం లేకుండా పదాలను కూర్చితే ఆకాంక్ష లేకపోవటంచేత ఆపదసముదాయం వాక్యం కాదు. గోవు వచ్చెను, గుఱ్ఱము పోయెను అనేరీతిగా ఆకాంక్ష తీరేవిధంగా కూర్చిన పదసముదాయం వాక్యం అవుతుంది.

ఎవరు వచ్చిరి? రాముడు. అన్నపుడు రాముడు అని ఒక్కపదమే ఉన్నా, 'వచ్చెను' అనే క్రియ అధ్యాహరింపబడుతుంది. అలాగే రాముడు వచ్చెనా? వచ్చెను. దేవదత్తు డేమి వండెను? అన్నము. మొద లైనస్థలాలలో కర్త, కర్మ, మొ. అధ్యాహరింపబడతాయి. కాబట్టి పదసముదాయం వాక్యం అని చెప్పబడిఉంటుంది.

**2. విషయబోధకం:** 'విషయబోధకము వాక్యము' అని వాక్యానికి ప్రౌఢవ్యాకర్త మరిఒక లక్షణాన్ని పేర్కొన్నాడు. విషయాన్ని బోధించేది వాక్యం.

**విషయం:** 'ఉద్దేశ్యవిధేయభిన్నంబు విషయంబు' ఉద్దేశ్యవిధేయాలతో కూడినది విషయం. దేనిని గూర్చి చెప్పబడుతుందో అది ఉద్దేశ్యం. విశేష్యం మొద లైనవి ఉద్దేశ్యాలు. (దానినిగురించి) ఏమి చెప్పబడుతుందో అది విధేయం. క్రియ మొద లైనవి విధేయాలు. ఈరెండూ కలిసినది విషయం. దానిని బోధించేది వాక్యం.

'వాగ్భూషణమే సుభూషణము' ఇందులో 'వాగ్భూషణం' గురించి చెప్పబడు తున్నది. కాబట్టి అది ఉద్దేశ్యం. దానినిగురించి 'సుభూషణం' అని చెప్పబడుతున్నది. కాగా ఇది విధేయం. ఈరెండింటితో గూడిన పైపదసముదాయం 'వాగ్భూషణమే సుభూషణము' అనేది విషయబోధకం కాబట్టి వాక్యం అవుతుంది.

**వాక్యభేదాలు:** వాక్యాలలో 'కొన్ని క్రియాన్వయము కలవి,కొన్ని తదితరాన్వయము కలవి. అని ప్రౌఢవ్యాకరణం ముందుగా ఒకభేదం చెప్పింది.

**1. క్రియాన్వయవాక్యాలు:** క్రియలు అంటే లట్ మొ. లకారాలు చివర కలిగిన వర్తమానం మొద లైనఅర్థాలను తెలియజేసే సమాపకక్రియలు. ఇటువంటి సమాపకక్రియలతో అన్వయం కలిగినవాక్యం క్రియాన్వయవాక్యం. 'అవివేకి చెడున్.' చెడున్ అనే సమాపకక్రియతో అన్వయం కలిగిఉండటంచేత ఇది క్రియాన్వయవాక్యం.

**2. క్రియేతరాన్వయవాక్యం:** క్రియలకంటె వే రైన విశేష్యం, విశేషణం మొ. నామపదాలతో అన్వయం గలిగినవాక్యం క్రియేతరాన్వయవాక్యం. 'వాగ్భూషణమే సుభూషణము' ఇక్కడ 'సుభూషణము' అనేక్రియేతర(విశేష్య)ంతో అన్వయం కలిగిఉండటంచేత ఇది క్రియేతరాన్వయవాక్యం.

అసమాపకక్రియలను క్రియాభేదంగా గుర్తిస్తే క్రియాన్వయవాక్యం రెండువిధా లవుతుంది.

**1. సంపూర్ణవాక్యం:** 'సమాపకక్రియలు గలవాక్యము సంపూర్ణవాక్యము. 'లడాది లకారాలు చివర గలిగినవి సమాపకక్రియలు. అవి కలిగినవాక్యం సంపూర్ణవాక్యం. 'నలుడును దమయంతి దోడ్కొని వెలువడియె'. 'వెలువడియె' అని లిడంత మైనసమాపకక్రియాపదం కలిగినఈవాక్యం సంపూర్ణవాక్యం.

**2. అసంపూర్ణవాక్యం:** 'అసమాపకక్రియలు గలవాక్యము అసంపూర్ణము' క్త్వార్థకాలు మొద లైనవి అసమాపకక్రియలు. ఇటువంటిక్రియలు గలిగినవాక్యం అసంపూర్ణవాక్యం. 'నలుడును దమయంతి దోడ్కొని'. 'తోడ్కొని' అనే (క్త్వార్థక - భూతకాలిక) అసమాపకక్రియ గలిగినఇది అసంపూర్ణవాక్యం.

**మహావాక్యం:** 'వాక్యసముదాయము మహావాక్యము నాఁబడు. అయ్యది రామాయణాదికము' మహావాక్యం వాక్యభేదం కాదు. ఇంక వాక్యసమూహానికి మహావాక్యం అని పేరు. రామాయణం మొ.

## 3. అన్వయం అంటే ఏమిటో వివరించి అందులో భేదాలను పేర్కొనండి.

**అన్వయం:** 'పదములకుఁ బరస్పరము గలసంబంధ మన్వయ మనంబడు' వాక్యంలో ఉన్నపదాలకు ఒకదానికి మరొకదానితో ఉన్నసంబంధాన్ని అన్వయం అంటారు. 'రాముడు రావణుని చంపెను' ఇక్కడ రాముడు అనేది కర్తగాను, రావణుని అనేది కర్మగాను, మొదలుగా పదాలు అన్నీ పరస్పరం సంబంధం కలిగిన ఉన్నాయి. ఇటువంటిసంబంధాన్నే అన్వయం అంటారు.

**సమాసం-అన్వయవిశేషాలు:** సమాసంలో ఇటువంటిఅన్వయంలో కొన్ని విశేషాలును ప్రౌఢవ్యాకర్త ఇలా పేర్కొన్నాడు.

**1. సమస్తానికి వ్యస్తంతో :** 'ఒక్కొకచో సమాసగతపూర్వపదంబు వ్యవహితోత్తరపదం బొంటితోడను, వానిపెక్కింటితోడను నన్వయించెడి'. 'రాహుకంఠము దెగి దేహము ధరణిఁ బడియె' రాహుకంఠము' అనేసమాసంలో పూర్వపదం ఐన రాహు(యొక్క) అనేది ఆసమాసానికి తర్వాత ఉన్న 'తెగి' అనేదానితో వ్యవధానం కలిగిఉన్న 'దేహము' అనేదానితో అన్వయించి రాహు(యొక్క) దేహము అని అర్థం ఇస్తుంది. ఈఉదాహరణం 'గొంతిసంకటపాటు కోడలిబన్నంబు' (గొంతికోడలి) అనేదానితో

పోలిక గలిగిఉంది.

**2. వ్యస్తానికి సమస్తంతో :** 'కొన్నియెడల సిద్ధసమాసమధ్యగతపదంబులతోఁ దద్భిన్నపదంబుల కన్వయంబు చూపట్టెడి'. 'అందొకటిచే జనితాధరపీడ యై' జనితాధరపీడ అనేసిద్ధసమాసంలోని (పీడతో కాక) జనిత అనేశబ్దంతో ఆసమాసంలో కాక, వేరుగా ఉన్న 'ఒకటిచే' అనేశబ్దానికి అన్వయం. 'వారి అస్మదీయోరుచమూ సమూహములు'. అన్నపుడు వారి ఉరుచమూసమూహములు, అస్మదీయ ఉరుచమూ సమూహములు అని అన్వయం. (పార్థివప్రాగ్రసరుండు ... ధర్మసుతుపన్పు' ఇత్యాదులలో కూడ ఇటువంటి అన్వయం గుర్తింపవచ్చు.)

**కులకము:** 'కులకం బనఁగాఁ బద్యమునకుఁ బద్యాంతరముతో నన్వయము' పద్యంలో వాక్యార్థం (అన్వయం) అక్కడ ముగియకుండా, తరువాతిపద్యంలోకి కొనసాగితే అది తెలుగులో కులకం అనబడుతుంది.

తా నొకపండు చెచ్చెరన్, కొనివ్రచ్చుడు'. చెచ్చెరన్ అనుపద్యం ముగియగా కొనివ్రచ్చుడు అనేతరువాతిపద్యంలోని కన్వయం కలగటంచేత ఇది కులకం. రెండుపద్యాలకె 'కులకం' అనటం సంస్కృతంకంటె తెలుగులో విశేషం.

## 4. అధ్యాహారం అంటే ఏమిటో వివరించి అందులో విశేషాలను పేర్కొనండి.

**అధ్యాహారం:** 'ఆకాంక్షావిషయపదానుసంధానము అధ్యాహారము' వాక్యంలో ఆకాంక్షిత మైనఅర్థాన్ని ఇచ్చేపదం ప్రయుక్తం కానపుడు దానిని తెచ్చుకోవటం అధ్యాహారం. 'నన్ను జూచి నగరె.' ఎవరు? అని ఆకాంక్షిత మైనకర్తృపదం ఈవాక్యంలో ప్రయోగింపబడలేదు. కాగా దానిని (జనులు) తెచ్చుకొని అన్వయించుకోవాలి. ఇలా అన్వయంకోసం వాక్యంలో లేనిపదాన్ని తెచ్చుకోవటం అధ్యాహారం. ఇలా తెచ్చుకోవలసినపదాలు అధ్యాహార్యాలు. ఇలాటివాటిని కొన్నిటిని ప్రౌఢవ్యాకరణం నిరూపించింది.

**1. తదాదులు:** 'కొన్నియెడలఁ దదాదులు విశేషణంబు లధ్యాహార్యంబు లగు' కొన్ని వాక్యాలలో ఆ-ఈ మొద లైనవిశేషణరూపాలు అధ్యాహారం చేసుకోవలసిఉంటుంది. 'కలకంఠకంఠి కన్నీ రొలికిన సిరి యింట నుండ నొల్లదు'. ఇక్కడ 'ఇంట నుండ నొల్లదు' అంటే 'ఆఇంట నుండ నొల్ల' దని 'ఆ' అనేవిశేషణం అధ్యాహారం చేసికోవాలి.

**2. సంబంధిపదాలు:** 'కొన్నియెడల సంబంధంబునం బూర్వవాక్యంబునందలిపదం బధ్యాహార్యం బగు'. కొన్ని వాక్యాలలో సంబంధార్థంలో అంతకు పూర్వం ప్రయుక్త మైన సంబంధిపదం ఆతరువాతిచోట అధ్యాహారం చేసుకోవలసిఉంటుంది. దానవేశ్వరునకుఁ దమ్ములకు' ఇక్కడ రెండవచోట 'తమ్ములకు' అన్నచోట 'ఎవరి తమ్ములకు' అనేఆకాంక్షలో అంతకు పూర్వం ప్రయోగింపబడిన దానవేశ్వరునకు అనేదానినిబట్టి దానవేశ్వరుని(యొక్క) తమ్ములకు అని అన్వయం. దానవేశ్వరునకు అతనితమ్ములకు అని అర్థం.

**3. న్యూనవచనాలు:** 'న్యూనవచోవాక్యంబునఁ దద్వచనంబు లధ్యాహార్యంబు లగు'. ఐన, ఏని, మొద లైనవి న్యూనవచనాలు. ఇవి అవసర మైఉండి కూడా ప్రయోగింపబడకపోతే అక్కడ ఆపదాలు అధ్యాహారం చేసికోవాలి. 'ఎత్తెఱఁగున ధర్మక్రియఁ జిత్తంబునఁ జేర్పవలయు' 'ఎత్తెఱఁగున నైన, లేదా ఎత్తెఱఁగున నేని' అనేవిధంగా ఈవాక్యంలో ఐన, లేదా ఏని అనేన్యూనవచనాలు అధ్యాహార్యాలు.

**4. కర్త, కర్మ, క్రియ:** 'కొన్నియెడలఁ గర్తృకర్మక్రియ లధ్యాహార్యంబు లగు'. కొన్ని వాక్యాలలో కర్త, కొన్ని వాక్యాలలో కర్మ, మఱి కొన్నివాక్యాలలో క్రియ అధ్యాహారం చేసుకోవాలి. 'నన్నుఁ జూచి నగరె'. ఇక్కడ 'జనులు నగరె' అనేతీరుగా 'జనులు' అనేకర్త అధ్యాహార్యం. 'దవదహనం బుదగ్రతరుదాహము చేయుచు నున్నఁ జూచి'. ఇక్కడ 'దాహము చేయుటను జూచి' అనేవిధంగా కర్మ అధ్యాహార్యం. అక్కడ నెవ రున్నారు? రాముఁడు. ఇక్కడ రాముడు 'ఉన్నాడు' అనేతీరుగా ఉన్నాడు అనేక్రియ అధ్యాహార్యం.

ఇలా ఆయాసందర్భాలలో కవిప్రయోగానుగుణంగా అధ్యాహారం అవసరం కావటంచేత అథర్వణుడు అంగీకరింపకపోయినా, వీటిని ప్రౌఢవ్యాకర్త కవిప్రయోగానుగుణంగా నిరూపించాడు.

00000000000

.

# సామాన్యవిషయాలు

## 1. ప్రౌఢవ్యాకరణరచనాప్రణాళికను గురించి తెలపండి.

ఆధునికాంధ్రవ్యాకరణాలలో బాలవ్యాకరణానికి తర్వాత ప్రౌఢవ్యాకరణం పేరు ప్రసిద్ధం. బాలవ్యాకరణంతోటిసంబంధమూ, ప్రౌఢవ్యాకరణం అనేపేరూ, దీనిప్రసిద్ధికి కారణాలు కావచ్చు.

### త్రిలింగలక్షణశేషం

సీతారామాచార్యులుగారు తమయీలక్షణగ్రంథంపేరు గ్రంథపీఠికలోనూ, పరిచ్ఛేదాంతగద్యలలోనూ త్రిలింగలక్షణశేషం అని మాత్రమే పేర్కొనడం కనబడుతుంది. త్రిలింగలక్షణం అంటే తెలుగువ్యాకరణం. కాబట్టి త్రిలింగలక్షణశేషం అంటే తెలుగువ్యాకరణంలో మిగిలింది. ఈపేరునుబట్టి తనకు పూర్వంలోని తెలుగువ్యాకరణాలలో చెప్పగా మిగిలినలక్షణం ఇందులో గ్రంథకర్త చెప్పదలుచుకున్నాడు అనాలి.

**రచనాలక్ష్యం :** 'భారతాదిగ్రంథపరిశోధనంబుచే దొరకినవిశేషలక్షణ ప్రయోగముల నేర్చి కూర్చి త్రిలింగలక్షణశేషం బనునొకయపూర్వవ్యాకరణము

దీని వ్రాసితిని'. అని గ్రంథకర్త పీఠికలో చెప్పాడు. కాగా కవిప్రయోగాలలోని విశేషాలను లక్షణబద్ధం చేయడం ఈగ్రంథరచనాలక్ష్యం.

**అసాధారణలక్షణం :** 'ఇందలిలక్షణము లసాధారణములు' అని ప్రౌఢవ్యాకర్త పేర్కొన్నాడు. బాలవ్యాకరణం భాషాసామాన్యలక్షణం తెలుపుతూ, సాధారణలక్షణం కాగా కవిప్రయోగాలలోని అరు దైనవిశేషాలు అంటే అసాధారణలక్షణాలు ప్రౌఢవ్యాకరణం తెలుపుతుంది. అందుకే ఇందులోనిలక్షణాలు అసాధారణాలు ఐనాయి. ఈఅసాధారణత కవిప్రయోగాలమూలంగా కలిగిం దని తెలియాలి.

**రచనాప్రణాళిక :** సంస్కృతసంప్రదాయానుసరణం, సంజ్ఞాదు లైనఅంశాలలో చింతామణి, బాలవ్యాకరణాలమార్గంలో వాటికి శేషగ్రంథంగా ఇది రచింపబడింది.

**చింతామణిశేషం :** చింతామణి అభిప్రాయాలను వివరించేసందర్భాలను పరిశీలిస్తే ఇది చింతామణిని అనుసరించినగ్రంథంగా తెలియవచ్చు.

'ఊరుచోటుమేన్వాదు లున్లుగ్విషయంబులు.' ఇక్కడ 'ఉన్లుక్' అనేఅంశం 'కేషాంచి దుదంతానాం నేతి విభక్తా వునో లుక్ స్యాత్' అనేచింతామణిలక్షణం లేక అర్థం కాదు. ఇలాంటిలక్షణాలు చింతామణికి వ్యాఖ్యలలాగా ఉంటాయి.

'ఇట్టిప్రయోగములచేత 'అన్యస్యాః క్వచి ద్ధువే చ్చాన్యా' అనుశబ్దశాసనులసూత్రము సార్థక మగుచున్నది'.

'ఆంధ్రశబ్దచింతామణియందు గల ఇద మద సిత్యాదిసూత్రమందలియదః ప్రభృతులు వ్యర్థము లగుచు స్వేతరంబులకును నక్కార్యం బగు నని తెలుపుచున్నవి'.

మొద లైనప్రౌఢవ్యాకరణవివరణలు ఆగ్రంథం చింతామణిని ఎంతగానో వివరణాత్మకంగా అనుసరించడాన్ని స్పష్టం చేస్తుంది.

బాలవ్యాకర్త కిత్తుగా జెప్పిన ఆగమం ఒక్కచో చింతామణి మిత్తుగా చెప్పింది. 'షష్ఠ్యా ఉతో ఽచి నుమ్ సే' ప్రౌఢవ్యాకర్త 'పోఁడి పరం బగుచో నెల్లెడల ను మ్మగు' అని మిత్తుగా చెప్పడంలో చింతామణిని అనుసరించటం గమనింపవచ్చు.

'గోకుల మిల్లిలు' ఇత్యాదిసందర్భాలలో లక్ష్యసాధనైకదృష్టితో చింతామణి అభిప్రాయానికి భిన్నంగా గూడా చెప్పడం కనబడుతుంది.

**బాలవ్యాకరణానుసరణం :** ప్రౌఢవ్యాకరణం కేవలం బాలవ్యాకరణానికే శేషం కాదు. సూరి బాలవ్యాకరణంలో సర్వనామాలప్రక్రియ చెప్పలేదు. ప్రౌఢవ్యాకర్త చెప్పాడు. కాని అందులో చింతామణి నిరూపించిన 'నేను, నన్ను', మొద లైనవాటిప్రక్రియ ప్రౌఢవ్యాకర్త చెప్పలేదు.

అయినా చింతామణితో సంబంధం కలిగిఉన్న బాలవ్యాకరణంలో ఉక్త మైన విషయాన్ని కూడా దృష్టిలో ఉంచుకుని కూడ ప్రౌఢవ్యాకరణం రచింపబడింది. 'ఉండిపదంబు పరం బగుచో వలన కందువర్ణక మట్లు నవర్ణకంబు నగు' మొద లైనఆయాసూత్రాలు బాలవ్యాకరణానికి వివరణప్రాయాలే అనవచ్చు.

'ముత్తియశబ్దేతరంబులయందును దఱుచుగ నిత్వలోపంబు చూపట్టెడి' మొద లైనలక్షణాలలో విశేషప్రయోగసాధనదృష్టికంటె సూరిఅభిప్రాయాన్ని తిరస్కరించే ఆకాంక్ష అధికంగా కనబడుతుంది.

ఇలాంటివాటివల్ల బాలవ్యాకరణశేషం అనదగి ఆపోలికతో ప్రౌఢవ్యాకరణం అనేపేరు ప్రసిద్ధి కెక్కింది.

**ఇతరలక్షణవివేచనం :** బాలవ్యాకరణంలో ఉక్త మైనదానిని విడిచిన ప్రౌఢవ్యాకర్త చింతామణికి శేషగ్రంథ మనదగిన వికృతివివేకం మొ. పూర్వలక్షణగ్రంథాలలో చెప్పబడినఅంశాలను తెలుగుచేశాడు. 'రోశబ్దం బొండు సంబోధనంబున స్త్రీవాచకంబునకుం బరంబుగ నగు' అన్నది 'రో ఇతి స్త్రీవాచకో భవేత్ పర త్రైవ' అనేవికృతివివేకలక్షణానికి అనువాదమే. అయినా 'అయ్యది హ్రస్వాంతంబును నయ్యెడి' అనేది ప్రౌఢవ్యాకర్త విశేషంగా చెప్పాడు.

మొత్తం మీద ప్రౌఢవ్యాకర్త వికృతివివేకం మొ. ఇతరవ్యాకరణాలు ఆధారంగా కొంత లక్షణం చేసినట్లు గుర్తింపవచ్చు.

**విశేషలక్షణం :** ప్రౌఢవ్యాకర్త అపూర్వవ్యాకరణం అని చెప్పినయిందులో లక్షణం అపూర్వం కొంత లేకపోలేదు.

వాక్యప్రకరణం అపూర్వంగా ఇందులో చేరింది. అన్వయవిశేషాలు, కొంత సర్వనామ ప్రక్రియ మరి కొన్ని లక్షణాలు ప్రౌఢవ్యాకర్త లక్ష్యానుగుణంగా స్వతంత్రంగా చేసినది.

**ఆంగ్లవ్యాకరణప్రభావం :** పూర్వాంధ్రవ్యాకరణాలకంటే అధికంగా ప్రౌఢ వ్యాకరణంలో చేరినవాక్యపరిచ్ఛేదం ఆంగ్లవ్యాకరణప్రభావంచేతనే అంటారు. వాక్యాన్నిగూర్చి చెప్పదలచుకోవడం, నామాలు, క్రియలు, అవ్యయాలు అని పదాలను వర్గీకరించడం, సమాపకక్రియలు, అసమాపకక్రియలు అని క్రియలను వింగడించడం, మొద లైనకొన్ని అంశాలలో ఆంగ్లవ్యాకరణప్రభావం ఉన్నది. అయినా ఇందులో

లక్షణంమాత్రం సంస్కృతసంప్రదాయానుగుణమె. వాక్యలక్షణమె సాహిత్యదర్పణం నుంచి స్వీకరింపబడింది. ఇలాగే మహావాక్యలక్షణం, విశేష్యాదులు నామభేదాలుగా చెప్పడం, కర్తరిప్రయోగాదుల వివరణం మొదలుగా లక్షణం సంస్కృతసంప్రదా యానుగుణమే.

**ప్రయోగప్రదర్శనం :** 'విశేషప్రయోగముల నేర్చి కూర్చి యీవ్యాకరణ మసాధారణ లక్షణములతో' వ్రాసినట్లు గ్రంథకర్త స్వయంగా చెప్పుకున్నాడు. విశేషకవి ప్రయోగాలకు లక్షణం చెప్పబడుతున్నది. కాబట్టి (అసాధారణలక్షణం) ఇందలి లక్షణానికి కారణ మైనప్రయోగాన్ని తప్పకుండా ప్రదర్శింపవలసిందే. ఏనుఁగున నేనుఁగు, అవసర మక్కఱలు మొద లైనచోట్ల ఒక్కొక్కప్రయోగానికే లక్షణం ఏర్పడింది. ఇది ప్రౌఢవ్యాకర్త ప్రయోగపరిశీనాపటిమను తెలుపుతుంది. శబ్దరత్నాకరనిర్మాణం ఈవిషయాన్ని ఇంకా నిరూపిస్తుంది.

సూత్రనిర్మాణాదులలో ఏ వయినా లోటుపాట్లు ఉన్నా, బహుముఖశ్రమతో అరు దైన కవిప్రయోగవిశేషాలతో అసాధారణలక్షణం చేయడంలో ప్రౌఢవ్యాకరణం రచనాప్రణాళిక చక్కగా ఉపయోగించింది.

## 2. ప్రౌఢవ్యాకరణం నామసార్థక్యాన్ని గురించి వివరించండి.

శ్రీబహుజనపల్లి సీతారామాచార్యులుగారు తాము వ్రాసినవ్యాకరణాన్ని 'త్రిలింగ లక్షణశేషము అను ప్రౌఢవ్యాకరణము' అని పేర్కొన్నారు.త్రిలింగలక్షణం అంటే తెలుగువ్యాకరణం. కాబట్టి త్రిలింగలక్షణశేషం అంటే అంతకు పూర్వం తెలుగువ్యాకరణాలలో చెప్పగా మిగిలినలక్షణం. అదే ప్రౌఢవ్యాకరణం.

### ప్రౌఢవ్యాకరణం

పీఠికలోనూ, ఇతరస్థలాలలోనూ వ్యాకర్త ఈగ్రంథానికి త్రిలింగలక్షణశేషం అనేపేరే తప్ప 'ప్రౌఢవ్యాకరణం' అనేపేరు ఎక్కడా ప్రస్తావించలేదు. కాని గ్రంథకర్త పర్యవేక్షించిన మొదటిముద్రణంనుంచి ప్రౌఢవ్యాకరణం అనేది దీనికి నామాంతరంగా ఈగ్రంథం ముఖపత్రం మీద ఉండడంచేత ఈపేరు గూడా గ్రంథకర్త ఉద్దేశపూర్వకంగానే ఏర్పఱచినట్లు గుర్తింపవచ్చు. త్రిలింగలక్షణశేషం అనేపేరుకంటే ప్రౌఢవ్యాకరణం అనేపేరే ఈగ్రంథానికి ప్రసిద్ధ మైంది.

**సంజ్ఞార్థం :** ప్రౌఢవ్యాకరణం అనేపేరు ముందుగా బాలవ్యాకరణాన్ని స్ఫురింప జేస్తుంది. దీనివల్ల ఇది బాలవ్యాకరణంకన్న మిన్న అనేఅభిప్రాయం కలిగిస్తుంది.

అందువల్లనే కొందఱు బాలురకొఱ కయినవ్యాకరణం – బాలవ్యాకరణం కాగా, ప్రౌఢులకొఱ కయినవ్యాకరణం ప్రౌఢవ్యాకరణం అని చెప్తారు. సూరివ్రాతలనుబట్టి బాలవ్యాకరణం బాలురకొఱకయి చేయబడినదే అని చెప్పాలి.

కాని ప్రౌఢవ్యాకరణం అలా కాదు. తమగ్రంథాన్ని గురించి ఆచార్యులుగారు 'విశేషప్రయోగముల నేర్చి కూర్చి త్రిలింగలక్షణశేషం బనునొకయపూర్వవ్యాకరణము దీని వ్రాసితిని. ఇందలిలక్షణము లసాధారణములు. ఇయ్యది విద్యార్థుల కత్యంతోపకారకము' అని పేర్కొన్నారు. ప్రౌఢవ్యాకరణం కూడా విద్యార్థులకొఱకు వ్రాయబడిందే. ఇందలిలక్షణాలు అసాధారణాలు. విశేషాలూ, అపూర్వాలూ కావడం చేత విషయగతప్రౌఢివల్ల ప్రౌఢవ్యాకరణం అయిం దన్నమాట.

బాలవ్యాకరణానికి తరువాతిగ్రంథం అనేఅర్థాన్ని స్ఫురింపజేస్తూ భాషాసాధారణ లక్షణాన్ని (బాలవ్యాకరణంద్వారా) తెలుసుకున్నతరువాత అసాధారణ మైన విశేష లక్షణాన్ని తెలుపుతూ, ప్రౌఢ మైన ఈవ్యాకరణం మూలంగా భాషాస్వరూపం సమగ్రంగా తెలిసి విద్యార్థులు ప్రౌఢు లవుతా రని గూడా గ్రంథకర్తతలపు కావచ్చు.

ప్రౌఢులకోసం వ్రాయబడింది కాబట్టి అని కాకుండా, ప్రౌఢ మైనవ్యాకరణం కాబట్టి ఇది ప్రౌఢవ్యాకరణ మని ఈగ్రంథకర్త వచనాలనుబట్టి ఊహింపవచ్చు.

**సార్థక్యం :** రచనాప్రణాళిక, సూత్రనిర్మాణచాతుర్యం మొద లైలక్షణాలనుబట్టి ప్రౌఢవ్యాకరణంకంటే బాలవ్యాకరణమే ప్రౌఢం అని చెప్పడంలో తప్పు లేదు. అయినా–

## రచనాలక్ష్యం

బాలవ్యాకర్త అది బాలురకు సుసాధంగా ఉండేవిధంగా కూర్చాడు. ప్రౌఢవ్యాకరణం అటువంటి ఉద్దేశంతో రచింపపబడింది కాదు. అసాధారణమూ, విశేషమూ ఐనలక్షణం చెప్పబూనింది.

**లక్షణం అసాధారణం :** భాషాసాధారణలక్షణం తెలిసినవాడికే విశేషలక్షణం తెలియజేయాలి. పూర్వవ్యాకరణాలచేత ఆంధ్రభాషాసామాన్యలక్షణం తెలిసినవారికి విశేషాలు చెప్పడానికి పూనుకుంది. కాబట్టి ఇందులో విషయం ప్రౌఢం అవుతున్నది.

**అరుదయినప్రయోగాలు :** విశేషప్రయోగాలను గుర్తించి ఇందులో లక్షణం చేయబడింది. విశేషప్రయోగాలు వెదకి చూపినది కాబట్టి ఇది ప్రౌఢం. ఉదా. బాలవ్యాకరణం ముత్తియశబ్దంలో మాత్రం ఇత్వలోపం చెప్పి ఇతరాలకు కవి ప్రయోగాలు మృగ్యం అని చెప్పగా ప్రౌఢవ్యాకరణం 'ముత్తియశబ్దేతరంబుల

యందును దఱుచుగ నిత్వలోపంబు చూపట్టెడి' అన్నది. ముత్తియేతరము లైనఏయేశబ్దాలలో ఈకార్యం అవుతున్నది అన్నది ఇక్కడ ప్రయోగానుగుణంగా మాత్రమే గుర్తింపవలసిఉన్నది.

మిశ్రద్వంద్వం, అజడంబు తృతీయకు నవర్ణకం మొద లైనకొన్నిలక్షణాలకు లభ్య మైనది ఒక్కొక్క ప్రయోగమే.

కవిప్రయోగాలలో మూలమూలలలో ఉన్న ఇలాంటివిశేషాలను గూడా తెలియజేస్తున్న ఈవ్యాకరణం ప్రతిపాదించేలక్షణం తత్కర్త పేర్కొన్నట్లుగా అసాధారణమే. ఇలాటిఅసాధారణ విషయాలు కలిగిన ఈగ్రంథం ప్రౌఢమే.

**వాక్యప్రకరణము :** 'వాక్యపరిచ్ఛేదము' అనేది ఇందులో అపూర్వంగా ప్రవేశించిన విభాగం. పదవాక్యగతవిశేషాలు అన్వయవిశేషాలు మొద లైనవి ఇందులో చేర్చ బడ్డాయి. ఇలాటివిషయాలు పూర్వవ్యాకరణాలలో ప్రత్యేకంగా ప్రస్తావింప బడలేదు.

ఇలా ఈవ్యాకరణం తత్కర్త పేర్కొన్నట్లు అపూర్వలక్షణాలతో ఆంధ్రభాషలోని అసాధారణ స్థితులను స్పష్టం చేస్తూ విషయగత మైనప్రౌఢిమూలంగా ప్రౌఢ మయిన వ్యాకరణం అయి ప్రౌఢవ్యాకరణం అనేపేరు సార్థకం చేసికొన్న దని చెప్పవచ్చు.

## 3. 'త్రిలింగలక్షణశేషము' నామసార్థక్యం గురించి వివరించండి.

పీఠికలోనూ, పరిచ్ఛేదారంభంలోనూ 'త్రిలింగలక్షణశేషము'గా తనవ్యాకరణాన్ని సీతారామాచార్యులుగారు పేర్కొన్నారు. ముఖపత్రంలో 'త్రిలింగ లక్షణశేషము అను ప్రౌఢవ్యాకరణము' అని పేర్కొనబడింది. చివరిలో (గ్రంథ ముద్రణంనాటికి) 'ప్రౌఢవ్యాకరణం' అనేపేరుమీద గూడా దృష్టి ఏర్పడినా, గ్రంథకర్త మొదటినుంచీ తనఈగ్రంథానికి 'త్రిలింగలక్షణశేషము' అనేపేరే ఉద్దేశించా దని పీఠికాదులనుబట్టి నిశ్చయంగా చెప్పవచ్చు.

త్రిలింగం అంటే తెలుగు. శేషం అంటే చెప్పగా మిగిలింది. అంటే తనకు పూర్వం (తెలుఁగు) వ్యాకరణాలలో చెప్పగా మిగిలిఉన్నభాషాలక్షణం త్రిలింగలక్షణశేషం.

'త్రిలింగలక్షణం' అనేపేరుతో తెలుఁగులో ఈత్రిలింగలక్షణశేషానికి ముందు ఒకవ్యాకరణం కనబడదు. రావిపాటి గురుమూర్తి శాస్త్రి 'తెలుగువ్యాకరణం' ఉన్నది. అదే 'త్రిలింగలక్షణం' అని చెప్పడానికి ప్రౌఢవ్యాకరణంలోని అంతర్విషయాలు సహకరించవు.

కాగా ఈప్రౌఢవ్యాకరణం అంతకు పూర్వం ఉన్న ఏదో ఒకతెలుఁగువ్యాకరణానికి

మాత్రమే శేషం అనడానికి వీలు లేదు. ముం దున్న తెలుగువ్యాకరణాలలోని త్రిలింగలక్షణం మొత్తానికి శేషం ఈత్రిలింగలక్షణశేషం.

**సార్థక్యం :** ఇంతటి పేరు ఈవ్యాకరణానికి తగ దేమో అని కొందఱు అనుమానిస్తున్నారు. ఇది ఎంతవరకు సార్థకం అనడానికి గ్రంథకర్తవచనాల్లో ఆధారాలు చూద్దాం.

**ఆధారాలు :** 'తుద కిప్పుడు తద్భారతాదిగ్రంథపరిశోధనంబుచే దొరకినవిశేషలక్షణ ప్రయోగముల నేర్చి కూర్చి త్రిలింగలక్షణశేష మనునొకయపూర్వవ్యాకరణము దీని వ్రాసితిని. ఇందలిలక్షణము లసాధారణములు–' అని గ్రంథకర్త పీఠికలో పేర్కొన్నాడు.

**1. అపూర్వవ్యాకరణం :**

క్త్వార్థ మయినయిత్తుకు సంధి లేకపోవడం ఈభాషకు సాధారణలక్షణం. 'ఇప్రత్యయాంతావ్యయంబునకు సంధియుఁ జూపట్ట'టం అసాధారణం. భాషలోని ఇలాటి అసాధారణలక్షణాలను పేర్కొనడంచేత ఇందలిలక్షణాలు అసాధారణాలు. అనడం ఉచితమే.

పూర్వవ్యాకరణాలు భాషాసాధారణలక్షణాలను చెప్తుండగా తద్భిన్నంగా అసాధారణాలు చెప్తూ అపూర్వవ్యాకరణం అవుతున్నది. అంటే సాధారణలక్షణాలు చెప్పేపూర్వాంధ్రవ్యాకరణాల కిది శేషం అన్నమాట.

కాబట్టి పూర్వవ్యాకరణనిరపేక్షంగా ఇందులో లక్షణం సరిగా తెలియదు. అసాధారణలక్షణం తెలియడానికి ముందు భాషాసామాన్యలక్షణం తెలియాలి కదా.

ప్రౌఢవ్యాకర్త 'అక ప్రత్యయాంతావ్యయంబు కళయ' అన్నాడు. అంతకు ముందు కొందరు వ్యాకర్తలు ఇది ద్రుతప్రకృతికం కూడా అవుతుం దనడం తెలిస్తే కానీ ఈలక్షణం ఆరంభించడానికి మూలం తెలియదు. ఇలా పూర్వాంధ్రవ్యాకరణాలు చదివి అందులో లోటుపాట్లను ప్రౌఢవ్యాకరణంతో సరి చేసుకోవాలి. ఇలా ఇది పూర్వం రచింపబడిన త్రిలింగలక్షణాలకు (తెలుగువ్యాకరణాలకు) అన్నింటికీ శేషమే అవుతున్నది.

**2. బాలవ్యాకరణానికి మాత్రమే శేషమా?**

ప్రౌఢవ్యాకరణం అనేపేరునుబట్టి కావచ్చు, ఇది బాలవ్యాకరణానికి శేషగ్రంథంగా పేర్కొంటారు. కాని బాలవ్యాకరణానికి ఒక్కదానికె శేషంగా చెప్పాలనుకుంటే, 'త్రిలింగలక్షణశేషం' అనేపేరు పెడతాడా? త్రిలింగలక్షణం అంటే బాలవ్యాకరణం ఒక్కటే కాదు గదా. ఇంకా ప్రౌఢవ్యాకర్త తనగ్రంథంలో సూరిపేరును గానీ, బాలవ్యాకరణాన్ని గానీ స్పష్టంగా పేర్కొననేలేదు. 'బాలవ్యాకరణశేషమే' వ్రాయదలిస్తే అలా చెప్పకుండా ఉంటాడా?

కజ్యంతం, నుజ్యంతం అని కాక అక-ప్రత్యయాంతం అన్-ప్రత్యయాంతం అనే తీరుగా వ్యవహరించడం మొద లైనకారణాలనుబట్టి ఇది బాలవ్యాకరణాని కొక్కదానికే శేషం అనడానికి వీలు లేదు.

'తద్భవములందును నలఘురేఫము గలదు'. 'నెన్నడాదులన్ నెఱి దగు' మొ. పెక్కు విధానాలు బాలవ్యాకరణాన్ని ఉద్దేశించే చెప్పబడిన వనడం స్పష్యం. బాలవ్యాకరణం కూడా ఒకత్రిలింగలక్షణమే కాబట్టీ, ప్రసిద్ధం గూడా కాబట్టీ, దానికి శేషంగా వివరణాద్యాత్మకలక్షణాలు ప్రౌఢవ్యాకరణంలో (అధికంగా) ఉండడంలో వింత లేదు. కాగా ఇది బాలవ్యాకరణానికి గూడా శేషమే కాని బాలవ్యాకరణానికి మాత్రమే శేషం అనడానికి వీలు లేదు.

### 3. చింతామణిశేషం :

బాలవ్యాకరణంలో సర్వనామప్రక్రియ చెప్పబడలేదు. ప్రౌఢవ్యాకరణం చెప్పింది. కాని చింతామణిలో చెప్పబడిన నీనాతాశబ్దాలప్రక్రియ ప్రౌఢవ్యాకర్త విడిచిపెట్టాడు. 'ఊరు చోటు మేన్వాదు లున్లుగ్విషయంబులు' అన్నపుడు 'కేషాంచిత్ ...' అనేచింతామణిలక్షణంచేతనే ఉన్లోపం అవుతుం దని ప్రౌఢవ్యాకర్త వివరించాడు. ఇలాటి చింతామణివివరణలు ఇందులో ఇంకా ఉన్నాయి. ఇటువంటికారణాలనుబట్టి ప్రౌఢవ్యాకరణం చింతామణికి శేషం అవుతుంది.

### 4. త్రిలింగలక్షణా లన్నింటికీ శేషమే :

చింతామణి, బాలవ్యాకరణాలకే కాదు, అంతకు పూర్వం ఉన్న త్రిలింగలక్షణాలకు అన్నింటికీ ప్రౌఢవ్యాకరణం శేషమే.

'దీర్ఘ స్స్యాద్ వర్ణనిర్దేశే' అన్నది వికృతివివేకం. 'విధానోచ్చారణముల' నధికంగా చేర్చి ప్రౌఢవ్యాకర్త ఆలక్షణాన్ని తెలుగు చేశాడు.

'పురమునందలివా రని పొసఁగఁ బలుకునెడ పురంబున వా రని ఇడగవచ్చు'

అని కవిసంశయవిచ్ఛేదం. 'సప్తమీతత్పురుషమునందు నవర్ణకంబు నగు' అనిప్రౌఢవ్యాకర్త లక్షణం.

'రాహువు బాహువు తరు వనంగ రాహు బాహు తరు వన రాజభూష' అని సర్వలక్షణసారసంగ్రహంలోనూ, ఆంధ్రకౌముదిలోనూ చెప్పబడింది. ప్రౌఢవ్యాకర్త లక్ష్యాను గుణంగా ఈలక్షణాన్ని 'రాహు, బాహు'శబ్దాలకే పరిమితం చేశాడు.

ఇలా ఇతరపూర్వవ్యాకరణాలనుంచి కూడ గ్రహింపవచ్చు.

300 పైగా సూత్రాలు ఉన్న ప్రౌఢవ్యాకరణంలో ఆమ్రేడితస్థలాలు, అన్వయ విశేషాలు, మొద లైన అనేకాంశాలను చెప్పేసూత్రాలు అంటే సగం గ్రంథం ప్రౌఢ వ్యాకర్త స్వతంత్రంగా చెప్పిందే అనవచ్చు.

కొన్ని అంశాలు పూర్వవ్యాకర్తలు చెప్పినవిగానే తోచినా, అక్కడ అభిప్రాయ భేదాలను పరిష్కరిస్తూ ఉచితపక్షాన్ని నిర్ధారించడంచేత అలాటిలక్షణాలు (పూర్వ వ్యాకరణాలలో చెప్పబడినట్లు తోచినా) అవి యథాతథానువాదాలు కాక వివరణాద్యాత్మకాలు ఐ ఉండడం గుర్తిస్తే, ఇది వాటికీ శేషగ్రంథమే అని తెలియవచ్చు.

కాగా త్రిలింగలక్షణం ఏర్పరచడంలో ప్రౌఢవ్యాకర్త మరి కొంత జాగ్రత్త తీసుకుని ఉంటే ఈనామం ఇంకా దృఢంగా కుదిరేదే కాని, ప్రస్తుతలక్షణంతో గూడా ఈగ్రంథానికి 'త్రిలింగలక్షణశేషం' అనేపేరు సార్థకమే.

## 4. ప్రౌఢవ్యాకరణం బాలవ్యాకరణానికి శేషగ్రంథం– నిరూపించండి.

**ప్రౌఢవ్యాకరణం :**

'త్రిలింగలక్షణశేషము అనుప్రౌఢవ్యాకరణము' అని సీతారామాచార్యులుగారు తమవ్యాకరణానికి ప్రౌఢవ్యాకరణం అనేపేరు ముఖపత్రంమీద ఉంచారు. ఈపేరు గ్రంథాంతర్భాగంలో కనబడదు. ప్రౌఢవ్యాకరణం అనేపేరుపై మక్కువ ఈవ్యాకర్తకు తరువాత కలిగింది.

కాని ప్రౌఢవ్యాకరణం అనేపేరు బాలవ్యాకరణాన్ని స్మరింపజేస్తుంది. ఈపేరు బాలవ్యాకరణాన్ని మించింది, దానికి తరువాతి గ్రంథం, దానికి పై గ్రంథం అనే అభిప్రాయాన్ని గల్గిస్తుంది. అందుకే ప్రౌఢవ్యాకరణం అనేపేరు గ్రంథకర్త తరువాత తగిలించా డేమొ. ప్రౌఢవ్యాకరణం అనేపేరె ప్రచారంలోకి రావడానికి గానీ, ఇది బాలవ్యాకరణశేషం అనేఉద్దేశం కలగడానికి గానీ బాలవ్యాకరణానికి ఉన్న ప్రసిద్ధి కారణం కావచ్చు.

**బాలవ్యాకరణశేషం :**

గ్రంథకర్త తఱుచుగా ప్రస్తావించిన 'త్రిలింగలక్షణశేషము' అనేపేరునుబట్టి ఇది బాలవ్యాకరణానికి కూడా శేషం అవుతుంది. బాలవ్యాకరణమూ త్రిలింగలక్షణమే కదా. ప్రచారంలో ఉండి ప్రసిద్ధం కావడమూ, చింతామణిప్రభావం గలిగిఉండడమూ అనేవాటిని బట్టికూడా బాలవ్యాకరణాన్ని ఉద్దేశించే ఇందులో పెక్కులక్షణాలు చేయబడినాయి అని తోస్తుంది. అందువల్లనే చింతామణ్యాదులు ఇతరాంధ్ర వ్యాకరణశిష్టా లయినలక్షణాలు గూడ ఇందులో చెప్పబడినా ఆధిక్యం, స్పష్ట మైన సంబంధం అనుసరించి ఇది బాలవ్యాకరణ శేషం అనేఅభిప్రాయం ప్రబలింది.

ఇందలిలక్షణానికి బాలవ్యాకరణంతో ఉన్నసంబంధం ఇలా గమనింపవచ్చు.

**1. వివరణాత్మకాలు:**

బాలవ్యాకరణంలో ఆయాలక్షణాలఅభిప్రాయం అక్కడ స్పష్టంగా లేక, సందేహం కలుగుతుం దని తలచినచోట సూరిసూత్రాలచేత సిద్ధించేఅర్థాన్నే స్పష్టం చేస్తూ ప్రౌఢవ్యాకరణం వివరణాత్మకాలు అయినలక్షణాలు చేసింది.

'ఉండిశబ్దము పరం బగునపుడు వలనకు ద్వితీయాసప్తములు ప్రాయికంబుగ నగు' అని బాలవ్యాకరణం. ఇక్కడ 'సప్తమి' అని సామాన్యంగా చెప్పటంచేత సప్తమీవిభక్తు లయిన 'అందు-న' ప్రత్యయాలు రెండూ లక్షణసిద్ధం అవుతున్నాయి. 'సంప్రదానంబునకుం జతుర్థి యగు' అనేచోట చతుర్థు లయిన కొఱకు-కయి అనేవి రెండూ అవుతునే ఉన్నాయి కదా. సూరి 'వనమందుండి వచ్చె' అని అందు ప్రత్యయం ఒక్కటే ఉదాహరించాడు. సూరి ఉదాహరింపని కారణంగా సప్తమే అయినా 'న' వర్ణకం రా దని సందేహిస్తా రేమొ అని శంకించుకొని ప్రౌఢవ్యాకరణం 'ఉండిపదంబు పరం బగుచో వలన కందువర్ణక మట్లు నవర్ణకంబు నగు' అన్నది. ఇది బాలవ్యాకరణసిద్ధమె కాబట్టి దానిఅభిప్రాయాన్ని ఈలక్షణం వివరిస్తున్న దని తెలియవచ్చు. ఈసూత్రంలోని 'అందువర్ణక మట్లు' అనేదళం బాలవ్యాకరణోదాహృతిని పరామర్శిస్తూ బాలవ్యాకరణాన్ని ఉద్దేశించే చెప్పబడినట్లు స్పష్టం చేస్తుంది. ఇలాటివి ప్రౌఢవ్యాకరణానికి బాలవ్యాకరణంతో గలసన్నిహిత సంబంధాన్ని నిరూపిస్తాయి.

'ఓశబ్దము సంబోధ్యవాచకమునకు ముందే ప్రయోగింపఁబడు' అని చెప్పినసూరి వచనంలోని 'ముందే' అనేమాటలో అవ్యవహితం కావా లేమో అని సందేహం కలుగుతుండగా 'ఓశబ్దం బొక్కచో సంబోధ్యవాచకమునకు ముం దితరశబ్దవ్యవహితం

బయి కానంబడియెడి' అనే ప్రౌఢవ్యాకరణలక్షణం దానిని వారిస్తున్నది.

'నకారం బసాధారణంబు ద్రుతంబు' అనే ప్రౌఢ, సూత్రమూ, దాని వివరణమూ బాలవ్యాకరణంలో ద్రుతప్రకృతికాలను అక్కడక్కడ సాధించి ఉదాహరించిన సూరి అభిప్రాయాలను ఒకచోటికి తెచ్చి చెప్తూ, బాలవ్యాకరణానికి ఈలక్షణం వివరణాత్మకం అవుతున్నది.

'ఒకానొకచో ద్వంద్వంబునం బూర్వపదంబు క్లీబసమం బగు' అనేప్రౌఢ.లక్షణం 'ఆచ్ఛికశబ్దంబుతోడ స్త్రీసమంబు ప్రాయికంబుగ ద్వంద్వం బగు' అనేబాలవ్యాకరణలక్షణంలోని ప్రాయికశబ్దానికి వివరణమె.

**2. సవరణలు :**

బాలవ్యాకరణంలోని అభిప్రాయం కవిప్రయోగాదులకు భిన్నంగా కనబడినచోట్ల లక్ష్యానుగుణంగా ప్రౌఢవ్యాకరణం దానిని సవరించింది.

'విను మనియె - ఇచ్చుట నచ్చు పరం బయినది కాబట్టి లోపము లేదు' అనేబాలవ్యాకరణలక్షణాన్ని సవరిస్తూ 'మధ్యమపురుషమువర్ణకంబున కచ్చు పరం బగునపుడును లోపంబు చూపట్టెడి' అని ప్రౌఢవ్యాకరణం పేర్కొన్నది. (న ప్రాణే తు కదాచన' అని అథర్వణుడు కూడా అలాగే చెప్పాడు.) ఇక్కడి 'అచ్చు పరంబగునపుడును' అనేదళం బాలవ్యాకరణాన్ని ఉద్దేశించి చెప్పడాన్ని సూచిస్తుంది.

'ఇయలోనిఇకారమునకు కొందరు లోపము చెప్పిరి గాని అది కవిప్రయోగము లందు మృగ్య' మనీ 'ముత్తియశబ్దమునందు మాత్ర మిత్వలోపంబు గానంబడియెడి' అనీ బాలవ్యాకరణం పేర్కొన్నది. 'ముత్తియశబ్దేతరంబులయందును దఱుచుగ నిత్వలోపంబు గానంబడియెడి' అని ప్రౌఢవ్యాకరణం ఆఅభిప్రాయాన్ని సవరించింది. ఇందలి 'ముత్తియశబ్దేతరంబులయందును (తఱుచుగ కానంబడియెడి) అనేదళం ఈలక్షణం బాలవ్యాకరణాన్ని ఉద్దేశించే చెప్పబడిం దని స్పష్టం చేస్తున్నది.

'బహువ్రీహిని స్త్రీవాచ్యం బగుచో నుపమానంబు మీఁది మేనునకు బోఁడి యగు' అని బాలవ్యాకరణం. 'అలరుబోఁ డీత్యాదు లుపమానపూర్వపదకర్మ ధారయంబులు' అని ప్రౌఢవ్యాకరణం సవరణం. ఇట అలరు+మేను అనేబాల వ్యాకరణప్రక్రియను గూడ అలరు+పోఁడి అనేతీరుగా ప్రౌఢవ్యాకరణం సవరించింది.

'అలఘురేఫము తత్సమతద్భవములందు లే' దని బాలవ్యాకరణం. 'తద్భవంబు లందును నలఘురేఫము గల' దని ప్రౌఢవ్యాకరణం సవరణం.

'విశ్వకర్మాదులకు స్త్రీత్వం బగు' అని బాలవ్యాకరణం. 'విశ్వకర్ముఁ డనియు రూపంబు' అని ప్రౌఢవ్యాకరణం సవరణం.

ఇట్లే కపిలగడ్డము, ప్రాణగొడ్డము మొదలయినవాటివిషయంలో ప్రౌఢవ్యాకరణంబాలవ్యాకరణాభిప్రాయాన్ని సవరించింది.

**3. పూరణలు :**

బాలవ్యాకరణంలో ప్రతిపాదింపబడినలక్షణాన్ని ఆమోదిస్తూ దానికి సంబంధించిన విశేషాంశాలను పేర్కొంటూ, ఆలక్షణాన్ని సమగ్రపఱచటం ప్రౌఢవ్యాకరణంలో కొన్నిచోట్ల కనబడుతుంది.

లెమ్ము+లెమ్ము అని ఉండగా 'ఆమ్రేడితంబు పరం బగునపుడు మధ్యమముడుజులకు లోపంబు విభాష నగు' అనేబాలవ్యాకరణలక్షణంచేత 'ము' లోపించి లెలెమ్ము – అని అవుతుంది. 'లేలెమ్ము' అని కావలసినరూపం బాలవ్యాకరణంలో అసమగ్రంగ నిలిచిపోయింది. 'ఆమ్రేడితంబు పరం బగునపుడు కృతహ్రస్వంబునకు దీర్ఘం బగు' అనేలక్షణంచేత ప్రౌఢవ్యాకరణం దానిని పూరించింది.

'షష్ఠీసమాసమునం దుకారఋకారముల కచ్చు పరం బగునపుడు నుగాగమం

బగు' అని బాలవ్యాకరణం చెప్పిననుగాగమాన్ని అంగీకరిస్తూనే ప్రౌఢవ్యాకరణం 'కొన్నిచోట్ల షష్ఠీసమాసంబునం దుకారంబున కచ్చు పరం బగునపుడు నుగాగమంబు నకు లోపం బగు' అని దానికి క్వాచిత్కంగా లోపం చెప్పింది. నుగాగమం రా దనకుండా (వచ్చి) లోపిస్తుం దనడంచేత ఈ ప్రౌఢవ్యాకరణలక్షణం బాలవ్యాకరణానికి పూరక మనవచ్చు.

ఇలాగే కంటె, అందు పరకనగాగమం, శత్రర్థ 'చు' పరకపత్వం మొద లయినవిధులు బాలవ్యాకరణానికి పూరణలుగా చెప్పవచ్చు.

బాలవ్యాకరణంలో సర్వనామరూపాలకు పట్టిక ఇవ్వబడింది. ప్రౌఢవ్యాకరణం వాటిప్రక్రియ చాలవరకు నిరూపించింది. ఇలాటివి పూరణలు.

**4. విశేషలక్షణం :**

బాలవ్యాకరణం స్పృశింపని అనేక మైనఅంశాలు ప్రౌఢవ్యాకరణం చెప్తున్నది. విశేషణాలు, జాత్యేకవచనాదులు, ద్విరుక్తిస్థలాలు, వాక్యప్రకరణం మొద లైనవి ఇలాటివి.

ఇలా బాలవ్యాకరణానికి వివరణాద్యాత్మకంగా ప్రౌఢవ్యాకరణం బాలవ్యాకరణానికి శేషగ్రంథం అని పేర్కొనదగిన విధంగా మిక్కిలి సన్నిహితసంబంధంతో రచింపబడింది.

# ప్రౌఢవ్యాకరణం

## వాక్యవివరణం - సంజ్ఞాపరిచ్ఛేదం

**1. (లూ)కారగ్రహణము సంస్కృతప్రాకృతభాషావ్యాకరణజ్ఞులసమ్మతము.**

**2. అయ్యది మంత్రశాస్త్రప్రసిద్ధము.** (సం. 1)

'ఆంధ్రభాషకు వర్ణంబు లేఁబదియైదు' అనేసూత్రంవివరణంలోనిది ఈవాక్యం.

పైసూత్రంవివరణంలో ప్రౌఢవ్యాకర్త ఆవర్ణమాలలో (లూ)కారం గూడ చూపాడు. కాని '(లు)కారస్య ద్వాదశ, తస్య దీర్ఘాభావాత్'. అనేపాణినీయాన్నిబట్టి సంస్కృతంలో దీర్ఘ మయిన (లూ)కారం లేదు. అందువల్ల దాన్ని తొలగించి క్షకారాన్ని కలిపి అనంతాది లాక్షణికులు కొందఱు సంస్కృతానికి 50 వర్ణాలు చూపారు. కాబట్టి

వర్ణమాలలో (లూ)కారం చూపరా దనేపూర్వపక్షానికి సమాధానం ఈవివరణం.

పాణినీయం అంగీకరించకపోయినా ఇతరసంస్కృతవ్యాకరణాలు సంస్కృతంలో కారం ఉన్న దని చెప్పాయి. సంస్కృతంలోని(లు,లూ)లు ప్రాకృతంలో లే వంటూ వరరుచి హేమచంద్రుడు మొ. ప్రాకృతవైయాకరణులు సంస్కృతంలో (లు)తోపాటు (లూ) కూడా ఉన్న దన్నారు. సంస్కృతకావ్యాదుల్లో (లూ)కారం కన్పించదు. కానీ మంత్రశాస్త్రంలో ప్రసిద్ధంగా ఉన్నది. మాతృకాపూజలో (లూ)కారం వాగ్దేవి వామ గండం (లేదా దంతం) గా పూజిస్తారు.

కాబట్టి (లూ)కారం వర్ణమాలలో చేర్చవలసినదే అని సిద్ధాంతం. కాని (లూ)కారం ఉన్నపదంసంస్కృతంలో ఒక్కటి గూడా లేదు. '(లూ)కారం' అనేది ఆవర్ణాన్ని చెప్పేది కాబట్టి పదంగా లెక్కలోకి రాదు.(లూ)కారం ప్రయోజనం భాషలో ఒకప్పుడు పరిమితం. ఇపుడు అసలు లేదు. (నిజానికి (లు) కారం స్థితీ అంతే).

**3. యవలలవలె రేఫంబును బ్రయత్నభేదంబుచే ద్వివిధంబు గాన శబ్దశాసనాదులచేత నలఘురేఫము వర్ణాంతరముగాఁ బరిగణింపఁ బడదయ్యె.** (సం. 1)

'ఆంధ్రభాషకు వర్ణంబు లేఁబదియైదు' అనేసూత్రంవివరణంలోనిది ఈవాక్యం.

పైసూత్రంవద్ద ప్రౌఢవ్యాకరణం వర్ణమాలలో శకటరేఫను చూపలేదు. దానికి కారణాన్ని ఇలా వివరిస్తున్నది.

అప్పకవి మొద లయినవారు శకటరేఫను వర్ణమాలలో పరిగణించారు. 'యరలవలు లఘువులు నలఘువు లని ద్వివిధంబు లగు.' య-వ-ల- అనే వాటిలాగానే రేఫ కూడా లఘువు. అలఘువు అని రెండు విధాలు. ఈభేదం ఉచ్చారణలోని ప్రయత్నంభేదంవల్ల వచ్చిందే. స్థానకరణభేదం ఉంటేనే వర్ణాలను భిన్నంగా పరిగణించవలసిఉంది. అందువల్లనే దంత్యతాలవ్యచజలు వేరుగా పరిగణింపబడ్డాయి. లఘ్వలఘువులవిషయంలో స్థానకరణ భేదం లేకపోవడంవల్ల ఇవి వేరేవర్ణాలు గావు. య-వ-ల- అనేవి గూడా లఘువులు అలఘువులు వేరుగా రెండు రెండు చొప్పున వర్ణమాలలో చెప్పలేదు. అలానే రేఫ గూడా. అందుకే చింతామణిలో నన్నయ కూడా 'షట్త్రింశ దత్ర' అని శకటరేఫను వర్ణమాలలో చేర్చలేదు.

(యవలలతో పోలికవల్ల శకటరేఫ చేరిస్తే యలవలు చేర్చా లని భావం.

నన్నయ చేర్చలేదు. తాను గూడా శకటరేఫను వర్ణమాలలో చేర్చకపోవడం ప్రామాణికమె అని తాత్పర్యం.)

**4. క్షకారము సంస్కృతవ్యాకరణములయందును నిఘంటువుల యందును షాంతపదమధ్యమునందుఁ బఠింపఁబడుటంజేసి యది వర్ణాంతరము గాదు. సంయుక్తాక్షరం బని తెలియవలయు.** (సం.1)

'ఆంధ్రభాషకు వర్ణంబు లేఁబదియైదు' అనేసూత్రంవివరణంలోనిది ఈవాక్యం.

పైసూత్రంవద్ద ఆంధ్రవర్ణమాలలో ప్రౌఢవ్యాకర్త 'క్ష' అనేవర్ణాన్ని చూపలేదు. దానికి కారణం ఏమిటి అనేవిషయాన్ని నిరూపించటానికి ఈవివరణం చేయబడింది.

కొందరు సంస్కృతపండితులూ, అనంతుడు మొద లైనతెలుగు లాక్షణికులూ క్షకారాన్ని సంస్కృతవర్ణమాలలో ప్రత్యేకంగా పరిగణించారు. క్షకారం వర్ణాంతరం కా దని ప్రౌఢవ్యాకర్త వివరిస్తున్నాడు. క్షకారాన్ని సంస్కృతవర్ణమాలలో చేర్చనిసూరిమతానికి కూడా ఇది వివరణం కావచ్చు.

సుబంతరూపసాధనం, ధాతుపరిగణనం మొద లైనసందర్భాలలో సంస్కృతవ్యాకరణాలలో క్షాంతాలు ప్రత్యేకంగా చూపబడలేదు. ఇంక షకారాంతాలలో కూర్చబడినవి. (ప్రౌఢవ్యాకర్త షాంతశబ్దమధ్యంలో అనదగును.) అలాగే అకారాదిక్రమంలో శబ్దాలను నిర్దేశించేసంస్కృతనిఘంటువులలోనూ క్షకారాంతాలు విడిగా గాక షకారాంతశబ్దాలలో చూపబడ్డాయి. కాబట్టి 'క్ష'కారం ప్రత్యేకవర్ణం కాదు. ఇది షకారాంతం. అంటే 'క్ష' అనేది కారషకారాలసంయుక్తాక్షరం. కకారమూ, షకారమూ వేర్వేరుగా వర్ణమాలలో పరిగణింపబడిఉన్నాయి. 'క్స' మొద లైనసంయుక్తాక్షరాలవలెనె 'క్ష' అనేసంయుక్తవర్ణాన్ని గూడ వర్ణమాలలో పరిగణింపరాదు.

క్షకారోచ్చారణంలో కకారషకారములసంయుక్తధ్వని నేడు కానరాదు. అయినా ఇటువంటిభిన్నధ్వనినిబట్టి యిది ప్రత్యేకవర్ణంగా తలపరాదు. 'ఫ' మొద లైనవర్ణాల ఉచ్చారణంలోను భేదం గమనింపవచ్చు.

**5. నిర్దేశవిధానంబులం గారేఫప్రత్యయములు రానియెడల హ్రస్వమునకు దీర్ఘము వచ్చు నని యర్థము.** (సం.3)

చూ. 'ఒకచో హ్రస్వంబు దీర్ఘం బగు'. సూత్రవివరణం.

**6. నిర్దేశవిధానవిషయము లయినవర్ణములు దీర్ఘము లయ్యె నేని**

**యవి యట్లే యుండు నని యర్థము.** (సం.4)

చూ. 'దీర్ఘంబు దీర్ఘంబ' సూత్రవివరణం.

**7. ద్రుత మనఁగా నొల్లనియెడ మఱఁగిపోవునది యనుట.** (సం.4)

'నకారం బసాధారణంబు ద్రుతంబు' అనేసూత్రం వివరణంలోనిది ఈవాక్యం. పైసూత్రం చెప్పినద్రుతసంజ్ఞకు అర్థాన్ని వ్యాకర్త వివరిస్తున్నాడు.

'అక్క ర్లేదనుకుంటే తొలగిపోయేది' అని 'ద్రుత' శబ్దానికి అర్థం. అనవసర మనుకుంటే లోపిస్తుంది అని తాత్పర్యం. శబ్దంలో ఏవర్ణం లేకపోతే అర్థానికి భంగం కలుగుతుందో అది అవసరం. ఏవర్ణం లేకపోయినా (లోపించినా) అర్థసిద్ధికి బాధ ఉండదో అది అనవసరం అనుకోవచ్చు. దానిని ఒల్లకపోవచ్చును. 'నేను' – ఇందులో నువర్ణం లోపించి 'నే' అని ఉన్నా, దానికి 'నేను' అనేఅర్థం. నువర్ణం లేకపోయినా బాధ లేదు గాబట్టి ఒకప్పుడు అక్కర్లేదనుకుంటే అది (లోపించి) పోతుంది. కాబట్టి 'నేను' లో 'ను' ద్రుతం. 'చేను' అనే శబ్దంలో 'ను' వర్ణం లేకపోతే పొలము – అనే ఆఅర్థం సిద్ధించదు. అర్థసిద్ధికి ఇందులో నువర్ణం అవసరం. కాబట్టి ఇది తొలగిపోదు. అందుచేత ఇది ద్రుతం కాదు.

చరిత్రము – అన్నపుడు మువర్ణం పోయి చరిత్ర అని ఉంటుంది. 'ము' ద్రుతం కాదు. పై ద్రుతనిర్వచనం ఇక్కడ అతివ్యాప్త మవుతున్నది. ఉన్నాను, చదువఁగలను ఇత్యాదుల్లో నువర్ణం ద్రుతమే దానికి లోపం రాదు. ఇటువంటిచోట్ల అవ్యాప్తి. ఏ మైనా ద్రుతం ఏదో వివరంగా నిరూపించినతర్వాత ఆసంజ్ఞకు వ్యుత్పత్తి చెప్పడం అవసరం గూడా కాదు.

**8. శ్లేషయందు జకార మొక్కటియ యొకయర్థమున దంత్యమును వేఱొకయర్థమునఁ దాలవ్యము నయ్యెడు నని యర్థము.** (సం.5)

చూ. 'ఒకానొకచో జకారం బుభయంబు నగు' – సూత్రవివరణం.

**9. ఇట జకారము భారతార్థమునందు దంత్యము రామాయణార్థము నందుఁ దాలవ్యము నగు నని యెఱుంగవలయును.** (సం. 5)

చూ. 'ఒకానొకచో జకారం బుభయంబు నగు' సూత్రవ్యాఖ్య.

**10. అపుడు తత్సమంబునందలిచజలు దంత్యములు కా వని యూహించునది.** (సం.6)

'రాజు వైకృతం బని కొంద ఱందురు' అనేసూత్రంవివరణంలోనిదిఈవాక్యం.

'రాజుశబ్దం బొక్కటి దంత్యయుక్తంబు గానంబడియెడి' అని సూరి సంస్కృత సమాలలో 'రాజు' అనేశబ్దం ఒక్కదానిలో మాత్రమే దంత్య(జకార)ం ఉన్న దని చెప్పాడు. 'రాజు వైకృతం బని కొంద ఱందురు' అనేప్రౌఢసూత్రాన్నిబట్టి కొందరి మతంలో రాజు – తద్భవం. కాగా దంత్యం ఉన్నరాజుశబ్దం ఒక్కటీ అచ్చతెలుగు. కాబట్టి ఇక తత్సమాలలో అంటే సంస్కృతసమాలలో చజలు దంత్యాలు లేవు. అన్నీ తాలవ్యాలే. అని దీని కర్థం.

కొన్ని అచ్చతెలుగునిఘంటువులు, కేతన మొద లైనలాక్షణికులు దీన్ని అచ్చతెనుగుగా చెప్పారు. అచ్చతెనుగుకావ్యంలో ప్రయోగింపబడింది. కాబట్టి వైకృత మని 'కొంద ఱందురు' 'అప్పుడు' అంటే వైకృత మని అంగీకరించినపుడు సంస్కృత సమాలలో దంత్యా లుండవు. తద్భవంగా రాజుశబ్దం ఒకటి ఉన్నది. అయినా తత్సమం గూడా మరొకటి ఉంది. అందులోనూ జకారం దంత్యమే.

వైకృత మని అంగీకరించకపోవడానికీ అవకాశా లున్నాయి. శబ్దరత్నాకరంలో రాజు వైకృతం అనడం చింత్యం అన్నాడు. అది తన కిష్ట మైతే 'రాజు వైకృతంబు' అని చెప్తే చాలు. 'జకారం బుభయంబు' అనేసూత్రందగ్గర పాండురాజులో జకారం దంత్యం అన్నాడు. అందుకే ఈవాక్యాలలో 'అపుడు' అనవలసివచ్చింది.

కాగా ఈవిషయంలో నిశ్చయానికి రానివ్యాకర్త ఈసూత్రం చెప్పకుండా ఉంటే బాగుండేది.

**11. ప్రత్యయాగమావ్యయాత్మక మై యుత్వవిశిష్ట మైననకారంబు ద్రుత సంజ్ఞకం బని యర్థము.** (సం. 7)

చూ. 'నకారం బసాధారణంబు ద్రుతంబు' – సూత్రవివరణం.

**12. వలయుచో నీద్రుతంబునందలియుత్వంబునకు లోపం బగు.** (7)

'నకారం బసాధారణంబు ద్రుతంబు' అనేసూత్రంవివరణంలోనిది ఈవాక్యం.

పైసూత్రంప్రకారం ప్రౌఢవ్యాకరణం ప్రత్యయం గానీ, ఆగమం గానీ, అవ్యయం గానీ అయిననకారం ఉత్వంతో కూడి 'ను' అనేరూపంతో ఉన్నవర్ణం ద్రుతం అని వివరించింది.

ద్రుత మయిన ఆ'ను'వర్ణంలోని ఉకారానికి అవసర మయితే లోపం వస్తుం దని ఈవివరణం చెప్తున్నది. 'వలయుచో' అంటే ఛందస్సులో గల గణాలు మొద

లైనవాటిని అనుసరించి అని గ్రహించాలి. ఉత్వానికి లోపం వస్తే గణభంగం అయ్యేపక్షంలో లోపం రాదు. గణభంగం కాకపోతే లోపం వస్తుంది. ఇలా అవకాశాన్ని బట్టి స్వరలోపం గ్రహించాలి.

'అతిశయముగ బుద్ధిమంతుఁ డగు బుధసేవన్' ఇక్కడ ద్రుతంలో ఉత్వం లోపించకపోతే చివరివర్ణం లఘు వై, గణ భంగ మవుతుంది. కాబట్టి ఇటువంటిచోట్ల ఉత్వం నిత్యంగా లోపిస్తుంది.

ఇలాగే 'వైజయంతీనవాంశుకవ్యాజమునను' ఇక్కడ ఉత్వం లోపిస్తే గణభంగం. కాబట్టి ఉత్వం అసలు లోపించదు.

అవసానంలో ఈస్వరలోపం వికల్పంగా రావడం ఛందస్సులో గణానుగుణంగా కుదరదు.

అవసానంలో ద్రుతస్వరలోపాన్ని బాలవ్యాకరణం చెప్పింది. చింతామణి ద్రుత లోపం మాత్రమే చెప్పింది. అందుకే యీవ్యాకర్త స్వరలోపాన్ని వివరించి ఉండవచ్చు.

**13. ఉన్నాను ఇత్యాదులయందు ద్రుతంబునందలియుకారంబునకు లోపంబు గలుగదు.** (సం. 7)

'నకారం బసాధారణంబు ద్రుతంబు' అనేసూత్రం వివరణంలోనిది ఈవాక్యం.

పైసూత్రాన్ని అనుసరించి ప్రత్యయం గానీ, ఆగమం గానీ, అవ్యయం గానీ అయి ఉత్వంతో కూడిననకారం (నువర్ణం) ద్రుతం. అవసర మయితే ఈనువర్ణంలోని ఉత్వం లోపిస్తుం దన్నాడు ప్రౌఢవ్యాకర్త. అలా రావలసిన(ఉత్వ)లోపం 'ఉన్నాను' మొద లయినవాటిల్లోని ఉకారానికి మాత్రం రాదు అని ప్రస్తుతవాక్యం వివరిస్తున్నది. 'ఉన్నాను'లో చివరిఉత్వం లోపిస్తే ఉన్నాన్, ఇటువంటిరూపాలు కవులు ప్రయోగించలేదు. ఇలాగే చదువుచున్నాను మొ. వాటిల్లో గూడా ఉత్వానికి లోపం రాదు.

'ఉన్నాను' మొద లయినవాటిల్లో ద్రుతానికి కూడా లోపం రావడం లేదు. ఉన్నా, మొ. రూపాలు కవిప్రయోగాలలో మృగ్యం. 'అవసానంబునందు ద్రుత స్వరంబున కేని ద్రుతంబున కేని లోపంబు బహుళంబుగా నగు' అనేబాలవ్యాకరణ లక్షణంలోనిబహుళపదంచేత ఇక్కడ ద్రుత, ద్రుతస్వరలోపాలు రా వని, (అప్రవృత్తి) గ్రహించవచ్చు. ప్రౌఢవ్యాకర్త బాలవ్యాకరణలక్షణాన్ని ఉద్ధరించడం లేదా సూటిగా ప్రస్తావించడం కానరాదు.

**14. శబ్దశాసనుండు ద్రుతాఖ్యో నః అని కేవలనకారగ్రహణము చేయుట ద్రుతమునకు స్థిరత్వసిద్ధికై యని తెలియవలయు.** (సం. 7)

'నకారం బసాధారణంబు ద్రుతంబు' అనేసూత్రంవివరణంలోనిది ఈవాక్యం.

నన్నయ చింతామణిలో 'ద్రుతాఖ్యో నః' అనే సూత్రం చేత 'నకారంబు ద్రుతంబు' అని చెప్పాడు. దాన్నిబట్టి వ్యాఖ్యాతలు పొల్లునకారమే చింతామణిమతంలో ద్రుతం అని వివరించారు. 'నకారం బసాధారణంబు ద్రుతంబు' అని సూత్రించినప్రౌఢవ్యాకర్త (ప్రత్యయాగ మావ్యయాత్మక మైన) నువర్ణం ద్రుతం అన్నాడు.

ఇది పై నన్నయఅభిప్రాయానికి విరుద్ధం గదా అని శంకించుకొని ఈవివరణం చేశాడు.

చింతామణిమతంలో గూడా 'ను' వర్ణమే ద్రుతం. అటువంటప్పుడు ద్రుతాఖ్యోనః అని నకారం ద్రుతం అనడం ఎందుకు? 'ద్రుతాఖ్యో నుః' అని నువర్ణం ద్రుతం అని చెప్పాలి గదా ! అంటే ద్రుతానికి స్థిరత్వం సిద్ధించడంకోసం 'న' అన్నాడు. (అంతే కాని పొల్లు నకారమే ద్రుతం అని చెప్పడానికి కాదు).

వనమును జూచెద, రాముని గొలుతు, అదియునున్ గాక మొద లైనస్థలాలను పరిశీలిస్తే ద్రుతం, 'ను - ని - న్' అని మూడు ఆకారాలతో ఉండటం గుర్తించవచ్చు. బాలవ్యాకరణం నువర్ణంలో ఉన్నఉత్వానికి ఇత్వం చెప్పి 'ని' వర్ణాన్నీ, ను(ని)లో స్వరలోపంచేత 'న్' అనేదాన్నీ సాధించింది. 'ఏకదేశవికృత మనన్యవత్' అనేన్యాయా న్ననుసరించి ద్రుత మైననువర్ణం వికృతు లైన-ని,న్ అనేవి కూడా ద్రుతసంజ్ఞను కలిగిఉంటాయి. కాబట్టి బాలవ్యాకరణమార్గంలో ద్రుతం నువర్ణం అన్నా పెద్దగా ఇబ్బంది లేదు. 'అదియునున్ గాక' వంటిస్థలాలు కొన్నింట్లో భేదం ఉన్నది.

కాని చింతామణిలో నువర్ణంలాగానే నివర్ణం గూడా ప్రత్యేకంగా విధింపబడింది. 'ఉత్వయుతౌ వనకారౌ' అన్నప్పుడు నువర్ణం విధింపబడింది. 'ని రమో మహతా' మ్మన్నప్పుడు ని వర్ణం చెప్పబడింది. 'నుమ్వోతః' ఇత్యాదుల్లో నకారపుపొల్లే చేస్తారు. కాగా వీ టన్నింటికీ ద్రుతసంజ్ఞ కలగా లంటే 'ను - ని - న్' అనేవాటికి వేర్వేరుగా ద్రుతత్వాన్ని విధించవలసి ఉంటుంది. ఆస్థితిలో ఈమూడింట్లో స్థిరంగా ఉన్నది 'న' కారం ఒక్కటే. 'ఆ'నకారాన్ని గ్రహించి 'ద్రుతోఖ్యో నః' అని చింతామణి చెప్పింది.

అంతే తప్ప చింతామణివ్యాఖ్యాతలు చెప్పినట్లు నకారపుపొల్లే ద్రుతం అని చింతామణిఅభిప్రాయం కా దని చెప్పడం ప్రౌఢవ్యాకర్త యీవివరణం తాత్పర్యం.

ఇక్కడిస్థిరశబ్దం పరుషసరళేతరం అనేఅర్థం కలిగినసంజ్ఞ గాదు.

**15. వ్యతిరేకార్థక భూతకాలికాసమాపకక్రియ ద్రుతకృతికము కా దని యర్థము.** (సం. 8)

చూ. అకప్రత్యయాంతావ్యయంబు కళయ - సూత్రవివరణం.

**16. తఱచుగ ననుటచేఁ గేవలవర్ణోచ్చారణమునం దీవిధి నిత్యము గా దని తెలియునది.** (సం. 9)

'నిర్దేశవిధానోచ్చారణంబులం దఱచుగ అవర్ణాదులు కారప్రత్యయాంతములును, రవర్ణ మిఫప్రత్యయాంతము నగు' అనేసూత్రంవివరణంలోనిది ఈవాక్యం. సూత్రంలోని తఱచుశబ్దానికి ప్రయోజనాన్ని వివరిస్తున్నది ఈవాక్యం.

పైసూత్రం నిర్దేశం, విధానం, ఉచ్చారణం అనేమూడర్థాలలో అవర్ణాదులకు కార ప్రత్యయాన్ని, రవర్ణానికి ఇఫ ప్రత్యయాన్నీ చెప్తున్నది. తఱచు అనేశబ్దంచేత 'ఉచ్చారణం' అనేఅర్థంలో మాత్రం కార, ఇఫ ప్రత్యయాలు రావడం నిత్యం గాదు. అంటే నిర్దేశ విధానాలలో కార, ఇఫ ప్రత్యయాలు రావడం నిత్యం. లకారమునకు రేఫ వచ్చును. విశేషవిధినిబట్టి కారేఫలను బాధించి దీర్ఘం వస్తే లాకు రావచ్చును. అంతే కాని దీర్ఘం కానీ, కార, ఇఫలు కానీ లేకుండా, 'ల'కు 'ర' వచ్చును- అనగూడదు.

ఉచ్చారణం అనేమూడోఅర్థంలో మాత్రం కార,ఇఫలు నిత్యం కాదు. కాబట్టి రాకపోవచ్చును. అ-ఇ-ఉ మొ.

'ఆంధ్రభాషకు వర్ణంబు లేఁబదియైదు' అనేసూత్రంవద్ద ఉదాహరణలను అ-ఆ-ఇ-ఈ- ఇత్యాదిగా వర్ణోచ్చారణలో కార, ఇఫ ప్రత్యయాలు లేకుండా చూపడం గమనించాలి.

దీర్ఘాలకు నిర్దేశవిధానాలలోనూ కార, ఇఫలు రాకపోవడం ఉన్నది. ఐకి ఔ వచ్చును. దీన్ని గూడా తఱచుశబ్దంచేతనే సాధించుకోవచ్చు.

**17. క్షారశబ్దము కటుశబ్దపర్యాయంబు నగు.** (సం. 10)

'కారము క్షారశబ్దభవము' అనేసూత్రం వివరణంలోనిది ఈవాక్యం.

పైసూత్రం తెలుగులోని కారము సంస్కృతంలోని క్షారశబ్దంనుంచి పుట్టిం దని చెప్తున్నది. సూరి 'కటుః - కారో - కారము'- అని కారము ప్రాకృతసమం అన్నాడు. సంస్కృతంలోని కటుశబ్దానికీ, తెలుగులో కారము అనేదానికీ రూపంలో

సామ్యం లేకపోవడంవల్ల సూరి ప్రాకృతాన్ని ఆశ్రయించవలసివచ్చింది. అందు కని ప్రౌఢవ్యాకర్త 'క్షార' శబ్దంతో రూపంలో సామ్యం ఉంది కాబట్టి 'క్షార' నుండి పుట్టిం దన్నాడు. రూపం మాత్రమే సమానంగా ఉంటే సరిపోతుందా అర్థం సరిపోవాలి కదా. అని శంకించుకుని సమాధానంగా ఈవివరణం చెప్పాడు.

సూరి కారము (కారో) అనేదానికి సంస్కృతంలోని 'కటు' శబ్దం మూలంగా చూపాడు. అది ప్రమాణమే కదా. క్షార శబ్దం కటుశబ్దార్థం కలిగి ఉంది. అర్థంతోపాటు రూపంలో గూడా సామ్యం ఉంది. కాబట్టి క్షారశబ్దభవం అనడం యుక్తం అని తాత్పర్యం.

'క్షార' కంటే - ప్రాకృతంలోని 'కారో' అనేదానికి రూపంలో (అర్థంలోనూ) సామ్యం ఇంకా ఎక్కువగా ఉంది. ప్రౌఢవ్యాకరణం తెలుగులోకి ప్రాకృతంనుంచి పదాలు రావడం అంగీకరించదు. ప్రాకృతసమభవాలు సంస్కృతభవాలుగా చెప్తుంది. క్షారశబ్దానికి కటుశబ్దార్థం ఉన్న దనడానికి ప్రౌఢవ్యాకర్త ప్రమాణంగా చూపిన 'క్షారలవణవర్జనం చ' అనేస్మృతివాక్యంలో క్షారశబ్దానికి కారం అనే అర్థం లేదు. 'పప్పుదినుసులు' ఇత్యాదిగా అర్థం భిన్నంగా ఉంది. క్షార-కారశబ్దాలకు అర్థంలో సామ్యం లేదు. కాబట్టి కారం క్షారశబ్దభవం కాదు.

**18. ఇందు సారూప్యము గనఁబడెడి.** (సంజ్ఞ. 10)

చూ. కారము క్షారశబ్దభవము సూత్రవ్యాఖ్య.

**19. కోట్టశబ్దపర్యాయంబుగా సంస్కృతంబునఁ గోట శబ్దంబు నొక్కండు గానంబడియెడి.** (సం. 11)

**20. దానివలనఁ గలిగిన దండు రేని యుపు డది కుండ లోనగువానివంటి దని యెఱుంగవలయును.** (సం. 11)

'కోటపేఁటలు వైకృతములు' అనేసూత్రం వివరణంలోనిది ఈవాక్యం.

పైసూత్రం 'కోట్టశబ్దభవము కోట' అని చెప్తున్నది. 'కోట్ట' అనే సంస్కృతశబ్దం నుంచి తెలుగులోని 'కోట' అనేశబ్దం తద్భవంగా ఏర్పడింది.

కాని సంస్కృతంలోనే 'కోట్ట' అనేశబ్దానికి పర్యాయంగా అదే అర్థంలో కోట అనేశబ్దం కూడా కనబడుతున్న దని చెప్తున్నది ఈవివరణవాక్యం.

'కోట్ట, కోట' - అనేరెండుశబ్దాలు సంస్కృతంలో ఉన్నపుడు కోట్టనుండి వచ్చిం దనడం దేనికి? తెలుగులోని 'కోట' శబ్దానికి దగ్గరగా ఉన్న కోటశబ్దంనుంచి

ఏర్పడింది అని చెప్పవచ్చు గదా. అని శంకించుకుని వ్యాకర్త ఇలా వివరించాడు.

'కోట' శబ్దంనుండి ఐనా తెలుగు కోట పుట్టిం దనవచ్చు. అయితే సమంగా ఉన్నది గదా అని తెలుగులోని కోట సంస్కృతసమం అనుకోడానికి వీల్లేదు. తద్భవమే. మార్పు ఏమీ లేకపోయినా సంస్కృత 'కుండ' నుంచి ఏమార్పు లేకుండా తెలుగు 'కుండ' తద్భవంగా ఏర్పడినట్లె సంస్కృతకోటనుండి తెలుగుఏకోట పుట్టిం దనీ చెప్పవచ్చు అని తాత్పర్యం.

**21. కోట్టశబ్దభవము కోట. (కోట్టారఘట్టహట్టా శ్చ)** (సం. 11)

**22. పింతా విటజనా(శ్రయః అని అమరపదపారిజాతము.**

**23. పింతాశబ్దభవము పేcట.** (సం. 11)

చూ. కోట పేcటలు వైకృతములు సూత్రవివరణం.

**24. అది వికృతియందు సహజంబ.** (సం. 11)

చూ. పేcట శబ్దార్థంబు .... వాక్యవివరణం.

**25. పేcటశబ్దార్థము ప్రకృతి యగుపింతాశబ్దార్థముకంటె నించుక భిన్నముగా నున్నది.** (సం. 11)

'కోట పేcటలు వైకృతములు' అనేసూత్రంవివరణంలోనిది ఈవాక్యం.

సూరి పేటశబ్దం దేశ్యం అనగా 'కోటపేcటలు వైకృతములు' అనేసూత్రం 'పేcట' శబ్దం తద్భవం అని చెప్పింది. 'పింతాశబ్దభవము పేcట' అని పేcట సంస్కృతంలోని పింతా అనేశబ్దంనుండి పుట్టిం దని చెప్పాడు ప్రౌఢవ్యాకర్త.

అయితే 'పింతా విటజనా(శ్రయః' అని పింతాశబ్దానికి విటులు ఉండేచోటు అని అర్థం. తెలుగులో పేటశబ్దం సామాన్యంగా జనం నివసించేచోటు అనేఅర్థం మాత్రం తెలుపుతుంది. అర్థంలో ఈభేదాన్నిబట్టి పేcటశబ్దం పింతాశబ్దభవం అనడం కుదరదు. అందుచేత వైకృతం అనడం తప్పు, సూరి చెప్పినట్లు దేశ్యమే అనీ చెప్పాలి. అనేఅభిప్రాయానికి ఈవివరణం సమాధానం.

అర్థంలో కొంచెం భేదం ఉన్నా తద్భవమె అని వివరిస్తున్నాడు ప్రౌఢవ్యాకర్త. మూల సంస్కృతశబ్దార్థం తద్భవ మైనపుడు తెలుగులో కొంచెం భిన్నంగా ఉండడం సహజమె. 'గౌరవమ్' అనే సంస్కృతశబ్దానికి లేని వాత్సల్యం మొద లైనఅర్థాలు తద్భవ మైన 'గారవము' శబ్దానికి ఉన్నాయి. అర్థంలో ఇటువంటిమార్పులను వైకృతదీపికలో ఈవ్యాకర్త అనేకతద్భవాల్లో ప్రస్తావించాడు. కాగా ప్రకృతిఅర్థం

వికృతిలో మారడం ఇతరస్థలాల్లో వలెనే ఇక్కడ గూడ ఉన్నది. అందుచేత అర్థంలో భేదం ఉన్నా ఇది తద్భవమె. పేట – పింఠా శబ్దభవమే అని సారాంశం.

**26. ఇయ్యది ప్రాణకుట్టకశబ్దభవము.** (సం. 12)

**27. అంచపదము అంచయాన లోనగువానివంటిది.** (సం. 12)

'ప్రాణగొడ్డ మగ్రామ్యంబు నాఁదగు' అనేసూత్రంవివరణంలోనిది ఈవాక్యం.

తెలుగులోని ప్రాణగొడ్డము అనేశబ్దం ప్రాణకుట్టక అనేసంస్కృతసమాసంనుండి తద్భవంగా ఏర్పడింది. వైకృతదీపికలో ఈవ్యాకర్త 'ప్రాణకుట్ట' శబ్దభవం అన్నాడు.

ఇది అంచపదము అంచయాన మొద లైనతద్భవాలవంటిది. 'హంసపద, హంసయాన' అనేసంస్కృతసమాసాలనుంచి అంచపదము అంచయాన అనేతద్భవ శబ్దాలు ఏర్పడ్డాయి. ఈవిధంగా సంస్కృతంలోని సమాసరూపం మొత్తం తెలుగులో తద్భవం కావడం అనేపద్ధతి ఉంది. అదే మార్గంలో 'ప్రాణకుట్టక' అనేసంస్కృత సమాసంనుంచి 'ప్రాణగొడ్డము' అనేతద్భవం ఏర్పడడంలో వింత లే దని ఈవివరణం తాత్పర్యం. ప్రత్యేకశబ్దంనుంచే కాక సమాసాలనుంచి కూడా తద్భవా లేర్పడతా యనడానికి వ్యాకర్త అంచపదము అంచయాన అనేవాటిని ప్రాణగొడ్డానికి పోలికగా చూపా దని గ్రహించాలి.

అయితే పై తద్భవాల్లో సంస్కృతసమాసంలోని పూర్వపదం మారింది. ఉత్తరపదం అలాగే ఉంది. 'ప్రాణగొడ్డము' అనేతద్భవంలో ఉత్తరపదం మార్పు చెందగా పూర్వ పదం అలాగే ఉంది. ఈవిషయంలో వీటికి పోలిక కుదరలేదు. యోగపాదుకా– యోగవాగె, నాగస్వరః – నాగసరము అనేరీతివాటిని పోలికగా ఇస్తే సమాసాలనుంచి తద్భవం ఏర్పడ వ చ్చని మాత్రమే కాక పూర్వపదం తద్భవంలో మార్పు చెందక పోవడానికి కూడా పోలిక సరిపోయేది.

**28. తఱచుగ ననుటచే నొక్కొకచో ననుకరణసహితంబు నగు నని యెఱుంగవలయు.** (సం. 16)

'జయపదం బనుకరణ విరహితంబ తఱచుగ నగు' అనేసూత్రంవివరణంలోనిది ఈవాక్యం. సూత్రంలోని తఱచుశబ్దం ప్రయోజనాన్ని ఈవాక్యం వివరిస్తున్నది.

సంస్కృతవాక్యం లేదా పదం అనుకరణం లేకుండా తెలుగులో ప్రయోగించ గూడ దని చింతామణి చెప్పింది. బాలవ్యాకరణం అభిప్రాయం కూడా ఇదే అనవచ్చు. కాగా జయ అనేసంస్కృతపదం అనుకరణం లేకుండా ప్రయోగింపబడటాన్ని

ప్రౌఢవ్యాకర్త ఈసూత్రంతో చెప్తున్నాడు. అయితే అనుకరణవిరహితం కావడం 'తఱచు' అనడంవల్ల అరుదుగా అనుకరణసహితం కూడా కావ చ్చని అర్థం. 'జయ' సంస్కృతక్రియాపదం. తెలుగులో అనుకరణవిరహితంగానే తఱచుగా ప్రయోగింప బడుతున్నది. జయపూతనాఘాత. అరుదుగా అనుకరణం ఉండి కూడా ప్రయోగించవచ్చు.

కాని అటువంటిప్రయోగాన్ని వ్యాకర్త చూపలేదు. జయ పూతనాఘాత అనేవిధంగా జయపదం అనుకరణం లేకుండా ప్రయోగించినస్థలాల్లో ఎక్కడా గూడా 'జయ యని పూతనాఘాత' ఇత్యాదిగా అనుకరణం ఉండేఅవకాశం లేదు. అలాగే 'నన్ను జయింపుము, చూతము' అనేవిధ మైనస్థలాల్లో 'నన్ను జయ చూతము' అనేవిధంగా ప్రయోగింపబడదు.

'విరహితంబ' అని అవధారణార్థకం చేర్చి 'తఱచుగా' అనడం కొంత విలక్షణంగా ఉంది. అవధారణార్థకం చేర్చడంలో వ్యాకర్త అభిప్రాయ మేమో. ఈవివరణం లక్ష్యానుగుణం కాదు. ('జయ పూతనాఘాత' ఇత్యాదుల్లో జయ అవ్యయంగా తెలుగులో ప్రయోగింపబడిందా అని సందేహం. పరిశీలించాలి.)

# సంధిపరిచ్ఛేదం

## 1. ఆదిశబ్దము అన్న, అక్క, అప్పలను దెలిపెడు. (సంధి. 1)

శ్రేష్ఠతావాచకంబు లగునార్యాంబాద్యర్థకశబ్దంబులు పరంబు లగుచో నన్ని యచ్చులకు సంధి నిత్యము' అనేసూత్రంవివరణంలోనిది ఈవాక్యం. సూత్రంలోని ఆదిశబ్దం అర్థాన్ని ఈవాక్యం వివరిస్తున్నది.

పైసూత్రంలో 'ఆర్యాంబాద్యర్థక' అన్నచోటి 'ఆది' శబ్దం అన్న, అక్క, అప్ప అనేశబ్దాలను తెలియజేస్తుం దని ఈవివరణానికి అర్థం.

కాగా ఆర్యాంబార్థకము లైన అయ్య, అమ్మ అనేవి మాత్రమే కాక ఆదిశబ్దంచే బోధింపబడే అన్న, అక్క, అప్ప అనేశబ్దాలు పరంగా ఉన్నపుడు కూడ సంధి అన్ని అచ్చులకు సంధి నిత్యంగా వస్తుం దని ఈవివరణం తాత్పర్యం.

నరసింగ+అన్న= నరసింగన్న, రామ+అప్ప= రామప్ప. మొ.

ఇలాగే, తిమ్మ + అరుసు = తిమ్మరుసు, మొ.

**2. భూతకాలికాసమాపకక్రియయొక్క యికారమునకుఁ బ్రామాణిక ప్రయోగములందును గొన్నియెడల సంధి గనఁబడుచున్న దని యర్థము.**
(సంధి. 2)

చూ. 'ఇప్రత్యయాంతావ్యయంబునకు సంధియుఁ జూపట్టెడి'. సూత్రవివరణం.

**3. నన్నయభట్టారకుఁడు 'అన్నిష్టసఖి నూఁదియున్నదాని అని ప్రయోగించి 'లుక్సంశ్లేషౌ నాచి ద్రుతస్య' అని సంశ్లేషమును నిషేధించుట ప్రయోగవైరళ్యసూచనార్థం బని యెఱుంగునది.** (సంధి. 3)

'కొన్నియెడలఁ బ్రామాణిక ప్రయోగంబులం ద్రుతంబున కచ్చు పరం బగుచో ద్విత్వంబు చూపట్టెడి' అనేసూత్రం వివరణంలోనిది ఈవాక్యం.

పైసూత్రంతో ప్రౌఢవ్యాకరణం అచ్చు పరంగా ఉండగా ద్రుతానికి ద్విత్వం చెప్పింది. లాక్షణికులు చాలమంది దీన్ని దుస్సంధి అని తిరస్కరించారు. 'లుక్సంశ్లేషౌ నాచి ద్రుతస్య' అని చింతామణిలో నన్నయ ద్రుతానికి సంశ్లేషం నిషేధించాడు. అచ్చు పరంగా ఉండగా ద్రుతానికి సంశ్లేషం అంటే ద్రుతద్విత్వం అని అప్పకవ్యాదులు చెప్పారు. చింతామణి నిషేధించినద్రుతద్విత్వాన్ని ప్రౌఢవ్యాకరణం విధించడం యుక్తమా అని సందేహం.

నన్నయ అన్+ఇష్టసఖి అన్నపుడు ద్రుతానికి ద్విత్వం చేసి, అన్నిష్టసఖి అని ప్రయోగించాడు. కాబట్టి ద్రుతద్విత్వవిధానం నన్నయాదిప్రామాణికకవిసమ్మతమె. అందుచేత చెప్పడం యుక్తమె.

అయితే నన్నయ, భారతంలో ద్రుతద్విత్వాన్ని ప్రయోగించి, చింతామణిలో 'లుక్సంశ్లేషౌ న' అని నిషేధించడం ఏమిటి? తనప్రయోగాలకే విరుద్ధంగా తాను లక్షణం చెప్పి తనప్రయోగాలను లక్షణవిరుద్ధాలుగా గ్రామ్యాలను చేయడం సక్రమమా?

నిషేధించడాన్నిబట్టి ద్రుతానికి ద్విత్వం చేయరాదు. ప్రయోగించాడు గాబట్టి చేసుకోవచ్చు. అంటే అరుదుగా ద్రుతానికి ద్విత్వం చేయవచ్చు అని తాత్పర్యం. ఇలా ఈప్రౌఢ.లక్షణం నన్నయలక్ష్యలక్షణాలకు అనుగుణం. సూత్రంలో 'కొన్నియెడల' అన్న దందుకే.

ద్రుతద్విత్వానికి నన్నయ ప్రయోగం ఇ దొక్కటి చూపాడు ప్రౌఢవ్యాకర్త. ఇది పెన్వాదిసూత్రందగ్గర 'పెన్నరదము' ఇత్యాదులవలె ద్రుతేతర మైనహల్లుకు ద్విత్వంగా

సమన్వయించాడు. అది యుక్తం. ఈ 'అను – అన్' లో నకారం ద్రుతం కాదు. కాగా 'అన్నిష్టసఖి'లో ద్రుతద్విత్వం లేదు.

**4. ఇయ్యది తదితరంబులకు నుపలక్షణం బని యెఱుంగునది.** (4)

'చిట్టడవిఁ జిట్టి' అనేసూత్రం వివరణంలోనిది ఈవాక్యం.

సూత్రంలో ఉచ్చరింపబడిన 'చిట్టడవి' అనేశబ్దం ఇటువంటి ఇతరశబ్దాలకు ఉపలక్షకం అంటే వాటిని గూడా తెలియజేస్తుంది.

'చిట్టడవిఁ జిట్టి' అనేసూత్రం 'చిట్టడవి' అనేదానిలో పూర్వపదం 'చిట్టి' అని పేర్కొంటున్నది. సూత్రంలో ఉచ్చరించినది 'చిట్టడవి' శబ్దం ఒక్కటే కాబట్టి ఆఒక్కచోట మాత్రమే పూర్వపదం చిట్టి. కాబట్టి చిట్టెలుక ఇత్యాదుల్లో చిన్నయసూరి చెప్పినట్లుగా పూర్వపదం చిఱు(త) అవుతుంది.

సూత్రంలోని 'చిట్టడవి' అనేశబ్దం చిట్టెలుక మొద లయినఇతరశబ్దాలను గూడ తెలియజేస్తుంది. అని యీవివరణం అభిప్రాయం. దీనివల్ల చిట్టెలుక మొద లయిన వాటిల్లో గూడా చిట్టి అనేదే పూర్వపదం. కాబట్టి సూరి చెప్పినట్లుగా 'చిఱు' కాదు. కుఱు చిఱు సూత్రంలో 'చిఱు' శబ్దం చేర్చడం అనవసరం అని తాత్పర్యం.

'ఉపలక్షణమార్గంకంటె 'చిట్టడవిప్రభృతుల' ఇత్యాదిగా సూత్రంలోనే ఈఅంశం స్పష్టం చేయడం యుక్తం.

**5. చిట్టడవి – – – ఇత్యాదులందుఁ బూర్వపదము చిట్టిశబ్ద మని యర్థము.** (సంధి. 4)

చూ. చిట్టడవిఁ జిట్టి సూత్రవ్యాఖ్య

**6. ఇవి సంజ్ఞావాచకంబులు గాన సంధి నిత్యము.** (సంధి. 4)

'చిట్టడవిఁ జిట్టి' అనేసూత్రం వివరణంలోనిది ఈవాక్యం.

పైసూత్రం చిట్టడవి,చిట్టెలుక మొద లైనస్థలాలలో పూర్వపదం 'చిట్టి' అని పేర్కొన్నది. కాబట్టి చిట్టి+అడవి, ఇత్యాదిగా ఉండగా సంధి జరిగేవిషయాన్ని ఈవాక్యం వివరిస్తున్నది.

చిట్టడవి మొదలుగా 'చిట్టి'శబ్దం పూర్వపదంగా ఉన్నఈశబ్దాలు సంజ్ఞావాచకాలు. అంటే పేర్లు. కాబట్టి సంధి నిత్యంగా వస్తుంది. అని ఈవివరణం తాత్పర్యం. సంధి నిత్యం గాబట్టి చిట్టడవి, చిట్టెలుక అని మాత్రమే అవుతుంది. కాని చిట్టియడవి

అనేవిధంగా సంధి రాక, యడాగమం వచ్చినరూపా లుండవు.

చిట్టిశబ్దాన్ని ఏమ్యాదుల్లో చేర్చుకుంటే 'ఏమ్యాదులయిత్తునకు సంధి వైకల్పికము' కాబట్టి సంధి రాని (యడాగమం వచ్చిన) రూపాలు ఉండవలసివస్తుంది. దాన్ని వారించడానికి ఈవివరణం నిత్యసంధిని పేర్కొన్నది.

కాని ఈవివరణం నిత్యసంధిని విధించకుండా అది పూర్వసిద్ధం అన్నట్లుగా చెప్తున్నది. సంజ్ఞావాచకంబులు కాబట్టి సంధి నిత్యం అంటే సంజ్ఞావాచకాల్లో సంధి నిత్యంగా వస్తుం దని ఎవరు చెప్పారు? చింతామణి గాని, చిన్నయసూరి గాని చెప్పలేదు. ప్రౌఢవ్యాకరణమూ చెప్పలేదు. రామయ్య మొద లైనవి సంజ్ఞా వాచకాలే. అక్కడ సంధి నిత్యమే. బహుశః ఈవివరణం దానిని ఉద్దేశించే చెప్పడం జరిగిం దేమొ. ఆసూత్రం 'శ్రేష్ఠతావాచకంబు లగునార్యాంబాద్యర్థకశబ్దంబులు పరంబు లగునపుడు' సంధిని చెప్పింది. అడవి, ఎలుక ఇత్యాదిగా ఇక్కడిఉత్తరపదాలు శ్రేష్ఠతావాచకాలు కాదు గదా. పయిగా 'చిట్టడవి' ఇత్యాదులను సంజ్ఞలుగా పేర్కొనడం గూడా విచార్యమె.

చిట్టిశబ్దేకారానికి ఇక్కడ సంధి నిత్యంగా రావడం (వివరణంలో నైనా) విశేషంగా విధిస్తే బాగుండేది.

## 7. హల్లు పరం బగుచో ద్విత్వంబునకు లోపంబు వైకల్పికంబు. (4)

'చిట్టడవిఁ జిట్టి' అనేసూత్రం వివరణంలోనిది ఈవాక్యం.

పైసూత్రం చిట్టడవి, చిట్టెలుక మొద లైనసమాసాల్లో పూర్వపదం 'చిట్టి' అని పేర్కొంది. ప్రసంగవశంగా చిట్టిశబ్దాన్నిగురించి వేరే విషయం ఈవాక్యంలో వ్యాకర్త ప్రస్తావిస్తున్నాడు.

హలాదిశబ్దంతో సమాసం జరిగినపుడు చిట్టిశబ్దానికి హల్లు పరంగా ఉంటుంది. అప్పుడు చిట్టిశబ్దంలో ద్విత్వానికి (ఒక టకారానికి) వికల్పంగా లోపం వస్తుంది. చిట్టితాళము. (ద్విత్వం లోపిస్తే) చిటితాళము, (లోపించకుంటే) చిట్టితాళము. కాగా అచ్చు పరంగా ఉంటే లోపం రాదు. చిట్టడవి. చిటడవి అని ఉండదు.

'అక్కటాదులజడ్డకు లోపంబు విభాష నగు' అనేసూత్రంచేత ఈద్విత్వలోపం బాలవ్యాకరణం సాధించింది. అక్కటాదుల్లో సూరి చిట్టిశబ్దాన్ని చూపాడు కూడా. అచ్చు పరంగా ఉండగా లోపం లేకపోవడం విషయం "జడ్డక్కరంబుతోఁ బదాది స్వరంబు గూడుచో జడ్డకు లోపంబు లేదు' అనేసూత్రంచేత బాలవ్యాకరణం చెప్పే ఉంది. దీనివల్ల సంధిప్రసంగం లేనపుడు గూడా ద్విత్వం లోపిస్తుంది. చిటి.

ఈవివరణంలో వ్యాకర్త ప్రస్తావించినఅంశం పూర్వోక్తమే. కాబట్టి దీనికి ప్రయోజనం స్పష్టతే అనుకోవాలి.

**8. కొన్నియెడల ననఁగాఁ బ్రాసంబులం దని యర్థము.** (సంధి. 5)

'కొన్నియెడలఁ దెనుఁగులమీఁదిసాంస్కృతికకతపలకు గదవలు గానంబడియెడి' అనేసూత్రంవివరణంలోనిది ఈవాక్యం. సూత్రంలోని 'కొన్నియెడల' అనేపదం అర్థాన్ని 'ప్రాసలలో' అని వివరిస్తున్నది.

ప్రథమాంతా లయిన అచ్చతెలుగుశబ్దాలకు పరంగా, ప్రాసస్థానంలో ఉన్న సంస్కృతసమశబ్దంమొదటి క-త-ప అనేవర్ణాలకు గ-ద-వ అనేవర్ణాలు రావడం కనబడుతున్న దని సారాంశం.

వీరల్ గోపించిన, ఇట్లు దపంబు, వేవణములు. ఇ వన్నీ ప్రాసగతాలే.

నిజానికి కొన్నియెడల అనేదానికి ప్రాసంబులందు అనేఅర్థం సూత్రకర్త చెప్తే తప్పు తెలియదు. కొన్నియెడల అనడానికి బదులుగా సూత్రంలోనే 'ప్రాసంబులందు' అంటే బాగుండేది. కాని ఈకార్యం ప్రాసలోనే వస్తుంది అని చెప్పడం యుక్తియుక్తం గాదు. ప్రాసఘటితం ప్రమాణం అవుతుంది. ప్రాసేతరస్థలాల్లో రా దని నిషేధించడం ఎంతవరకు సమంజసం. సూత్రం బాగానే ఉంది. వివరణమె అవసరం కాదు అనిపిస్తుంది.

**9. పెనుశబ్దము పెనుపుశబ్దలుప్తశేషము.** (సంధి. 9)

'తఱచుగఁ గర్మధారయసమాసంబునం బెన్వాదుల కడహల్లున కచ్చు పరం బగునపుడు ద్విత్వంబు గానంబడియెడి' అనేసూత్రంవివరణంలోనిది ఈవాక్యం. సూత్రంలోని 'పెను' శబ్దాన్ని గూర్చి ఈవాక్యం వివరిస్తున్నది.

పైసూత్రంలో పెన్వాదులు అంటే 'పెను' మొద లైనవి అని అర్థం. ఇందులో మొదటి దైన 'పెను' అనేశబ్దం 'పెనుపు' అనేశబ్దంలోని చివరిఅక్షరం లోపించగా మిగిలినరూపం. ఇలా అంతిమాక్షరలోపం సమాసంలో జరుగుతుంది. కాగా ఇక్కడి 'పెను' అనేది ప్రత్యేకశబ్దం కాదు.

పెనుపు అనేవిశేషణానికి విశేష్యంతో కర్మధారయసమాసం చేయగా 'ఆచ్ఛికసమాసములం దఱచుగ వర్ణలోపాగమాదేశవికారంబులు నిత్యవైకల్పికములుగాఁ బెక్కులు గానంబడియెడి' అనేసూత్రంచేత పెనుపు అనేశబ్దంలో చివరిఅక్షరం (పు) లోపించగా మిగిలిన (పెను)దానికి ప్రస్తుతసూత్రంచేత చివరిఉత్వం లోపించి, (పెన్) చివరిహల్లు

(న్)కు ద్విత్వం వచ్చి, పెన్నరదము, పెన్నదరులు ఇత్యాదిగా రూపాలు ఏర్పడతాయి.

**10. తఱచుగ ననుటచే 'అన్నిష్టసఖి నూఁదియున్నదాని' ఇత్యాదులు గ్రాహ్యంబులు.** (సంధి. 9)

తఱచుగఁ గర్మధారయసమాసంబునం బెన్వాదుల కడహల్లున కచ్చు పరం బగునపుడు ద్విత్వంబు గానంబడియెడి' అనేసూత్రంవివరణంలోనిది ఈవాక్యం. సూత్రంలోని తఱచు శబ్దానికి ప్రయోజనాన్ని ఈవాక్యం వివరిస్తున్నది.

సూత్రంలోని 'తఱచు'శబ్దంచేత అన్నిష్టసఖి (అను+ఇష్టసఖి), అన్నుర్వీశుఁడు (అను+ఉర్వీశుఁడు), పెన్నురము (పెను+ఉరము) మొద లైనవి గ్రహింపదగినవి అని వాక్యాని కర్థం.

వీటిలో విశేషం వ్యాకర్త స్పష్టం చేయలేదు. 'పెన్నురము' అన్నపుడు 'పెను' పెన్వాదులలోదే. ఆదిశబ్దంచేత 'అను' గ్రహింపవచ్చు.

సూత్రానికి సాధారణ మైనఉదాహరణలుగా చూపిన 'పెన్నదరులు, పెన్నరదము, కన్నాకు పల్లఱపు అనేవాటిల్లో అన్నింట్లోనూ ఉత్తరపదం ఆచ్ఛికమే. విశేషంగా చూపిన వీటిఅన్నింట్లోనూ (ఇష్టసఖి, ఉర్వీశుఁడు, ఉరము) ఉత్తరపదాలు సంస్కృత సమాలు. కాగా తఱచుశబ్దంచేత మిశ్రసమాసాలలోనూ, సంస్కృతసమం పరంగా ఉండగా ద్విత్వం వస్తుం దని చెప్పాలి. ఆచ్ఛికసమాసాల్లో సాధారణ మన్నమాట.

అను+ఇష్టసఖి అని ఉన్నపుడు సంస్కృతసమం పరంగా ఉన్నప్పటికీ, ప్రస్తుత సూత్రంలోని తఱచుశబ్దంచేత అను లోని ఉత్వం లోపించి(అన్+ఇష్టసఖి) కడహల్లు నకారానికి ద్విత్వం వచ్చి, అన్నిష్టసఖి అని అవుతుంది. ఇలాగే అన్నుర్వీశుడు మొ.

కాని 'ఆచ్ఛికసమాసంబులందు' అనక 'కర్మధారయసమాసములం' దని సామాన్యంగా చెప్పడంచేత ఆచ్ఛికసమాసాల్లోలాగానే మిశ్రసమాసాల్లో కూడా ఈకార్యం సాధారణంగానే అవుతుంది. కాబట్టి యీప్రయోజనానికే అయితే సూత్రంలో 'తఱచుగ' అనడం అనవసరం. కర్మధారయేతరసమాసంలో ద్విత్వం మొ. ఇతరవిధ మైనప్రయోగం ఉంటే ప్రయోజనంగా చూపాలి.

**11. వింజామరము (వెల్ల+చామరము) సంధియందు వర్ణవికారము.**

(సంధి. 12)

'సమాసమందుఁ దత్సమంబు పరం బగునపుడును నుమాగమాదులు గానంబడియెడి' అనేసూత్రంవివరణంలోనిది ఈవాక్యం.

వెల్ల అనేఅచ్చతెలుగుశబ్దానికి చామరము అనేతత్సమశబ్దంతో 'క్రొత్తాదులు లుప్తశేషంబులు దేశ్యంబులతోడంబలెఁ దత్సమంబులతోడం గర్మధారయం బగు' అనేసూత్రంప్రకారం మిశ్రకర్మధారయసమాసం ఏర్పడి 'వెల్ల+చామరము'. పైసూత్రం ప్రకారం (తొలియచ్చుమీదివర్ణాలు లోపించి) నుమాగమం రాగా వె+ను+ చామరము. ద్రుతకార్యాలు జరిగి వెంజామరము అని కావలసిఉంది. కాని రూపం వింజామరము అని కవిప్రయుక్తం. కాగా వెను+చామర అనేచోట 'ఇట సంధియందు వర్ణవికారము' అనేసూత్రకర్త వివరణవాక్యాన్ని అనుసరించి 'వె' లోని ఎత్వానికి ఇత్వం వచ్చి, వి+ చామరము. ఇపుడు ద్రుతకార్యాలు జరిగి వింజామరము అని అవుతుంది అని ఈవివరణం తాత్పర్యం.

తొలియచ్చుమీదివర్ణాళకు ప్రాతాదిసూత్రంచేత లోపం చేసేపక్షంలో ఆసూత్రంలోని బహుళపదంచేత ఈవర్ణవికారం సిద్ధిస్తుంది. కాని ప్రౌఢవ్యాకర్తకు ఆదృష్టి లేదు.

**12. నెన్నడ - నెన్నడుము ఇత్యాదులయందు నెఱిశబ్దము పూర్వ పదంబుగా నుండుట యుక్త మగు నని యర్థము.** (సంధి. 14)

**13. నెఱ పూర్ణార్థకము - నెఱి రమ్యార్థకము.** (సంధి. 14)

చూ. నెన్నడాదుల న్నెఱి దగు. సూత్రవివరణం.

**14. అసమాసంబునం బూశబ్దము పూవుశబ్దముయొక్క పర్యాయముగా గానంబడియెడి నని యర్థము.**

చూ. పూపూవు సూత్రవ్యాఖ్య.

# శబ్దపరిచ్ఛేదం

**1. అయ్య అన్న అమ్మ అక్క మొద లగునవి విశేష్యములు.** (శబ్ద. 1)

**2. తక్కినవి విశేషణంబులు.** (శబ్ద. 1)

చూ. 'శబ్దములు విశేష్యములు విశేషణము లని ద్వివిధంబులు' సూత్రవ్యాఖ్య.

**3. అన్వయక్రమమునందు విశేషణములను ముందు చెప్పి కడపట విశేష్యమును జెప్పవలె ననుట.** (శబ్ద. 7)

చూ. 'ప్రధానంబు పశ్చాద్వాచ్యం బగు' సూత్రవ్యాఖ్య.

**4. ఒక్కచో ననఁగా సంబోధ్యవాచకంబు క్రియాజన్యవిశేషణపూర్వకం బగునపు డనియు ,ఇతరశబ్దం బనఁగా అక్రియాజన్యవిశేషణమునకు సంబంధించినపద మనియు నర్థము.** (శబ్ద. 13)

'ఓశబ్దం బొక్కచో సంబోధ్యవాచకమునకు ముం దితరశబ్దవ్యవహితం బయి కానంబడియెడి' అనేసూత్రం వివరణంలోనిది ఈవాక్యం. సూత్రంలోని 'ఒక్కచో' అనేశబ్దం అర్థాన్ని ఈవాక్యం వివరిస్తున్నది.

సంబోధింపబడేది సంబోధ్యం. దానిని తెలియజేసేశబ్దం సంబోధ్యవాచకం. క్రియాజన్యవిశేషణం అంటే ధాతుజవిశేషణం. సంబోధ్యవాచకానికి పూర్వంలో ధాతుజవిశేషణం ఉంటే దానికి పూర్వంలో ఉన్న ఓశ బ్దానికీ, సంబోధ్యవాచకానికీ మధ్యలో ధాతుజవిశేషణానికి సంబంధించినపదంతో వ్యవధానం ఉంటుం దని ఈవాక్యానికి అర్థం.

ఓవినువీధి నున్నఖచరోత్తములార! ఇక్కడ ఖచరోత్తములార అనేది సంబోధ్య వాచకం. దీనికి పూర్వంలో 'ఉన్న' అనేధాతుజవిశేషణం ఉన్నది. ఉన్న ఖచరోత్తములు అనేది సమాసం. కాబట్టి 'ఓ ఉన్న ఖచరోత్తములార' అని ఉండవచ్చు. కాని ఓ శబ్దానికీ, (ఉన్న) ఖచరోత్తములార అనేసంబోధ్యవాచకానికీ నడుమ ఉన్న అనేధాతుజ విశేషణానికి సంబంధించిన, అంటే ధాతుజవిశేషణంలోని కన్వయించే 'వినువీధిన్' అనేపదంతో వ్యవధానం ఉన్నది. ఇలా సంబోధ్యవాచకానికీ దానికి ముందుండే ఓశబ్దానికీ మధ్యలో వ్యవధానం (సంబోధ్యవాచకం సమాసం పొందినధాతుజ విశేషణం ఉన్నపుడు ఆధాతుజవిశేషణానికి సంబంధించినపదంతో మాత్రమే ఉంటుంది. ఇటువంటిస్థితి ధాతుజవిశేషణం లేనపుడు ఉండ దని తాత్పర్యం.)

సూరి ఓ శబ్దము సంబోధ్యవాచకానికి ముందే ప్రయోగింపబడుతుం దని చెప్పగా వ్యవధానం ఉంటుంది అనేది విశేషం అనేదృష్టితో వ్యాకర్త ఈలక్షణం చెప్పిఉండవచ్చు.

**5. ఒకానొకయాధునికగ్రంథమునందు 'అన్నరో, ఏనుంగురో' అని**

**కవిప్రయోగములు కానంబడుచున్నవి. వానికిఁ బ్రామాణికప్రయోగములు కానంబడవు.** (శబ్ద. 14)

'రోశబ్దం బొండు సంబోధనంబున స్త్రీవాచకంబునకుం బరంబుగ నగు' అనేసూత్రం వివరణంలోనిది ఈవాక్యం.

పైసూత్రం సంబోధనంలో స్త్రీవాచకాలమీద రోశబ్దాన్ని విధించింది. మహాకవి ప్రయోగాలు కూడా అలాగే ఉన్నాయి. కాని ఆధునికు డైన కూచిమంచి తిమ్మకవి తన అచ్చతెనుగు రామాయణంలో అన్నరొ, ఏనుంగురొ అని ప్రయోగించాడు. ఇందులో 'అన్న' అనేది మహత్తు. ఏనుంగు అనేది తిర్యక్కు. స్త్రీవాచకాలకు చెప్పిన యీకార్యం స్త్రీవాచకాలు కానిశబ్దాలపై రావడం ఈలక్షణానికి విరుద్ధం.

స్త్రీవాచకాలమీద 'రో'ను విధించిన అధర్వణుఁడు 'అన్య త్రాపి క్వచిద్ రో స్యాద్ రూఢదేశ్యప్రయోగతః' అని స్త్రీవాచకేతరాలపై గూడ 'రో' శబ్దాన్ని చెప్పాడు. అమ్మచెల్లరో. మొ. దానిప్రకారం ఈప్రయోగాలు లక్షణబద్ధాలే అవుతాయి.

అయినా ప్రౌఢవ్యాకర్త – స్త్రీవాచకేతరాలమీద రోశబ్దం ప్రామాణిక కవి ప్రయోగాలలో కనబడడం లేదు. కాబట్టి ఈఆధునికప్రయోగాలను లక్షణబద్ధం చేయలేదు. ఈకవి యితరప్రయోగాలను ఇతరప్రామాణికప్రయోగాలనుబట్టి గ్రహించా డన్నమాట.

ఆధునికకృతులలో గం గనుకాసె, నెలఁ తిచ్చెను అనేప్రయోగా లున్నా అధర్వణుడు సంస్కృతీయాచ్చుకు సంధి చెప్పినా, చిన్నయసూరి విశేషంగా ప్రస్తావించడం ఇక్కడ స్మరించాలి.

**6. కొన్ని యనఁగాఁ గీడుప్రభృతులును నల్లాదులును.** (శబ్ద. 10)

'తెనుఁగునం గొన్ని శబ్దములు విశేషణవిశేష్యంబు లుభయంబులు నగు' అనేసూత్రం వివరణంలోనిది ఈవాక్యం. సూత్రంలోని 'కొన్ని' శబ్దాన్ని వివరిస్తున్నది ఈవాక్యం.

తెలుగులో కీడు మొద లైనవీ, నల్ల మొద లైనవీ, విశేషణాలూ, విశేష్యాలూ రెండూ అవుతాయి అని సూత్రం చెప్తున్నది.

కీడు దొలగునట్లు. ఇక్కడ కీడు అనేది పాపం అనేఅర్థంతో విశేష్య మై 'తొలగు' అనేక్రియలోనికి అన్వయిస్తూ ప్రధాన మైంది. ఇలాగే కీడు లేదు. పెద్ద కీడు మొ.

నీ వేమిట నిమ్మహాధ్వరంబు కీ డంటి. ఇక్కడ మహాధ్వరంబు అనేదానికి 'కీడు' విశేషణం.

కీడు ప్రభృతు లంటే మేలు మొ. కర్మములు మేలు నిచ్చును – విశేష్యం. యుగంబులఁ గృతంబు మేలు. 'కృతంబు' అనేదానికి 'మేలు' విశేషణం.

ధవళదేహంబునందు నల్ల గలిగిన. ఇక్కడ నలుపు అనేఅర్థంలో నల్ల – విశేష్యం. కలుగు క్రియతో అన్వయం.

'నల్లతిరునామము' – ఇక్కడ తిరునామము అనేదానికి నల్ల విశేషణం.

**7. ఈకవి పాపజాతికాన అని ప్రయోగించినాఁడు అది విచార్యము.**

(శబ్ద. 15)

'దేశ్యంబులం గొన్నియెడల స్త్రీవాచక స్త్రీసమంబు లగుసంబోధ్యవాచకశబ్దంబుల మీఁద నేకవచనంబునఁ గాన శబ్దం బొందును అల యనునవ్యయం బొందును గానంబడియెడి. అల దీర్ఘాంతంబు నగు' అనేసూత్రంవివరణంలోనిది ఈవాక్యం.

పైసూత్రం దేశ్యస్త్రీవాచక స్త్రీసమాలమీద కొన్నియెడల 'కాన' (అల) వస్తుం దని చెప్తున్నది.

'మాసామికాన' అన్నపుడు 'సామి' అనే దేశ్య(ఆచ్ఛిక)శబ్దం మీద 'కాన' ప్రయోగించిన చేమకూర వేంకటకవి స్థలాంతరంలో 'పాపజాతికాన' అని ప్రయోగించాడు. ఆప్రయోగం విచారింపదగినది. అంటే సరి కాదు అని ప్రౌఢవ్యాకర్త వివరణానికి తాత్పర్యం.

ఇక్కడ పాపజాతి అనేశబ్దం దేశ్యం (అచ్చతెలుగు) కాదు. సంస్కృతసమం. దేశ్యాలమీద చెప్పిన 'కాన' తద్భిన్న మైన సంస్కృతసమంమీఁద రావడం లక్షణానికి విరుద్ధం. అయితే దీన్నిబట్టి సూత్రంలోనే 'దేశ్యము' అనడం సరి గా దని, సంస్కృత సమాలమీద కూడా వస్తుం దనీ చెప్పవచ్చు కదా. అనే సందేహానికి సమాధానం ఈవివరణం. సంస్కృతసమాలపై కాన లక్షణబద్ధం చేయదగినంతటిప్రయోగ ప్రామాణ్యం ఉన్నది కాదు. కాబట్టి కవిప్రయోగానుగుణంగా 'దేశ్యంబుల' అని చెప్పి, దానికి విరుద్ధంగా ఉన్న 'పాపజాతికాన' అనేప్రయోగం విలక్షణంగా ప్రస్తావింపవలసిందే నని తాత్పర్యం.

'మద్వ్యభిచారులారకాన' అని మరొకకవి సంస్కృతసమంమీద బహువచనంలో 'ఆర' మీద కూడా 'కాన' చేయడం మరీ విశేషం.

**8. ఇట్లు భూసురోత్తముల్, భూపాలుర్.** (శబ్ద. 16)

'హలవసానంబులు పరంబు లగునపుడు లురువర్ణకంబులయుత్వంబునకు లోపంబు వైకల్పికంబుగ నగు' అనేసూత్రం వివరణంలోనిది ఈవాక్యం.

పైసూత్రం లు, రు అనేప్రత్యయాలలోని ఉకారానికి హల్లు లేదా అవసానం పరంగా ఉంటే వికల్పంగా లోపం వస్తుం దని చెప్తున్నది. 'ప్రతతుల్ సొల్పడి, తత్పాలుర్ భయం బందగన్' అనేపూర్వోదాహరణాలలో హల్లు పరంగా ఉండగా లురువర్ణకాలలోని ఉత్వానికి లోపం రావటం చూపబడింది. కాగా లురువర్ణకాలలోని ఉత్వానికి అవసానం పరంగా ఉండగా లోపం రావటం ఉదాహరించవలసిఉంది.

ఇట్లు అంటే పూర్వోక్తప్రకారంగా లురు వర్ణకాలలోని ఉత్వం హల్లు పరంగా లోపించినవిధంగానే భూసురోత్తముల్, భూపాలుర్ అనేస్థలాలలో అవసానం పరంగా ఉండగా పైసూత్రం ప్రకారం ఉత్వం లోపించిం దని గ్రహించా లని తాత్పర్యం.

**9. ఇట్టిప్రయోగంబులంబట్టి యాగమశాస్త్ర మనిత్య మగుటవలనఁ దక్కిన చోట్ల నకారాగమంబు రాకుండిన దోషంబు లే దనియు –**

**10. కుత్సార్థదోషవిస్ఫురణంబు కలుగక పువర్ణాంతశబ్దములమీఁద నకారాగమము వచ్చుట కేతత్ సూత్రారంభప్రవృత్తి యైయుండు.**

**11. కాన నచ్చో మాత్ర మయ్యది యత్యావశ్యక మనియుఁ దోఁచు చున్నది.** (శబ్ద. 19)

'కువర్ణకంబు పరం బగునపుడు కవిత్రయంబువారిప్రయోగంబులం దక్కఁ దక్కినమహాకవి ప్రయోగంబులందునుం గొన్నియెడల నగాగమంబు చూపట్టదు' అనేసూత్రం వివరణంలోనిది ఈవాక్యం.

'కువర్ణకంబు పరం బగునపు డుకారఋకారంబులకు నగాగమం బగు' అనేబాల వ్యాకరణసూత్రం కువిభక్తి పరంగా ఉండగా నగాగమం (నిత్యంగా) విధించింది. కాని ఉత్సవముకు, బచ్చుకు – మొ. రీతిగా కవిత్రయేతరమహాకవిప్రయోగాలలో అరుదుగా ఈనగాగమం లేదు. 'ఆగమశాస్త్ర మనిత్యమ్' అనేసంస్కృతసంప్రదాయా న్ననుసరించి ఆగమంగా చెప్పినవిధి నిత్యం కాదు. కాబట్టి యీనగాగమం ఉత్సవముకు మొ. కొన్నిచోట్ల లేకపోవడం లక్షణానుగుణమే. అందుకే ప్రౌఢవ్యాకర్త నగాగమం లేకపోవటాన్ని పైసూత్రంలో లక్షణబద్ధం చేశాడు.

అయినా నీచార్థం స్ఫురింపకుండా ఉండడానికిగాను 'పు' వర్ణాంతశబ్దాలకు

కువర్ణకం పరంగా ఉండగా నగాగమం నిత్యంగా రావడం అవసర మనీ, అందుకే ఈసూత్రం ఆరంభింపబడిం దనీ వ్యాకర్త ఈవివరణలలో పేర్కొంటున్నాడు. (వివరణంలో నకారాగమం అంటే నగాగమం అని గ్రహించాలి.)

తూపు+కు, వీఁపు+కు - మొ. చోట్ల పువర్ణం మీద నగాగమం చేయకపోతే నీచార్థం స్ఫురింపవచ్చు. ఇలాగే ఏకాక్షర 'పూ' శబ్దంపై (పూపూవు) కూడా నని గ్రహింపవచ్చు. కాబట్టి ఇక్కడ నగాగమం నిత్యంగానే చేయాలి. తూపునకు పూనకు మొ. నగాగమంతో వ్యవధానంవల్ల నీచార్థస్ఫూర్తి వారింపబడుతుంది.

ఈప్రౌఢవ్యాకరణాభిప్రాయం యుక్తంగానే ఉన్నది. కాని కవిప్రయోగాలే ఇందుకు విరుద్ధంగా ఉన్నాయి. నీతూపుకోర్వక, సొంపుకు ఇత్యాదిగా పువర్ణం పై గూడా ఈఆగమం రాకపోవడం ప్రయోగాల్లో కనబడుతున్నది

## 12. బాలిగానిన్ బాలిగానిచేతన్ అని తక్కినవిభక్తు లూహ్యంబులు.

(శబ్ద. 22)

'తెనుఁగునం గొన్నితత్సమదేశ్యశబ్దములకంటెం బరంబుగ నేకవచనంబున నీచత్వద్యోతకం బయి యిగా యనునొక్కశబ్దంబును, దానిపై డువర్ణకాదులునం జూపట్టెడి. సంబోధనంబున డువర్ణకంబు చూపట్టదు. తుదిదీర్ఘంబునకు హ్రస్వంబు వైకల్పికంబు' అనేసూత్రం వివరణంలోనిది ఈవాక్యం.

బాల అనేసంస్కృత(సమ)శబ్దంమీద, చిట్టి అనేదేశ్యశబ్దంమీద నీచత్వార్థంలో ఇగా అనేశబ్దం చేరి ప్రథమైకవచనంలో డుజ్‌ప్రత్యయం వచ్చి బాలిగాఁడు, చిట్టిగాఁడు అని రూపాలు ఏర్పడటాన్ని సూత్రకర్త ఇంతకు ముందు ఉదాహరించాడు. కాగా ద్వితీయ మొద లైన ఇతరవిభక్తులలో రూపాలు ఎలా ఉంటాయో ఈ వివరణంలో ప్రస్తావిస్తున్నాడు.

సూత్రంలో 'డువర్ణకాదులు' అన్నప్పటి ఆదిశబ్దంచేత ద్వితీయాదివిభక్తులలో ఏకవచనం పరంగా ఉన్నపుడు 'ని' అనేఆగమం నిత్యంగా వస్తుంది. కాబట్టి బాలిగానిన్, బాలిగానిచేతన్ ఇత్యాదిగా రూపాలు అవుతాయి. ఇలాగే చిట్టిగానిన్, చిట్టిగానిచేత ఇత్యాదులు ఏర్పడటాన్ని గ్రహించవచ్చు.

ఇగా అనేశబ్దం చేరిన ఈశబ్దాలు అనుదంతాలు కాబట్టి 'అనుదంతం బగుతెనుఁగుడుమంతంబునకు నిగాగమంబు నిత్యంబుగా నగు' అనేసూత్రంచేత నిగాగమం నిత్యంగా వస్తుం దని గ్రహించవచ్చు. బాల, గోపాల ఇత్యాదిశబ్దాలు సంస్కృతాలే అయినా, వాటిమీద చేరిన ఇగా అనేది దేశ్యం గాబట్టి దానిమీద చేరే నిగాగమం

అచ్చతెలుగుశబ్దాలమీద లాగా నిత్యంగా వస్తుం దని గ్రహించవచ్చు.

**13. ఇట్లు గోపాలిగాఁడు.** (శబ్ద. 22)

'తెనుఁగునం గొన్నితత్సమదేశ్యశబ్దములకంటెం బరంబుగ నేకవచనంబున నీచత్వద్యోతకం బయి యిగా యనునొక్కశబ్దంబును, దానిపై డువర్ణకాదులునం జూపట్టెడి. సంబోధనంబున డువర్ణకంబు చూపట్టదు. తుదిదీర్ఘంబునకు హ్రస్వంబు వైకల్పికంబు' అనేసూత్రం వివరణంలోనిది ఈవాక్యం.

పైసూత్రం ప్రకారం ఇగా అనేశబ్దం చేరి డుజాదులు వచ్చినందుకు వ్యాకర్త దీనికి పూర్వంలో బాలిగాఁడు, చిట్టిగాఁడు అనేఉదాహరణలు చూపాడు. ఇట్లు అంటే ఈప్రకారంగా అంటే ఇంతకు ముందు ఉదాహరించిన బాలిగాఁడు, చిట్టిగాఁడు అనేశబ్దాలు ఏర్పడినప్రకారంగా అని అర్థం. ఆవిధంగానే గోపాలిగాఁడు, గోపాలిగానిన్ ఇత్యాదిరూపాలు అవుతాయి అని ఈవాక్యం తాత్పర్యం.

గోపాల అనేతత్సమశబ్దంమీద నీచత్వార్థాన్ని వివక్షించినపుడు పైసూత్రంప్రకారం ఇగా అనేశబ్దం చేరి గోపాల+ఇగా అని ఉండగా, సంధి జరిగి, గోపాలిగా. దీనిపై ప్రథమైకవచనంలో డుజ్‌ప్రత్యయం వచ్చి, గోపాలిగాఁడు. ద్వితీయాదివిభక్తులలో ఇగా శబ్దంమీద నువర్ణకాదులు వస్తాయి. కాబట్టి గోపాలిగానిన్, గోపాలిగానిచేత ఇత్యాదిగా రూపాలు సిద్ధిస్తాయి.

**14. కొందఱు ఇరులు కేలు శబ్దములు నిత్యబహువచనాంతము లందురు. అట్లు కాదు.** (శబ్ద. 28)

'దేశ్యమునం దక్కడాదులు నిత్యైకవచనాంతములు' అనేసూత్రంవివరణంలోనిది ఈవాక్యం.

ఇరులు ఇత్యాదులు బహువచనాంతా లని అహో మొ.వారు చెప్పారు. (కేలు బహువచన మన్నది యెవరో తెలుసుకోవాలి) దానిని తిరస్కరించడానికి ఈవివరణం చెప్పబడింది.

'దేశ్యమునం దక్కడాదులు నిత్యైకవచనాంతములు' అనేసూత్రంలోని ఆదిశబ్దంచేత ఇరులు, కేలు అనేశబ్దాలు గ్రహింపబడి అవి నిత్యైకవచనాంతా లవుతున్నాయి.

'ఇరులునన్' – ఇక్కడ ఇరులుశబ్దంమీద 'న' అనేసప్తమీవిభక్తి ఉన్నది. 'డుమువున లేకవచనంబులు' సప్తమీ నవర్ణకం (బహువచనం కాదు) ఏకవచనం మాత్రమే అవుతుంది. కాబట్టి 'ఇరులునన్' అనేది సప్తమ్యేకవచనాంతం. ఇరులు (కేలు)

అన్నప్పటి లువర్ణం ప్రథమాబహువచనంలాగా, 'ఇరులకు, ఇరులగొంగ' ఇత్యాదులలో 'ల'వర్ణం లడాగమంలాగా కనబడుతుంది. కాని ఇరులున అనేప్రయోగాన్నిబట్టి ప్రాతిపదిక ఇరులు. 'ఇరు' అని లేదు. ఇరులకు ఇత్యాదులలో అత్త్వం విశేషంగా సాధించుకోవాలి. ఇరులులు ఇరుళ్లు, మొ. రూపాలు లేవు. కాబట్టి 'ఇరులు' నిత్యైక వచనాంతం.

ఒకకేలఁ బట్టి, కేలితో లేదా కేలిచేత అనేఔపవిభక్తిక మైన కేలుశబ్దంమీద తృతీయకు అత్త్వం వచ్చి 'కేలన్' అయింది. కాబట్టి 'కేలు'లోని 'లు'వర్ణం బహువచనం కాదు. ప్రాతిపదికావయవమె.(ఔపవిభక్తికాలు ద్వితీయాదివిభక్తులలో ఏకవచనంలో మాత్రమే వస్తాయి. కాబట్టి కేలులో 'లు' బహువచన మైతే ఔపవిభక్తికం రావటానికి వీలు లేదు.)

అయితే ఇది కూడా నిత్యైకవచనాంత మంటున్న ప్రౌఢవ్యాకర్త 'పెఱకేలులు' అని దీనిపై బహువచనం చూపాడు. కేలులు, కేళ్లు అనేప్రయోగాన్నిబట్టి కేలుపై బహువచనం గూడా ఉంది. కాబట్టి కేలు నిత్యైకవచనాంతం కాదు.

**15. దంష్ట్రా శబ్దంబును బుంలింగముగాను గానంబడియెడి.** (శబ్ద. 24)

'విధాశబ్దంబు సంస్కృతంబునం బుంలింగంబు నగు' అనేసూత్రంవివరణంలోనిది ఈవాక్యం. ఇక్కడ సూరి పేర్కొన్న దంష్ట్రాశబ్దాన్ని గూర్చి ప్రౌఢవ్యాకర్త సందర్భవశంగా ప్రస్తావిస్తున్నాడు.

సంస్కృతంలో 'దంష్ట్రా' అనేస్త్రీలింగమే కాక 'దంష్ట్ర' అని పుంలింగశబ్దం కూడా ఉన్న దని ఈవాక్యాని కర్థం. స్త్రీలింగ మైన దంష్ట్రాశబ్దం తెలుగులోకి వచ్చినపుడు దీర్ఘానికి హ్రస్వము, 'స్త్రీలింగంబులప్రథమైకవచనంబునకు లోపం బగు' అని ప్రథమైకవచనలోపాదిక మయిన స్త్రీలింగకార్యాలతో దంష్ట్ర, దంష్ట్రను మొ. తత్సమరూపాలవుతాయి. 'దంష్ట్ర' అనేపుంలింగశబ్దం తెలుగులోకి వచ్చినపుడు అదంత అమహత్త్వాన్ననుసరించి 'అమహన్నపుంసకముల కదంతములకు ముపర్ణకం బగు' అని ముపర్ణకాదికార్యాలు వచ్చి దంష్ట్రము, దంష్ట్రములు మొ. తత్సమరూపా లవుతాయి.

చిన్నయసూరి దంష్ట్రా అనేస్త్రీలింగశబ్దాన్ని గ్రహించి, 'దంష్ట్రము' అనే ముపర్ణకాంత రూపంకోసం దీన్ని కంధరాదుల్లో చేర్చి 'కంధరాదులు క్లీబతుల్యంబులు బహుళంబుగా నగు' అని క్లీబతుల్యతను విధించాడు. (స్త్రీలింగపక్షంలో దంష్ట్ర – దంష్ట్రలు మొ.)

ముపర్ణకాంతరూపాలకోసం సూరి క్లీబతుల్యత చెప్పడం అనవసర మనీ పుంలింగశబ్దం నుంచి అవి సాధింపబడతా యనీ ఈవివరణం తాత్పర్యం.

అప్రసిద్ధ మైనపుంలింగశబ్దాన్నించి సాధించడంకంటే సుప్రసిద్ధస్త్రీలింగశబ్దంనుంచి తత్సమాలు సాధించడం యుక్తం గాబట్టి సూరిమార్గం గ్రాహ్యం.

**16. దీనికిఁ దత్సమంబునం బుంలింగరూపముతోనె ప్రయోగము గాని స్త్రీలింగరూపముతో లేదు.** (శబ్ద. 24)

'విధాశబ్దంబు సంస్కృతంబునం బుంలింగంబు నగు' అనేసూత్రంవివరణంలోనిది ఈవాక్యం.

సంస్కృతంలో 'విధా' అనేస్త్రీలింగశబ్దం ప్రసిద్ధం. ప్రౌఢవ్యాకర్త పుంలింగ మైన 'విధః' అనేశబ్దం కూడా సంస్కృతంలో ఉన్న దని చెప్తున్నాడు.

స్త్రీలింగశబ్దంనుంచి ప్రథమైకవచనలోపాది స్త్రీలింగకార్యాలతో, విధ-విధలు- అనేవిధ మైనరూపా లవుతాయి. పుంలింగశబ్దంనుంచి ఇది అదంతామహత్తు కాబట్టి మువర్ణకాదులతో విధము-విధములు అనేవిధ మైనరూపా లవుతాయి. తెలుగులో విధ-మొద లయినస్త్రీలింగరూపాలు లేవు. మువర్ణకాంతరూపాలు మాత్రమే ఉన్నాయి. దానిని సమన్వయించడానికి అంటే స్త్రీలింగరూపాలను వారించడానికి వ్యాకర్త పుంలింగశబ్దం మాత్రమే తత్సమ మవుతుం దనీ, స్త్రీలింగరూపం తెలుగులోకి అసలు రా దని పైరీతిగా వివరించాడు.

ప్రసిద్ధ మైనస్త్రీలింగరూపాన్ని గ్రహించినసూరి విధాశబ్దాన్ని కంధరాదుల్లో చేర్చి 'కంధరాదులు క్లీబతుల్యంబులు బహుళంబుగా నగు' అని క్లీబతుల్యతను చెప్పి, స్త్రీలింగరూపాలను వారించడంకోసం 'విధాశబ్దమునకుఁ గ్లీబతుల్యత్వంబు నిత్యంబు' అని చెప్పాడు.

పుంలింగశబ్దంనుంచి ఈరూపాలు సిద్ధిస్తాయి. కాబట్టి నిత్యక్లీబతుల్యతావిధానం అనవసరం అని ప్రౌఢవ్యాకర్త ఆంతర్యం.

అప్రసిద్ధ మైనపుంలింగశబ్దం మాత్రమే తెలుగులోకి రావడమూ, ప్రసిద్ధ మైన స్త్రీలింగశబ్దం అసలు రాకపోవడమూ యుక్తియుక్తంగా కనబడవు. సూరిమత ముచితం.

**17. వర్గువునందలివువర్ణకం బొండె లోపించు.** (శబ్ద. 25)

'అర్ఘాదుల కడయచ్చున కుత్వంబును మీఁద వువర్ణకంబును వైకల్పికంబుగా నగు' అనేసూత్రంవివరణంలోనిది ఈవాక్యం.

వర్గువు అనేశబ్దంలోనివువర్ణకం ఒకపక్షంలో లోపిస్తుంది. అంటే మరొకపక్షంలో

లోపించదు. వికల్పంగా లోపిస్తుంది అని తాత్పర్యం.

వర్గ అనేశబ్దానికి ప్రథమైకవచనంలో 'అమహన్నపుంసకములకు' అని ప్రాప్తిస్తున్న మువర్ణకాన్ని బాధించి 'అర్ఘాదుల కడయచ్చున కుత్వంబును మీఁద వువర్ణకంబును వైకల్పికంబుగా నగు' అనేసూత్రంచేత ఉత్వము (వర్గు), పైన వువర్ణకము వచ్చి 'వర్గువు' అని అవుతుంది. ఈశబ్దంలోని 'వు' ప్రత్యయానికి ఈవివరణ ననుసరించి లోపం రాగా 'వర్గు'. ఒండె అనడంచేత లోపం రానిపక్షంలో 'వర్గువు'.

వైకల్పికం కాబట్టి ఉత్వవువర్ణకాలు రాకపోతే 'అమహన్నపుంసకముల కదంతములకు మువర్ణకం బగు' అని మువర్ణకం వచ్చి వర్గము.

'వువర్ణకంబు' అనడంచేత ఈలోపం ప్రథమైకవచనంలోనే. వర్గులు – వర్గును. ఇత్యాదిగా ఇతరవిభక్తిస్థలాలు 'వువర్ణకేతరవిభక్తిపరం బగునపుడు' అనేబాలవ్యాకరణ సూత్రంచేత వుగాగమం రాకుండడంచేత ఏర్పడినరూపాలుగా గ్రహించాలి. వువర్ణం లోపించినవి కాదు.

దీన్ని రాహుబాహుశబ్దాలలో కలిపి తరువాతసూత్రంలో చెప్తే ఇబ్బంది ఉందా? విచారించాలి.

**18. సరులు లేనిదృక్షంజనశాబకములను అని యొక్కచోఁ బ్రయోగము కనఁబడుచున్నది.** (శబ్ద. 32)

**19. అది శబ్దాలంకారతత్పరత్వమునఁ బ్రౌఢముగాఁ జెప్పబడిన దని గ్రహింపవలయును.** (శబ్ద. 32)

'సమానార్థకము లయిన యీ డెన సరి సాటి లోనగుదేశ్యవిశేషణశబ్దములును' అనేసూత్రంవివరణంలోనిది ఈవాక్యం.

పైసూత్రాన్నిబట్టి సమానార్థక మైన 'సరి' అనేశబ్దం నిత్యైకవచనాంతం. కాబట్టి దీనిపై ఏవిభక్తిలోనూ బహువచనం ఉండదు. బహుత్వార్థంలో గూడా ఏకవచనమే ఉంటుంది. అవి దీనికి సరిగావు మొ.

'సరులు లేని దృక్షంజనశాబకముల' అనేప్రయోగంలో 'సరి' శబ్దం బహు వచనాంతంగా ఉన్నది. అపుడు 'సరి' శబ్దం నిత్యైకవచనాంత మెలా అవుతుంది? అంటే శబ్దాలంకారం మీదితాత్పర్యంతో కవి శబ్దసాధుత్వాన్ని పట్టించుకోలే దని వ్యాకర్తసమాధానం. అలంకారం కుదిరితే చాలు అన్నఉద్దేశంతో చేసినఈప్రయోగాన్ని బట్టి ఆబహువచనరూపాన్ని ప్రమాణీకరించవలసినఅవసరం లే దనీ, 'సరులు'

అనేరూపం లక్షణవిరుద్ధం అనీ వ్యాకర్త తాత్పర్యం.

**20. ఇవి వృత్తియం దేకవచనాంతముల యగు.** (శబ్ద. 36)

'అదరులు లోనగుశబ్దములు' అనేసూత్రం వివరణంలోనిది ఈవాక్యం.

అదరులు మొద లైనశబ్దాలు నిత్యబహువచనాంతాలు. ఇవి వృత్తియందు అంటే సమాసంలో మాత్రం ఏకవచనాంతాలు మాత్రమే అవుతాయి.

'అదరుటగ్గి' 'మిడుగుఱుఁబుర్వు' అనేఈసమాసాల్లో అదరు, మిడుగుఱు అని యీశబ్దాలు ఏకవచనాంతా లయినాయి.

కాని అదరులయగ్గి, మిడుగుఱులమెఱుఁగులు. ఇత్యాదులుగా కర్మధారయేతర సమాసంలో బహువచనం ఉండగూడ దనవచ్చునా? ఈకార్యం కర్మధారయంలో మాత్రమే అయితే ఈవివరణం అనవసరం అనిపిస్తుంది. అదరులు + అగ్గి, మిడుగుఱులు+పుర్వు – ఇత్యాదిగా బహువచనాంతమె అయినా 'సమాసవిభక్తికి లోపం బగు' అని ఆప్రథమాబహువచనం లోపిస్తుంది. కాబట్టి ఈవివరణం ప్రయోజనం పరిశీలించి కనుక్కోవాలి.

**21. తఱచుగ ననుటచే బియ్యము జీలకఱ్ఱ.** (శబ్ద. 37)

**22. ఇవి ధాన్యవాచకము లయ్యును నిత్యైకవచనాంతములే యని గ్రహింపవలయు.** (శబ్ద. 37)

'తఱచుగ ధాన్యవాచకశబ్దములును' అనేసూత్రంవివరణంలోనిది ఈవాక్యం.

పైసూత్రం ధాన్యవాచకాలు తఱుచుగా నిత్యంగా బహువచనంతో మాత్రమే ఉంటా యని చెప్తున్నది. సూత్రంలో 'తఱచుగ' అనడంచేత అరుదుగ బహువచనాంతం కాకపోవడం కూడా ఉంటుం దని అర్థం. అపు డవి ఏకవచనాంతాలు మాత్రమే అవుతా యని గ్రహించాలి. 'ఏకవచనాంతములే' అన్నప్పటి అవధారణార్థక 'ఏ' కారంచేత నిత్య ఏకవచనాంతా లవుతా యని అర్థం.

బియ్యము – జీలకఱ్ఱ మొ. ఇవి ధాన్యాన్ని బోధించేశబ్దాలే. అయినప్పటికీ సూత్రంలోని 'తఱచు' శబ్దంచేత బహువచనాంతాలు కాక ఏకవచనాంతా లయినాయి. 'కతిపయసంభారవాచకశబ్దములును' అనేసూత్రంప్రకారం నిత్యైకవచనాంతాలు. కాబట్టి బియ్యములు ఇత్యాదిగా బహువచనరూపా లుండవు. 'పుణ్యాహముల బియ్యముల' అన్నచోట్ల బహువచనం, అర్థవిశేషంలో అయిందిగా గ్రహించాలి.

**23. ఒకానొకకవి యిందుఁ గొన్నిటి నేకవచనాంతములుగాఁ బఠించి**

**యున్నాడు. అది విచార్యము.** (శబ్ద. 38)

'క్రీడావిశేషవాచకశబ్దములును' అనేసూత్రంవివరణంలోనిది ఈవాక్యం.

పైసూత్రం కొన్ని ప్రత్యేక మైనఆటలను బోధించేశబ్దాలు నిత్యబహువచనాంతాలు అని చెప్పింది. అందుచేత అచ్చనగాయలు మొద లైన ఈక్రీడావిశేషవాచకశబ్దాలమీద ఎప్పుడూ బహువచనమే కాని ఏకవచనం ప్రయోగించడానికి అవకాశం లేదు. అయినా ఒకానొకకవి వీటిలో కొన్నిటిని ఏకవచనాంతంగా ప్రయోగించాడు.

'బిల్లగోళ్లు' నిత్యబహువచనాంతంగా ఈవ్యాకరణం చెప్తుండగా ధూర్జటి 'బిల్లగోడు' అని ఏకవచనాంతంగా ప్రయోగించాడు. అలాగే 'కనుమూసిగంతలు' నిత్యబహువచ నాంత మని ఈవ్యాకరణం చెప్తుండగా పింగళి సూరన 'కనుమూసిగంత' అని ఏకవచనాంతంగా ప్రయోగించాడు.

ఇది పై లక్షణానికి విరుద్ధం. కాబట్టి ఈప్రయోగాలు సరిగావు అని అభిప్రాయం.

వీటిలో ఏకవచనాంతతను స్వీకరించి లక్షణంలో దోషం చెప్పాలా? లక్షణాన్ని ప్రమాణీకరించి ప్రయోగాలలో దోషం ఎంచాలా? అనేవిషయం ఇంకా పరిశీలించాలి అని కూడా ఈవివరణవాక్యానికి అర్థం అవుతుంది.

**24. నాయఁడుగారు, దేవిగారు దీనికిఁ దఱచుశబ్దంబు శరణంబు.** (శబ్ద. 39)

'తఱచుగా స్త్రీసమంబులగుదేశ్యశబ్దములకుఁ గడపలఁ గొన్నింటి కేకవచనంబునం బూజ్యతయందు గారు శబ్దం బగు' అనేసూత్రంవివరణంలోనిది ఈవాక్యం.

పైసూత్రం గారుశబ్దాన్ని స్త్రీసమా లయిన ఆచ్ఛికశబ్దాలకు చివర విధించింది. (దేశ్య మన్నమాటను ఈవ్యాకర్త ఆచ్ఛికం అనేఅర్థంలో ఉపయోగిస్తుంటాడు.) కాని నాయఁడుగారు దేవిగారు – అనేవి దీనికి భిన్నంగా ఉన్నాయి. 'నాయఁడు' శబ్దం ఆచ్ఛికమే. కాని స్త్రీసమం కాదు. డుమంతం అంటే పుంలింగతుల్యం అయింది, దేవి శబ్దం. (స్త్రీసమం అని ప్రౌఢవ్యాకర్త ఉద్దేశం) ఆచ్ఛికం కాదు. ఇది సంస్కృతసమం. పైసూత్రంప్రకారం వీటికి పైన గారు శబ్దం రావడానికి వీలులేదు. మరి 'గారు' చేయడం ఎలా కుదురుతుంది. అంటే సూత్రంలోని 'తఱచు' శబ్దాన్ని ఆశ్రయించుకుని 'స్త్రీసమ మైనదేశ్యం' కాని యీశబ్దాలమీద గారు వచ్చిం దని సమర్థించుకోవాలి.

'శరణంబు' అనడంలో ఈపుంలింగతుల్యాదులపై గారు రావడం సమ్మతం కా దనీ అయినా 'స్థితస్య గతి శ్చింతనీయా' అన్నమార్గంలో అటువంటిప్రయోగాలే

వైనా ఉంటే తఱచుశబ్దాన్ని ఆశ్రయించడం ఒకటే మార్గ మనీ వ్యాకర్త అభిప్రాయాన్ని గుర్తించాలి.

**25. ద్వితీయాదివిభక్తులయందు గారు శబ్దమునందలిరువర్ణము రివర్ణం బగు నని యర్థము.** (శబ్ద. 40)

'ద్వితీయాదులందు రు రి యగు' అనేసూత్రం వివరణంలోనిది ఈవాక్యం. సూత్రం అర్థాన్ని ఈవాక్యం వివరిస్తున్నది.

'తఱచుగా స్త్రీసమంబు లగుదేశ్యశబ్దంబులకుఁ గడపలఁ గొన్నింటి కేకత్వంబునం బూజ్యతయందు గారు శబ్దం బగు' అనేసూత్రంచేత పూజ్యతలో కొన్నిశబ్దాలకు గారు శబ్దం వస్తుంది. ఆవచ్చిన గారు అనేశబ్దంలోని చివరి 'రు' వర్ణం 'రి'వర్ణంగా మారుతుంది అని ఈవివరణం తాత్పర్యం. అంటే రువర్ణంలోని ఉత్వం స్థానంలో ఇత్వం వస్తుం దని అర్థం.

అయ్య అనేస్త్రీసమదేశ్యశబ్దం మీద ఏకత్వార్థంలో 'తఱచుగా.. అనేసూత్రంచేత గారు శబ్దం చేరి అయ్యగారు అని కాగా ఈప్రాతిపదిక మీద ద్వితీయావిభక్తిని (ఏకవచనాన్ని) వివక్షించగా, 'నువర్ణంబు ద్వితీయ' అనేసూత్రంచేత నువర్ణకం వచ్చి, అయ్యగారు–ను అని ఉండగా ప్రస్తుతసూత్రంచేత రువర్ణంలోని ఉత్వానికి ఇత్వం వచ్చి, అయ్యగారి–ను. 'ఇకారంబుమీఁది కునువు క్రియావిభక్తులయుత్వంబున కిత్వం బగు' అనేసూత్రంచేత ద్వితీయానువర్ణంలోనిఉత్వానికి ఇత్వం వచ్చి, అయ్యగారిని. అవసానంలో ద్రుతస్వరంలోపించినపక్షంలో 'అయ్యగారిన్'. ఇలాగే మిగిలిన విభక్తులలో రువర్ణానికి ఇత్వం రాగా, అయ్యగారిచేత, అయ్యగారియందు ఇత్యాదిగా రూపాలు అవుతాయి.

**26. ఒక్కచో ననుటచే ఆచార్యుఁడు ద్రోణునకున్ శిష్యుఁడ.** (శబ్ద. 43)

'పూజ్యతయం దొక్కచో నామతదేతద్యుష్మదస్మచ్ఛబ్దంబులయేకవచనంబునకు బహువచనం బగు' అనేసూత్రంవివరణంలోనిది ఈవాక్యం. సూత్రంలోని 'ఒక్కచో' అనేదళం ప్రయోజనాన్ని ఈవాక్యం వివరిస్తున్నది.

పైసూత్రం పూజ్యతలో నామాదులకు ఏకత్వంలో బహువచనం విధించింది.

ఈసూత్రంలో 'ఒక్కచో' అనడంచేత బహువచనం రావడం సార్వత్రికం కాదు. కాబట్టి పూజ్యతార్థంలో ఏకవచనం అలాగే ఉండవచ్చు. ఏకవచనంలో ఉన్నమాత్రంచేత పూజ్యార్థం లే దని భావించరా దని తాత్పర్యం.

'ఆచార్యుఁడు ద్రోణునకున్ శిష్యుఁడ' ఇక్కడ గురువులనుగూర్చి పేర్కొనడంవల్ల

పూజ్యార్థం ఉన్నది అయినా, ఆచార్యుడు, ద్రోణునకున్ అనేశబ్దాలను ఏకవచనంలో ప్రయోగించడం జరిగింది. సూత్రంలోని 'ఒక్కచో' అనేదళంవల్ల ఇక్కడ పూజ్యార్థం ఉన్నా, బహువచనం రాలే దని గ్రహించాలి. బహువచనం వస్తే 'ఆచార్యులు ద్రోణులకున్' అని అవుతుంది.

**27. అనుప్రయుక్తం బగునపుడు వీని కీరూపంబు లిట్ల యగు.** (శబ్ద. 53)

'ఆఈశబ్దములకును, ఏశబ్దమునకును మహదర్థమున నన్నివిభక్తులయందును వకారంబు నిత్యంబుగాను, వైకల్పికంబుగాను, అమహదర్థంబునం బ్రథమేతర విభక్తులయందు వచనద్వయంబునం గ్రమంబునం దకారవకారంబులు నిత్యముగాను బూర్వాగమంబు లగు' అనేసూత్రంవివరణంలోనిది ఈవాక్యం.

పైసూత్రం ఆ,ఈ శబ్దాలకు, మహదర్థంలో వాడు, వీరు, వానిన్, వీనియందున్, మొద లైనవిధంగానూ, అమహదర్థంలో దానిన్, వీనియందున్ మొద లైనవిధంగానూ, రూపాలు చెప్తున్నది. అలాగే ఏశబ్దానికి వేడు, ఎవనియందున్ ఇత్యాదిగా రూపాలు పేర్కొన్నది.

ఆ,ఈ,ఏ శబ్దాలు దేనికైనా అనుప్రయుక్త మైనపుడు గూడా ఇదే విధంగా ఆయాఅర్థాలలో, ఆయావిభక్తులలో ఆయారూపాలు పొందుతా యని ఈవాక్యం వివరిస్తున్నది. ధాతుజవిశేషణాలపై విభక్తి వివక్షించినపుడు తచ్ఛబ్దం అనుప్రయుక్త మవుతుంది. వచ్చినవాడు, వచ్చినవానిన్, అమహదర్థంలో వచ్చినది, వచ్చినదాని యందు ఇత్యాదిగా రూపాలు అవుతాయి. ఇలాగే త్రికం మీద చేరినపుడు కూడా, అవ్వాడు, ఏదానిన్ మొ. ఇలాగే అట్టివాడు, ఎట్టిది, మొ. ఈ, ఏశబ్దాలు అనుప్రయుక్తం అయ్యేస్థలాలు పరిశీలించాలి.

**28. తఱచుగ ననుటచే....వాక్యమును వ్యాసము చేసియుఁ జెప్ప నగు నని తెలియవలయును.** (శబ్ద. 47)

'కిమేకార్థకశబ్దంబులు క్రమంబున నజ్ఞాతవస్తూద్దేశ్యప్రశ్నమునందును, నిర్దిష్ట స్త్రీపురుషాన్యతరప్రశ్నమునందును, నిర్దిష్టస్త్రీపురుషాన్యతరగ్రహణమునందును, అనిర్దిష్ట స్త్రీపురుషోద్దేశ్యవ్యాహారమునందును దఱచుగ బహువచనాంతంబు లగు' అనేసూత్రం వివరణంలోనిది ఈవాక్యం.

పైసూత్రం ప్రకారం నిర్దిష్టస్త్రీపురుషాన్యతరప్రశ్నంలో ఏ, ఒక అనేశబ్దాలకు ఏకవచనానికి బహువచనం విధింపబడింది. 'సీతారాము లిద్దఱలో నెవరు మిక్కిలి కరుణ గలవారు' అనేస్థలంలో 'ఎవరు' అని బహువచనం వచ్చింది. నిజానికి

సీతారాములు ఇద్దరిలో సీత, లేదా రాముడు ఎవరో ఒకరు కరుణ గలవారని చెప్పటం ఉద్దేశించటంచేత ఏకవచనం రావాలి. బహువచనం వచ్చింది.

అయితే సూత్రంలో ఇలా బహువచనం రావటం 'తఱచుగ' అని చెప్పబడింది. కాబట్టి బహువచనం రాకుండాఉండే అవకాశం గూడ ఉంది. అపుడు 'సీతారాములిద్దఱలో సీత మిక్కిలి కరుణ గలదా? రాముఁడు మిక్కిలి కరుణ గలవాఁడా?' మొద లైనవిధంగా పై(బహువచనం వచ్చిన)వాక్యాన్ని విస్తరించి కూడా చెప్పవచ్చు. అని ఈవివరణవాక్యం తాత్పర్యం.

బహువచనం రాకపోతే వాక్యస్వరూపమే మారిపోతుంది అన్నమాట. కాని సూత్రంలో తఱచు అనేపదానికి ప్రయోజనం ఇలా చెప్పటం కుదరదు. తఱచుగా బహువచనం వస్తుం దంటే అరుదుగా బహువచనం రాదు. కాబట్టి ఏ, ఒక అనేశబ్దాలకు బహువచనం రానపుడు ఏకవచనం రావాలి. కాని వాక్యాన్ని విస్తరించి చెప్పినపుడు ఇక్కడ 'ఏ' (కిం) శబ్దప్రయోగమే లేదు. కాగా తఱచుశబ్దానికి వ్యాకర్త చెప్పినప్రయోజనం సరిగా దని చెప్పకతప్పదు.

**29. నీ వెవ్వ రిత్యాదివిశేషప్రయోగంబులుం గలవు.** (శబ్ద. 47)

'కిమేకార్థకశబ్దంబులు క్రమంబున నజ్ఞాతవస్తూద్దేశ్యప్రశ్నమునందును, నిర్దిష్టస్త్రీపురుషాన్యతరప్రశ్నమునందును, నిర్దిష్టస్త్రీపురుషాన్యతరగ్రహణమునందును, అనిర్దిష్టస్త్రీపురుషోద్దేశ్యవ్యాహారమునందును దఱచుగ బహువచనాంతంబు లగు' అనేసూత్రం వివరణంలోనిది ఈవాక్యం.

పైసూత్రం ఏ, ఒక అనేశబ్దాలకు ఆయాసందర్భాలలో ఏకత్వంలో బహువచనాన్ని చెప్తున్నది. ఆవిధంగా తెలియనివస్తువును గురించి ప్రశ్నించేసందర్భంలో ఏ, ఒక అనేశబ్దాలకు బహువచనం వస్తుంది. కాని 'నీవెవ్వ రేమిపనికై యేవలనికిఁ బోవుచునికి యిది' అనేస్థలంలో 'నీవెవ్వరు' అని ప్రయోగింపబడింది. ఇక్కడ నీవు అని చెప్తుండటంచేత ఆవ్యక్తి ఎదురుగా ఉండటంవల్ల తెలిసినదే కాబట్టి ఇది జ్ఞాతవస్తూద్దేశ్యప్రశ్నము. నీవు అనటంచేత ఇది ఏకత్వార్థంలో ఉన్నది. కాబట్టి నీవెవడు' అని కింశబ్దం ఏకవచనంలో ఉండాలి కాని ఎవ్వరు అని బహువచనంలో ఉంది. అజ్ఞాతప్రశ్నంలో బహువచనం వస్తుం దని సూత్రం చెప్తుండగా జ్ఞాతవస్తువిషయంలో బహువచనం రావడం సూత్రం ప్రకారం సిద్ధించనిఅంశం గాబట్టి ఇది విశేషం అని సూత్రకర్త వివరించాడు.

**30. శబ్దశాసనుఁడు తచ్ఛబ్దాతః అని సూత్రించిన సూత్రమునందలి**

**తచ్ఛబ్ద మంతప్రభృతులకు నుపలక్షణ మని తెలియునది.** (శబ్ద. 51)

'ఈ ఏ ఒక శబ్దములకంటెంబరంబయినయంతశబ్దమునకారంబునకు లోపం బగు.' అనేసూత్రంవివరణంలోనిది ఈవాక్యం.

పైసూత్రంచేత ప్రౌఢవ్యాకర్త ఈ, ఏ, ఒక శబ్దాలమీద అంత శబ్దం మొదటి అకారానికి లోపం చెప్పాడు. ఈ+అంత= ఇంత, ఏ+అంత=ఎంత, ఒక+అంత= కొంత. ఈప్రక్రియ నన్నయకు కూడా సమ్మతమే అని నిరూపించడానికే పైవివరణం చేశాడు.

చింతామణి 'శబ్దా త్తచ్ఛబ్దాతః' అనేసూత్రంచేత తచ్ఛబ్ద + అతః అని తచ్ఛబ్దం (అది, అవి) లోని అకారానికి లోపం చెప్పింది. నీ+అది=నీది మొ. ఆసూత్రంలోని తచ్ఛబ్దం తద్ వ్యాఖ్యాతలు, సూరి పేర్కొన్న అది, అవి శబ్దాలనే కాక అంత మొద లైనవాటిని గూడా బోధిస్తుంది. కాబట్టి 'అంత'లో కూడా అకారం లోపిస్తుంది అని ఈవివరణం తాత్పర్యం.

కాని యిందులో ఇబ్బందులు ఉన్నాయి.

1. అంత 'ప్రభృతులు' అని వివరణంలో చెప్పిన ప్రభృతులను ఈవ్యాకర్త కూడా వివరించలేదు.

2. చింతామణివ్యాఖ్యాతలు ఎవరూ అంతలో అకారలోపం వ్యాఖ్యానించలేదు.

3. ఈలోపం ఈ, ఏ, ఒక లపై అని ప్రౌఢవ్యాకర్త చెప్పాడు. చింతామణిలో ఆనియమం లేదు. కాబట్టి ఇతరశబ్దాలలోవలె ఈలోపాన్ని సామాన్యంగా చేసుకోవలసి వస్తుంది. నీ + అంత = నీ(ం)త, నా(ం)త మొ. అపరూపాలు గావాలి చింతామణిలో.

4. అంతశబ్దం తదర్థకం అనడానికి చింతామణిలో ఆధారం లేదు. ప్రౌఢవ్యాకర్త గూడా 'ఆ'శబ్దంనుండి సాధించలేదు.

5. ఆశబ్దంనుంచి 'అంత' ఏర్పడినట్లే 'ఈ' శబ్దంనుంచి ఇంత, ఏశబ్దంనుంచి ఎంత – ఆక్రమంలోనే సాధించుకోవడం న్యాయం. ఈ+అంత అని ఇక్కడ మళ్ళీ అంత శబ్దం తీసుకోవడం సక్రమంగా కనబడదు.

**31. ఇ ట్లనుటచే అయ్యి దీత్యాదులందు ద్విత్వంబు గలుగ దని యూహింపవలయును.** (శబ్ద. 59)

'హ్రస్వవ్యస్తత్రికంబుమీఁది దివులకు ద్విత్వంబు నగు' అనేసూత్రంవివరణంలోనిది ఈవాక్యం.

పైసూత్రంలో 'వ్యస్త' అనడంచేత ప్రత్యేకంగా ఉన్న త్రికంమీద మాత్రమే 'ది-వి' లలో దకారవకారాలకు ద్విత్వం వస్తుంది. కాబట్టి సమాసం మొ. ఇతరస్థితిలో దివులకు ఈకార్యం రాదు.

'ఆ' శబ్దానికి 'కొన్నియెడల- ద్రికంబున కదియవులును - నను ప్రయుక్తంబు లగు' (శబ్ద. 54) అనేసూత్రంచేత 'అది' అనేతచ్ఛబ్దం అనుప్రయుక్త మై, ఆ+అది - ఆయది, (ఆయవి) అనేతీరుగా ఉన్నచోట(హ్రస్వ)త్రికం ప్రత్యేకంగా లేదు. ఇంక తచ్ఛబ్దం (త్రికం) మీద అనుప్రయుక్త మైఉన్నది. కాబట్టి సూత్రంలో 'వ్యస్త' అనడంచేత ఇటువంటిచోట్ల ద్విత్వం రాదు. ఆయది, ఆయవి అని అలాగే ఉంటుంది. ఆయద్ది, ఆయవ్వి అనేవిధంగా ద్విత్వం వచ్చినరూపాలు ఉండవు.

### 32. దేనన్, వేనన్ అనువానికిఁ బ్రయోగంబులు మృగ్యంబులు.

(శబ్ద. 62)

'అది యిది యెది యనువానికిఁ దృతీయా సప్తమ్యేకవచనంబులయందు దాన దీన దేన ననియు, వానిబహువచనంబునయందు వాన వీన వేన ననియు రూపంబులు.' అనేసూత్రంవివరణంలోనిది ఈవాక్యం.

పైసూత్రం ఆ, ఈ, ఏ అనేశబ్దాలకు తృతీయా సప్తమీ విభక్తులలో దాన, దీన, వేన, అని యేకవచనంలోనూ, వాన, వీన, వేన అని బహువచనంలోనూ రూపాలు ఏర్పడతా యని చెప్పింది. ఇందులో దేన, వేన అనేరూపాలు కవిప్రయోగాలలో కనబడటం లే దని ఈవాక్యం వివరిస్తున్నది. ఇవి 'ఏ' శబ్దానికి తృతీయాసప్తములలో ఏకబహువచనాలలో లక్షణసిద్ధ మైనరూపాలు. కవిప్రయుక్తాలు గానపుడు లక్షణం సాధించటం దేని కనేసందేహం గలగవచ్చు. ఆ,ఈ శబ్దాలకు ఏర్పడే దాన,దీన, వీన,వేన అనేరూపాలసామ్యంతో దేన, వేన అనేరూపాలు కూడ గ్రహింపదగిఉన్నాయి. కాబట్టి ఏశబ్దానికి తృతీయాసప్తములలో రూపాలు దేనియందు, వేనియందు అని కవిప్రయుక్త మై ఉన్నాయి. దేన, వేన అనేరూపాలు సాధించటం యుక్తమే. కాని సందర్భం లేకపోవటం లేదా ఇతర మైనకారణాలవల్ల ఈశబ్దాలు కవిప్రయోగాలలో లే వని గుర్తించటం గూడ సమంజసమే.

### 33. వీనికి ఎవ్వరియొక్క యాఁడుది యనియు, ఒకరియొక్క యాఁడుది యనియు నర్థము.

(శబ్ద. 65)

'అయ్యది యేకత్వంబున సమాసగతషష్ఠ్యంతయత్కిమర్థకాన్యైకార్థకశబ్దంబులపయి నగు' అనేసూత్రంవివరణంలోనిది ఈవాక్యం.

పైసూత్రంప్రకారం షష్ఠ్యంత మైన ఏ, ఒక్క అనేశబ్దాలకు అంటే ఎవ్వరి(యొక్క), ఒక్కని(యొక్క) అనేశబ్దాలకు పైన స్త్రీని బోధించేసందర్భంలో 'త' అనేప్రత్యయం వస్తుంది. కాగా ఎవ్వరిత, ఒక్కరిత అనేరూపాలు సిద్ధిస్తాయి. ఇలా ఏర్పడినశబ్దాల అర్థాన్ని ఈవాక్యం వివరిస్తున్నది.

(యత్ కిమర్థక మైన)ఎవ్వరిత అంటే ఎవ్వరియొక్క ఆడుది అని అర్థం. అలాగే (అన్య ఏకార్థక మైన) ఒక్కరిత అనేశబ్దానికి ఒక్కరియొక్క ఆడుది అనీ, ఒకఆడుది అనీ అర్థాలు గ్రహించాలి.

**34. స్వార్థంబునం గప్రత్యయంబు రా - ఎవ్వతుక.** (శబ్ద.70)

'ఎవ్వరితాదులందలిరివర్ణంబునకు లోపంబు విభాష నగు'. అనేసూత్రంవివరణం లోనిది ఈవాక్యం.

'తవర్ణకంబు స్త్ర్యర్థకం బగు' అని స్త్రీని బోధించేసందర్భంలో వచ్చిన తప్రత్యయం చివర గలిగిన' అన్యఏకార్థక (ఒక), యత్కిమర్థక (ఏ), శబ్దాలకు స్వార్థంలో క అనేప్రత్యయం వస్తుంది. స్వార్థం అంటే ఇక్కడ ప్రాతిపదికార్థం. కాబట్టి కప్రత్యయం వచ్చినా, రాకున్నా అర్థం ఒకటే.

'ఉకవర్ణకంబు చిఱుతాదులకు స్వార్థంబునం దగు' అని సూరి ప్రత్యయం 'ఉక' అని చెప్పాడు. చింతామణి 'నామ్నః కవర్ణక స్స్యాత్ స్వార్థే, స్యా దుత్వ మపి పరే తస్మిన్' అని ప్రత్యయాన్ని 'క' అని చెప్పి ముందు ఉత్వం చెప్పింది. ప్రౌఢవ్యాకర్త చింతామణి ననుసరించి ప్రత్యయాన్ని కవర్ణకంగా చెప్పాడు. కాగా స్వార్థంలో కప్రత్యయం, ముందు ఉత్వం వస్తుం దని గ్రహించాలి. ఎవ్వత+క - ఎవ్వతుక- ఒక్కర్తి+క=ఒక్కర్తుక. మొ.

**35. అతనిన్ భిన్నరూపము. అక్కథకు ననుట యభిన్నరూపము.**

**36. దాని భిన్నరూపము. ఆకలహంస అభిన్నరూపము.** (శబ్ద.75)

**37. వాఁడె భిన్నరూపము. ఆసుదర్శనాయుధుఁ డనుట అభిన్న రూపము.** (శబ్ద.75)

'నామపునర్గ్రహణంబున భిన్నంబు నభిన్నంబు నయి తచ్ఛబ్దార్థంబు తత్పర్యాయం బగు' అనేసూత్రం వివరణంలోనిది ఈవాక్యం.

భిన్నం అంటే ప్రత్యేకంగా ఉన్నది. అభిన్నం అంటే వేరొకదానితో అంటే ఇక్కడ నామపదంతో కలిసి ఉన్నది. తచ్ఛబ్దం అంటే తచ్ఛబ్దార్థాన్ని తెలిపే 'ఆ' అనేతెలుగుశబ్దం. పూర్వవాక్యంలోని నామపదాన్ని తరువాత తిరిగి గ్రహించవలసివస్తే దానికి

పర్యాయంగా 'ఆ' అనేతచ్ఛబ్దాన్ని ప్రత్యేకంగా ప్రయోగించి కాని, లేదా ఆతచ్ఛబ్దాన్ని ఆనామపదానికి పూర్వంలో చేర్చి గాని ప్రయోగించవచ్చు.

'అతనిఁ బూజించిరి' అనేవాక్యంలో పూర్వవాక్యంలోని 'కథకుడు' అనేనామపదం 'అతనిన్' అనేవిధంగా తచ్ఛబ్దం భిన్నంగా ప్రయోగింపబడి గ్రహింపబడింది. ఇక్కడ తచ్ఛబ్దాన్ని(ఆ) 'కథకున్' అనేనామపదానికి పూర్వంలో చేర్చి '(ఆకథకున్)అక్కథకున్' అనేవిధంగా గూడా ప్రయోగించవచ్చు.

**38. ఇటఁ దాశబ్దము పాదపూరణార్థకము.** (శబ్ద. 77)

**39. వచ్చె సుదర్శనాయుధుఁడు, విదురుఁడు ప్రబోధించె- అని యాత్మార్థవిరహితంబుగను జెప్పనగు.** (శబ్ద. 77)

'నామతదేతత్క్రమర్థంబులకుం బునర్గ్రహణంబునఁ బ్రథమాద్యంత మయి పూర్వపరంబులుగ నాత్మార్థం బభిహితం బగు' అనేసూత్రంవివరణంలోనిది ఈవాక్యం.

పైసూత్రానికి లక్ష్యంగా వ్యాకర్త నామానికి పూర్వంలో ప్రయోగింపబడినందుకు 'తా వచ్చె సుదర్శనాయుధుఁడు' అనేప్రయోగాన్నీ, నామానికి పరంగా ప్రయోగింపబడి నందుకు 'విదురుఁడు ... తాను బ్రబోధించె' అనేప్రయోగాన్నీ ఉదాహరించాడు.

ఈప్రయోగాలలో ఉన్న ఆత్మార్థక మైన 'తాను' శబ్దం ప్రత్యేకంగా అపూర్వ మైన అర్థాన్ని తెలియజేయదు. కాబట్టి పాదపూరణం మాత్రమే దానికి ప్రయోజనం. అంటే ఆశబ్దం ప్రయోగించినా, ప్రయోగించకపోయినా ఆవాక్యానికి అర్థం ఒకటే. కాగా తాను శబ్దాన్ని ప్రయోగించకుండా వచ్చె సుదర్శనాయుధుడు అనీ, అలాగే విదురుడు ప్రబోధించె అనీ ప్రయోగించినా అర్థంలో ఏమీ భేదం ఉండదు అని తాత్పర్యం.

**40. ఒకచో ననుటచే ఒకఁడు ఒకతె ఒకటి.** (శబ్ద. 85)

'ఒకానొకచో ననిర్దిష్టార్థమం దొకశబ్దమునకుం బూర్వాగమం బగు' అనేసూత్రం లోని 'ఒకచో' అనేదళం ప్రయోజనాన్ని ఈవాక్యం వివరిస్తున్నది.

ఒకచో అనటంచేత ఒకశబ్దానికి పూర్వంలో 'ఒకాన్' అనేది ఆగమంగా రావడం అనిర్దిష్టార్థంలో కూడా సార్వత్రికం కాదు. కాబట్టి ఒకపక్షంలో 'ఒకాన్' రాకపోవచ్చు. ఒకడు, ఒకతె, ఒకటి అనేశబ్దాలకు ఒకాన్ పూర్వాగమ మైతే ఒకానొకఁడు, ఒకానొకతె, ఒకానొకటి. 'ఒకాన్' రాకపోతే అదే అర్థంలో ఒకడు, ఒకతె, ఒకటి అనేవిధంగా కూడా ఉంటుంది. ఒకానొకఁడు=ఒకఁడు, ఒకానొకతె=ఒకతె, ఒకానొకటి=ఒకటి.

**41. ఒకశబ్ద మొక్కాదుల కుపలక్షణము.** (శబ్ద. 85)

'ఒకానొకచో ననిర్దిష్టార్థమం దొకశబ్దమునకుం బూర్వాగమం బగు' అనేసూత్రంవివరణం లోనిది ఈవాక్యం.

పైసూత్రం 'ఒక' అనేశబ్దానికి పూర్వంలో 'ఒకాన్' అనేది ఆగమంగా వస్తుం దని చెప్పింది. ఒకాన్ + ఒకతె, ఒకానొకతె. సూత్రంలోని 'ఒక శబ్దమునకు' అనే దళం ఒక్క మొద లైనవాటిని గూడా బోధిస్తుంది. ఒక్క, ఒక్కొ, ఒకొ అనేవి ఒక్కాదులు. (ఒకశబ్దంతోపాటు) వీటికి గూడా పయిసూత్రంప్రకారం అనిర్దిష్టార్థంలో 'ఒకాన్' పూర్వంలో ఆగమంగా వస్తుంది. ఒకానొక్కఁడు, ఒకానొక్కొతె ఒకానొకొటి మొ.

సూత్రంలోని ఒకశబ్దంచేత ఒక అనేశబ్దం ఒక్కదాన్ని మాత్రమే గ్రహిస్తే, ఒకానొక్కొతె ఇత్యాదిరూపాలు సిద్ధించవు. వాటిని గూడ సాధించటానికి వ్యాకర్త ఈఉపలక్షణ మార్గాన్ని ఆశ్రయించాడు. 'ఒకశబ్దమునకు' అని కాకుండా, వివరణంలో చెప్పినట్లుగా సూత్రంలోనే 'ఒక్కాదులకు' అని చెప్పిఉంటే సూత్రం సమగ్రంగా ఉండే దనవచ్చు.

**42. తఱచుగ ననుటచే తాము, మేము, తమ్మున్, మమ్మున్ ఇత్యాది రూపంబు లగు నని యెఱుంగునది.** (శబ్ద. 86)

'సర్వనామంబులకు మహదర్థంబునం దఱచుగ లులలకు రుర లగు' అనేసూత్రం వివరణంలోనిది ఈవాక్యం. సూత్రంలోని తఱచుశబ్దానికి ప్రయోజనాన్ని ఈవాక్యం వివరిస్తున్నది.

మహత్తులమీది బహువచన లులలకు తఱచుగా రురలు వస్తా యని సూత్రం చెప్తున్నది. తఱచు అనడంచేత ఈకార్యం అరుదుగా రాకపోవచ్చును.

తాము - మేము మొద లైనవాటిలో తా-నా- అనేశబ్దాలమీది ప్రథమాబహువచన 'లు' వర్ణానికి రు వర్ణం లేదు. ఇలాగే మనము మొ.

తమ్మున్, మమ్మున్ అన్నపుడు ద్వితీయలో 'ర' వర్ణం రాలేదు. ఇలాగే తనచేత, మాకు, మనయందు మొ.

బహువచనంలో రు,రలు లేనిసర్వనామాల నుద్దేశించి సూత్రంలో తఱచుశబ్దం ప్రయోగింపబడిం దని వ్యాకర్త తాత్పర్యం.

వీటిప్రక్రియ ప్రౌఢవ్యాకరణం చెప్పలేదు. బాలవ్యాకరణం గూడా చెప్పలేదు. చింతామణి చెప్పింది. కాని అక్కడ సంస్కృతవిభక్తులస్థానంలో సరాసరిగా ము- మొద లైనవి చెప్పబడ్డాయి. కాని లుల లు చేయడమె లేదు. రు ర లు వచ్చే చోట్ల

నిత్యమే. రానిచోట్ల అసలు రావు. కాగా ఈసూత్రంలో తఱచుశబ్దం అవసరం గా దని చెప్పవచ్చు.

**43. తఱచుగ ననుటచే ఇరువుర నిత్యాదులయం దిత్వంబు కలుగదు.** (శబ్ద. 90)

'ద్వితీయాదులం దసంయుక్తరవర్ణకంబునత్వంబున కిత్వంబు తఱచుగ నగు' అనేసూత్రంవివరణంలోనిది ఈవాక్యం. సూత్రంలోని తఱచు శబ్దానికి ప్రయోజనాన్ని ఈవాక్యం వివరిస్తున్నది.

'తఱచుగ' అనడంచేత 'ద్వితీయాదులం దసంయుక్తరవర్ణంబునత్వంబునకు' కూడా ఇరువురకు మొద లైనవాటిల్లో ఇత్వం రా దని అర్థం.

ఇరువురన్, మూగురచేత మొ. ఇక్కడ 'ులలకు రుర లగు' అని వచ్చినరవర్ణం ద్వితీయాదులకు సంబంధించినది. అసంయుక్తం కూడా అయింది. కాబట్టి పైసూత్రంచేత ఇక్కడి రవర్ణంలోని అత్వానికి ఇత్వం రావలసిఉంది. 'తఱచు' శబ్దంచేత ఈచోట్ల ఇత్వం రాదు. కాబట్టి ఇరువురిన్, మూగురిచేత ఇత్యాదిగా కావు. ఇరువుర నిత్యాదిగా అత్వం అలాగే ఉంటుంది.

**44. సాధారణంబుగ ననుటచే ఎనమండ్రు తొమ్మండ్రు ఇత్యాదులందు రా దని యెఱుంగునది.** (శబ్ద. 91)

'రురవర్ణకంబులు పరంబు లగునపుడు సాధారణంబుగ సంఖ్యావాచకంబులకు గువర్ణంబు పూర్వాగమం బగు' అనేసూత్రంవివరణంలోనిది ఈవాక్యం. పైసూత్రంలోని 'సాధారణంబుగ' అనేదళానికి ప్రయోజనాన్ని ఈవాక్యం వివరిస్తున్నది.

బహువచనం (రురల) పరంగా ఉండగా సంఖ్యావాచకాలకు చివర సాధారణంగా 'గు' అనేవర్ణం ఆగమ మవుతుంది అని సూత్రం చెప్తున్నది. సాధారణంగా అనడంవల్ల అసాధారణంగా అంటే కొన్ని విశేషస్థలాల్లో అరుదుగా 'గు' ఆగమం రాకపోవడం కూడా ఉన్న దనేఅర్థం సిద్ధిస్తున్నది. ఒక+రు – ఇక్కడ గుగామం లేదు. ఒకరు.

ఇలాగే ఎనమండ్రు, (ఎనిమిది+రు), తొమ్మండ్రు (తొమ్మిది+రు) మొ.వాటిల్లో గువర్ణాగమం రాదు (ఎనమండుగురు తొమ్మండుగురు అని వ్యవహారంలో ఉంది) పదుగురు – పదురు, పదుండ్రు–పదుగుండ్రు–అన్నచోట గువర్ణాగమం వికల్పంగా వస్తున్నది.

**45. అక్షరంబుల కనుటచే ఎనుబండ్రు లోనగువానియం**

**దుపాంత్యవర్ణంబు నకును లోపంబు.** (శబ్ద. 92)

'సంఖ్యావాచకంబులకు విభక్తి పరం బగునపుడు కొన్నింటియంత్యాక్షరంబులకు లోపం బగు' అనేసూత్రంవివరణంలోనిది ఈవాక్యం.

పైసూత్రం విభక్తి పర మవుతుండగా కొన్ని సంఖ్యావాచకాలలో చివరి 'అక్షరంబులకు' లోపం చెప్తున్నది. ఏ(ను)గురు, వేగురు మొ. చివరిఅక్షరం ఒక్కటి మాత్రమే లోపించేపక్షంలో 'అక్షరంబునకు' అని ఏకవచనం చాలు. కాగా 'అక్షరంబులకు' అని బహుత్వార్థంతో (బహువచనంలో) చెప్పడంచేత అంత్యాక్షరం ఒక్కటి మాత్రమే కాక దానికి సమీపంలో పూర్వంలో ఉన్నమరొకఅక్షరం కూడా కొన్ని సంఖ్యావాచకాల్లో లోపిస్తుంది. అని బహువచనానికి ప్రయోజనాన్ని వ్యాకర్త వివరించారు.

ఎనిమిది + పది అని ఉండగా చివరిఅక్షరం 'ది' తోపాటు దానికి సమీపంలో పూర్వంలో ఉన్న 'మి' అనేఅక్షరం కూడా లోపించి ఎని+పది- 'పది యుత్తరపదం బగుచో..' (సమా. 24) అనేసూత్రంచేత ఎను+పది, ఎనుబది అని అవుతుంది. వ్యాకర్త 'ఎనుబండ్రు' అని చూపడం ప్రమాదం. 'ఎనుబది+రు' అన్నపుడు అంత్యాక్షరం ఒక్కటే లోపిస్తుంది. 'ఎనిమిది+పది' అన్నపుడు విభక్తి పరంగా లేదు. సమాసంలో కూడా వస్తుం దని (విభక్తి పరంగా లేకున్నా) చెప్పుకోవాలి.

**46. కొన్నింటి యనుటచే అయిదుగురు, ఆఱుగురు ఇత్యాదులందు లోపంబు లేదు.** (శబ్ద. 92)

'సంఖ్యావాచకంబులకు విభక్తి పరం బగునపుడు కొన్నింటియంత్యాక్షరంబులకు లోపం బగు' అనేసూత్రం వివరణంలోనిది ఈవాక్యం. సూత్రంలోని 'కొన్నింటి' అనేదానిప్రయోజనాన్ని వివరిస్తున్నది.

పైసూత్రం విభక్తి పర మవుతుండగా కొన్ని సంఖ్యావాచకాలలో చివరిఅక్షరాలకు లోపం చెప్తున్నది. మూ(ఁడు)గురు నలుగురు మొ.

అయితే సూత్రంలో 'కొన్నింటి' అనడంచేత సంఖ్యావాచకాలకు అన్నింటిలోనూ ఈలోపం రాదు. కాబట్టి కొన్ని సంఖ్యావాచకాలలో చివరిఅక్షరాలు లోపించవు.

అయిదుగురు, ఆఱుగురను. ఇక్కడ విభక్తి (రు-ర) పరంగా ఉండగా అయిదు, ఆఱు అనేసంఖ్యావాచకాలలో చివరి అక్షరం లోపించలేదు. ఇలాగే ఒకరు.

మూఁడు, నాలుగు, ఏను, ఎనిమిది, తొమ్మిది, వేయి శబ్దాలలో, సమాసాంతంలో పదిశబ్దంలోను, ఈలోపం వస్తున్నది.

**47. ఇట్టియెడల అవ యనియె యుండవచ్చును. అయినను గ్రంథములయందుఁ బాఠ మి ట్లగపడుచున్నది.** (శబ్ద.103)

'కొన్నియెడల నవ కగు కానంబడియెడి' అనేసూత్రం వివరణంలోనిది ఈవాక్యం.

'సంఖ్యకుం బూరణార్థంబునం దవగాగమం బగు' అనేబాల. సూత్రంప్రకారం సంఖ్యావాచకాలకు పూరణార్థంలో అవక్ అనేఆగమం వస్తుంది. అలా వచ్చిన 'అవ' స్థానంలో 'అగు' అనేశబ్దం కనబడుతున్న దని సూత్రం చెప్తున్నది. 'ఏడగుపర్వము, ఎనిమిదియగుపర్వము, పదియగువేయి అనేవిధంగా ఉన్నకవి ప్రయోగాలలో సంఖ్యావాచకాలకు పూరణార్థంలో అవ అనేఆగమం స్థానంలో అగు అనేశబ్దం కనబడుతున్నది. నిజానికి ఇక్కడ కవిప్రయోగంలో 'అగు'స్థానంలో 'అవ' అనేది ఉన్నా, అర్థభంగం కాని, గణభంగం కాని మొదలుగా ఏవిధ మైన ఇబ్బంది లేదు. కాబట్టి పూర్వవ్యాకరణానుగుణంగా అవ అనేదే ఉన్న దనవచ్చును గదా. 'అగు' అనేదానిని విశేషంగా విధించటం దేనికి? అనే సందేహం గలగవచ్చు నని శంకించుకుని వ్యాకర్త ఇలా సమాధానం చెప్పాడు. 'అవ' అనేది ఉన్నా ఇబ్బంది లేదు కాని కవిప్రయోగాలలో 'అగు' అనేదే కనబడుతుండటంచేత 'అవ'కు 'అగు' విధించవలసివచ్చిం దని వ్యాకర్త సమాధానం.

**48. కొన్నియెడల ననుటచే పదివేవురు, నూఱునేఁబంద్రు, లేక నూటయేఁబంద్రు అని యిట్లు మహత్త్వయుక్తరూపంబులుం గల వని యెఱుంగవలయు.** (శబ్ద.104)

'మహద్విశేషణసంఖ్యావాచకంబులకుం గొన్నియెడల నమహత్కార్యంబు చూపట్టెడి' అనేసూత్రం వివరణంలోనిది ఈవాక్యం.

సూత్రంలోని 'కొన్నియెడల' అనేదళం ప్రయోజనాన్ని ఈవాక్యం వివరిస్తున్నది.

యతులు పదివేలు, పరిచారకులు నూఱువేలు, మొద లైనకవిప్రయోగాలలో విశేష్యం మహద్వాచకం కాగా, దానివిశేషణం అయినసంఖ్యావాచకం మాత్రం అమహత్కార్యంతో ఉంది. అయినా సూత్రంలో 'కొన్నియెడల' అనటంచేత అమహత్కార్యం నిత్యంగా రావలసిన అవసరం లేదు. ఇంక విశేష్యాన్ని అనుసరించి మహత్కార్యంతో గూడ ఉండవచ్చు. యతులు పదివేలు అనేచోట 'పదివేలు' అని అమహత్కార్యం కాకుండా, మహత్కార్యం వచ్చి, 'పదివేవురు' అని అవుతుంది. అలాగే 'పరిచారకులు నూఱువేలు' అనేచోట నూఱువేలు అనేఅమహద్రూపమే కాక మహత్కార్యం వచ్చి, నూఱునేఁబంద్రు, లేదా నూటయేఁబంద్రు' అనేవిధంగా

కూడా ఉంటుంది. ఇలా మహత్కార్యం వచ్చిన రూపాలు కూడా కవిప్రయోగాలలో ఉన్నా యని ఈవివరణవాక్యం తాత్పర్యం.

**49. కడపటియుదాహరణములయందలిసంఖ్యావాచకములు తత్సమములు గాన వాని కట్టిరూపములు మూఁ డర్బుదములవారు, పదివేల సహస్రసంఖ్యలవారు అని యేర్పడుచున్నవి.** (శబ్ద. 104)

'మహద్విశేషణసంఖ్యావాచకంబులకుం గొన్నియెడల నమహత్కార్యంబు చూపట్టెడి' అనేసూత్రం వివరణంలోనిది ఈవాక్యం.

పైసూత్రానికి ఉదాహరణలలో చివర ఉన్న మూఁడర్బుదములు వీరభటులు, వేఁడి వెలుంగులు, పదివేలసహస్రములు' అనేచోట్ల సంఖ్యావాచకాలు సంస్కృతసమ శబ్దాలు. సూత్రంలోని 'కొన్నియెడల' అనేదళంచేత అమహత్కార్యం రాకుండా, మహత్కార్యం వచ్చినపక్షంలో ఈతత్సమసంఖ్యావాచకాలకు రూపం ఎలా ఉంటుందో ఈవివరణం నిరూపిస్తున్నది.

అర్బుద అనేశబ్దానికి మహత్కార్యం ప్రత్యేకంగా చెప్పబడలేదు. కాగా మహత్తచ్ఛబ్దం బహువచనరూపంతో సమాసం ఏర్పడినరూపం ఉంటుంది. అర్బుదములవారు. ఇలాగే సహస్రసంఖ్య అనేతత్సమశబ్దం గూడ ఇలాగే మహత్తచ్ఛబ్దంతో సహస్రసంఖ్యల వారు అని అవుతుంది. తత్సమసంఖ్యావాచకాలమహత్కార్యం వచ్చినరూపాన్ని ఇలా మహత్తచ్ఛబ్దంతో గ్రహించా లని వివరణం తాత్పర్యం.

**50. ఊరు మొద లగువానికిఁ దృతీయయం దత్వము సంప్రాప్తింపదు గాన 'ఔపవిభక్తికనామ్నా మత్వం స్యాత్ సప్తమీతృతీయార్థే' అనుసూత్రమున కవి విషయములు గాక 'కేషాంచి దుదంతానాం నేతి విభక్తౌ వునో లుక్ స్యాత్' అనుసూత్రమునకు విషయంబు లగుచున్న వని యెఱుంగ వలయును.** (శబ్ద. 104)

చూ. 'ఊరుచోటుమేన్వాదు లున్లుగ్విషయంబులు' సూత్రవ్యాఖ్య.

**51. ఇట నర్థవిశేషము క్రమముగా ననుట.** (శబ్ద. 114)

'కొన్నిశబ్దంబు లర్థవిశేషంబున ద్విరుక్తంబు లయి యదంతంబులు నగు' అనే సూత్రంవివరణంలోనిది ఈవాక్యం.

ఒండు అనేశబ్దం ద్విరుక్తం కాగా ఒండొండు. ఇది అదంతం కాగా, ఒండొండ. ఇలాగే తరము శబ్దం ద్విరుక్తం అయి, అదంతం కాగా, తరతరమ. ఇలా ద్విరుక్తం

అయి, అదంతం కావటం అర్థవిశేషంలో అని సూత్రం చెప్తున్నది. ఆఅర్థవిశేషాన్ని ఈవివరణం స్పష్టం చేస్తున్నది. ఆఅర్థం 'క్రమముగా' అని. అంటే క్రమంగా అనేఅర్థంలో ఈశబ్దాలు ద్విరుక్త మై, అదంత మవుతా యని తాత్పర్యం.

**52. తఱచుగ ననుటచే నుశబ్దము కొన్నింటి కొకప్పుడు వచ్చును. ఒకప్పుడు రా దని యర్థము గ్రహింపవలెను.**

**దీని కుదాహరణములు పాదపూరణమందలివి.** (శబ్ద. 116)

'నామసర్వనామంబులకును గళ లగునవ్యయంబులకును గడపల సముచ్చయార్థ విశేషపాదపూరణంబులయందు నుశబ్దంబు తఱచుగ నగు'. అనేమొద లైనసూత్రం లోని 'తఱచుగ' అనేపదం ప్రయోజనాన్ని ఈవాక్యం వివరిస్తున్నది.

పైసూత్రంప్రకారం నుశబ్దం సముచ్చయం, అర్థవిశేషం, పాదపూరణం అనేఅర్థాలలో తఱచుగా వస్తుంది అని చెప్తుంది. తఱచు అనటంచేత కొన్నిచోట్ల రాకపోవచ్చును. ఈరాకపోవటం అనేది పాదపూరణంలో జరుగుతుంది అని తరువాతి వివరణవాక్యం తెలియజేస్తున్నది.

'రేయిపగలు నిద్రయు నెప్పు డెఱుఁగక'. ఇక్కడ నిద్రయును అనేస్థలంలో (యు)ను శబ్దం పాదపూరణార్థంలో వచ్చింది. అంటే ఇక్కడ నుశబ్దం లేకపోయినా, అర్థంలో ఏవిధ మైనభంగమూ లేదు. ప్రత్యేకంగా ఏఅర్థమూ లేకుండా వచ్చింది కాబట్టి ఇది పాదపూరణం అవుతుంది. నుశబ్దం ఉన్నా, లేకపోయినా, అర్థంలో భేదం లేదు కాబట్టి ఇక్కడ నుశబ్దం తప్పక ఉండవలసినఅవసరం లేదు. నుశబ్దం లేకుండా రేయిపగలు నిద్ర యెప్పు డెఱుఁగక' అని కూడ ఉండవచ్చు. కాబట్టి ఇటువంటి (పాదపూరణ)స్థలాలలో నుశబ్దం రాకపోవటం సాధించటంకోసం సూత్రంలో తఱచుగ అనటం జరిగిం దని తాత్పర్యం.

పాదపూరణంలో నియతంగా ఉండనవసరం లేదు కాబట్టి దానికోసం తఱచు అనక్కరలేదు. ఇంక సముచ్చయం మొద లైనఅర్థవిశేషాలు ఉన్నప్పటికీ నుశబ్దం లేని స్థలాలు ఉంటే వాటిని సాధించటంకోసం తఱచుగ అనటం సార్థకం అవుతుంది.

**53. విభాష ననుటచే నుశబ్దము కొన్నియెడల యువర్ణపూర్వకముగానే వచ్చు ననియుఁ గొన్నియెడల యువర్ణపూర్వకము గాకయు వచ్చు ననియు నర్థము పరిగ్రహింపవలెను.** (శబ్ద. 116)

'నామసర్వనామంబులకును గళ లగునవ్యయంబులకును గడపల సముచ్చయార్థ

విశేషపాదపూరణంబులయందు నుశబ్దంబు తఱచుగ నగు. కళ లగుననుదంత శబ్దంబులమీఁద నయ్యది యువర్ణపూర్వకంబుగ విభాష నగు' అనేమొద లైనసూత్రం లోని 'విభాష' అనేపదంప్రయోజనాన్ని ఈవాక్యం వివరిస్తున్నది.

ఉదంతాలు కాని కళాశబ్దాలమీద సముచ్చయాద్యర్థవిశేషాలలో 'ను'శబ్దం పూర్వంలో 'యు' అనేవర్ణం గలిగి వస్తుం దని సూత్రం చెప్తున్నది. ఇలా రావటం విభాష. కాబట్టి అనుదంతాలమీద కూడా నుశబ్దం యువర్ణపూర్వకం అయి మాత్రమే వస్తుంది. కొన్నిస్థలాలలో యువర్ణపూర్వకం కావటం కాకపోవటం కూడా ఉంటుంది. అంటే కొన్నిచోట్ల 'యును' అని మాత్రమే ఉంటుంది. కొన్నిచోట్ల 'యును' లేదా 'ను' అని కూడా వస్తుంది.

అనుటయును. ఇక్కడ అనుట అనేభావార్థకశబ్దం మీద ఆనంతర్యంలో నుశబ్దం యువర్ణపూర్వకం అయి మాత్రమే వస్తుంది. యువర్ణపూర్వకం కాకుండా 'అనుటను' అనేవిధంగా ఉండదు. అలా ఉంటే ఆనంతర్యార్థం కుదరదు. కాబట్టి యిక్కడ యువర్ణపూర్వకం కావటం నిత్యం అని గ్రహించాలి.

'ఎంతయు సంయమవంతుడు, ఎంత ననఘుండు' ఇక్కడ ఎంతయు, ఎంతను అనేవిధంగా ఒకసారి యువర్ణపూర్వకం అయింది. వేరొకసారి యువర్ణపూర్వకం కాక కేవలం నుశబ్దం మాత్రమే ప్రయోగింపబడింది. ఇలాంటిచోట్ల యువర్ణపూర్వకం కావటం వికల్పం అని గ్రహించాలి.

# కారకపరిచ్ఛేదం

**1. క్రియాన్వయమును గలిగించునది అనఁగాఁ గ్రియాన్వయము కలది యని కారకశబ్దార్థము.** (కార. 1)

**2. అవి యాఱు. కర్మకారకము, కర్తృకారకము, కరణకారకము, సంప్రదాన కారకము, అపాదానకారకము, అధికరణకారకము.** (కార. 1)

చూ. వ్యాసప్రశ్న. కారకాలు.

**3. సముచ్చయగ్రహణము కూర్చి జ్ఞాపనార్థము.** (కార. 2)

'ఉద్దేశార్థమునందు ద్వితీయకు గుఱిచియు ననుప్రయుక్తం బగు' అనేసూత్రం

వివరణంలోనిది ఈవాక్యం.

పైసూత్రం కర్మ కయినద్వితీయపై ఉద్దేశార్థంలో 'గుఱిచి' అనుప్రయుక్తం అవుతుం దని చెప్తున్నది. 'మమ్ముగుఱిcచి' మొ. 'గుఱిcచియు' అన్నప్పటి సముచ్చయార్థక నుశబ్దం ప్రయోగించడంలోనిప్రయోజనాన్ని వ్యాకర్త యీవాక్యంతో వివరిస్తున్నాడు.

గుఱిచి కూడా వస్తుం దనడంవల్ల గుఱిచి ఒక్కటి మాత్రమే కాక (ప్రసిద్ధ మైన) కూర్చి అనేది కూడా అనుప్రయుక్త మవుతుంది. వర్షముం గూర్చి జపము మొ.

'కర్మప్రవచనీయకే కూర్చిః' అని చింతామణి కూర్చిని చెప్పిఉండడంచేత అది ప్రసిద్ధం గాబట్టి ప్రౌఢవ్యాకర్త విశేష మయిన 'గుఱిచి'ని ఉచ్చరించి కూర్చిని నుశబ్దంచేత జ్ఞాపకం చేశా డని ఊహించవచ్చు. అయితే చింతామణిలో కూర్చి ద్వితీయావిభక్తి. ఇక్కడ కూర్చి మొ. ద్వితీయకు పైన అనుప్రయుక్తాలు.

'కూర్చి' ప్రత్యేకంగా అన్వయించేపదం. కాబట్టి దాన్ని అనుప్రయుక్తం చేయనవసరం లేదు. కాని యిక్కడ గుఱించి, గుఱియించి అనేవి కూడా కనబడు తున్నాయి. వాటిని గూడ ఈనుశబ్దం సంగ్రహించగలదు. లేదా గుఱిచి ప్రభృతు లని స్పష్టంగా చెప్పవచ్చు.

**4. తఱచుగ ననుటచే నొకానొకచో నేకవచనంబున నుకారంబుమీcది ద్వితీయయుc దృతీయావిభక్త్యర్థక మయ్యెడు నని తెలియవలయు.**

(కార. 4)

'కొన్నియెడలc జేతవిభక్త్యర్థకవర్ణంబులకును, వలనవర్ణకంబునకును దఱచుగ 'జేసి యనుప్రయుక్తం బగు' అనేసూత్రంవివరణంలోనిది ఈవాక్యం. సూత్రంలోని 'తఱచు' అనేశబ్దానికి ప్రయోజనాన్ని వ్యాకర్త ఈవాక్యంలో వివరిస్తున్నాడు.

'తఱచు' శబ్దంచేత అరుదుగా ఏకత్వంలో సైతం ఉదంత (జడ) శబ్దానికి పైనున్న ద్వితీయ కూడా తృతీయావిభక్తి (చేత) యొక్క అర్థాన్ని తెలుపుతుంది. అపుడు దానిపై 'చేసి' అనుప్రయుక్త మవుతుంది.

అంటే ఉదంతజడశబ్దాల కేకత్వంలోనూ తృతీయకు ద్వితీయ వస్తుం దని తాత్పర్యం. సూరి 'ఉదంతంబులకు బహుత్వ మందే యీకార్య' మని చెప్పగా ఏకత్వంలో గూడ తృతీయకు ద్వితీయ వస్తుం దని ప్రౌఢవ్యాకర్త పేర్కొంటున్నాడు.

తండ్రిపనుపుచేత, అన్నచోట పనుపు అనేఉదంతజడంమీది తృతీయకు ప్రస్తుతసూత్రంలోని తఱచు శబ్దంచేత ద్వితీయ వచ్చి, చేసి అనుప్రయుక్తం కాగా పనుపుఁజేసి – ఇలాగే తప్పుచేత – తప్పును – తప్పుఁజేసి మొ.

ఈవివరణం సమంజసంగా కనిపించదు. చేసి తఱచుగా అనుప్రయుక్తం అవుతుం దనేవిధానానికి, తృతీయకు ద్వితీయ కావడానికి సంబంధం ఏమీ లేదు. ఈప్రయోగంకోసమే అయితే తఱచుశబ్దం అనవసరం. పనుపున్, తప్పున్ అనే విధంగా చేసి లేకుండా తృతీయకు ద్వితీయ ఉంటుందా. ఏదైనా ఈద్వితీయను మ రొకతీరుగా సాధించుకోటం యుక్తం.

**5. ఇ ట్లనుటచే 'ఇవ్విధము నాననముల్ గలవారు' అనునిట్టి ప్రయోగములు నిర్దుష్టము లగుచున్నవి.** (కార. 4)

'కొన్నియెడలఁ జేతవిభక్త్యర్థకవర్ణకంబులకును వలన వర్ణకంబునకును దఱచుగఁ జేసి యనుప్రయుక్తం బగు' అనేసూత్రంవివరణంలోనిది ఈవాక్యం.

సందర్భవశంగా ద్వితీయ ఇతరవిభక్త్యర్థాలలో రావటాన్ని ప్రస్తావిస్తూ ప్రౌఢవ్యాకర్త ఇలా వివరించాడు. 'ఇతరత్ర చ ద్వితీయా' అనేచింతామణిసూత్రం ద్వితీయ, ఇతర (విభక్తి)స్థలంలో కూడా అవుతుం దని సామాన్యంగా చెప్తున్నది. కాని ఎక్కడ (ఏవిభక్తికి) వస్తుందో ఆస్థానాన్ని స్పష్టంగా నియమించలేదు, కాబట్టి కవిప్రయోగాలలో ఇతరవిభక్త్యర్థంలో ఎక్క డెక్కడ ద్వితీయావిభక్తి కనిపిస్తున్నదో ఆఅన్నితావుల్లోనూ 'ఇతరత్ర' అనేచింతామణిలక్షణంచేత ద్వితీయ వస్తుంది.

ఇవ్విధ మయిన ఆననములు – అన్నచోట 'ఆననములు' అనేప్రథమాంత విశేష్యానికి విశేషణ మయిన 'ఇవ్విధ' శబ్దానికి ప్రథమావిభక్తి వచ్చి, (బహువచనానికి ఏకవచన మై) ఇవ్విధము. ఇక్కడి ప్రథమావిభక్తికి 'ఇతరత్ర చ ద్వితీయా' అని ద్వితీయ వచ్చి – ఇవ్విధమున్ (ఆననముల్) అని అవుతుంది. కాగా ఇక్కడ ప్రథమకు ద్వితీయ రావడం 'ఇతరత్ర చ' అనేలక్షణానికి అనుగుణమై ఈప్రయోగం లక్షణబద్ధ మయింది. కాబట్టి ఇటువంటి ప్రయోగాలు దోషగ్రస్తాలు కావు.

**6. ఈయర్థమునకు 'ఇతరత్ర చ ద్వితీయా' అనుస్థాననియమ శూన్యవిధియు నవకాశ మిచ్చుచున్నది.** (కార. 4)

'కొన్నియెడలఁ జేతవిభక్త్యర్థకవర్ణంబులకును వలనవర్ణకంబునకును దఱచుగఁ జేసి యనుప్రయుక్తం బగు' అనే సూత్రంవివరణంలోనిది ఈవాక్యం.

పైసూత్రంలోని తఱచుశబ్దంచేత 'ఉదంతము పైని ఏకవచనమునను ద్వితీయ తృతీయార్థక మగుట ఒకానొకచోఁ గల' దని వ్యాకర్త పేర్కొన్నాడు. అంటే ఉదంత మైనజడశబ్దానికి ఏకత్వంలో కూడా తృతీయకు ద్వితీయ వస్తుం దని అర్థం. తృతీయకు వచ్చింది కావడంచేతనే యిక్కడిద్వితీయ తృతీయార్థక మవుతున్నది.

సూరి యిక్కడ బహుత్వంలోనే వస్తుం దని చెప్పగా తాను ఏకత్వంలో గూడా వస్తుం దని చెప్పిన ఈఅర్థానికి చింతామణి ఆమోదం కూడా ఉన్న దని యిలా వివరించాడు.

'ఇతరత్ర చ ద్వితీయా' అనేచింతామణిలో 'ఇతరత్ర' అని సామాన్యంగా చెప్పింది. ద్వితీయ ఏవిభక్తిస్థానంలో వస్తుందో ఆస్థానం నియమించకపోవడంవల్ల కవిప్రయోగానుసారంగా ఏవిభక్తి కైనా, ఎక్క డయినా ద్వితీయ వస్తుం దని చెప్పవచ్చు. ఉదంతాలకు బహుత్వంలో మాత్రమే అని (సూరిలాగా) చింతామణి నియమించడం లేదు. కాబట్టి ఏకత్వంలో గూడా ఉదంతజడాలపై తృతీయకు ద్వితీయ చేయడానికి చింతామణిలక్షణంప్రకారం అవకాశం ఉన్నది.

పనుపుచేత – తృతీయకు ద్వితీయ వచ్చి, పనుపున్. చేసి అనుప్రయుక్త మై, పనుపుఁజేసి.

కాగా 'తఱచు'శబ్దానికి ప్రయోజనంగా చెప్పినఅర్థం చింతామణిసమ్మతం. కాబట్టి ప్రామాణికం అని యీవివరణంలో ప్రౌఢవ్యాకర్త తెలుపుతున్నాడు.

**7. ఇటఁ జేతవిభక్త్యర్థక లవర్ణముపై నెల్లెడల నుండవలసిన చేసి యొక్క చోటనె యున్నది.** (కార. 5)

'కొన్నియెడలఁ జేతవిభక్త్యర్థకవర్ణకంబులకును వలన వర్ణకంబునకును దఱచుగఁ జేసి యనుప్రయుక్తం బగు' అనేసూత్రంవివరణంలోనిది ఈవాక్యం.

'స్తనముల,..చూడ్కుల,..అధరముల, అలకంబుల, ... గతుల, పిఱుందుల ,.. భాషితములఁజేసి' అనేప్రయోగాన్ని గురించి ప్రౌఢవ్యాకర్త ఈవివరణం చేస్తున్నాడు.

స్తనములచేత – చూడ్కులచేత మొద లైనఈశబ్దాలు అన్నింటిలోనూ 'జడంబు తృతీయాసప్తములకు ద్వితీయ బహుళంబుగా నగు' అని తృతీయకు ద్వితీయ వచ్చి స్తనములన్ – చూడ్కులన్ – మొ. చింతామణి ననుసరించి ఇక్కడి 'ల' ద్వితీయావిభక్తి. (బాలవ్యాకరణంలో 'ను' అనేదే ద్వితీయ. ల–ఆగమం) కాగా ఈ 'ల'వర్ణం, తృతీయా విభక్త్యర్థకం కాబట్టి 'కొన్నియెడలఁ జేతవిభక్త్యర్థకవర్ణకంబులకును వలన

వర్ణకంబునకును దఱచుగఁ జేసి యనుప్రయుక్తం బగు' అనేసూత్రంచేత చేతవిభక్త్యర్థక లవర్ణాలు అన్నింటిమీద 'చేసి' అనుప్రయుక్త మై - స్తనములఁజేసి, చూడ్కులఁజేసి ఇత్యాదిగా ఉండవలసివచ్చేది. 'అయ్యది యొక్కచోఁ బెక్కుచోట్ల కొక్కటియ చాలెడి' అనేసూత్రంప్రకారం అన్నింటిపైని కాకుండా చివరిదానికి ఒక్కదానికే వచ్చి - స్తనముల, - - చూడ్కుల - - - - 'భాషితములఁజేసి' అని ప్రయోగింపబడింది.

**8. పక్షమునఁ గార్యసంప్రయోగముకొఱకు మొ.** (కార. 9)

'చతుర్థికిం బొంటె వర్ణకంబు నగు' అనేసూత్రం వివరణలోనిది ఈవాక్యం.

సూత్రంలో 'వర్ణకంబును' అనేచోట సముచ్చయార్థక మైనను శబ్దాన్ని ప్రయోగించటంచేత చతుర్థికి 'పొంటె' ప్రత్యయం రావటం వికల్పం. కాబట్టి 'పొంటె' ప్రత్యయం రానిపక్షం కూడ ఉంటుంది. ఆపక్షంలో రూపం ఎలా ఉంటుందో ఈవివరణం స్పష్టం చేస్తున్నది.

'కొఱకు కయి చతుర్థి' అనేసూత్రంప్రకారం కొఱకు, కయి అనేవి రెండు చతుర్థీవిభక్తిప్రత్యయాలు. విశేష మైన 'పొంటె' రానిపక్షంలో పూర్వోక్త మైన 'కొఱకు, కయి' అనేప్రత్యయాలు ఉంటాయి. పొంటె ప్రత్యయం వచ్చినపక్షంలో 'కార్య సంప్రయోగముపొంటెన్'. సూత్రంలోనిసముచ్చయంచేత పొంటె రానిపక్షంలో కొఱకు వస్తే 'కార్యసంప్రయోగముకొఱకున్'. వివరణంలోని మొద లగునవి అనేది కయిప్రత్యయాన్ని సంగ్రహిస్తుంది. కయి ప్రత్యయం వచ్చినపక్షంలో 'కార్య సంప్రయోగముకయి'.

**9. ఈసూత్రము నిట్లు చెప్పుటకు నంద్వితరసప్తమ్యర్థకవర్ణకంబుల మీఁదియుండికి లోపంబు వచ్చుట ప్రయోజనంబు.** (కార. 11)

'వలన కాదేశంబు లగుద్వితీయాసప్తములమీఁదియుండికి లోపంబు బహుళంబుగా నగు' అనేసూత్రంవివరణంలోనిది ఈవాక్యం.

పైసూత్రంలోని బహుళశబ్దంచేత 'అందు' అనేసప్తమీవిభక్తిమీది ఉండి లోపించ దని వ్యాకర్త వివరించాడు. 'అందు, న - సప్తమి' అని సప్తమిలో అందు, న అనేవి రెండే విభక్తులు. అందుపై లోపం రాకపోతే ఇక మిగిలింది 'న'వర్ణకం ఒక్కటే కదా. అటువంటపుడు సూత్రంలో సప్తమి అని సామాన్యంగా చెప్పడం దేనికి? అని శంకించుకుని ఇలా వివరించాడు.

'సప్తమి' అని సూత్రంలో సామాన్యంగా చెప్పడంచేత 'అందు' విభక్తికంటె వే రయినవీ, సప్తమీఅర్థాన్ని బోధించేవీ అయిన అన్నివర్ణాలపై గూడా 'ఉండి' పదం లోపిస్తుంది.

1. గహ్వరమున - - పాఱు. ఇక్కడ 'న' అనేసప్తమిపై ఉండి లోపించింది.

2. ఒడలన్ వెలువడి, ఎక్కడన్ వచ్చియె. ఇక్కడ 'అందు' అనేసప్తమికి ఆదేశంగా వచ్చి (సప్తమ్యర్థక మై)న 'అత్వం' మీద ఉండి లోపించింది.

3. నూతిలో వెలువడి, నూతియొక్కలోను–నూతిలోను నూతిలోనువలననుండి, నూతిలో నుండి. చోటన్ – చోన్– అయినట్లు, లోనన్ – లోన్ శబ్దంలో నవర్ణం లోపించి 'నూతిలోనుండి' ఇట సప్తమి కయినఅత్వం లోపించినా, 'నూతిలోన్' అనేది సప్తమ్యంతమే. కాబట్టి దానిపై ఉండి లోపించి నూతిలో వెలువడి.

సప్తమిలో 'అందు'పై లోపించకపోయినా మిగిలినసప్తమ్యర్థకాలు అన్నింటిపై గూడా ఉండికి లోపం వస్తున్నది. కాబట్టి సూత్రంలో 'సప్తమి' అని సాధారణంగా చెప్పబడిం దని తాత్పర్యం.

'బహుళగ్రహణముచే నందుమీఁదియుండికి లోపంబు కలుగ దని' యింతకు ముందు చెప్పినవాక్యంఅభిప్రాయాన్నే ప్రస్తుతవాక్యం వివరిస్తున్నది.

**10. బహుళగ్రహణముచే నందుమీఁదియుండికి లోపంబు గలుగ దని యెఱుంగునది.** (కార. 11)

'వలన కాదేశంబు లగుద్వితీయాసప్తములమీఁదియుండికి లోపంబు బహుళంబుగా నగు' అనేసూత్రంవివరణంలోనిది ఈవాక్యం.

పైసూత్రం వలనస్థానంలో ఆదేశంగా వచ్చిన ద్వితీయ, సప్తమీవిభక్తులకు పైనున్న ఉండిపదానికి లోపం బహుళంగా చెప్తున్నది. బహుళం అనడంచేత ఈకార్యం ప్రవృత్తి, అప్రవృత్తి, విభాష, అన్యకార్యం అని నాలుగువిధాలుగా ప్రవర్తించవచ్చు. వాటిలో 'అప్రవృత్తిని' ప్రస్తుతవాక్యం వివరిస్తున్నది.

'అందు' అనేది సప్తమీవిభక్తి. కాబట్టి సప్తమిమీద ఉండి లోపిస్తుం దంటే 'అందు' అనేసప్తమిమీద ఉండికి లోపం ప్రాప్తిస్తున్నది. అయితే సూత్రంలోనిబహుళపదంచేత సప్తమిలో అందుమీద మాత్రం ఉండికి లోపం రాదు. 'గహ్వరమున వరదవార, ఎక్కడన్ వచ్చియె' ఇత్యాదిగా సప్తమ్యర్థంలో ఇతరవిభక్తులపై మాత్రమే ఉండి

లోపిస్తుంది.

వనమం దుండి వచ్చె - ఇక్కడ ఉండికి లోపం రాదు. అప్రవృత్తి. కాబట్టి 'వనమందు వచ్చె' అని ఉండి లోపించినరూపం ఉండదు.

కాని 'నాయందు ధనముఁ గొనిపొమ్ము' ఇత్యాదిగా తిక్కనాదులప్రయోగాలలో అందుమీద కూడా ఉండి లోపించడం కనబడుతూనే ఉన్నది.

**11. పక్షంబునఁ గలుగుటంబట్టి.** (కార. 12)

'కొన్నియెడల హేతువునం దన్నంతక్రియలమీఁదను బట్టివర్ణకంబు విభాష నగు' అనేసూత్రం వివరణంలోనిది ఈవాక్యం.

పైసూత్రంచేత అన్నంతక్రియమీద పట్టి ప్రత్యయం వచ్చినందుకు వ్యాకర్త 'కలుగంగఁబట్టి' అనేకవిప్రయోగాన్ని చూపాడు. సూత్రంలో పట్టివర్ణకం రావటం విభాష అనటంచేత పట్టి ప్రత్యయం రానిపక్షంలో రూపం ఎలా ఉంటుందో ఈవాక్యం వివరిస్తున్నది. కలుగంగన్ అనేఅన్నంతక్రియమీద పట్టి ప్రత్యయం రానిపక్షంలో కలుగుట అనేభావార్థకక్రియమీద పట్టి ప్రత్యయం వచ్చి, (ముందు నుగాగమంతో) 'కలుగుటంబట్టి' అని అవుతుంది.

పట్టి రానిపక్షంలో ప్రకృతే మారిపోవటం సరిగాదు. అన్నంతంమీద పట్టి రానపు డేమవుతుందో చూపాలి. కలుగంగన్ అనేవిధంగా ఉండటమో మరొకటో చూపాలి. కలుగుటంబట్టి అనేరూపంకోసం అయితే సూత్రంలో 'విభాష' అనటం అనవసరం.

**12. ఇట నొకానొకచోఁ గొఱకుకయివర్ణకంబులు నయ్యెడి.** (కార. 13)

'షష్ఠీస్థానికం బగు కువర్ణకం బొక్కొక్కచో ద్వితీయాదివిభక్తులకు మాఱుగాఁ దత్తదర్థంబులం జూపట్టెడి' అనేసూత్రంవివరణంలోనిది ఈవాక్యం.

పైసూత్రంచేత వేటను బోయిరి మొద లైనకొన్నిస్థలాలలో ద్వితీయకు 'కు' అనేషష్ఠీవిభక్తి వస్తుంది. వేటకుఁ బోయిరి.

ఇలా ద్వితీయకు షష్ఠి వచ్చేస్థలాలు కొన్నింటిలో కొఱకు, కయి అనేచతుర్థీవిభక్తులు గూడా అవుతా యని ఈవివరణం తాత్పర్యం. ద్వితీయకు చతుర్థి వస్తే - వేటకొఱకుఁ బోయిరి, వేటకై పోయిరి మొ.

ఇట అంటే సందర్భాన్నిబట్టి ద్వితీయకే. అది గూడా (ఒకానొకచో) కుషష్ఠి వచ్చేసందర్భాలలో అని గ్రహించాలి. ద్వితీయకు షష్ఠి ఉద్దేశార్థంలోనే వస్తుంది. రాముని జూచెను- రామునకు జూచె నని కాదు. కాగా ద్వితీయ వచ్చినచోట

ఉద్దేశార్థం కూడా ఉన్న ట్లయితే అపుడు ద్వితీయకు మాఱుగా కు షష్ఠి రాకుండా, కొఱకు – కయి వస్తాయి. ఇవీ రాకపోతే ద్వితీయ అలాగే ఉంటుంది.

చతుర్థి (కొఱకు, కయి) 'కొన్నియెడల నుద్దేశమాత్రంబున కగు' నని సూరి చెప్పాడు. ఇక్కడ ద్వితీయకు ఉద్దేశార్థం ఉన్నపుడే రావడం గమనించాలి.

**13. పక్షంబున బ్రహ్మనుగూర్చి తపము చేసె.** (కార. 13)

'షష్ఠీస్థానికం బగుకువర్ణకం బొక్కొకచో ద్వితీయాదివిభక్తులకు మాఱుగాఁ దత్తదర్థంబులం జూపట్టెడి' అనేసూత్రంవివరణంలోనిది ఈవాక్యం.

'చిరముగ బ్రహ్మకుం దపము సేసి' ఇక్కడ బ్రహ్మను(గూర్చి) అన్నప్పటిద్వితీయకు పైసూత్రంప్రకారం 'కు' అనేషష్ఠీవిభక్తి వచ్చి, బ్రహ్మకున్ అని అయింది. కు షష్ఠి రావటం కవిప్రయోగానుసారంగా గ్రహించాలి. కాబట్టి ద్వితీయకు షష్ఠి రానిపక్షంలో ఆద్వితీయ అలాగే ఉండి – 'బ్రహ్మను' 'ఉద్దేశార్థంబునందు ద్వితీయకు గుఱిచియు ననుప్రయుక్తం బగు' అనేసూత్రంచేత ఉద్దేశార్థంలో 'కూర్చి' అనుప్రయుక్తం అయి 'బ్రహ్మనుగూర్చి' అని అవుతుంది.

**14. పక్షమున నీచే నారాధ్యను.** (కార. 13)

'షష్ఠీస్థానికం బగుకువర్ణకం బొక్కొకచో ద్వితీయాదివిభక్తులకు మాఱుగాఁ దత్తదర్థంబులం జూపట్టెడి' అనేసూత్రంవివరణంలోనిది ఈవాక్యం.

'నీచేత నారాధ్యను' అనుచోటి 'చేత' అనేతృతీయకు పైసూత్రంచేత 'కు' అనేషష్ఠీవిభక్తి రాగా 'నీకు నారాధ్యను' అవుతుంది. షష్ఠి రావటం అనిత్యం కాబట్టి రానిపక్షంలో అంతకు పూర్వం అక్కడ ఉన్న 'చేత' అనేతృతీయావిభక్తితో 'నీచే(త) నారాధ్యను' అని ఉంటుంది. ఇలాగే 'అసురులకు బూజనీయులు' అనేచోట కుషష్ఠి రానిపక్షంలో 'అసురులచే(త) బూజనీయులు'.

**15. పక్షమున నీతో మార్కొనంగ నోపరు, హరితో మార్కొనునయ్య అంగపతితో నెదిరించెన్.** (కార. 13)

**16. ఇట నర్థభేదము విశేషము.** (కార. 13)

'షష్ఠీస్థానికం బగుకువర్ణకం బొక్కొకచో ద్వితీయాదివిభక్తులకు మాఱుగాఁ దత్తదర్థంబులం జూపట్టెడి' అనేసూత్రంవివరణంలోనిది ఈవాక్యం.

'కరణసహార్థతుల్యార్థయోగంబులం దృతీయకుం దోడ వర్ణకం బగు' అనేసూత్రంచేత తుల్యార్థయోగంలో తోడ ప్రత్యం విధింపబడింది. మార్కొను మొద లైన ఇక్కడిఅర్థాలు

తుల్యార్థంకంటె భిన్న మైనవి. అయినా తోడ వస్తుంది. 'ఇట నర్థభేదము విశేష' మని ఇక్కడిఅర్థం తుల్యార్థంకంటె భిన్నం అనేఅంశం వివరించాడు. ఇలా ఇక్కడ తోడ ప్రత్యయం వచ్చి 'నీతోడ మార్కొనంగ' అని ఉండగా పైసూత్రంచేత తోడ అనేతృతీయావిభక్తికి మాఱుగా 'కు'అనేషష్ఠీవిభక్తి వచ్చి, 'నీకు మార్కొనంగ' అని ప్రయోగింపబడింది. కుషష్ఠి రానిపక్షంలో పూర్వంలోని తోడ తృతీయతో, 'నీతో(డ) మార్కొనంగ' అని ఉంటుంది.

ఇలాగే 'హరితో ఇభంబులు' అనేచోట తృతీయకు 'కు'షష్ఠి వస్తే, 'హరి కిభంబులు'. రానిపక్షంలో హరితో(డ) ఇభంబులు. 'అంగపతితో నెదిరించెన్' అనేచోట 'కు'షష్ఠి వస్తే 'అంగపతి కెదిరించెన్'. షష్ఠి రానిపక్షంలో 'అంగపతితో(డ) నెదిరించెన్'.

### 17. పక్షమున నీకంటె నగ్గలముగ. (కార. 13)

### 18. అగ్గలము – ఇది అన్యార్థాదిగణగణ్యం బని యెఱుంగవలయు.

'షష్ఠీస్థానికం బగుకువర్ణకం బొక్కొకచో ద్వితీయాదివిభక్తులకు మాఱుగాఁ దత్తదర్థంబులం జూపట్టెడి' అనేసూత్రంవివరణంలోనిది ఈవాక్యం.

'కంటెవర్ణకం బన్యార్థాది యోగజం బగు పంచమి కగు' అనేసూత్రంలో చెప్పబడిన అన్యార్థాదులలో 'అగ్గలము' అనేశబ్దాన్ని పరిగణించుకోవాలి అనిపైవివరణవాక్యానికి అర్థం. దానిచేత అగ్గలము అనేఅర్థంతో యోగం ఉన్నపుడు 'కంటెవర్ణకం బన్యార్థాది ...' అనేసూత్రంచేత కంటె అనేవిభక్తి వస్తుంది. ఇలా 'నీకంటె నొరులగ్గలముగ' నని 'కంటె' అనేపంచమీవిభక్తి కాగా, దానికి పైసూత్రంచేత 'కు' అనేషష్ఠీవిభక్తి వచ్చి, 'నీకు నగ్గలముగ' అని అవుతుంది. నిత్యం కాదు కాబట్టి షష్ఠి రానిపక్షంలో పంచమితో 'నీకంటె నగ్గలముగ' అనేఉంటుంది.

### 19. పక్షమున నీయం దనురక్త. (కార. 13)

'షష్ఠీస్థానికం బగుకువర్ణకం బొక్కొకచో ద్వితీయాదివిభక్తులకు మాఱుగాఁ దత్తదర్థంబులం జూపట్టెడి' అనేసూత్రంవివరణంలోనిది ఈవాక్యం.

కోమలి నీ కనురక్త అని నన్నయప్రయోగం. ఇక్కడ 'అధికరణంబున సప్తమి యగు' అని అందు అనేసప్తమీవిభక్తి వచ్చి 'నీయందు అనురక్త'. ఇక్కడి సప్తమీవిభక్తికి పైసూత్రంచేత కు అనేషష్ఠీవిభక్తి రాగా, నీకు అనురక్త అని అయింది. నిత్యం కాదు కాబట్టి కు షష్ఠి రానిపక్షంలో అంతకుముందరిసప్తమితో 'నీయం దనురక్త' అని ఉంటుంది.

## 20. పక్షమున నీయందుఁ దక్కు. (కార. 13)

'షష్ఠీస్థానికం బగుకువర్ణకం బొక్కొకచో ద్వితీయాదివిభక్తులకు మాఱుగాఁ దత్తదర్థంబులం జూపట్టెడి' అనేసూత్రంవివరణంలోనిది ఈవాక్యం.

'ఈపాండిత్యము నీకు దక్కు' అని పెద్దనప్రయోగం. ఇక్కడ 'అధికరణంబున సప్తమి యగు' అని అందు అనేసప్తమీవిభక్తి వచ్చి 'నీయందు దక్కు'. ఇక్కడి సప్తమీవిభక్తికి పైసూత్రంచేత 'కు' అనేషష్ఠీవిభక్తి రాగా, 'నీకు దక్కు' అని అయింది. నిత్యం కాదు కాబట్టి కు షష్ఠి రానిపక్షంలో అంతకుముందరిసప్తమితో 'నీయందు దక్కు' అని ఉంటుంది.

## 21. పక్షమున నావిషయమున సైపు. (కార. 13)

'షష్ఠీస్థానికం బగుకువర్ణకం బొక్కొకచో ద్వితీయాదివిభక్తులకు మాఱుగాఁ దత్తదర్థంబులం జూపట్టెడి' అనేసూత్రంవివరణంలోనిది ఈవాక్యం.

'నాకు ననఘ సైపు' అని నన్నయప్రయోగం. ఇక్కడ 'అధికరణంబున సప్తమి యగు' అని అందు అనేసప్తమీవిభక్తి వచ్చి 'నాయందు సైపు'. ఇక్కడి సప్తమీవిభక్తికి పైసూత్రంచేత కు అనేషష్ఠీవిభక్తి రాగా, 'నాకు సైపు' అని అయింది. నిత్యం కాదు కాబట్టి కు షష్ఠి రానిపక్షంలో అంతకుముందరిసప్తమితో 'నాయందు సైపు' అని ఉంటుంది. ఈఅర్థంలో 'నావిషయమున సైపు' అని కూడా ఉండవచ్చు. 'విషయనిమిత్తాదిజా తథైవాన్యా' అనేచింతామణిలక్షణాన్ని అనుసరించి కాబోలు ఇక్కడ ప్రౌఢవ్యాకర్త 'నావిషయమున సైపు' అని విషయశబ్దంతో రూపం చూపాడు. 'నాయందు సైపు' అని అందుసప్తమిని చూపుట యుక్తము.

## 22. చతుర్థికి నుదాహరణంబులు పూర్వవ్యాకరణంబులం జూచునది. (కార. 13)

'షష్ఠీస్థానికం బగు కువర్ణకం బొక్కొకచో ద్వితీయాదివిభక్తులకు మాఱుగాఁ దత్తదర్థంబులం జూపట్టెడి' అని చెప్పి ప్రౌఢవ్యాకరణం ఉదాహరణలు ద్వితీయ, తృతీయ, పంచమి, సప్తమి– లకు మాత్రమే చూపింది. ఈ 'కు'వర్ణకం షష్ఠీవిభక్తే కాబట్టి షష్ఠిలో 'కు' రావడం విశేషంగా చూపనవసరం లేదు. మఱి చతుర్థికి కుషష్ఠి అయినఉదాహరణలు ఎందు కీయలేదు? చతుర్థికి కుషష్ఠి రాదా? అనేసందేహానికి సమాధానం ప్రస్తుతవివరణం.

చతుర్థ్యర్థంలో కుషష్ఠి కావడం పూర్వవ్యాకరణాలలో చెప్పబడిఉంది. కాబట్టి దానిని ఆవ్యాకరణాలలో చూడవలసిన దని ఈవాక్యానికి అర్థం.

ఇక్కడ పూర్వవ్యాకరణం అంటే ప్రధానంగా బాలవ్యాకరణం అనవచ్చు. సూరి 'చతుర్థికి మాఱుగా షష్ఠియె తఱుచుగాఁ బ్రయోగంబులం గానంబడియెడి' అని స్పష్టంగా చెప్పి జనకుండు రామునకుం గన్య నిచ్చెను. పురుషార్థంబునకు యత్నింపవలయు అని ఉదాహరించాడు.

చింతామణివ్యాఖ్యలలోను చతుర్థికి షష్ఠి చెప్పబడింది. రామునికి మ్రొక్కులు మొద లగునవి.

కాగా చతుర్థికి కుషష్ఠి కావటం పూర్వప్రసిద్ధం కాబట్టి ఇక్కడ ఉదాహరింపలేదని తాత్పర్యం.

**23. తఱచుగ ననుటచే బాహుకుండు రథంబు గడపునేర్పునకు ఇత్యాదు లెఱుంగునది.** (కార. 15)

'ధాతుజవిశేషణ భావార్థక పూర్వ వ్యవహితావ్యవహిత కర్తృపదప్రథమకుఁ దఱచుగ యొక్కషష్ఠి యగు' అనేసూత్రంవివరణంలోనిది ఈవాక్యం. సూత్రంలోని తఱచు అనేశబ్దానికి ప్రయోజనాన్ని ఈవాక్యం వివరిస్తున్నది.

పైసూత్రంలో కర్తృపదప్రథమకు యొక్క 'తఱచుగా' వస్తుంది అనడంచేత అరుదుగా యొక్క షష్ఠి రాదు. అపుడు అంతకు ముం దున్నప్రథమ అలాగే ఉంటుంది అని ఈవివరణం తాత్పర్యం.

'బాహుకుండు రథము గడపునేర్పు' –ఇక్కడ కర్త అయిన బాహుకశబ్దానికి 'భావార్థకాదియోగంబునఁ గర్తకుం బ్రథమ యగు' అని ప్రథమ రాగా, ఆప్రథమకు ప్రస్తుతసూత్రంచేత 'యొక్క' వచ్చి 'యొక్కకు లోపంబు బహుళంబు' గాబట్టి లోపించగా 'బాహుకు రథంబు గడపునేర్పు'. 'తఱచు' అనడంచేత యొక్క రానిపక్షంలో ప్రథమ అలాగే ఉండి, బాహుకుండు రథము గడపు నేర్పు. ఇలాగే పరీక్షిజ్జనపాలు చనుట మొ.

**24. ఇక్కడ నిది షష్ఠ్యంతమునకు విశేషణము గనుక ప్రథమ.** (కార. 16)

'యొక్కకు లోపంబు బహుళంబు' అనేసూత్రంవివరణంలోనిది ఈవాక్యం.

'వారివ ...పుష్పదామములయు' అనేప్రయోగంలో 'పుష్పదామముల యొక్కయును' అనేచోట 'యొక్క' 'యొక్కకు లోపంబు బహుళంబు' అనేసూత్రంచేత లోపించిం దని వ్యాకర్త ఉదాహరిస్తున్నాడు.

లోపించడానికి ఇక్కడ యొక్క ఉన్నదా? దీనికి విశేషణ మైన వారివి (+అ)

అనేది ప్రథమలో ఉన్నది గదా అని సందేహం కల్గవచ్చు నని వ్యాకర్త ఇలా వివరించాడు.

'దామములయొక్క' అనేది షష్ఠి. అయితే 'వారివి' అనేవిశేషణం గూడా 'విశేష్యంబులకుం బోలె' అనేసూత్రంచేత షష్ఠిలో ఉండాలి గదా. వారివానియొక్క. 'కొన్నియెడల విశేషణంబుల షష్ఠికిం బ్రథమ విభాష నగు'. ('షష్ఠీ విశేషణానాం ప్రథమా స్యాత్' అని చింతామణి) అని షష్ఠికి ప్రథమ వచ్చి – వారివి. దానిపై అవధారణార్థంలో 'అ'కారం చేరి (వారివి+అ) వారివ=వారివే అయిన అని అర్థం.

కాగా 'వారివ' అన్నపు దున్నప్రథమ షష్ఠికి వచ్చింది. ఆషష్ఠి 'దామములయొక్క' అన్నప్పు దున్నవిశేష్యషష్ఠి ననుసరించి వచ్చింది. దామములయొక్క(యును) అన్నపు దున్న యొక్కవిభక్తికి లోపం, 'యొక్కకు లోపంబు బహుళంబు' అనేసూత్రంచేత వచ్చింది. కాబట్టి యిది యీసూత్రానికి లక్ష్యం అయిం దని వ్యాకర్త వివరణతాత్పర్యం.

**25. సమ్మెటకోలలయొక్కయు, అంకుశములయొక్కయు, చేఁకుకోలల యొక్కయు వ్రేటులచేత నని యర్థము.** (కార. 16)

**26. ఇట అంకుశములవ్రేటు లనఁగా లక్షణచేఁ బోటు లని యర్థము.**

'యొక్కకు లోపంబు బహుళంబు' అనేసూత్రంవివరణంలోనిది ఈవాక్యం.

'సమ్మెటకోలల, అంకుశముల, చేఁకుకోలల వ్రేటుల' అని కవిప్రయోగం. 'సమ్మెటకోలలయొక్క, అంకుశములయొక్క, చేఁకుకోలలయొక్క వ్రేటుల' అని ఉండగా 'యొక్కకు లోపంబు బహుళంబు' అనేసూత్రంచేత యొక్కప్రత్యయాలు లోపించి పై ప్రయోగం సిద్ధించింది. కవిప్రయోగం అర్థాన్ని పైవాక్యంచేత వ్యాకర్త యొక్కప్రత్యయం చేర్చి వివరించాడు.

వ్రేటులు అంటే దెబ్బలు అని అర్థం. సమ్మెటదెబ్బలు, చేఁకుకోలలదెబ్బలు అనే విధంగా అక్కడ దెబ్బలు అనేఅర్థంతో వ్రేటులు అనేశబ్దం సూటిగా అన్వయిస్తుంది. అయితే అంకుశములదెబ్బలు అనేఅర్థం కుదరదు. అంకుశాలతో కొట్టరు కదా. పొడవటం అని చెప్పాలి. కాబట్టి అంకుశాలవిషయంలో వ్రేటులు అనేశబ్దానికి దెబ్బలు అనేముఖ్యార్థానికి బాధ యేర్పడటంచేత అంటే సరిగా అన్వయించకపోవటం చేత లక్షణావృత్తి నాశ్రయించి, (అంకుశాలవిషయంలో మాత్రం) వ్రేటులు అంటే పోటులు (పొడుచుటలు) అనేఅర్థం స్వీకరించా లని వ్యాకర్త వివరిస్తున్నాడు.

**27. బహుళగ్రహణముచే ధాతుజవిశేషణభావార్థకములముందఱి కర్తృ**

**పదంబులయొక్కకు నిత్యంబుగ లోపం బని యెఱుంగవలయు.** (కార. 16)

'యొక్కకు లోపంబు బహుళంబు' అనేసూత్రంవివరణంలోనిది ఈవాక్యం.

పైసూత్రం యొక్క షష్ఠికి బహుళంగా లోపం చెప్తున్నది. బహుళం అంటే ఆకార్యం ప్రవృత్తి, అప్రవృత్తి, విభాష, అన్యకార్యం అని నాలుగు విధాలుగా ప్రవర్తించవచ్చు. అందులో ప్రవృత్తిస్థలాన్ని ఈవాక్యం వివరిస్తున్నది.

'ధాతుజవిశేషణ భావార్థక పూర్వ వ్యవహితావ్యవహిత కర్తృపదప్రథమకు దఱచుగ యొక్కషష్ఠి యగు' అనేసూత్రం ధాతుజవిశేషణాలకూ, భావార్థకాలకు ముందటి కర్తృపదాలకు యొక్క అనేషష్ఠీవిభక్తిని చెప్తున్నది. బాహుకుఁడు – కడపు – బాహుకు యొక్క – కడపు. ధాతుజవిశేషణం. జనపాలకుడు చనుట–జనపాలకుయొక్క చనుట. ఇక్కడ వచ్చిన యొక్క విభక్తికి 'యొక్కకు లోపంబు బహుళంబు' అనేసూత్రంలోని బహుళపదంచేత లోపం నిత్యంగా వస్తుంది. బాహుకు – గడపు, జనపాలకు చనుట మొ.

కావ్యాలలో ఎక్కడా 'యొక్క' ప్రయోగం కానరాదు. కాబట్టి యొక్క అనేవిభక్తి ఎక్క డైనా నిత్యంగానే లోపిస్తుం దని చెప్పాలి.

**28. దీనికిఁ బ్రయోగాంతరంబు మృగ్యంబు.** (కార. 17)

'ఒక్కచో నుదంతం బగునజడంబు తృతీయకును నవర్ణకంబు గానంబడియెడి' అనేసూత్రంవివరణంలోనిది ఈవాక్యం.

'ఉదంతజడంబుతృతీయకు నవర్ణకం బగు' అనేబాలవ్యాకరణసూత్రం తృతీయకు నవర్ణకం జడశబ్దాలమీద మాత్రమే విధించటంచేత జడం 'కాని' శబ్దంమీద తృతీయకు నవర్ణకం రాదు. పైసూత్రంతో ప్రౌఢవ్యాకర్త జడం కానిదానిమీద కూడ తృతీయకు నవర్ణం వస్తుం దని చెప్పి, 'ఏనుగున నేనుగు' అనేప్రయోగం ఒకటి చూపాడు. ఇది తప్పు, జడం గానిదానిమీద తృతీయకు నవర్ణకం వచ్చినందుకు మరొకప్రయోగం లభించలే దని వ్యాకర్త ఈవివరణంతో స్పష్టం చేస్తున్నాడు.

**29. ఇట్టిప్రయోగములచేత 'అన్యస్యాః క్వచి ద్భవే చ్చాన్యా' అను శబ్దశాసనులసూత్రము సార్థక మగుచున్నది.** (కార. 20)

'ఒక్కొకచో జడంబు సప్తమికిం బ్రథమయు నగు' అనేసూత్రం వివరణంలోనిది ఈవాక్యం.

తీర్థమందు ఆడి – తీర్థమాడి, చిచ్చునందు ఉఱికిన – చిచ్చుఱికిన, మొద

లయిన యీప్రయోగాలలో (జడవాచకాలమీది) సప్తమీవిభక్తికి ప్రథమావిభక్తి వచ్చింది. అందుకే ప్రౌఢవ్యాకరణం 'ఒక్కొకచో జడంబు సప్తమికిం బ్రథమయు నగు' అని పేర్కొన్నది. ఈలక్షణం చింతామణిసమ్మతమె అని వ్యాకర్త వివరిస్తున్నాడు.

చింతామణి 'ఇతరత్ర చ ద్వితీయా, తస్యాః ప్రథమా చ జడపదానాం స్యాత్' అని ఆయావిభక్తులకు వేరే విభక్తులు రావడం చెప్పింది. కాని సప్తమికి ప్రథమ రావడం (ప్రౌఢవ్యాకరణంలో లాగా) సూత్రించలేదు. (బాలవ్యాకరణం కూడా జడంబు ద్వితీయకే ప్రథమను విధించింది. కాని సప్తమికి చెప్పలేదు).

అయినా 'అన్యస్యాః క్వచి ద్భవే చ్చాన్యా' అని చింతామణి 'ఒకానొకవిభక్తికి మఱి యొకవిభక్తియు నగు' అని చెప్పింది. సప్తమికి ప్రథమ వచ్చిన ఇటువంట ప్రయోగాలు (ఇలాగే ఇతరా లే మైనా ఉంటే అవీ) అన్యస్యాః అనేసూత్రానికి లక్ష్యా లయి, ఆలక్షణం ప్రయోజనవంత మవుతున్నది. ఆయావిభక్తులకు ఆయావిభక్తులు ప్రత్యేకించి చెప్పినవి పోగా, వానికి భిన్నంగా విభక్తి మారినస్థలాలను 'అన్యస్యాః' అనేలక్షణం సాధిస్తుంది.

'అన్యస్యాః' అనేసూత్రం సాధిస్తున్నది కాబట్టి సప్తమికి ప్రథమ అనేయీవిధానం చింతామణిసమ్మతం.

**30. పక్షాంతరమునఁ దీర్థమం దాడి మొ.** (కార. 20)

'ఒక్కొకచో జడంబు సప్తమికిం బ్రథమయు నగు' అనేసూత్రం వివరణంలోనిది ఈవాక్యం.

పైసూత్రంలోని 'ప్రథమయును' అనేచోటి సముచ్చయార్థకనుశబ్దంచేత ఈకార్యం వైకల్పికం (అరుదు). కాబట్టి జడవాచకాలమీది సప్తమికి ప్రథమ రాకపోవచ్చును. ప్రథమ రానిపక్షంలో పూర్వపుసప్తమి అలాగే ఉంటుంది.

'తీర్థమందు ఆడి' అనేచోట 'అధికరణంబునకు సప్తమి యగు' అనేసూత్రంచేత సప్తమీవిభక్తి (అందు) వచ్చింది. ఆసప్తమికి పైసూత్రంచేత ప్రథమావిభక్తి రాగా తీర్థము+ఆడి=తీర్థమాడి అని అయింది. ప్రథమయును అన్నప్పటినుశబ్దంచేత ప్రథమ రావటం వికల్పం కాబట్టి రానిపక్షంలో – సప్తమి అలాగే ఉండి, 'తీర్థమం దాడి'.

ఇలాగే నెఱఁకు లాడు–నెఱఁకులం దాడు, మోము గ్రమ్మఁగ–మోమునందుఁ గ్రమ్మఁగ, ఆవ మిడిన–ఆవమం దిడిన మొ.

**31. షష్ఠీవిశేషణానా మ్మను బహువచనస్వారస్య మిట్టిప్రయోగముల**

**కుత్పాదకముగా నున్నది.** (కార. 22)

'కొన్నియెడల విశేషణంబు ద్వితీయాదులకుఁ బ్రథమ చూపట్టెడి' అనేసూత్రం వివరణం లోనిది ఈవాక్యం.

పైసూత్రంచేత ప్రౌఢవ్యాకర్త విశేషణం ద్వితీయాదివిభక్తులకు ప్రథమ విధించాడు. ఈలక్షణం నన్నయకు సమ్మతం కాబట్టి ప్రామాణికం అని నిరూపించడానికి ఈవివరణం చేశాడు.

చింతామణి 'షష్ఠీ విశేషణానాం ప్రథమా స్యాత్' అని విశేషణములషష్ఠికి ప్రథమ విధించింది. ఇలా నన్నయ షష్ఠికి మాత్రమే చెప్పగా ప్రౌఢవ్యాకర్త ద్వితీయాదులకు చెప్పడం నన్నయమతానికి విరుద్ధం కదా అని సందేహం. కాని షష్ఠికి ఒక్కదానికి మాత్రమే (ప్రథమ) రావడం చింతామణి ఉద్దేశించిఉంటే 'విశేషణస్య' అని ఏకవచనంలో చెప్తే చాలు. 'విశేషణానాం' అని బహువచనంలో చెప్పడం దేనికి?

'కర్మధారయంబులందు ముపర్ణకంబునకుం బుంపు లగు' అన్నపుడు బహువచనం వల్ల కర్మధారయేతరసమాసంలో అంటే వ్యధికరణంసమాసంలోనూ పుంపులు రావడం, సింగపుంగొదమ ఇత్యాదుల్లో స్పష్టం.

అలాగే ఇక్కడ 'షష్ఠీ విశేషణానాం' అన్నప్పటి బహువచనంస్వారస్యంచేత షష్ఠ్యంతా లయినవిశేషణాలకే కాక, ఇతర విభక్త్యంతవిశేషణాలకు కూడా ప్రథమ వస్తుంది అనేఅర్థం కలుగుతున్నది. దానివల్ల విశేషణంబుద్వితీయాదులకు గూడ అరుదుగా చింతామణి సూత్రంచేత ప్రథమ వస్తుంది. ఘనుల్ – దైత్యపతులను, తల్లి ద్రౌపదితోడ – మొదలైన షష్ఠికి భిన్న మైన విశేషణవిభక్తికి ప్రథమ వచ్చినప్రయోగాలకు 'విశేషణానాం' అన్నప్పటి బహువచనం సాధకం అని తాత్పర్యం.

కాగా ప్రౌఢవ్యాకర్త పేర్కొన్నఈలక్షణలక్ష్యాలు చింతామణిసమ్మతాలు.

**32. మఱియు నేతద్విశేషంబు లనేకవిధంబులు గలవు గాని ప్రామాణిక ప్రయోగములు దొరుకమింజేసి యవి యనాదృతము లయ్యె.** (కార. 22)

'కొన్నియెడల విశేషణంబు ద్వితీయాదులకుఁ బ్రథమ చూపట్టెడి' అనేసూత్రం వివరణం లోనిది ఈవాక్యం.

ఏతద్విశేషంబులు అంటే విశేషణం విభక్తులకు విశేష్యానుగుణ మైనవిభక్తికంటె భిన్న మైనవిభక్తి రావటం అని అర్థం కావచ్చు. అటువంటివి అనేకవిధాలుగా ఉన్నట్లు వ్యాకర్త పేర్కొన్నాడు. కాని అవి యేవో, వాటిలక్షణం ఏమిటో ఉదాహరించక పోవటంచేత గుర్తించటం కష్టం. ఇటువంటిప్రయోగాలు వెదికి కనుగొనవలసిఉంది.

అయినా అటువంటివాటికి ప్రామాణిక మైనప్రయోగాలు లే వనీ, అందువల్ల అవి ఆదరింపదగినవి కా వనీ చెప్తున్నాడు వ్యాకర్త.

**33. బహువచనాంతము గాక యేకవచనాంత మైనచోఁ దెరువు లై దుండవలెను.** (కార. 25)

'కొన్నియెడల విధేయవిశేషణ మొండ బహువచనాంతం బయి విశేష్యంబులు పెక్కింటి కన్వయయోగ్యం బగు' అనే సూత్రంవివరణంలోనిది ఈవాక్యం.

పైసూత్రంప్రకారం విధేయవిశేషణం బహువచనాంత మై ఒకటే ఉండి, అనేక మైనవిశేష్యాలతో ప్రత్యేకంగా అన్వయిస్తుంది.

ఇది దక్షిణాపథంబున కిది విదర్భాపురమున కిది కోసల కిం
దిది యుజ్జయినికిఁ దెరువులు మది నిన్నిటిలోన నరుగ మన కెద్ది యగున్.

ఇక్కడ 'తెరువు' అనేవిధేయవిశేషణాన్ని ఏకవచనాంతంగా ప్రయోగిస్తే, ఇది దక్షిణాపథమునకు తెరువు, ఇదియు విదర్భాపురమునకు తెరువు, ఇది కోసలకు తెరువు, ఇది యుజ్జయినికి తెరువు, మన కేది తెరు వగు – అనేవిధంగా 'తెరువు' శబ్దాలు అయిదు ఉండవలసి వస్తుంది. అని యీవాక్యం తాత్పర్యం.

**34. ఇక్కడఁ దృతీయకుఁ బంచమిగా మార్పు గలిగె నని తెలియ వలయు.** (కార. 26)

చూ. కొన్నియెడల విభక్తిపరిణామంబు గ్రాహ్యంబు. సూత్ర వ్యాఖ్య.

# సమాసపరిచ్ఛేదం

**1. బహుళంబుగా ననుటచే రామరాయఁడు, సుబ్బరావు, ఎఱ్ఱప్రెగ్గడ యిత్యాదులందు దీర్ఘంబు వైకల్పికంబు.** (సమా. 2)

"కర్మధారయంబు బిరుదాద్యుత్తరపదం బయ్యె నేని ద్వ్యక్షరాదంత స్త్రీపుంసంజ్ఞా వాచకం బగుపూర్వపదంబు నంత్యాక్షరంబున కంతట దీర్ఘంబు బహుళంబుగా నగు' అనేసూత్రం వివరణంలోనిది ఈవాక్యం. పైసూత్రంలోని బహుళపదం ప్రయోజనాన్ని ఈవాక్యం వివరిస్తున్నది.

బహుళం అంటే ఆసూత్రంలో చెప్పినకార్యం ప్రవృత్తి, అప్రవృత్తి, విభాష, అన్యకార్యం అని నాలుగు విధాలుగా ప్రవర్తిస్తుంది. కాగా రామరాయఁడు, సుబ్బరావు,

ఎఱ్ఱప్రెగ్గడ మొద లయినవాటిల్లో దీర్ఘం వికల్పం(విభాష)గా వస్తుంది. దీర్ఘ మయితే రామారాయఁడు మొ. ఇక్కడ రామరాయఁడు మొదలుగా చూపడంచేత అంతకు ముందున్న 'రామాశాస్త్రి' ఇత్యాదుల్లో దీర్ఘం నిత్యం అనేఅర్థం వస్తున్నది. రామనాయఁడు, రామరెడ్డి ఇత్యాదులు వినిపించవు. కాని రామశాస్త్రి, సుబ్బశాస్త్రి అనేరీతివి వ్యవహారంలో ఉన్నాయి.

**2. అంతట ననఁగా సాంస్కృతికాదులు మూట నని యర్థము.** (సమా. 2)

'కర్మధారయంబు బిరుదాద్యుత్తరపదం బయ్యె నేని ద్వ్యక్షరాదంత స్త్రీ పుం సంజ్ఞావాచకం బగుపూర్వపదంబునంత్యాక్షరంబున కంతట దీర్ఘంబు బహుళంబుగా నగు' అనేసూత్రంలోని 'అంతట' అనేశబ్దం అర్థాన్ని వివరిస్తున్నది ఈవాక్యం.

అంతట అంటే అన్ని విధ మైనసమాసాలలో అని అర్థం. అవి సాంస్కృతికాదులు మూడు. 'సాంస్కృతికాచ్ఛికమిశ్రభేదంబుచే సమాసంబు త్రివిధంబు' అని చెప్పిన మూడువిధా లయినసమాసాలలోనూ ఈదీర్ఘకార్యం జరుగుతుం దని తాత్పర్యం.

**1. సాంస్కృతికసమాసం** : ఇది సిద్ధం, సాధ్యం అని రెండు విధాలు. ప్రస్తుతసందర్భంలో సిద్ధసమాసాలు మాత్రమే ఉంటాయి. రామశాస్త్రి – రామాశాస్త్రి. 'సంస్కృతసమశబ్దాలకు అయ్యేసాధ్యసాంస్కృతికాలు ఉండ వని చెప్పాలి.

**2. ఆచ్ఛికసమాసం :** రెండూ అచ్చతెలుగుపదాల కయినసమాసం ఆచ్ఛికం. సుబ్బారెడ్డి. మొ.

**3. మిశ్రసమాసం :** సంస్కృతసమశబ్దమూ, ఆచ్ఛికశబ్దమూ కలిసినది మిశ్రసమాసం. రామారావు, సుబ్బాశాస్త్రి మొ.

ఇటువంటిమూడురకాలసమాసాల్లోనూ పయికార్యం కావడంకోసం సూత్రంలో 'అంతట' అన్నాడు.

'అంతట' అనేదళం లేకపోయినా ఈఅర్థానికి భంగం లేదు. సమాసంలో అంటే ఏసమాసంలో నైనా చేయవచ్చు.

**3. కృష్ణశాస్త్రీత్యాదులందు దీర్ఘంబు గలుగదు.** (సమా. 2)

'కర్మధారయంబు బిరుదాద్యుత్తర పదం బయ్యె నేని ద్వ్యక్షరాదంతస్త్రీపుంసంజ్ఞావాచకం బగుపూర్వపదంబు నంత్యాక్షరంబున కంతట దీర్ఘంబు బహుళంబుగా నగు' అనేసూత్రంవివరణంలోనిది ఈవాక్యం. సూత్రంలోనిబహుళపదం ప్రయోజనాన్ని

వివరిస్తున్నది.

పైసూత్రంప్రకారం రావలసినదీర్ఘానికి సూత్రంలోని 'బహుళంబు' అనేపదంచేత 'కృష్ణశాస్త్రి' మొద లైనసమాసాలలో దీర్ఘం కాదు అని పై వివరణవాక్యాని కర్థం.

'కృష్ణశాస్త్రి' అనేసిద్ధసమాసంలో 'శాస్త్రి' అనేబిరుదవాచకం పరంగా ఉండగా రెండక్షరాల పురుషసంజ్ఞ అయిన 'కృష్ణ' శబ్దంలో చివరిఅచ్చుకు పై సూత్రంప్రకారం దీర్ఘం ప్రాప్తిస్తున్నది. సూత్రంలోని బహుళపదంచేత దీర్ఘానికి అప్రవృత్తి. దీర్ఘం రాదు. కాబట్టి కృష్ణశాస్త్రి అని హ్రస్వంతో మాత్రమే రూపం ఉంటుంది. ఇత్యాదులనడంచేత – శివరావు మొ. చోట్ల దీర్ఘం రాదు.

### 4. రామిసెట్టి సుబ్బిసెట్టి యిత్యాదులం దిత్వంబు నిత్యంబు. (సమా. 4)

'ఇటఁ బూర్వపదంబునత్వంబున కిత్వంబు బహుళంబుగా నగు' అనేసూత్రం వివరణం లోనిది ఈవాక్యం.

పైసూత్రంలో బహుళం అనడంచేత ఆకార్యం, ప్రవృత్తి, అప్రవృత్తి, విభాష, అన్యకార్యం అని నాలుగు విధాలుగా ప్రవర్తిస్తుంది. అందులో ప్రవృత్తిని ఈవాక్యం వివరిస్తున్నది.

కర్మధారయసమాసంలో బిరుదాద్యుత్తరపదం పరంగా ఉండగా పూర్వంలోని ద్వ్యక్షరాదంత స్త్రీ పుంసంజ్ఞావాచకశబ్దానికి బహుళంగా వచ్చే ఇత్వం – రామిసెట్టి, సుబ్బిసెట్టి మొ. చోట్ల నిత్యంగా వస్తుంది.

రాముఁడు+సెట్టి. విభక్తిలోపాదులతో, రామ+సెట్టి అని కాగా, 'కర్మధారయంబు బిరుదాద్యుత్తరపదం బయ్యె నేని' అనేసూత్రంప్రకారం రావలసినదీర్ఘాన్ని బాధించి 'ఇటఁ బూర్వపదంబు' అనేసూత్రంచేత ఇత్వం నిత్యంగా వచ్చి, రామిసెట్టి. ఇలాగే సుబ్బఁడు + సెట్టి = సుబ్బిసెట్టి. నిత్యంగా రావటంవల్ల రామసెట్టి, సుబ్బసెట్టి వంటి ఇత్వం రానిరూపాలు ఉండవు.

### 5. కృష్ణమ్మ యనుచో అమ్మ ప్రేమసూచకం బని యెఱుంగునది. (5)

'పైయాగమంబులు కొన్నియెడల ద్విత్వయుక్తంబు లగు' అనేసూత్రం వివరణం లోనిది ఈవాక్యం.

కృష్ణుడు అనేసంజ్ఞకు పంతులు అనేబిరుదవాచకంతో కర్మధారయ మై విభక్తిలోపాదులతో కృష్ణపంతులు అని కాగా 'కొన్నియెడల' ననాపామాయాగమంబు లగు' అని 'అమ' ఆగమ మై, (కృష్ణ+అమ+పంతులు) సంధి జరిగి, కృష్ణమపంతులు.

'పైయాగమంబులు కొన్నియెడల ద్విత్వయుక్తంబు లగు' అనేసూత్రంచేత (అమ అనేఆగమంలో) మకారం ద్విరుక్త మై - కృష్ణమ్మపంతులు అని అవుతుంది.

ఇక్కడ కృష్ణమ్మ (పంతులు) అన్నచోట అమ్మశబ్దం ఉన్నది. అమ్మ అనేది స్త్రీవాచకం. 'కృష్ణమ్మపంతులు' అనేది పురుషసంజ్ఞ. పురుషుడిపేరులో 'అమ్మ' అనేస్త్రీవాచకం ఉండడం యుక్తమా? రామన్నసెట్టి, మల్లయ్యశాస్త్రి అని మొ. చోట్ల అన్న, అయ్య - మొ. పురుషవాచకాలే కాబట్టి పురుషసంజ్ఞలలో అవి చేరవచ్చును గాని స్త్రీవాచకం అయిన అమ్మ చేరడం ఎలా? అని శంకించుకుని వ్యాకర్త యీవివరణంలో సమాధానం చెప్తున్నాడు.

కృష్ణమ్మపంతులు అనేచోట అమ్మ అనేది ప్రేమను సూచించేదే కాని స్త్రీని బోధించేది కాదు. కాబట్టి పురుషసంజ్ఞలో 'అమ్మ' ఉండడాన్ని శంకించనవసరం లే దని భావం. ఇలాగే కృష్ణమరాజు మొ.

దీన్నిబట్టి కొండమాంబ - సూరమాంబ అన్నపుడు అమ స్త్రీవాచకమా? నన్నయ్యభట్టులో అయ్య పురుషవాచకమా? అనేఅభిప్రాయం కలుగుతుంది. కాని ఆగమాలుగా చెప్పిన అన మొ. అర్థవంతాలుగా భావించడమే సరి కాదు. ఇవి దేనికి ఆగమంగా వస్తాయో ఆశబ్దాలఅర్థంలో అంటే స్వార్థంలో ఉంటాయి. నిగాగమ, లడాగమాదుల్లాగా. స్త్రీపురుషవాచకా లవుతా యని సందేహించడమె పొరపాటు. వ్యాకర్త చెప్పినట్లు ప్రేమసూచకం అయితే ఆగమాన్ని ఆయాఅర్థవిశేషాలలో విధించాలి. లేకపోతే ప్రేమాద్యర్థాలను అది ఎలా సూచిస్తుంది. 'కృష్ణమ్మపంతులు'లో ప్రేమసూచక మైతే కృష్ణమపంతులులో ఏమిటి. నన్నయభట్టు ఇత్యాదులలో అయ మొ. వాటిపరిస్థితి ఏమిటి.

ఈవివరణం అనవసరమే కాక అనర్థకం కూడా అవుతున్నది.

**6. ఇ ట్లనుటచేఁ బూర్వపదంబు లుప్తవిభక్తికం బయి యవికృతాంతం బగు నని యెఱుంగవలయు.** (సమా. 6)

చూ. 'కర్మధారయం బియ్యది మిశ్రంబు సిద్ధ సమాసం బట్ల యగు'. సూత్రవ్యాఖ్య.

**7. పక్షమున అట్టివాఁడు మొ.** (సమా. 9)

'అట్టి యిట్టి యెట్టి విశేషణంబులమీఁదితచ్ఛబ్దవకారంబునకు లోపంబు విభాష నగు' అనేసూత్రంవివరణంలోనిది ఈవాక్యం.

అట్టి+వాఁడు అని ఉండగా పైసూత్రంప్రకారం వాఁడు శబ్దంలోని 'వా' అనే

అక్షరానికి విభాషగా లోపం వస్తుంది. లోపం వచ్చినపక్షంలో అట్టిఁడు. ఇలాగే ఇట్టి+వాఁడు = ఇట్టిఁడు, ఎట్టి+వాఁడు=ఎట్టిఁడు. విభాష కాబట్టి లోపం రానిపక్షంలో అట్టివాఁడు అని 'వా' అక్షరం నిలిచిఉంటుంది. ఇలాగే ఇట్టివాఁడు, ఎట్టివాఁడు.

**8. ఎట్టిఁడు నాహృదీశుఁ డనుట యుక్తము.** (సమా. 9)

'అట్టి యిట్టి యెట్టి విశేషణంబులమీఁదితచ్ఛబ్దవకారంబునకు లోపంబు విభాష నగు' అనేసూత్రంవివరణంలోనిది ఈవాక్యం.

ఎట్టి+వాఁడు అని ఉండగా పైసూత్రంచేత 'వా' అనేఅక్షరం లోపించినపక్షంలో 'ఎట్టిఁడు' అని అవుతుంది. దీనికి వ్యాకర్త 'ఎట్టిఁడు నానిజేశుఁడు' అనేకవిప్రయోగాన్ని చూపాడు. ఇక్కడ శబ్దంసాధుత్వవిషయంలో బాధ లేదు కాని అర్థంవిషయంలో భేదాన్ని వ్యాకర్త ప్రస్తావిస్తున్నాడు. నిజ+ఈశుఁడు=నిజేశుఁడు. నిజఈశుడు అంటే తనయొక్క అంటే ఇక్కడ నాయొక్క అని అర్థం. కాని అంతకు ముందే నానిజేశుడు అనేశబ్దంలో 'నా'(యొక్క) అనేశబ్దం చెప్పబడింది. కాబట్టి నా=నాయొక్క, నిజ=నాయొక్క, ఈశుడు అనేవిధంగా నాయొక్క అనేఅర్థం పునరుక్తం అవుతున్నది. 'నానిజేశుడు' అనేస్థలంలో 'నాహృదీశుడు' అని ఉంటే పునరుక్తి దోషం తొలగి అర్థవంతంగా ఉంటుం దని వ్యాకర్త సూచన చేస్తున్నాడు.

**9. తెనుఁగున సాధారణంబుగ విశేషణంబు లవిభక్తికంబులు.** (15)

'అట్టి యిట్టి యెట్టి విశేషణంబులమీఁదితచ్ఛబ్దవకారంబునకు లోపంబు విభాష నగు' అనేసూత్రంవివరణంలోనిది ఈవాక్యం.

పైసూత్రంచేత 'అట్టి+వాఁడు' ఇత్యాదుల్లో 'వా'కు లోపం చెప్పి అట్టిఁడు – ఇట్టిరు మొ. రూపాలను ప్రౌఢవ్యాకర్త సాధించాడు. ఇలా తచ్ఛబ్దం పెట్టుకోడం 'వా'కు లోపం చేయడం ఎందుకు? అట్టి ప్రాతిపదికపై ప్రథమైకవచనంలో డుజు వచ్చి, అట్టిఁడు – బహువచనంలో 'లు' కు 'రు' వచ్చి అట్టిరు, అని సులువుగా సిద్ధిస్తాయి గదా. కాగా 'వా' లోపవిధి అనవసరం అని శంకించుకుని దానికి సమాధానంగా వ్యాకర్త పైవివరణం చేశాడు.

తెలుఁగులో విశేషణాలు అంటే అచ్చతెలుగు లయినవిశేషణశబ్దాలు అని అర్థం. అచ్చతెలుగువిశేషణాలు విభక్తి పొందవు అని అర్థం. అయితే విభక్తిని పొందకపోతే అవి పదాలే కావు. పదం కాకపోతే 'అపదం న ప్రయుంజీత' అని ప్రయోగించడానికే అర్హం కావు. కాబట్టి అసలు విభక్తి ఉండ దని అర్థం కాదు. ఇంక విశేషణాలమీద

సరాసరిగా విభక్తులు చేరవు. అట్టి – ప్రథమైకవచనంలో డుజ్. అట్టిఁడు. ఇలా ఉండవు. అందువల్లనే ద్వితీయాదుల్లో అట్టిని, ఇట్టికొఱకు, ఎట్టివలన ఇత్యాదు లుండవు. ఇంక విభక్తివివక్షలో తచ్ఛబ్దం చేరి ఆయావిభక్తులు అనుప్రయుక్త మైనతచ్ఛబ్దంమీద వస్తాయి. ('ధాతుజవిశేషణంబులకు విభక్తి వివక్షించునపుడు తచ్ఛబ్దం బనుప్రయుక్తం బగు' అనేసూరిసూత్రంలోని ధాతుజవిశేషణం ఇతర మైనవిశేషణాలకు ఉపలక్షకంగా గ్రహించి తచ్ఛబ్దం చేసుకోవచ్చు.) అలా అట్టివాఁడు. ఇట్టివానిని మొ. రీతిగా రూపాలు సిద్ధిస్తాయి. ఇపుడు (ప్రథమావిభక్తిలో) 'వా' లోపం చేస్తేనే, అట్టిఁడు(అట్టివాఁడు), ఇట్టిరు(ఇట్టివారు) ఇత్యాదిరూపా లవుతాయి. అందు కని తచ్ఛబ్దవకారలోపవిధానం సార్థకం అని వ్యాకర్తసమన్వయం.

**10. ఆంధ్రశబ్దచింతామణియందుఁ గల ఇద మద సిత్యాది సూత్ర మందలియదఃప్రభృతులు వ్యర్థము లగుచు స్వేతరంబులకును నక్కార్యం బని తెలుపుచున్నవి.** (సమా. 10)

'ముయ్యేడ్వాదులందు హ్రస్వద్విత్వంబులు నిత్యంబులు' అనేసూత్రం వివరణం లోనిది ఈవాక్యం. ఈలక్షణం చింతామణికి సమ్మతమే అని నిరూపించడానికి పౌఢవ్యాకర్త ఇలా వివరించాడు.

ఆంధ్రశబ్దచింతామణి 'ఇదమదఏతద్యత్తచ్ఛబ్దా శ్శబ్దాంతరాన్వయే బహులం హ్రస్వం ప్రపద్య దీర్ఘాః, ద్విత్వ ముపర్యక్షరస్య జనయంతి' అనేలక్షణం ఈ, ఏ, ఆ (త్రికం) అనేశబ్దాలలో దీర్ఘానికి బహుళంగా హ్రస్వం వచ్చి, పై హల్లుకు ద్విత్వం వస్తుం దని చెప్పింది. ఈసూత్రంలో ఇదం, అదస్, ఏతత్ అనేమూడుశబ్దాలు గూడా 'ఈ' అనేదాన్నే బోధిస్తున్నాయి. అటువంటపుడు మొదటి దైన 'ఇదం' శబ్దం ఒక్కదానివల్లనే 'ఈ' శబ్దం బోధింపబడుతుండగా 'అదస్, ఏతత్' అనేశబ్దాలను సూత్రంలో ఉచ్చరించడం వ్యర్థం.

ఇలా 'అదస్ –ఏతత్' శబ్దాలు – వ్యర్థమై, ఆసూత్రంలో పఠింపబడినవాటికి మాత్రమే కాక ఇతరశబ్దాలకు గూడా ఆ సూత్రం విధించినకార్యం వస్తుంది అనేఅర్థాన్ని తెలియజేస్తాయి (జ్ఞాపకం చేస్తాయి).

జ్ఞాపకసిద్ధ మైనఈఅర్థంవల్ల సూత్రంలో పఠింపబడిన ఆ–ఈ–ఏ అనేశబ్దాలకంటె వే రయిన మూ(ఁడు)శబ్దానికి కూడా ఈకార్యం అంటే బహుళంగా హ్రస్వమూ, మీదిహల్లుకు ద్విత్వమూ వస్తాయి.

బహుళంగా చెప్పబడిన ఆహ్రస్వద్విత్వాలు ముయ్యేడు మొద లైనస్థలాల్లో మూఁ

డు) శబ్దవిషయంలో నిత్యంగా వస్తా యని ప్రౌఢవ్యాకరణం చెప్పడం చింతామణికి సమ్మతమె అని తాత్పర్యం.

దీనిచేత ముజ్జగములు, మూడుజగములు అనేరీతిగా బాలవ్యాకరణం సాధించిన రూపాలు పైచింతామణిసూత్రసిద్ధాలే కాబట్టి అందులో విశేషం లేదు. బహుళ ప్రయోజనంగా నిత్యస్థలాలను పేర్కొంటున్న 'ముయ్యేడ్వాదులందు..' అనే తనలక్షణమె విశేష మని కూడా వ్యాకర్త భావించిఉండవచ్చు.

ఇక్కడ ప్రౌఢవ్యాకర్త సమన్వయం సరి కాదు. వైయర్థ్యం, అర్థాంతరజ్ఞాపనం. స్వాంశంలో చారితార్థ్యం, అన్యత్ర ఫలం అని ఇటువంటిచోట్ల ఉండవలసిన నాలుగుఅంశాల్లో జ్ఞాపకసిద్ధ మైనఅర్థంవల్ల వ్యర్థ మైనఅంశం, చరితార్థం కావడం అనేఅంశం ఇక్కడ లేదు. 'అదస్–ఏతత్' లు సార్థకం కావడం అనేది జ్ఞాపకసిద్ధ మైనఅర్థంవల్ల సిద్ధించడం లేదు. కాబట్టి ఈసమన్వయం సంప్రదాయానుగుణం కాదు. వ్యర్థం కావడం మాత్రమే ఇక్కడ జరిగింది. కాబట్టి ముజ్జగము లిత్యాదులు చింతామణిసిద్ధాలు కావు. వాటిని బాలవ్యాకర్త చెప్పడం విశేషమే. చింతామణిచేత సాధించా లనుకుంటే వ్యర్థప్రసంగం లేకుండా చింతామణిసూత్రంలోని బహుళపదం చేత అన్యకార్యంగా మూఁడులో డుజ్లోపంతోపాటు హ్రస్వద్విత్వాలు గూడా సాధించుకోవచ్చు.

**11. త్రికక్రియాజన్యవిశేషణఘటితంబులు త్రికక్రియాజన్యవిశేషణోభయఘటితంబులు, కేవలక్రియాజన్యవిశేషణఘటితంబులు నని ద్వివిధంబులు.** (సమా. 18)

'కొన్నియెడల విశేషణోభయపదంబులు త్రికక్రియాన్యవిశేషణఘటితంబులు సందర్భయోగ్యపదవ్యవహితంబు లగు' అనేసూత్రంవివరణంలోనిది ఈవాక్యం.

సూత్రంలోని 'త్రికక్రియాజన్యవిశేషణఘటితంబులు' అనేపదం అర్థాన్ని ఈవాక్యం వివరిస్తున్నది. ఆ,ఈ,ఏ అనేమూడు సర్వనామాలకి త్రికం అని పేరు. క్రియాజన్య విశేషణాలు అంటే ధాతుజవిశేషణాలు.

ఇటువంటివిశేషణాలకు చేసిన(విశేషణోభయపద)కర్మధారయసమాసాలలో త్రికమూ, ధాతువిశేషణమూ, రెండు కలిసి ఉండవచ్చు. ఉదా. ఈకన్నులు తెఱవనిశిశువు. ఇక్కడ 'ఈ' అనే త్రికానికీ, 'తెఱవని' అనేక్రియాజన్యవిశేషణానికీ విశేషణోభయపదకర్మధారయం. 'కన్నులు' అనేపదంతో ఈరెండిటికీ వ్యవధానం.

రెండు కూడా క్రియాజన్యవిశేషణాలే అయిఉండవచ్చు. 'ఏకతమ తిరుగు నదరు

లుమిసెడు కొఱవిదయ్యంబు' ఇది తిరుగు, ఉమిసెడు అనేరెండు క్రియాజన్య విశేషణాలకు ఏర్పడిన విశేషణోభయపదకర్మధారయం. ఈరెండుధాతుజవిశేషణాలకు 'అదరులు' అనేపదంతో వ్యవధానం.

**12. ఇట్టిప్రయోగములు కవిత్రయమువారిగ్రంథములయందు దొరకినవి కావు.** (సమా. 18)

'కొన్నియెడల విశేషణోభయపదంబులు త్రికక్రియాన్యవిశేషణఘటితంబులు సందర్భయోగ్యపదవ్యవహితంబు లగు' అనేసూత్రంవివరణంలోనిది ఈవాక్యం.

ఇట్టిప్రయోగములు అంటే విశేషణోభయపదకర్మధారయాలు. విశేషణోభయపద కర్మధారయసమాసాలను ప్రౌఢవ్యాకర్త భారతంమొద లైనకవిత్రయంవారికావ్యాల నుండి ఉదాహరించలేదు. కాగా వారిగ్రంథాలలో ఇటువంటిసమాసాలు లేవు అనవచ్చు. విశేషణోభయపదకర్మధారయాలు లేకుంటే త్రికక్రియాజన్య విశేషణోభయ పదఘటితసమాసాలు, ఆవిశేషణాలనడుమ వ్యవధానం అనేది ఎలాగూ కవిత్రయం వారిప్రయోగాలలో ఉండదు.

**13. ఇటఁ బోఁడి పరం బగుచో నెల్లెడల ను మ్మగు.** (సమా. 19)

'అలరుఁబోఁ డీత్యాదు లుపమానపూర్వపదకర్మధారయంబులు' అనేసూత్రం వివరణంలోనిది ఈవాక్యం.

పైసూత్రం ఉపమానవాచకాలకు 'పోఁడి' అనే(సామాన్యవచన)శబ్దంతో (ఉపమాన పూర్వపద)కర్మధారయ సమాసాన్ని చెప్తున్నది.

ఉపమానపూర్వపదకర్మధారయంలో 'పోఁడి' అనేది పరంగా ఉండగా కల్గినచోట (ఎల్లెడల) ఉపమానశబ్దాలకు అన్నింటికీ, (నుమ్ము) 'నుమ్' అనేఆగమం వస్తుంది. అని ఈవివరణ వాక్యానికి అర్థం. 'నుమ్'లో మకారం ఇత్తు. కాబట్టి లోపిస్తుంది. మకారం ఇత్తుగా కలిగినది కాబట్టి 'ను'వర్ణం మిత్తు. కాబట్టి 'మిదచో ఽన్త్యా త్పరః అనేసంస్కృతసంప్రదాయాన్ని అనుసరించి ఉపమానశబ్దంలో చివరిఅచ్చుకు పరంగా వచ్చి చేరుతుంది. ఇక్కడిపూర్వపదాలు ఉపమానాలు. అన్నింటికీ అచ్చే చివర ఉంటుంది. కాబట్టి ఉపమానశబ్దానికి చివర ఆగమంగా వస్తుంది. (హలంతా లున్నసంస్కృతంలో మిత్తుకు ప్రత్యేకప్రయోజనం ఉంది. అజంతాలే ఉండేతెలుగులో కిత్తుకూ మిత్తుకూ తేడా లేదు. అందుకే సూరి ఈసందర్భంలో ఆగమాలను కిత్తులుగా మాత్రమే చెప్పాడు) ఆగమాత్మక మైననువర్ణం ద్రుతం. కాబట్టి దీనికి ద్రుతకార్యాలు వస్తాయి.

'అలరు'కు 'పోఁడి'తో పైసూత్రంప్రకారం సమాసం కాగా విభక్తిలోపానంతరం ఈవివరణవాక్యంచేత నుమాగమం వచ్చి, అలరును+పోఁడి. సరళాదేశాదిద్రుత కార్యాలు వచ్చి - అలరుఁబోఁడి - అలరుంబోఁడి మొ.

'ఇట' అనడం చేత 'దానిపోఁడి' ఇత్యాదు లైనఇతరసమాసాలలో నుమాగమం రాదు.

'పోఁడి పరం బగునపుడు' అనడంచేత ఉపమానపూర్వపదకర్మధారయ మైనా, పోఁడికంటె భిన్న మైనశబ్దం పర మైతే నుమాగమం రాదు. 'జుంటిమోవి'.

'ఎల్లెడల' అనడంచేత పూర్వపదంచివర ఏఅచ్చు ఉన్నా ఈఆగమం వస్తుంది. ననఁబోడి, విరిఁబోఁడి మొ.

'అగు' అనడంచేత నుమాగమం రాకుండ 'ననపోఁడి, విరిపోఁడి' ఇత్యాదిగా ఉండదు

**14. ఆదిపదంబుచే తియ్యఁబోఁడి, ననఁబోఁడి, విరిఁబోఁడి, యిత్యాదులు గ్రాహ్యంబులు.** (సమా. 19)

'అలరుఁబోఁ డీత్యాదులుపమానపూర్వపదకర్మధారయంబులు' అనేసూత్రం వివరణంలోనిది ఈవాక్యం.

అలరుఁబోఁడీత్యాదులు అనేస్థలంలోని ఆదిశబ్దంచేత తియ్యఁబోఁడి మొద లైనవి గ్రహించా లని ఈవివరణవాక్యానికి అర్థం. అంటే అలరుఁబోఁడి లాగా, తియ్యఁ బోఁడి మొద లైనవి ఉపమానపూర్వపదకర్మధారయసమాసాలు. తియ్య మొద లైనఉపమానవిశేషణశబ్దాలకు పోఁడి అనేవిశేష్యశబ్దంతో కర్మధారయసమాసం. తియ్యవలె మనోజ్ఞురా లైనది అనేఅర్థంలో తియ్య పోఁడి అనేశబ్దాలకు కర్మధారయ సమాసం ఏర్పడి, తియ్య+పోఁడి అని ఉండగా 'ఇటఁబోఁడి పరం బగుచో నెల్లెడల ను మ్మగు' అనేవివరణంచేత నుమాగమం వచ్చి, ద్రుతకార్యాలతో - తియ్యఁ బోఁడి అని అవుతుంది. ఇలాగే ననఁబోఁడి మొ.

అలరుఁబోఁడిలో మాత్రమే కాక తియ్యఁబోఁడి ఇత్యాదులు కూడా చిన్నయసూరి చెప్పినట్లు బహువ్రీహి సమాసాలు కా వనీ, ఉపమానపూర్వపదకర్మధారయసమాసాలే అవుతా యనీ, వీటిలో ఉత్తరపదం చిన్నయ చెప్పినట్లుగా 'మేను' శబ్దం కా దనీ, పోఁడిశబ్దం అనీ, వివరణంతాత్పర్యం. తియ్యఁబోఁడి, తీయంబోఁడి అనేరీతి రూపాలనుబట్టి నుమాగమం రావా లంటే సూరిలక్షణం సమన్వయించ దనీ,

సమాగమం ప్రత్యేకంగా సాధించా లనీ, అందుకే తాను సమాగమం చెప్పవలసి వచ్చిం దని అభిప్రాయం.

**15. దీనికిఁ బువ్వువలె మనోజ్ఞురాలైన దని యర్థము. ఇ ట్లింతట నెఱుఁగవలయు.** (సమా. 19)

'అలరుఁబోఁ డీత్యాదులుపమానపూర్వపదకర్మధారయంబులు' అనేసూత్రం వివరణంలోనిది ఈవాక్యం.

అలరుఁబోఁడి మొద లైనవానిని చిన్నయసూరి బహువ్రీహిసమాసాలుగా నిరూపించాడు. ప్రౌఢవ్యాకర్త ఇవి ఉపమానపూర్వపదకర్మధారయములు అన్నాడు. అలరుఁబోఁడి, తియ్యఁబోఁడి మొద లైన ఈసమాసాలు ఉపమానపూర్వపద కర్మధారయాలు అంటే అర్థం ఎలాగో వ్యాకర్త వివరిస్తున్నాడు. పోఁడి శబ్దానికి మనోజ్ఞం అని అర్థం. కాగా అలరుఁబోఁడి అంటే అలరు(పూవు)వలె మనోజ్ఞురా లైనది అని అర్థం. ఇలాగే చిగురుఁబోఁడి – చిగురువలె మనోజ్ఞురా లైనది. ఈవిధంగా ఈసమాసాలఅర్థాన్ని గ్రహించాలి.

**16. అద్విరుక్తం బనుటచే తేపతేపకు.** (సమా. 21)

'వారార్థకశబ్దంబు లద్విరుక్తంబులు తఱచుగ సంఖ్యాపూర్వకంబు లగు' అనేసూత్రం వివరణంలోనిది ఈవాక్యం. సూత్రంలోని తఱచుశబ్దం ప్రయోజనాన్ని వివరిస్తున్నది.

వారార్థకశబ్దాలు సంఖ్యాపూర్వకాలు కావటం ద్విరుక్తాలు కాకపోతేనే. కాబట్టి ద్విరుక్తాలు అయితే సంఖ్యాపూర్వకం కాదు. తడవతడవకు. ఇక్కడ తడవ అనే వారార్థకశబ్దం రెండుసార్లు ఉచ్చరింపబడింది. ఇది ద్విరుక్తం కావటంచేత 'తడవ తడవకు' అనేఈస్థలంలో పూర్వంలో సంఖ్యావాచకం ప్రయోగింపబడలేదు. కాగా సూత్రంలోని 'అద్విరుక్తంబు' అనేదళానికి ప్రయోజనం ఇటువంటిస్థలాలలో అని గ్రహించా లని తాత్పర్యం.

ద్విరుక్తం కాకపోతే ఒకతడవ, రెండుతడవలు ఇత్యాదిగా పూర్వంలో ఏదో ఒకసంఖ్యావాచకం ఉంటుంది.

**17. తఱచుగ ననుటచే తడవకు ఇత్యాదు లెఱుంగునది.** (సమా. 21)

'వారార్థకశబ్దంబు లద్విరుక్తంబులు తఱచుగ సంఖ్యాపూర్వకంబు లగు' అనేసూత్రం వివరణంలోనిది ఈవాక్యం. సూత్రంలోని 'తఱచు' శబ్దానికి ప్రయోజనాన్ని ఈవాక్యం వివరిస్తున్నది.

పైసూత్రం ప్రకారం వారార్థకశబ్దాలు ద్విరుక్తాలు కాకపోతే సంఖ్యాపూర్వకాలు కావాలి. అంటే వారార్థకశబ్దం ఒకేసారి ఉచ్చరించినపుడు పూర్వంలో ఏదో ఒకసంఖ్యా వాచకం ఉంటుంది. ఒకతడవ, రెండుసార్లు, మొ. ఇలా సంఖ్యాపూర్వకం కావటం తఱచు అనడంచేత ద్విరుక్తం కానప్పుడు కూడా అరుదుగా పూర్వంలో సంఖ్యావాచకం లేకపోవచ్చు.

తడవకు, మాటికి - మొ. ఇక్కడ వారార్థకశబ్దం ద్విరుక్తం కాలేదు. కాని పూర్వంలో సంఖ్యావాచకం కూడ లేదు. కాని వీటిని తడవతడవకు, మాటిమాటికి అనేవిధమైనఅర్థంతో సంఖ్యాపూర్వం అయినదానికంటె భిన్న మైన అర్థంలో వ్యవహరించటం గమనించవలసిఉంది.

**18. తఱచుగ ననుటంజేసి పదియాఱు పదా ఱిత్యాదిరూపంబులు గ్రాహ్యంబులు.** (సమా. 22)

'ఒకండ్వాదులు పరంబు లగుచోఁ దఱచుగ నున్ బది కగు' అనేసూత్రంవివరణం లోనిది ఈవాక్యం. సూత్రంలోని 'తఱచు'శబ్దం ప్రయోజనాన్ని వివరిస్తున్నది.

ఒకఁడు మొద లైనవి పరంగా ఉన్నపుడు పూర్వంలో ఉన్న 'పది' శబ్దానికి 'ఉన్' అనేది తఱచుగా వస్తుంది అని పైసూత్రం చెప్తున్నది. 'తఱచుగా' అనడంవల్ల ఈకార్యం అరుదుగా రాకపోవడం కూడా ఉన్నది అని పైవాక్యానికి అర్థం.

ఒకండ్వాదులలో లేనిశబ్దం పర మైనపుడు 'ఉన్' ఎలాగూ రాదు. ఒకండ్వాదులలో ఉన్నశబ్దం పరంగా ఉన్నా కూడా అప్పుడప్పుడు 'ఉన్' రాకపోవచ్చు. 'పది+ఆఱు' అన్నపుడు ఒకండ్వాదులలోని ఆఱు పరంగా ఉండగా 'ఉన్' వచ్చి (పది+ఉన్+ఆఱు) పదునాఱు. 'తఱచు' అనడంవల్ల ఉన్ రానిపక్షంలో 'పది+ఆఱు' అని ఉండగా 'ఏమ్యాదులయిత్తునకు సంధి వైకల్పికముగా నగు' అనేసూత్రంచేత సంధి వస్తే, పదాఱు. వైకల్పికం కాబట్టి సంధి రానిపక్షంలో యడాగమం వచ్చి, పదియాఱు. ఇలాగే పదేను, పదియేను, మొ.

**19. దీని నహోబలపండితుఁడు మిశ్రబహువ్రీహి యనెఁ గాని యది య ట్లగుట దుర్ఘటము.** (సమా. 27)

చూ. 'కఱకంఠుడు బహువ్రీహి' సూత్రవివరణం.

**20. ను శబ్దంబుచేఁ గూరగాయ లిత్యాదులు బహువచనాంతంబులు నగు నని యెఱుంగవలయు.** (సమా. 30)

'ద్వంద్వం బప్రాణివాచకకృదంతశబ్దఘటితం బేకవచనాంతంబు నగు' అనేసూత్రం

వివరణంలోనిది ఈవాక్యం. పైసూత్రంలో 'ఏకవచనాంతంబును' అని సముచ్చయార్థక మైన నుశబ్దానికి ప్రయోజనాన్ని ఈవాక్యం వివరిస్తున్నది.

ఏకవచనాంతం కూడా అవుతుంది అనడంవల్ల ఏకవచనాంతం కాకపోవడమూ ఉంది అనేఅర్థం కలుగుతున్నది. కాబట్టి నుశబ్దంవల్ల బహుత్వార్థాన్నిబట్టి వచ్చిన బహువచనం అలాగే ఉన్నరూపం కూడా ఉంటుంది అని గ్రహించాలి. కూర, కాయ అనేశబ్దాలకు ద్వంద్వసమాస మై, 'కూరగాయ' అని కాగా, బహుత్వార్థాన్నిబట్టి బహువచనం వచ్చి, కూరగాయలు. అందులో బహువచనానికి ఏకవచనం వస్తే కూరగాయ. 'ను'శబ్దంచేత ఏకవచనం గానిపక్షంలో 'కూరగాయలు' ఇత్యాదిగా బహువచనాంత మయినరూపం కూడా ఉంటుంది.

## 21. టవర్ణకం బిటఁ గృత్ప్రత్యయంబున కుపలక్షణంబు. (సమా. 31)

'భావద్వంద్వంబునం దొలిపదంబు టవర్ణకంబునకు లోపం బగు' అనేసూత్రం వివరణం లోనిది ఈవాక్యం.

పైసూత్రంలోని 'ట' వర్ణకంబు ఇతరకృత్ప్రత్యయాలను గూడా బోధిస్తుం దని ఈవివరణానికి అర్థం. ధాతువుమీద విధింపబడిన దుఙ్ (క్రియావిభక్తి)కంటె భిన్న మైనప్రత్యయం కృత్తు. ఇది భావద్వంద్వం కాబట్టి కృత్ప్రత్యయం అంటే భావార్థక మైన కృత్ ప్రత్యయం.

భావార్థకశబ్దాలకు అయినద్వంద్వసమాసంలో మొదటిపదంలోని 'ట' మొద లైనభావార్థక కృత్ప్రత్యయాలు అన్నింటికీ పైసూత్రంచేత లోపం వస్తుంది. సూత్రంలో ఉచ్చరించిన ట వర్ణకం దాని ఒక్కదానిని మాత్రమే కాక భావార్థంలో వచ్చిన 'ఇకి' మొ. ప్రత్యయాలను గూడా తెలియజేస్తుంది. కాబట్టి ఈలక్షణంచేత భావార్థక కృత్తు లన్నింటికి లోపం రావడం ఈవివరణానికి ప్రయోజనం.

'వినికి + వినమి' అనేద్వంద్వంలో మొదటిపదంలోని 'ఇకి' అనే కృత్ప్రత్యంలోని కివర్ణం లోపించి, విని వినమి – వినివినములు అవుతుంది. 'ఇకి' మొత్తం ప్రత్యయం అయిఉండగా 'ఇ' లోపింపకపోవడం ఇక్కడ విశేషం.

## 22. పుట్టుగ్రుంకుగ ట్లనఁగా పుట్టుగట్టు, క్రుంకుగట్టు (ఇ ట్లంతట నెఱుంగునది.) (సమా. 32)

'ద్వంద్వంబునం బూర్వపదాంత్యావయవంబునకు లోపం బొండె నగు' అనేసూత్రం వివరణంలోనిది ఈవాక్యం.

పుట్టుగట్టును, క్రుంకుగట్టును అనేఅర్థంలో ద్వంద్వసమాస మై, పైసూత్రంచేత పూర్వపదంలో చివరి 'గట్టు' అనేభాగం లోపించగా, 'పుట్టుగ్రుంకుగట్లు' అని అవుతుంది. ఇలా ఏర్పడిన ఈసమాసం అర్థాన్ని ఈవాక్యం వివరిస్తున్నది. పుట్టుగట్టును, క్రుంకుగట్టును అని దీనికి అర్థం. ఉదయపర్వతం, అస్తమయపర్వతం అనేవి రెండు అని తాత్పర్యం. ఇలాగే 'తొవదమ్మివిందు' అనేసమాసానికి 'తొవవిందును(చంద్రుడు), తమ్మివిందును(సూర్యుడు)' అని అర్థం. అలాగే 'విన్నకన్నది' అంటే విన్నది, కన్నది అని అర్థం. (ఇది విశేషణోభయపదకర్మధారయం. ద్వంద్వం కాదు.)

**23. ఇందు ఆదోఁకేత్యాదులు కొన్నిటియందు వర్ణలోపాగమాదేశ వికారంబులు నిత్యము లనియు, అందాఁకేత్యాదులయందు వైకల్పికంబు లనియు నెఱుంగవలయు.** (సమా. 36)

'అచ్ఛికసమాసములం దఱచుగ వర్ణలోపాగమాదేశవికారంబులు నిత్యవైకల్పిక ములుగాఁ బెక్కులు గానంబడియెడి' అనేసూత్రం వివరణంలోనిది ఈవాక్యం.

అచ్చతెలుగుపదాలకు చేసినసమాసంలో వర్ణాలు లోపించటం, ఆగమంగా రావటం, ఆదేశం కావటం అనేమార్పులు కొన్నిచోట్ల నిత్యంగానూ, కొన్నిచోట్ల వైకల్పికంగాను కనబడుతున్నా యని సూత్రం చెప్తున్నది. ఎక్కడ నిత్యమో, ఎక్కడ వికల్పమో ఈవివరణం ప్రస్తావిస్తున్నది.

ఆవు+తోఁక అని ఉండగా, పైసూత్రంప్రకారం ఆవుశబ్దంలో తొలియచ్చుమీది వర్ణాలు లోపించి, (ఆ+తోఁక) 'ను' అనేద్రుతం ఆగమంగా వచ్చి, ద్రుతకార్యాలు జరిగి 'ఆఁదోఁక' అని అవుతుంది. ఆఁదోఁక మొద లైనఈసమాసాలలో లోపం, ఆగమం మొద లైన కార్యాలు నిత్యంగా వస్తాయి. నిత్యం కాబట్టి ఈమార్పులు రాని ఆవుఁదోఁక అనేవిధ మైనరూపాలు ఉండవు.

అందాఁక మొద లైనసమాసాలలో వికల్పం. అంత+దాఁక అని ఉండగా, అంతలో చివరిఅక్షరం లోపించి, అందాఁక అని అవుతుంది. వైకల్పికం కాబట్టి లోపం రానిపక్షంలో 'అంతదాఁక' అని ఉంటుంది.

**24. వీని కొక్కటికిఁ బ్రయోగంబులు పెక్కులు గలవు. కాని గ్రంథవిస్తరభీతిచే నవి యుదాహరింపఁబడవయ్యె.** (సమా. 36)

'అచ్ఛికసమాసములం దఱచుగ వర్ణలోపాగమాదేశవికారంబులు నిత్యవైకల్పిక ములుగాఁ బెక్కులు గానంబడియెడి' అనేసూత్రం వివరణంలోనిది ఈవాక్యం.

అచ్చతెలుగుపదాలకు చేసినసమాసంలో వర్ణాలు లోపించటం, ఆగమంగా

రావటం, ఆదేశం కావటం అనేమార్పులు కొన్నిచోట్ల నిత్యంగానూ, కొన్నిచోట్ల వైకల్పికంగాను పలువిధాలుగా కనబడుతున్నా యని సూత్రం చెప్తున్నది. అనేకవిధాలయినమార్పులకు లక్ష్యాలు అధికంగా ప్రదర్శించాడు. ఆయారూపాలు అలా ఉంటా యని నిరూపించటానికి వాటికి కవిప్రయోగాలను కూడా చూపించాలి. ప్రౌఢవ్యాకర్త తనలక్షణాలకు ఇలాగే కవిప్రయోగాలను ప్రమాణంగా చూపాడు. ఇక్కడ ఉదాహరణలు చూపాడే కాని కవిప్రయోగాలు ఇవ్వలేదు. అందుకు కారణాన్ని వ్యాకర్త ఇలా వివరించాడు.

ఈసూత్రానికి చూపినలక్ష్యాలకు అన్నింటికి కవిప్రయోగాలు కూడా చాలా అధికంగానే ఉన్నాయి. అవి అన్నీ ఇస్తే గ్రంథం చాలా విస్తృతం అవుతుంది. అందువల్ల కవిప్రయోగాలు ప్రదర్శించటంలేదు. అని వ్యాకర్త వివరణం.

**25. నుశబ్దంబుచేఁ గువలయంబునందలివారు మొ.** (సమా. 37)

'కొన్నియెడల సప్తమీతత్పురుషంబునందు నవర్ణకంబు నగు' అనేసూత్రంవివరణంలోనిది ఈవాక్యం. పైసూత్రంలో 'నవర్ణకంబును' అనేచోటి'ను'శబ్దంయొక్క ప్రయోజనాన్ని ఈవాక్యం వివరిస్తున్నది.

ఈసూత్రం సప్తమీతత్పురుషంలో నవర్ణకాన్ని విధించింది. కువలయంబునవారు. 'అందు న సప్తమి' అని సప్తమిలో నవర్ణంతోపాటు అందు ప్రత్యయం ఇం కొకటి ఉంది. కాగా పై సూత్రంలో సముచ్చయార్థకనుశబ్దంచేత నవర్ణకంతోపాటు సప్తమి అయిన 'అందు'వర్ణకం కూడా ఒకపక్షంలో వస్తుం దని అర్థం సిద్ధిస్తుంది. కువలయంబునందు+వారు. 'అంద్వాదుల కలిగాగమంబు సమాసంబునం దగు' అని అలిగాగమం వచ్చి 'కువలయంబునందలివారు' అని కూడా ఉంటుంది. ఇలాగే చిత్తమున దుఃఖంబుల్-చిత్తమునందలిదుఃఖంబుల్. మొ.

అందువిభక్తి లోపింపనిరూపాలు పూర్వవ్యాకరణాల్లో చెప్పబడ్డాయి. (అందలివారు మొ.) కాబట్టి వాటిని 'ను' శబ్దంతో సంగ్రహిస్తూ విశేష మయిన నవర్ణకాన్ని ఇక్కడ విధించాడు వ్యాకర్త. సమాసంలో సప్తమీనవర్ణకలోపాభావం చెప్పదగును.

# తద్ధితపరిచ్ఛేదం

**1. పక్షమున ఆఁకొన్నవానితనము, ఆఁకొన్నదానితనము.....**(తద్ధి. 2)

'తనవర్ణకంబు పరంబగునపుడు తచ్ఛబ్దార్థమునకు లోపంబు విభాష నగు'

అనేసూత్రం వివరణంలోనిది ఈవాక్యం.

ధాతుజవిశేషణాలు మొద లైనవాటికి విభక్తివివక్షలో తచ్ఛబ్దం అనుప్రయుక్త మవుతుంది. తన అనేత్వార్థకప్రత్యయం షష్ఠ్యంతంమీద వస్తుంది. కాగా ఈవిశేషణాల మీద తనప్రత్యయం షష్ఠ్యంతమైనతచ్ఛబ్దంమీద ఉంటుంది. అపుడు పైసూత్రం ప్రకారం తచ్ఛబ్దానికి వికల్పంగా లోపం వస్తుంది. ఆఁకొన్నవానియొక్క+తన. విభక్తి, తరువాత తచ్ఛబ్దమూ లోపించి, 'ఆఁకొన్నతనము' అని అవుతుంది.

వివరణంలో 'పక్షంబున' అంటే సూత్రంలో విభాష అనటంచేత తచ్ఛబ్దలోపం వికల్పం కాబట్టి లోపం రానిపక్షంలో అని అర్థం. అపుడు ఆతచ్ఛబ్దం అలాగే ఉంటుంది. ఆఁకొన్నవానియొక్క+తన. (విభక్తి లోపించి) ఆఁకొన్నవానితనము. ఇలాగే అమహదర్థంలో – ఆఁకొన్నదానితనము మొ.

**2. గ్రామ్యజనులపాటలయందును జెంచీత యని యికారదీర్ఘంబ వినంబడియెడి.** (తద్ధి. 4)

'మతుబర్థంబునం జెంచునకుఁ దవర్ణకంబు పరం బగుచో నిత్వంబు నగు' అనేసూత్రం వివరణంలోనిది ఈవాక్యం.

పైసూత్రంప్రకారం చెంచుశబ్దానికి ప్రౌఢవ్యాకర్త ఇత్వం విధించి చెంచిత అనేరూపం సాధించాడు. ఇక్కడ ఇత్వం ఉంటుం దనే తనలక్షణానికి ఒకఆధారాన్ని చూపటానికి వ్యాకర్త ఈవివరణం చేస్తున్నాడు.

గ్రామ్యజనాలపాటలలో 'చెంచీత' అనేవిధంగా ఇకారదీర్ఘం వినబడుతున్నది. సంగీతంలో హ్రస్వానికి దీర్ఘశ్రుతి శాస్త్రసమ్మతమే. కాబట్టి గ్రామ్యజనాలపాటలలో ఉన్న చెంచీత అనేశబ్దంలో సంగీతలక్షణంగా వచ్చినదీర్ఘాన్ని హ్రస్వంగా గ్రహించగా, చెంచిత అని ఈశబ్దంలో నడుమ ఇకారం ఉన్నది అనేవిషయం స్పష్టం అవుతున్నది. కాబట్టి 'చెంచితలం బింఛపత్రచేలాంచితలన్' అనేప్రయోగంలో చెంచిత అనేవిధంగా ఇకారమధ్యంగా ఈశబ్దం ప్రయోగింపబడినట్లు గ్రహించగా ఇత్వాన్ని విధిస్తున్న ఈలక్షణం లక్ష్యానుగుణమే అని ఈవివరణం తాత్పర్యం.

**3. విశేష్యము భిన్నవచనవిభక్తికం బయ్యు మానార్థకములమీఁదఁ బరిమాణార్థమునం బ్రథమైకవచనంబునందె యెఁడువర్ణకంబు వచ్చు నని యర్థము.** (తద్ధి. 16)

చూ. 'పరిమాణార్థంబునం బ్రథమైకవచనంబునంద యెఁడువర్ణకం బగు'

సూత్రవివరణం.

**4. ఇతరంబులు ప్రయోగదృష్టంబులు గ్రాహ్యంబులు.** (తద్ధి. 19)

'ఒకానొకచో మతుబర్థంబున నవర్ణకంబు చూపట్టెడి' అనేసూత్రంవివరణంలోనిది ఈవాక్యం.

మతుబర్థంలో 'న' అనేప్రత్యయం వచ్చినందుకు 'దివ్యతేజంబునవాడు' అనేనన్వయ ప్రయోగం ఒకటి ప్రౌఢవ్యాకర్త చూపాడు. దానితరువాత చేసినఈవివరణంలో ఇతరంబులు అంటే, పూర్వంలో చూపిననన్వయప్రయోగంకంటె వే రైనవీ, మతుబర్థంలో నవర్ణం వచ్చినవీ, ఐనస్థలాలను కవిప్రయోగాలలో చూచినవాటిని అన్నింటినీ గ్రహించవచ్చు నని అర్థం. అంటే స్వతంత్రించి మతుబర్థంలో నవర్ణకం చేసిప్రయోగింపరాదు, కవిప్రయోగాలలో చూసినవాటిని (స్వయంగా చూసిన తర్వాతనే) మాత్రమే గ్రహించిప్రయోగించుకోవచ్చు అని తాత్పర్యం.

తద్ధితపరిచ్ఛేదంలో ఇది చివరిసూత్రం. వ్యాకర్త ఈపరిచ్ఛేదంలో దీనికి పూర్వంలో స్వార్థాదులలో ఆయాతద్ధితాలను చెప్పాడు. కాగా ఇక్కడ ఇతరంబులు అంటే (పూర్వవ్యాకరణాలలోనూ) ఈపరిచ్ఛేదంలో చెప్పకవిడిచిపెట్టిన తద్ధితప్రత్యయాలను కవిప్రయోగాలను చూసి, తెలియదగు అని తాత్పర్యం. తద్ధితా లింతటితో సమాప్త మైనా యనీ, తెలుగులోని తద్ధితాలు అన్నీ నిరూపింపబడ్డా యనీ, అందుచేత ఇక చెప్పవలసినవి లే వనీ, భావింపరా దని ఈవివరణానికి అర్థం. బాలవ్యాకరణంలో తద్ధితపరిచ్ఛేదం చివర చెప్పిన 'అర్థవిశేషంబుల వర్ణకాంతరంబులును మహత్ ప్రయోగంబుల నెఱుంగునది' అనేసూత్రంఅర్థాన్ని ఈవివరణం చెపుతున్న దని గ్రహించవచ్చు.

# క్రియాపరిచ్ఛేదం

**1. చేరు కొను అనఁగా అనుప్రయుక్త మగుకొను ధాతు వని యర్థము.** (క్రియ. 2)

'ఒకానొకచోఁ దద్ధర్మార్థకంబు లగు నుండు, చను, చేరుకొనులు ప్రశ్నార్థకైకార పరకంబు లగునపుడు వానికడయచ్చులకు లోపంబు విభాష నగు, అగుచో నుండు దకారంబునకు నకారం బగు' అనేసూత్రం వివరణంలోనిది ఈవాక్యం. పైసూత్రంలో 'చేరుకొను' అనేపదం అర్థాన్ని వివరిస్తున్నాడు.

'చేరుకొను' అంటే చేరునట్టి కొనుధాతువు. అంటే వేరొకధాతువు మొదలైనవాటిమీద అనుప్రయుక్త మైన కొను ధాతువు అని అర్థం. 'ఉండు, చను, చేరుకొను' అన్నపుడు ఉండు, చను అనేవాటిలాగా, 'చేరు' అనేది ఒకటిగానూ, 'కొను' అనేది వేరొకటిగానూ వేర్వేరు ధాతువు లనీ, చేరు అనేధాతువులో కూడా సూత్రంలో చెప్పినకార్యం జరుగుతుం దని భావించేఅవకాశం ఉండటంచేత వ్యాకర్త ఇలా వివరించిఉంటాడు. దీనిచేత 'చేరునే' అనేచోట చేరుధాతువులో ఉత్వం లోపించి, 'చేర్నే' అనేవిధ మైనరూపం కాకుండా ఉండటం ప్రయోజనం.

దొరకు ధాతువుమీద 'కొను' అనుధాతువు అనుప్రయుక్తం కాగా ఏర్పడిన 'దొరకొను' అనేశబ్దపల్లవధాతువులోని 'కొను' అనుప్రయుక్తం. దొరకొనును అనేతద్ధర్మప్రథమ పురుషైకవచనంమీద ప్రశ్నార్థంలో ఏకారం చేరి, (దొరకొనున్+ఏ) దొరకొనునే. ప్రస్తుతసూత్రంచేత కొనులో ఉత్వం లోపించి, దొరకొన్నే అని అవుతుంది. విభాష అనటంచేత లోపం రానిపక్షంలో దొరకొనునే. ఇలాగే చేరుకొన్నే, మొ.

అనుప్రయుక్త మైన కొను ధాతువులోనే ఈకార్యం కాబట్టి వేరొకదానిమీద చేరకుండా స్వతంత్రంగా ఉన్న కొను ధాతువులో ఈకార్యం లేదు. కొనునే.

**2. పక్షమున ఉండునే మొ.** (క్రియ. 2)

'ఒకానొకచోఁ దద్ధర్మార్థకంబు లగు నుండు, చను, చేరుకొనులు ప్రశ్నార్థకైకార పరకంబు లగునపుడు వానికడయచ్చులకు లోపంబు విభాష నగు, అగుచో నుండు డకారంబునకు నకారం బగు' అనేసూత్రం వివరణంలోనిది ఈవాక్యం. పైసూత్రంలోని విభాషాపదం ప్రయోజనాన్ని వివరిస్తున్నాడు.

ఉండును అనేతద్ధర్మక్రియమీద ప్రశ్నార్థంలో ఏకారం చేరి, (ఉండును+ఏ) ఉండునే. పైసూత్రంచేత 'ఉండు'లో తుది ఉత్వం లోపించి ఉండ్+నే. 'సంస్కృతసమేతరంబు లయినతెలుఁగుశబ్దములయందుఁ బరుషసరళములకు ముందే బిందువు కానంబడుచున్నది' అనేసూత్రంప్రకారం (ఇక్కడ డకారాని కాదేశ మైననకారం స్థిరం పరంగా ఉండటంచేత ముందరిసున్న లోపించి – ఉన్+నే = ఉన్నే అని అవుతుంది.

'లోపంబు విభాష నగు' అనటంచేత చివరిఅచ్చుకు లోపం రావటం వికల్పం కాబట్టి లోపం రానిపక్షంలో డకారానికి నకారం గూడా రాదు, అలాగే ముందరిసున్న లోపించదు. కాబట్టి ఉండునే అని ఉంటుంది. ఇలాగే (చన్నే) చనునే, (దొరకొన్నే)

దొరకొనునే మొ.

**3. పక్షమున బలవంతుఁడు పయి నెత్తినబలహీనుఁడు ... కామాకుల చిత్తుఁడు నిద్ర లేక కుందుదు రధిపా.** (క్రియ. 6)

'మహద్బహుకర్తృకక్రియకు నేకవచనంబు విభాష నగు' అనేసూత్రం వివరణంలోనిది ఈవాక్యం. సూత్రంలోనివిభాష అనేపదానికి ప్రయోజనాన్ని ఈవాక్యం వివరిస్తున్నది.

'బలహీనుడు, ..., ..., కామాకులచిత్తుడు' అనేవిధంగా మహత్తు లయిన కర్తలు ఒకటికంటె ఎక్కువగా ఉన్న 'కుందు' అనేధాతువుపై (తద్ధర్మార్థంలో ప్రథమ పురుషలో) బహువచనానికి ఏకవచనం వస్తే – 'కుందును' అనేవిధంగా అవుతుంది. కాని సూత్రంలో విభాష అనటంచేత ఏకవచనం రావటం వికల్పం. కాబట్టి ఏకవచనం రానపుడు బహువచనం అలాగే ఉంటుంది. అపుడు 'కుందుదురు' అనేవిధంగా రూపం అవుతుంది. పైతిక్కనప్రయోగంలో బహువచనానికి ఏకవచనం రాలే దని తాత్పర్యం.

**4. పక్షమున ఇచ్చుకొనుట పుచ్చుకొనుట.** (క్రియ. 13)

'భావంబునం దనుప్రయుక్తం బగుకొనుటకుం గోలు విభాష నగు' అనేసూత్రం వివరణంలోనిది ఈవాక్యం. సూత్రంలోనివిభాషాపదానికి ప్రయోజనాన్ని ఈవాక్యం వివరిస్తున్నది.

'ఇచ్చుకొనుట' అనిఉండగా పైసూత్రంచేత 'కొనుట' అనేదానిస్థానంలో 'కోలు' అనేది ఆదేశంగా రాగా – ఇచ్చుకోలు. ఇలాగే పుచ్చుకోలు. సూత్రంలో విభాష అనటంచేత 'కోలు' అనేఆదేశం రావటం వికల్పం. కాబట్టి ఆదేశం రానిపక్షంలో 'కొనుట' అనేది అలాగే ఉంటుంది. ఇచ్చుకొనుట. అలాగే పుచ్చుకొనుట.

**5. పక్షమున చూపుటకొఱకు, కలుగుటకంటె, పట్టుటపొంటె.** (క్రియ. 14)

'కొఱకు కంటె పొంటెలు పరంబు లగునపుడు భావార్థకటవర్ణకంబునకు లోపంబు విభాష నగు' అనేసూత్రంవివరణంలోనిది ఈవాక్యం. సూత్రంలోని'విభాష' పదం ప్రయోజనాన్ని వివరిస్తున్నది.

పైసూత్రానికి సూత్రకర్త చూపినఉదాహరణలలో మొదటి దైన 'దాని జూపుకొఱకునై' అనేకవిప్రయోగంలో చూపుట+కొఱకు అని ఉండగా, కొఱకు విభక్తి పరంగా ఉండగా పైసూత్రంచేత ముం దున్నటవర్ణకానికి లోపం వచ్చి

'చూపుకొఱకు' అని అయింది. ఇలాగే కలుగుటకంటె, పుట్టుపొంటె అనేతరువాతి ఉదాహరణలలో సైతం కంటె, పొంటె అనేవిభక్తులు పరంగా ఉండగా భావార్థక టవర్ణకం లోపించి, కలుగుకంటె, పట్టుటపొంటె. సూత్రంలో విభాష అనటంచేత ఈకార్యం వికల్పం. కాబట్టి లోపం రానిపక్షంలో చూపుటకొఱకు, అలాగే కలుగుటకంటె, కలుగుటపొంటె అనేవిధ మైన 'ట'వర్ణకం అలాగే నిలిచిఉన్న రూపాలు (కూడా) ఉంటాయి.

**6. పక్షమున కనినదానికంటె.** (క్రియ. 21)

చూ. కంటెవర్ణకంబు పరంబగునపుడు విశేషణవర్ణకంబుమీఁదియమహ త్తచ్ఛబ్దార్థమునకు లోపంబు విభాష నగు' సూత్రవివరణం.

**7. పక్షమున పెల్లుగఁ దొరగు, కప్పముగ నడుగుము, కృతాంతనికేత నాతిథిన్.** (క్రియ. 22)

'క్రియావిధేయవిశేషణంబుమీఁదియగుధాతువున కన్నంతమునకు లోపంబు విభాష నగు' అనేసూత్రంవివరణంలోనిది ఈవాక్యం. సూత్రంలోని విభాషాపద ప్రయోజనాన్ని ఈవాక్యం వివరిస్తున్నది.

'పెల్లుగఁ దొరగు' అనేచోట పెల్లు అనేక్రియావిశేషణంమీద 'కాన్' అనే అగుధాతువు యొక్క అన్నంతరూప మైన కన్ (కాన్) అనేది పైసూత్రంచేత లోపిస్తుంది. 'పెల్లు దొరగు' అని అవుతుంది. సూత్రంలో విభాష అనటంచేత లోపం రావటం వికల్పం గాబట్టి లోపం రానిపక్షంలో 'క(కా)న్' అనేరూపం అలాగే నిలిచిఉండి 'పెల్లుగఁ దొరగు' అని ఉంటుంది. ఇలాగే కప్పముగ నడుగుము, కృతాంతనికేతనాతిథిగ అనేచోట్ల విధేయవిశేషణంమీది అన్నంత మైన అగుధాతువురూపం లోపించినపక్షంలో 'కప్ప మడుగుము', 'కృతాంతనికేతనాతిథిన్' అని రూపాలు అవుతాయి. విభాష కాబట్టి లోపం రానిపక్షంలో అన్నంత మైన అగుధాతువురూపం నిలిచిఉండి, రూపాలు 'కప్పముగ, కృతాంతనికేతనాతిథిగ' అనేవిధంగా ఉంటాయి.

**8. పక్షమున తూఁటాడి తూఁటాడి.** (క్రియ. 24)

'శబ్దపల్లవక్రియలు కొన్ని ద్విరుక్తంబు లగుచో నుత్తరపదంబు పూర్వావయవంబు నకు లోపంబు విభాషనగు' అనేసూత్రం వివరణంలోనిది ఈవాక్యం.

తూఁటాడి అనేశబ్దపల్లవక్రియ ద్విరుక్తం అయి, తూఁటాడి + తూఁటాడి అని ఉండగా, పైసూత్రంచేత రెండవ 'తూఁటాడి' శబ్దంలోనిమొదటిభాగం (తూఁ

టు+ఆడి) తూఁటు అనేది లోపించి, తూఁటాడి+ఆడి. యడాగమం వచ్చి, తూఁటాడియాడి. విభాష అనటంచేత లోపం వికల్పం కాబట్టి, లోపం రానిపక్షంలో తూఁటాడితూఁటాడి అనేవిధంగా ఉంటుంది. ఇలాగే, (నడయాడి యాడి) నడయాడి నడయాడి, (వాదడిచి యడిచి) వాదడిచి వాదడిచి మొ.

## 9. పక్షమున చనుదే చననిచ్చు మొ. (క్రియ. 25)

'శబ్దపల్లవక్రియలును, ద్వ్యవయవక్రియలును సమాప్తంబు నయి పునర్గృహీతంబు లగుచోఁ దత్పూర్వావయవంబునకు లోపంబు విభాష నగు' సూత్రం వివరణంలోనిది ఈవాక్యం. సూత్రంలోని విభాష అనేపదం ప్రయోజనాన్ని గూర్చి వివరిస్తున్నది.

ఆలతాంగి తోడ్కొని చనుదెమ్ము – ఈవాక్యంలో చనుదెమ్ము అనేశబ్దపల్లవక్రియ తరువాతి వాక్యంలో మళ్లీ గ్రహించవలసివచ్చినపుడు పైసూత్రంచేత పైశబ్దపల్లవంలోని (చను+తెంచు) మొదటిభాగానికి అంటే చను అనేదానికి లోపం వచ్చి, రెండవ దైన తెంచు అనేభాగం మాత్రమే గ్రహింపబడుతుంది. నుజ్యంతంగా 'తే ననువుగూడని పక్షమునందు' అని ప్రయోగింపబడుతుంది. సూత్రంలో విభాష అనటంచేత వికల్పం కాబట్టి లోపం రానిపక్షంలో పూర్వభాగం గూడా నిలిచిఉండి చనుదెంచు ధాతువు నుజ్యంతంగా చనుదేన్ అని కూడా ప్రయోగించవచ్చు.

అలాగే 'ఇలకుం దివికిం జననిచ్చు' ఇక్కడ చననిచ్చు అనేద్వ్యవయవక్రియ మళ్లీ గ్రహించవలసినపుడు చనన్ అనేపూర్వభాగం లోపించి, 'ఇచ్చి యే నని వెస నార్చు' అని ఇచ్చు (ఇచ్చి) అనేరెండవభాగం మాత్రమే ప్రయోగింపబడింది. సూత్రంలో విభాష అనటంచేత లోపం రావటం వికల్పం కాబట్టి లోపం రానిపక్షంలో పూర్వభాగం కూడా నిలిచిఉండి, 'చననిచ్చి' అనేవిధంగా ప్రయోగించబడుతుంది.

## 10. పక్షమున మోహాంధుండు భీష్ముండుఁ గేశవ నీవుం గడఁగుండు. (క్రియ. 26)

'ఒకానొకచో సహార్థంబున యుష్మదస్మదర్థంబు లభిహితంబు లగునపుడు క్రియలు తత్కర్తృకంబులు విభాష నగు' అనేసూత్రంవివరణంలోనిది ఈవాక్యం. సూత్రంలోని విభాషాపదం ప్రయోజనాన్ని వివరిస్తున్నది.

పైప్రయోగంలో కడగు అనేక్రియచేత నీవు అనేయుష్మదర్థం చెప్పబడుతున్నది. భీష్ముడితో కలిసి నీవు కూడా అనేవిధంగా ఇక్కడ సహార్థం ఉంది. కాబట్టి పైసూత్రం

ప్రకారం క్రియ యుష్మత్కర్తృక మై ప్రయోగింపబడుతుంది. ఈవాక్యంలో నీవు అనేయుష్మదర్థకం ఏకవచనంలో ఉంది. కాబట్టి క్రియ తత్కర్తృక మైనపుడు క్రియ మధ్యమపురుషలో ఏకవచనంలో – కడగుము అనే విధంగా ఉంటుంది.

సూత్రంలో విభాష అనటంచేత అది వికల్పం. కాబట్టి ఇక్కడ నీవు అనే యుష్మదర్థంతోపాటు, భీష్ముడు అనేది కూడా కర్త అయింది. కర్తలు బహుత్వంలో ఉండటంచేత క్రియకు బహువచనం వచ్చింది. 'అన్యయుష్మదస్మత్కార్యంబులం దుత్తరోత్తరంబు బలీయంబు' అనేసూత్రంచేత యుష్మత్కార్యం కలిగి, మధ్యమపురుష ప్రత్యయం వస్తుంది. కాగా 'కడగుండు' అనేవిధంగా క్రియ మధ్యమపురుష బహువచనంలో ప్రయోగింపబడింది.

## 11. పక్షమున తూర్పుగ, దక్షిణంబుగ, పడమరగ, ననియు నుండవచ్చును. (క్రియ. 30)

'అన్ప్రత్యయాంత మగునగుధాతువు కొన్నియెడలఁ బెక్కుచోట్ల కొక్కటియు నగు' అనేసూత్రంవివరణంలోనిది ఈవాక్యం. 'ఒక్కటియును' అనేచోటి సముచ్చయార్థక శబ్దానికి ప్రయోజనాన్ని ఈవాక్యం వివరిస్తున్నది.

ధర్మజుడు తూర్పు, భీముడు దక్షిణంబు, అర్జునుడు పడమర, కవలు ఉత్తరంబుగా నరిగిరి'. ఇక్కడ అరిగిరి అనేక్రియకు విశేషణాలు అయిన తూర్పు, దక్షిణము, పడమర, ఉత్తరము అనేశబ్దాలకు అన్నింటిపైని చేరవలసిన అన్ప్రత్యయాంత మైన అగుధాతువురూపం (కాన్) కన్ అనేది పైసూత్రం ప్రకారం చివరి దైన ఉత్తరము అనేఒక్కదానిమీద మాత్రమే చేరింది. 'పెక్కుచోట్లకు ఒక్కటియు' అన్నప్పటి సముచ్చయార్థకనుశబ్దంచేత ఈకార్యం వికల్పం. కాబట్టి ఒకపక్షంలో రాదు. అపుడు క్రియావిశేషణాలు అన్నింటికీ కన్ (కాన్) చేరుతుంది. అపుడు ప్రయోగం తూర్పుగ, దక్షిణంబుగ, పడమరగ, ఉత్తరంబుగ అని ఉంటుంది. అని ఈవివరణవాక్యానికి తాత్పర్యం.

## 12. అపిశబ్దార్థముచే అంగన భీతుల కెల్ల భీతిఁ దీర్చుము వెసఁ బొమ్ము నమ్ము మనుచుం గదిలెన్. (క్రియ. 16)

'కవిత్రయేతరప్రయోగంబులం గొన్నియెడల నిప్రత్యయాదులు పరంబు లగునపుడు పకారం బించుక్పకారంబున కేనిఁ గానంబడదు' అనేసూత్రం వివరణంలోనిది ఈవాక్యం.

'ఆగమాన్యచకారంబుల కద్విరుక్తంబునకు ముత్తు పరం బగునపుడు పవ లగు' అనేబాలవ్యాకరణలక్షణంప్రకారం ధాతువుచివర ఆగమంగా వచ్చిన చకారానికి ముత్తు పరంగ ఉన్నపుడు పకారం ఆదేశంగా రావాలి. కాని కవిత్రయంకంటె వే రయిన మహాకవులప్రయోగాలలో ఇంచుగాగమానికి సంబంధించినపకారానికి కూడా పకారం కొన్నిస్థలాలలో కనబడటం లే దని ప్రౌఢవ్యాకర్త పేర్కొన్నాడు. 'ఇంచుక్ చకారంబునకు 'ఏని' అని అపిశబ్దం అర్థాన్ని తెలియజేసే 'ఏని' అనేశబ్దాన్ని ప్రయోగించటంచేత ఇంచుగాగమంకంటే వే రైనఆగమంలో కూడా చకారానికి పకారం రావటం లే దని గ్రహించాలి.

తీర్చు+ము అని ఉండగా మధ్యమపురుషమువర్ణకం పరంగా ఉన్నది. ఈమువర్ణకం ప్రౌఢవ్యాకర్త పేర్కొన్న'నిప్రత్యయాదు'లలోనిదే. కాని దానికి పూర్వంలో చకారం ఇంచుగాగమానికి సంబంధించినది గాదు. చుగాగమం. ఇంచుక్కంటె వే రైన చుగాగమంలోని చకారానికి నిప్రత్యయాదులలోని మువర్ణకం పరంగా ఉండగా పకారం రాలేదు. అది సూత్రంలోని 'ఏనిన్' అనేశబ్దంచేత సాధింపబడుతున్న దని ఈవివరణవాక్యానికి తాత్పర్యం.

**13. చొక్కఁజేయు చొక్కించు ఇ ట్లంతట నెఱుంగునది.** (క్రియ. 18)

చూ. 'అన్నంతక్రియ చేయుయోగంబునం బ్రేరణార్థకం బగు' సూత్రవ్యాఖ్య.

**14. ఇందు రాఁ, బో ననుకర్తృభూతక్రియలతో వానికిఁ గర్త యగు నీ వనుదాని కన్వయం బని యెఱుంగవలయు.** (క్రియ. 27)

చూ. 'కర్తృభూతక్రియతోడం దత్కర్త కన్వయం బగు' అనేసూత్రవివరణం.

**15. తఱచుగ ననుటచే పూఁతపసిండివంటివలపుం బచరించుకులంబు నీతికిన్ లేఁత గదమ్మ, యిత్తెఱఁగు లేమ, దయాంబురాశివి గదమ్మ ఇత్యాదు లూహ్యంబులు.** (క్రియ. 29)

'తఱచుగం గ్రియలమీఁదికదకదవుల కన్నాదులు పర్యాయంబున నను ప్రయుక్తంబు లగు' అనేసూత్రం వివరణంలోనిది ఈవాక్యం.

పైసూత్రంలోని తఱచుశబ్దానికి ప్రయోజనాన్ని ఈవాక్యం వివరిస్తున్నది.

కదన్న, కదవన్న అనేశబ్దాలు క్రియలమీద ప్రయోగింపబడతా యని సూత్రం చెప్తున్నది. తఱచు అనేశబ్దంచేత క్రియలు కానివాటిమీద కూడ ఈశబ్దాలు ప్రయోగింపబడతాయి అని ఈవివరణవాక్యానికి అర్థం. దీనిచేత లేఁత,

దయాంబురాశివి, అనేసుబంతశబ్దాలమీద ఈశబ్దాలు చేరి, 'లేఁత గదమ్మ, దయాంబురాశివి గదమ్మ' అనేవిధంగా ప్రయోగింపబడటం సాధు వవుతున్నది.

# కృదంతపరిచ్ఛేదం

**1. ఇట్ల ఎగువ.** (కృత్. 5)

'ఎక్కుదిగులకుం బ్రేరణార్థంబున మతివర్ణకం బగు' అనేసూత్రం వివరణంలోనిది ఈవాక్యం.

పైసూత్రం ఎక్కు, దిగు అనేధాతువులకు మతిప్రత్యయం విధించింది. ఈవివరణం ఈధాతువులకు 'వ' అనేప్రత్యయం వస్తుం దని గ్రహించాలి. ఎక్కు+వ అని ఉండగా ప్రస్తుతవివరణాన్ని అనుసరించి పైన సూత్రంలో మతిప్రత్యయం పరంగా ఉండగా విధించిన 'ఎగు' అనేఆదేశం ఎక్కు అనేధాతువుకు 'వ' అనేప్రత్యయం పరంగా ఉండగా కూడా వస్తుంది. ఎగువ. కృదంత మైనఈప్రాతిపదికం స్త్రీసమం కాబట్టి ప్రథమైకవచనం లోపించి – ఎగువ. ఇలాగే దిగు అనేధాతువుకు కూడా 'వ' ప్రత్యయం వచ్చి, దిగువ. (ఎగు అనేఆదేశం విశేషం కావటంచేత కాబోలు వ్యాకర్త ఎగువ అనేరూపమే చూపాడు.)

కాని ఇక్కడ ఎగువ, (దిగువ) అనేదానికి ఎగుమతి అనేదానిలోలాగా ప్రేరణార్థం లేదు. 'ఇట్ల' అనేవివరణంలో అర్థంలో భేదాన్ని కూడా ప్రస్తావించవలసిఉంది. ఎగుమతితో సామ్యాన్ని చెప్పటంలో శబ్దంలోనిమార్పులు మాత్రమే వ్యాకర్త ఉద్దేశించిఉండవచ్చు.

# వాక్యపరిచ్ఛేదం

**1. ఆకాంక్ష యనఁగా నిలుపుదల లేక పయిపయిం బోయెడి పదార్థములమీఁదియాదరము.** (వాక్య. 1)

**2. అది వినువారికిఁ దెలిసికొనవలయు ననెడియపేక్షారూప మయినది.**

'వాక్యము నా యోగ్యతాకాంక్షాసహితం బగునర్థము గలయాసత్తియుక్తపద సముదాయంబు' అనేసూత్రం వివరణంలోనిది ఈవాక్యం. సూత్రంలోనిఆకాంక్ష అనేపదం అర్థాన్ని 'ఆకాంక్ష యనఁగా నిలుపుదల లేక పయిపయిం బోయెడిపదార్థములమీఁదియాదరము' అని నిర్వచించి, దానిస్వరూపాన్ని

ప్రస్తుతవాక్యంచేత వివరిస్తున్నాడు.

వ్యవధానం లేకుండా, ఒకదానితరువాత ఒకటిగా పదాలఅర్థాన్ని తెలుసుకోవాలని వినేవాళ్లు కోరుకోవడమే ఆకాంక్ష. తరువాతిపదం అర్థం ఏమిటి అనేకోరిక ఎక్కడ ఆగిపోతుందో, అక్కడికి ఆకాంక్ష పూర్తి అయినట్లు. (అక్కడి వరకు ఉన్నపదాల సముదాయం వాక్యం.)

ఉదా. రాముడు రావణుని చంపెను. ఇక్కడ రాముడు అనేపదఅర్థం తెలిసినతరువాత ఆతరువాత ఏమిటి అనేవిధంగా తరువాతిపదం అర్థాన్ని గురించిన అపేక్ష ఉంటుంది. అలా అపేక్ష ఉండటమే ఆకాంక్ష. 'రాముడు రావణుని చంపెను' అనేపదసముదాయం అయినతరువాత ఇక తరువాతిపదాన్ని కూర్చిన అపేక్ష ఉండదు. కాబట్టి చంపెను పదం తర్వాత ఆకాంక్ష లేదు. ఇలాగే 'గోవు గుఱ్ఱము' ఇక్కడ ఉన్నపదాలఅర్థానికి పరస్పరం సంబంధం లేదు.కాబట్టి ఇక్కడ ఆకాంక్ష లేదు. కాబట్టి ఇది వాక్యం కాదు.

**3. యోగ్యత యనఁగాఁ బదార్థములకుఁ బరస్పరసంబంధమునందు బాధ కలుగకుండుట.** (వాక్య. 1)

'వాక్యము నా యోగ్యతాకాంక్షాసహితం బగునర్థము గల యాసత్తియుక్త పద సముదాయంబు.' అనేసూత్రంవివరణంలోనిది ఈవాక్యం.

చూ. యోగ్యత. పారిభాషికపదవివరణం.

**4. ఆసత్తి యనఁగాఁ బదములచేరిక.** (వాక్య. 1)

'వాక్యము నా యోగ్యతాకాంక్షాసహితం బగునర్థము గల యాసత్తియుక్త పద సముదాయంబు.' అనేసూత్రంవివరణంలోనిది ఈవాక్యం.

చూ. ఆసత్తి. పారిభాషికపదవివరణం.

**5. వాక్యమునందుఁ గొన్ని క్రియాన్వయము కలవి, కొన్ని తదితరాన్వయము కలవి.** (వాక్య. 1)

'వాక్యము నా యోగ్యతాకాంక్షాసహితం బగునర్థము గల యాసత్తియుక్త పద సముదాయంబు.' అనేసూత్రంవివరణంలోనిది ఈవాక్యం.

చూ. క్రియాన్వయవాక్యం, క్రియేతరాన్వయవాక్యం. పారిభాషికపదవివరణం

**6. క్రియ లనఁగా వర్తమానాద్యర్థకము లయినసమాపకక్రియలు.**

(వాక్య. 1)

'వాక్యము నా యోగ్యతాకాంక్షాసహితం బగునర్థము గల యాసత్తియుక్త పద సముదాయంబు.' అనేసూత్రంవివరణంలోనిది ఈవాక్యం.

క్రియలు అంటే సమాపకక్రియలు. వర్తమానాది అన్నప్పటిఆదిశబ్దంచేత భూతం, భావి, తద్ధర్మాదులు, ఆశీస్సు మొద లైనఅర్థాలు గ్రహింపబడతాయి. అంటే లట్టు, లిట్టు, లృట్టు, లూట్టు, లాట్టు, లజి అనేలకారాలు చివర గలిగిన క్రియాపదాలు. 'లకారంబునకు డుబ్రువురునుము ఙ్గు' అని చెప్పబడిన క్రియావిభక్తులు చివర గలిగినశబ్దాలు సమాపకక్రియలు. చదువుచున్నాడు, చదివిరి, చదువగలవు, చదువుదును, చదువము మొ.

వాక్యార్థంయొక్క పరిసమాప్తిని తెలియజేసేవి కాబట్టి ఇవి సమాపకక్రియలు. చదువుచున్నాడు, చదువగలడు ఇత్యాదిగా ఆయాక్రియాపదాలలో క్రియ సమాప్తిని జెందలేదు. అందుచేత సమాపకక్రియ అంటే క్రియయొక్క సమాప్తిని బోధించేవి అని చెప్పటానికి వీలు లేదు.

**7. క్త్వా తద్వ్యతిరేక శతృ తుమున్ చేదానంతర్యార్థకము లసమాపకక్రియలు.** (వాక్య. 1)

'వాక్యము నా యోగ్యతాకాంక్షాసహితం బగునర్థము గల యాసత్తియుక్త పద సముదాయంబు.' అనేసూత్రంవివరణంలోనిది ఈవాక్యం.

వ్యాపారావబోధకాలు క్రియలు. అసమాపకం అంటే ముగియనిది. అటువంటి క్రియ అసమాపకక్రియ. వాక్యంలో ఆకాంక్ష పూర్తి కాకుండ, అంటే క్రియను గూర్చినఆకాంక్ష కలిగేవిధంగా చెప్పబడిఉన్నక్రియ, అసమాపకక్రియ. 'క్త్వా, తద్వ్యతిరేక, శతృ, తుమున్, చేత్, ఆనంతర్యార్థకాలు అసమాపకక్రియలు. ఇవి ఆఱు. 'హంస లెల్ల పిండుగట్టి' ఏమి చేశాయి అనేవిధంగా ఆకాంక్ష ముగియక పోవటంచేత 'పిండుగట్టి' అనేది (1.క్త్వార్థకం) అసమాపకక్రియ. ఇది క్త్వార్థం, ఇలాగే చదువక (2.వ్యతిరేకక్త్వార్థం), చదువుచున్ (3.శతృ), చదువను (బోయెను) (4.తుమర్థము), చదువుడున్ (5.ఆనంతర్యం) చదివినన్ (6.చేదర్థకం) అయిన క్రియలు అసమాపకక్రియలు.

**8. ఇందు మొదటివి మూఁడు క్రియా(అ)భిన్నకర్తృకములు.**

**9. వెనుకటిమూఁడు క్రియావిభిన్నకర్తృకములు.** (వాక్య. 1)

వాక్యము నా యోగ్యతాకాంక్షాసహితం బగునర్థము గల యాసత్తియుక్త పద సముదాయంబు.' అనేసూత్రంవివరణంలోనిది ఈవాక్యం.

క్త్వా, తద్వ్యతిరేక, శతృ, తుమున్, చేత్, ఆనంతర్యార్థకములు అసమాపకక్రియలు వీటిలో మొదటిమూడు అంటే క్త్వా, తద్వ్యతిరేక, శతృ అర్థకాలు క్రియా అభిన్నకర్తృకాలు. క్రియ అంటే తిజంతం. (సమాపకక్రియ). వాక్యంలోని క్రియాపదంతో అభిన్న మైన అంటే సమాన మైనకర్త గలిగినది క్రియాఅభిన్నకర్తృకం. వాక్యంలోని క్రియాపదానికి కర్త అయినదే క్త్వా, తద్వ్యతిరేక, శతృ అర్థకక్రియలకు కూడా కర్త అవుతుంది.

విడిచిపోవఁగా, నోప కఱచుచు హంస లెల్ల తిరుగుచుండె. ఈవాక్యంలో ఉండెన్ అనేక్రియాపదానికి కర్త హంసలు. 1. విడిచి అనేక్త్వార్థకానికి, 2. ఓపక అనేవ్యతిరేకక్త్వార్థకానికి, అఱచుచున్, తిరుగుచున్ అనేశత్రర్థకాలకూ కూడా కర్త హంసలు అనేదే. క్రియతో సమాన మైనకర్త కలిగినవి కావటంచేత ఇవి క్రియా అభిన్నకర్తృకాలు. ఈవాక్యంలో 'పోవగా' అనే తుమర్థకానికి కూడా కర్త హంసలే. కాబట్టి తుమర్థకం గూడా క్రియాఅభిన్నకర్తృకమే.

(చైత్రునిచేత మైత్రుడు కొట్టంబడి మడిసె అనేసూరి చూపినవాక్యంలో క్రియాపదానికి కర్త చైత్రుడు కాగా, కొట్టంబడి అనేక్త్వార్థకానికి కర్త మైత్రుడు. ఇది క్రియావిభిన్నకర్తృకం అయింది. అందుకే సూరి సమానకర్తృకంబు లనక సమానాశ్రయంబు లంటున్నట్లు ఆసూత్రాన్ని వివరించాడు. ఇలాగే 'కొట్టంబడక మడియఁడు' క్రియాపదానికి వ్యతిరేకక్త్వార్థానికి కర్తలు వేరు.)

మిగిలిన మూడు, అంటే (తుమున్) భావలక్షణం, చేత్, ఆనంతర్యార్థకాలు అయిన అసమాపకక్రియలు క్రియావిభిన్నకర్తృకాలు. వాక్యంలోని క్రియాపదానికి, కర్త అయినదానికంటే వేరైనది ఆవాక్యంలో ఉన్న తుమున్, చేత్, ఆనంతర్యార్థకాలకు కర్త అవుతుంది.

'చైత్రుడు వండ నతిథి వచ్చెను'. ఇక్కడ 'వచ్చెను' అనేక్రియాపదానికి కర్త అతిథి. 'వండన్' అనే భావలక్షణక్రియకు కర్త చైత్రుడు.

'వానలు కురిసినం బంటలు పంటలు పండును'. 'పండును' అనేక్రియకు కర్త పంటలు. 'కురిసినన్' అనేచేదర్థకానికి కర్త వానలు. ఇలాగే 'వాడు రమ్మనినన్ బోయితిని'. 'పోయితిని' అనేక్రియకు కర్త నేను. 'అనినన్' అనేవృత్తం బగుభావలక్షణానికి కర్త వాడు.

'జాబిల్లి తోతెంచుడుం గువలయంబులు వికసిల్లు'. 'వికసిల్లు' క్రియకు కర్త కువలయాలు. 'తోతెంచుడున్' అనే ఆనంతర్యార్థకానికి కర్త జాబిల్లి.

ఇలా, భావలక్షణం, వ్యతిరేకభావలక్షణం, చేత్, ఆనంతర్యార్థకాలు క్రియావిభిన్నకర్తృకాలు. తుమర్థం క్రియాఅభిన్నకర్తృకమే.

**10. నామములు నా వస్తువాచకశబ్దములు.** (వాక్య. 3)

'పదము లవి నామంబులు క్రియ లవ్యయంబు లని త్రివిధంబులు' అనేసూత్రం వివరణంలోనిది ఈవాక్యం.

చూ. నామము. పారిభాషికపదవివరణం.

**11. సందర్భవశమున నివి కొన్ని కర్త లనియుఁ గర్మము లనియుఁ జెప్పఁబడును.** (వాక్య. 3)

'పదము లవి నామంబులు క్రియ లవ్యయంబు లని త్రివిధంబులు' అనేసూత్రం వివరణం లోనిది ఈవాక్యం.

'నామంబులు నా వస్తువాచకశబ్దంబులు' అనేపూర్వవివరణవాక్యాన్ని అనుసరించి ఇక్కడ అవి అంటే నామాలు అని అర్థం. వస్తువాచకాలు ఐన ఈశబ్దాలే సందర్భాన్ని బట్టి కర్త లనీ, కర్మ లనీ చెప్పబడతాయి.

ధాత్వర్థవ్యాపారాశ్రయంబు కర్త. పని చేసినది కర్త. ధాత్వర్థఫలాశ్రయము కర్మ. ఫలితం పొందినది కర్మ. రాముడు రావణుని చంపెను. ఈవాక్యంలో రాముడు వ్యాపారాశ్రయం(చంపటం అనేపని చేసినవాడు) కావటంచేత కర్త. రావణుడు ఫలాశ్రయం (చావటం అనేఫలితాన్ని పొందినవాడు) కావటంచేత కర్మ. రావణుడు కూలెను ఈవాక్యంలో రావణుడు కర్త అయినాడు. భక్తులు రాముని స్తుతించిరి. ఇక్కడ రాముడు కర్మ. ఈవిధంగా నామాలు సందర్భాన్ని బట్టి కర్తలూ, కర్మలూ అవుతాయి అని ఈవాక్యానికి తాత్పర్యం.

**12. క్రియ లనఁగా వ్యాపారావబోధకము లయినవి.** (వాక్య. 3)

'పదము లవి నామంబులు క్రియ లవ్యయంబు లని త్రివిధంబులు' అనేసూత్రం వివరణం లోనిది ఈవాక్యం.

వ్యాపారం అంటే పనిని తెలిపేశబ్దం(అవబోధకం) క్రియ. వస్తువును గాక వ్యాపారాన్ని బోధించటంచేత వీటిని నామాలకంటే వేరు చేసి చెప్పటం జరిగింది. వచ్చుచున్నాడు. ఇక్కడ వచ్చుట అనేవ్యాపారాన్ని తెలియజేస్తున్నది కాబట్టి ఇది

క్రియ.

క్రియ లనగా వర్తమానాద్యర్థకము లగు సమాపకక్రియలు అని ఈవ్యాకర్త ఇంతకు ముందు వివరించాడు. దానినిబట్టి సమన్వయిస్తే, (లడాదిలకారాంతాలు) డుజ్ మొద లైనక్రియావిభక్తులు చివర గలిగినశబ్దాలు క్రియలు. అంటే సమాపక క్రియలు. తిజంతా లైనపదాలు అని అర్థం. వచ్చిరి, తినగలడు, తినడు. మొ.

వ్యాపారావబోధకత్వాన్నిబట్టి ధాతువు కూడా క్రియ అనేసంజ్ఞ పొందుతున్నది. క్రియాజన్యవిశేషణాలు ఇత్యాదులలో ఈవ్యాకర్త క్రియను ధాతువు అనేఅర్థంలో వ్యవహరించటం గమనించవచ్చు.

**13. అవి సకర్మకములు అకర్మకము లని ద్వివిధములు.** (వాక్య. 3)

**14. కర్మము గలది సకర్మకము.** (వాక్య. 3)

**15. కర్మము లేనిది యకర్మకము.** (వాక్య. 3)

'పదము లవి నామంబులు క్రియ లవ్యయంబు లని త్రివిధంబులు' అనేసూత్రం వివరణం లోనిది ఈవాక్యం.

'క్రియ లనఁగా వ్యాపారావబోధకము లయినవి'. అనేపూర్వవాక్యాన్ని అనుసరించి ఇక్కడ అవి అంటే క్రియ లని అర్థం. క్రియ అంటే వ్యాపారం-పని. శబ్దశాస్త్రంలో పనిని బోధించేశబ్దానికి క్రియ అని సంజ్ఞ. 'క్రియా ధాతుః' అనేచింతామణిలక్షణాన్ని ననుసరించి ధాతువు అనేఅర్థంలోనూ ప్రౌఢవ్యాకర్త ప్రయోగించాడు. క్రియాజన్య విశేషణాలు మొ. కాగా ధాతువులు అకర్మకం అనీ, సకర్మకం అనీ రెండు విధాలు.

'అకర్మకంబు నాఁ గర్మాకాంక్షానుత్థాపకంబు'. కర్మను గూర్చిన ఆకాంక్షను కలిగించని (కర్మ లేని) ధాతువు అకర్మకము. రాముడు వచ్చెను. ఇక్కడ వచ్చెను అంటే 'దేనిని వచ్చెను' అనేవిధంగా కర్మను గూర్చినప్రశ్నను కలిగింపదు కాబట్టి వచ్చు ధాతువు అకర్మకం.

'సకర్మకంబు నాఁ గర్మాకాంక్షోత్థాపకంబు. కర్మను గురించిన ఆకాంక్ష కలిగినధాతువు సకర్మకం. తిను, చదువు మొ. వాడు అన్నమును తినెను. ఇక్కడ 'దేనిని' (అన్నమును) తినెను, అనేవిధంగా కర్మను గూర్చిన ఆకాంక్ష కలిగినది కావడంచేత 'తిను' ధాతువు సకర్మకం.

**16. ధాత్వర్థవ్యాపారాశ్రయము కర్త.** (వాక్య. 3)

'పదము లవి నామంబులు క్రియ లవ్యయంబు లని త్రివిధంబులు'

అనేసూత్రంవివరణం లోనిది ఈవాక్యం.

'ధాత్వర్థవ్యాపారాశ్రయంబు కర్త నాఁబడు.' ధాతువుకు అర్థ మైనవ్యాపారం దేనిని ఆశ్రయించిఉంటుందో (పని చేసినవాడు) అది కర్త. దేవదత్తునిచేత వంటకము వండఁబడెను' ఇక్కడ వండు అనేధాతువుయొక్క అర్థ మైన వంట చేయడం అనేవ్యాపారం దేవదత్తుణ్ణి ఆశ్రయించిఉంది. (వంట చేసినవాడు) కాబట్టి దేవదత్తుడు కర్త. కర్తకు 'చేత' అనేతృతీయావిభక్తి వస్తుంది.

**17. ధాత్వర్థఫలాశ్రయము కర్మము.** (వాక్య. 3)

'పదము లవి నామంబులు క్రియ లవ్యయంబు లని త్రివిధంబులు' అనేసూత్రం వివరణంలోనిది ఈవాక్యం.

'ధాత్వర్థఫలాశ్రయంబు కర్మము నాఁబడు.' ధాతువుయొక్క అర్థ మైనఫలం దేనిని ఆశ్రయించిఉంటుందో అది కర్మ. దేవదత్తుడు వంటకమును వండెను. 'వండు' అనేధాతువుకు అర్థ మైన (వంటచేయుట అనేవ్యాపారానికి) ఫలం వండబడినపదార్థం, (వండబడటం) అనేఫలం వంటకాన్ని ఆశ్రయించిఉంది. కాబట్టి ఇక్కడ వంటకం కర్మం. కర్మకు ద్వితీయావిభక్తి వస్తుంది..

**18. కర్తృకర్మక్రియలు గూడఁ బ్రయోగ మనంబడు.** (వాక్య. 3)

'పదము లవి నామంబులు క్రియ లవ్యయంబు లని త్రివిధంబులు.' అనేసూత్రం వివరణంలోనిది ఈవాక్యం.

కర్త, కర్మ, క్రియ అనేవి మూడూ ఉన్న వాక్యాన్ని ప్రయోగం అంటారు. అని ఈవివరణవాక్యానికి అర్థం. ధాత్వర్థవ్యాపారాశ్రయం కర్త. ధాత్వర్థఫలాశ్రయం కర్మ. క్రియ అంటే సమాపకక్రియ. తిఙంతం. ఈమూడూ కలిసి ఉన్నవాక్యం ప్రయోగం. ఉదా. రాముడు రావణుని చంపెను. ఈవాక్యంలో రాముడు అనేపదం కర్త, రావణుడు అనేపదం కర్మ. చంపెను అనేపదం క్రియ. ఇలా ఈవాక్యంలో కర్త, కర్మ, క్రియ, అనేవి మూడూ ఉన్నాయి కాబట్టి దీనిని ప్రయోగం అంటారు.

**19. అది కర్తరిప్రయోగము, కర్మణిప్రయోగము నని ద్వివిధము.**

**20. క్రియచేఁ గర్త చెప్పఁబడు నేని యది కర్తరిప్రయోగము, కర్మము చెప్పఁబడు నేని కర్మణిప్రయోగము.** (వాక్య. 3)

'పదము లవి నామంబులు క్రియ లవ్యయంబు లని త్రివిధంబులు.' అనేసూత్రం

వివరణంలోనిది ఈవాక్యం.

ఈవాక్యంలో 'అది' అంటే 'కర్తృకర్మక్రియలు గూడఁ బ్రయోగ మనంబడు' అని పూర్వపువాక్యాన్ని అనుసరించి ప్రయోగం అని అర్థం. కర్త, కర్మ, క్రియ అనేవి మూడూ ఉన్న వాక్యాన్ని ప్రయోగం అంటారు. ఉదా. రాముడు (కర్త) రావణుని (కర్మ) చంపెను (క్రియ). ఈప్రయోగం 1. కర్తరిప్రయోగం, 2. కర్మణిప్రయోగం అని రెండువిధాలు. అర్థం.

ఈప్రయోగం(వాక్యం)లో క్రియచేత కర్త తెలియజేయబడితే దాన్ని కర్తరిప్రయోగం అంటారు. రాముడు రావణుని చంపెను. ఈవాక్యంలోని 'చంపెను' అనేక్రియాపదం కర్త అయిన రాముడిని బోధిస్తున్నది. కాబట్టి ఇది కర్తరిప్రయోగం.

ఈప్రయోగం(వాక్యం)లో క్రియచేత కర్మ తెలియజేయబడితే దాన్ని కర్మణి ప్రయోగం అంటారు. రామునిచేత రావణుడు చంపబడెను. ఈవాక్యంలోని 'చంపబడెను' అనేక్రియాపదం కర్మ అయిన రావణుడిని బోధిస్తున్నది. కాబట్టి ఇది కర్మణిప్రయోగం.

**21. కర్తరిప్రయోగము సకర్మకక్రియ గలచో సకర్మకకర్తరిప్రయోగ మనియు, అకర్మకక్రియ గలచో నకర్మకకర్తరిప్రయోగ మనియుఁ జెప్పఁబడును.** (వాక్య. 3)

'పదము లవి నామంబులు క్రియ లవ్యయంబు లని త్రివిధంబులు' అనేసూత్రం వివరణం లోనిది ఈవాక్యం.

చూ. పారిభాషికపదవివరణం. సకర్మకకర్తరిప్రయోగము, అకర్మకకర్తరి ప్రయోగము.

**22. అవ్యయము లనఁగా లింగవిభక్తివచనశూన్యములు.** (వాక్య. 3)

**23. అవి ప్రతిపదోక్తములు లాక్షణికము లని ద్వివిధములు.** (వాక్య. 3)

**24. ప్రకృతిసిద్ధములు ప్రతిపదోక్తములు.** (వాక్య. 3)

**25. లక్షణసిద్ధములు లాక్షణికములు.** (వాక్య. 3)

'పదము లవి నామంబులు క్రియ లవ్యయంబు లని త్రివిధంబులు' అనేసూత్రం వివరణంలోనిది ఈవాక్యం.

చూ. పారిభాషికపదవివరణం. అవ్యయము, ప్రతిపదోక్తావ్యయములు, లాక్షణికావ్యయములు.

**26. విషయ ముద్దేశ్యవిధేయములతోఁ గూడినది.** (వాక్య. 6)

**27. అనఁగా విషయమునం దుద్దేశ్యము, విధేయము నని రెండు గల వని యర్థము.** (వాక్య. 6)

చూ. విషయబోధకము వాక్యము సూత్రవ్యాఖ్య.

**28. ఉద్దేశించి చెప్పఁదగినది యుద్దేశ్యము.** (వాక్య. 6)

'ఉద్దేశ్యవిధేయభిన్నంబు విషయంబు' అనేసూత్రంవివరణంలోనిది ఈవాక్యం.

చూ. ఉద్దేశ్యము, పారిభాషికపదవివరణం.

**29. మీఁదఁ దెలియఁదగినది విధేయము.** (వాక్య. 6)

'ఉద్దేశ్యవిధేయభిన్నంబు విషయంబు' అనేసూత్రంవివరణంలోనిది ఈవాక్యం.

చూ. విధేయము, పారిభాషికపదవివరణం.

**30. ఉద్దేశ్యము వక్తృశ్రోతల కుభయులకుఁ దెలియును.** (వాక్య. 6)

'ఉద్దేశ్యవిధేయభిన్నంబు విషయంబు' అనేసూత్రంవివరణంలోనిది ఈవాక్యం.

ఉద్దేశించి చెప్పదగినది ఉద్దేశ్యం. దేనిని గూర్చి (ఉద్దేశించి) చెప్పబడుతుందో అది ఉద్దేశ్యం. ఉద్దేశింపబడినది అన్నమాట. ఇది వక్తకు అంటే చెప్పేవాడికి, శ్రోతకు అంటే వినేవాడికీ ఇద్దరికీ తెలుస్తుంది.

వచ్చినవాడు ఫల్గునుడు. ఈవాక్యంలో వచ్చినవాడు అనేపదం ఉద్దేశ్యం. ఫల్గునుడు అనేది విధేయం. వచ్చినవాడు అనేఉద్దేశ్యం చెప్పేవాడికీ, వినేవాడికీ ఇద్దరికీ తెలిసిఉంటుం దని వ్యాకర్త పేర్కొన్నాడు.

**31. విధేయము వక్తకు మాత్రము తెలియును.** (వాక్య. 6)

'ఉద్దేశ్యవిధేయభిన్నంబు విషయంబు' అనేసూత్రవివరణంలోనిది ఈవాక్యం.

మీద తెలియదగినది విధేయం. ఉద్దేశ్యాన్ని గురించి ఏమి చెప్పబడుతుందో అది విధేయం. ఇది చెప్పేవాడికి మాత్రమే తెలుస్తుంది.

రాముడు పురుషోత్తముడు. ఇక్కడ పురుషోత్తముడు అనేది విధేయం. రాముడు (ఉద్దేశ్యం) గురించి వక్త ఏమి చెప్పబోతున్నాడో శ్రోతకు ముందుగా తెలిసేఅవకాశం లేదు. దశరథునికొడుకు, నల్లనివాడు, మొదలుగా రాముడిని గురించి ఏమైనా చెప్పవచ్చు. ఏమి చెప్పబోతున్నాడో శ్రోతకు తెలియదు కదా. కాబట్టి విధేయం వక్తకు మాత్రమే తెలిసిఉంటుంది. అని ఈవాక్యం వివరిస్తున్నది.

**32. విశేష్యాదిక ముద్దేశ్యము.**

**33. విశేష్యాదికము– విశేష్యము, విశేషణము, సర్వనామము.** (వాక్య. 6)

'ఉద్దేశ్యవిధేయభిన్నంబు విషయంబు' అనేసూత్రవివరణంలోనిది ఈవాక్యం.

'విషయబోధకము వాక్యము' అనేసూత్రాన్ని అనుసరించి విషయాన్ని బోధించేది వాక్యం. విషయం అంటే ఉద్దేశ్య, విధేయాలతో కూడినది. ఉద్దేశ్యం అంటే ఉద్దేశించి చెప్పదగినది. అని ఉద్దేశ్యాన్ని నిర్వచించినతరువాత ఉద్దేశ్యాలు ఏవో ఈవాక్యంతో వ్యాకర్త నిరూపిస్తున్నాడు. వాక్యంలో సామాన్యంగా విశేష్యం, విశేషణం, సర్వనామం, అవ్యయం అనేవి ఉద్దేశ్యాలు అవుతాయి. విశేషణంచేత చెప్పదగిన జాతి మొద లైనవిశేషాలు గలిగినది విశేష్యం. విశేష్యంలోని జాతి మొద లైనవిశేషాలను తెలియజేసేది విశేషణం. అన్ని మొద లైనశబ్దాలకు సర్వనామాలు అని సంజ్ఞ. లింగవిభక్తివచనాలు లేనిశబ్దాలు అవ్యయయాలు.

'ఈహయంబులు పవనగతిం బఱతెంచు'. ఈవాక్యంలో హయంబులు ఉద్దేశ్యం. ఇది విశేష్యం. కాగా ఈవాక్యంలో ఉద్దేశ్యం విశేష్యం అయింది.

'అవివేకి చెడున్'. ఈవాక్యంలో అవివేకి అనేది ఉద్దేశ్యం. ఇది విశేషణం. కాగా ఈవాక్యంలో విశేషణం ఉద్దేశ్యం విశేషణం అయింది.

'కొందఱు పిశాచం బని పఱచిరి'. ఈవాక్యంలో కొందఱు అనేశబ్దం ఉద్దేశ్యం. ఇది సర్వనామం. కాగా ఈవాక్యంలో సర్వనామం ఉద్దేశ్యం అయింది.

'ఏలా వాలాయము సేయ'. ఇక్కడ చేయన్ అనేశబ్దం ఉద్దేశ్యం. ఇది తుమున్నంతం అయని అవ్యయం. కాగా ఈవాక్యంలో అవ్యయం ఉద్దేశ్యం అయింది.

**34. క్రియాదికము విధేయము.**

**35. క్రియాదికము– క్రియ, విశేష్యము, విశేషణము, సర్వనామము.** (వాక్య. 6)

'ఉద్దేశ్యవిధేయభిన్నంబు విషయంబు' అనేసూత్రవివరణంలోనిది ఈవాక్యం.

'విషయబోధకము వాక్యము' అనేసూత్రాన్ని అనుసరించి విషయాన్ని బోధించేది వాక్యం. విషయం అంటే ఉద్దేశ్య, విధేయాలతో కూడినది. విధేయం అంటే మీద తెలియదగినది అని విధేయాన్ని నిర్వచించినతరువాత విధేయాలు ఏవో ఈవాక్యంతో వ్యాకర్త నిరూపిస్తున్నాడు. వాక్యంలో సామాన్యంగా క్రియ, విశేష్యం, విశేషణం, సర్వనామం, అవ్యయం అనేవి విధేయాలు అవుతాయి. వర్తమానం మొద లైన

అర్థాలను బోధించే క్రియాపదాలు క్రియలు. విశేషణంచేత చెప్పదగిన జాతి మొద లైనవిశేషాలు గలిగినది విశేష్యం. విశేష్యంలోని జాతి మొద లైనవిశేషాలను తెలియజేసేది విశేషణం. అన్ని మొద లైనశబ్దాలు సర్వనామాలు. లింగవిభక్తివచనాలు లేనివి అవ్యయాలు.

'ఈహయంబులు పవనగతిం బఱతెంచు'. ఇక్కడ 'పఱతెంచు' విధేయం. ఇది క్రియ. కాగా ఈవాక్యంలో విధేయం క్రియ అయింది.

'వచ్చినవాడు ఫల్గునుడు' ఇక్కడ ఫల్గునుడు విధేయం. ఇది విశేష్యం. కాగా ఈవాక్యంలో విధేయం విశేష్యం అయింది.

'అక్రోధనుండు కరం బధికుడు'. ఇక్కడ అధికుడు అనేశబ్దం విధేయం. ఇది విశేషణం. కాగా ఈవాక్యంలో విధేయం విశేషణం అయింది.

'ఏలా వాలాయము సేయ'. ఇక్కడ ఏలా అనేశబ్దం విధేయం. ఇది అవ్యయం. కాగా ఈవాక్యంలో విధేయం అవ్యయం అయింది.

## 36. ఆదిపదద్వయంబుచే అన్నంతక్రియలును, నేలాద్యవ్యయములును గ్రాహ్యములు. (వాక్య. 6)

'ఉద్దేశ్యవిధేయభిన్నంబు విషయంబు' అనేసూత్రవివరణంలోనిది ఈవాక్యం.

'విషయబోధకము వాక్యము' అనేత్రాన్ని అనుసరించి విషయాన్ని బోధించేది వాక్యం. విషయం అంటే ఉద్దేశ్య, విధేయాలతో కూడినది. అని చెప్పి, ఉద్దేశ్య, విధేయాలను వివరిస్తూ వ్యాకర్త 'విశేష్యాదిక ముద్దేశ్యము. క్రియాదికము విధేయము' అని ఉద్దేశ్య విధేయాలు రెండింటివిషయంలో విశేష్యాదికము, క్రియాదికము అని ఆదిశబ్దాలు రెండు ప్రయోగించాడు.

ఆఆదిశబ్దాలచేత ఏవి గ్రహించాలో ఈవాక్యం వివరిస్తున్నది. ఉద్దేశ్యం అయిన విధేయాదులలోని ఆదిశబ్దంచేతా, విధేయం అయిన క్రియాదులలోని ఆదిశబ్దంచేత ఏల మొద లైనఅవ్యయాలు గ్రహించాలి. ఏలాదులు అన్నప్పటి ఆదిశబ్దంచేత తుమున్నంతాలు మొద లైన అవ్యయాలను గ్రహించాలి. అంటే ఏల, తుమున్నంతాలు మొద లైన అవ్యయాలు ఆయావాక్యాలలో ఉద్దేశ్యాలూ, ఆయావాక్యాలలో విధేయాలూ రెండూ అవుతాయి.

'మృగాకులోగ్రవనంబుల కరుగ నేల' ఇక్కడ అరుగన్ అనే అవ్యయం ఉద్దేశ్యం. ఏల అనేఅవ్యయం విధేయం. ఇక్కడ ఉద్దేశ్యమూ, విధేయమూ రెండూ అవ్యయాలే

అయినాయి.

**37. విశేష్యాదు లుద్దేశ్యవిధేయములు రెండు నగు.** (వాక్య. 6)

'ఉద్దేశ్యవిధేయభిన్నంబు విషయంబు' అనేసూత్రవివరణంలోనిది ఈవాక్యం.

'విషయబోధకము వాక్యము' అనేసూత్రాన్ని అనుసరించి విషయాన్ని బోధించేది వాక్యం. విషయం అంటే ఉద్దేశ్య, విధేయాలతో కూడినది. అని చెప్పిన వ్యాకర్త విధేయాదులు ఉద్దేశ్యా లనీ, క్రియాదులు విధేయా లనీ వివరించి విశేష్యము, విశేషణము, సర్వనామము, అలాగే అవ్యయాలు అనేవాటిని ఉద్దేశ్యాలలోనూ, విధేయాలలోనూ చూపాడు. ఆవిషయాన్ని ఇక్కడ స్పష్టంగా మళ్లీ వివరిస్తున్నాడు.

విశేష్యం, విశేషణం, సర్వనామం, ఏల మొద లైనఅవ్యయాలు ఆయాసందర్భాలలో ఉద్ధేశ్యాలు, విధేయాలు రెండూ అవుతాయి.

'వచ్చినవాడు ఫల్గునుడు'. ఈవాక్యంలో వచ్చినవాడు అనేది ఉద్దేశ్యం. ఇది విశేషణం. ఫల్గునుడు అనేది విధేయం. ఇది విశేష్యం. అంటే ఈవాక్యంలో విశేషణం ఉద్దేశ్యమూ, విధేయం విశేష్యమూ అయినాయి.

'వీరభోజ్యము సుమ్ము రాజ్యము'. ఈవాక్యంలో రాజ్యము ఉద్దేశ్యం. ఇది విశేష్యం. వీరభోజ్యము విధేయం. ఇది విశేషణం. అంటే ఈవాక్యంలో విశేష్యం ఉద్దేశ్యమూ, విశేషణం విధేయమూ అయినాయి.

'వీ రెవ్వరయ్య' ఈవాక్యంలో వీరు ఉద్దేశ్యం. సర్వనామం. ఎవ్వరు విధేయం. సర్వనామం. కాగా ఈవాక్యంలో ఉద్దేశ్యమూ, విధేయమూ రెండూ సర్వనామాలే అయినాయి.

'ఏలా వాలాయము సేయ' ఈవాక్యంలో ఉద్దేశ్యం అయిన ఏల అనేశబ్దమూ, విధేయం అయిన చేయన్ అనేశబ్దమూ రెండూ అవ్యయాలే.

**38. క్రియ లుద్దేశ్యములు గావు.** (వాక్య. 6)

'ఉద్దేశ్యవిధేయభిన్నంబు విషయంబు' అనేసూత్రవివరణంలోనిది ఈవాక్యం.

'విషయబోధకము వాక్యము' అనేసూత్రాన్ని అనుసరించి విషయాన్ని బోధించేది వాక్యం. విషయం అంటే ఉద్దేశ్య, విధేయాలతో కూడినది. అని చెప్పిన వ్యాకర్త విధేయాదులు ఉద్దేశ్యా లనీ, క్రియాదులు విధేయా లనీ వివరించి విశేష్యాదులు ఉద్దేశ్యా లనీ, క్రియాదులు విధేయా లనీ పేర్కొన్నాడు. అందులో విశేష్యం, విశేషణం, సర్వనామం, (ఏలాద్యవ్యయాలు) అనేవాటిని ఉద్దేశ్యాలూ, విధేయాలూ రెండింటిలో

